

డా॥ జి.వి. పూర్ణచందు

# తెలుగు కోసం

భాష ★ సాహిత్యం ★ సంస్కృతి ★ చరిత్ర

అనుశీలన




ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి
ప్రచురణ






# తెలుగు కోసం

భాష * సాహిత్యం * చరిత్ర * సంస్కృతి

అనుశీలన

డా॥ జి.వి.పూర్ణచందు B.A.M.S.,

ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి

ప్రచురణ

1

# TELUGU KOSAM

**Dr.G.V. Purnachand** B.A.M.S.
Satnam Towers, First Floor,
Opp. Buckinghampet Post Office,
Governorpet, Vijayawada-520 002
Cell : 94401 72642
purnachandgv@gmail.com
gvpurnachand@gmail.com



First Edition - 2018

**Price ₹300/-**

Published by
Andhra Pradesh Creativity and
Culture Commission,
Ghantasala Venakteswara Rao
Govt. Music & Dance College,
Durgapuram,
VIJAYAWADA - 520 003

Title :
**Silathoranam formed naturally on Tirumala Hills, 2.5 Million years ago**

Designed by
**Ramu Alahari**

Page Setting by
**Victory Publishers**

Printed by
**Sri Durga Bhavani Offset Printers,
Vijayawada.**

2

# విషయసూచిక

# కొనసాగవలసిన పరిశోధనల కొలువు

- డా.మండలి బుద్ధప్రసాద్
ఉపసభాపతి, ఆంధ్రప్రదేశ్ శాసనసభ

ఒకప్పుడు టైప్ రైటర్ పైన తెలుగు అక్షరం కనిపిస్తే అదృష్టంగా ఉండేది. 1970లలో తెలుగు టైప్ రైటర్లు, 1980లలో ఎలక్ట్రానిక్ తెలుగు టైప్ రైటర్లు అందుబాటులో కొచ్చాయి. అనేకమంది తెలుగు టైపు నేర్చుకున్న వారికి ప్రభుత్వోద్యోగాలు వచ్చాయి కూడా!

1980 దశాబ్ది చివరినాటికి కంప్యూటర్లు మారుమూల ప్రాంతాలకు కూడా విస్మరించాయి. 90 నాటికి ఇంటర్నెట్ సదుపాయం అందుబాటులో కొచ్చింది. కంప్యూటర్ల వలన తెలుగు భాష వాడకం తగ్గిపోతుందేమోనని, ఉద్యోగాలు పోతాయని తొలిరోజుల్లో అందరూ భయపడిన మాట వాస్తవమే!

1990లలో కంప్యూటర్లలో తెలుగు అక్షరాలు కూడా కనిపించటం మొదలవటంతో భాషాభిమానులు ఊపిరి పీల్చుకున్నారు. ఇంతలో విండోస్ అందుబాటులోకి వచ్చాయి. ఇవి ఆధునిక సాంకేతికతకు కిటికీలు కాదు ద్వారాలే! పేజిమేకర్ కూడా రావటం వలన అందమైన టైపులతో తెలుగు పుస్తకాలను అచ్చు వేయటానికి కంప్యూటర్ ఏకైక సాధనం అయ్యింది. అనూ ఫాంట్లు ఇందుకు ఉపయోగపడ్డాయి. లెటర్ ప్రెస్సులూ, లెనోటైప్ ప్రెస్సులూ, పాత టైప్ రైటర్‌లు పూర్తిగా మూతపడ్డాయి.

2000 మిలీనియం సంవత్సరం తరువాత శ్రీలిపి, లేఖిని, బరాహాలాంటి లిపులు అందుబాటులోకి వచ్చాయి. అయితే ఇవన్నీ చాలా పరిమితమైన ప్రయోజనాలను మాత్రమే సాధించగలిగాయి. తెలుగును పూర్తిస్థాయిలో కంప్యూటర్లో వాడకానికి తీసుకురావటం 21వ శతాబ్ది అవసరంగా మారింది.

నిజానికి, ఈ కొత్త శతాబ్దిలో తొలి దశకం తెలుగు భాషోద్యమానికి శ్రీకారం చుట్టింది. ఒకవైపు తెలుగు భాష పరిరక్షణ ప్రధాన అంశంగా ఉద్యమంలా సాగుతుండగా, కంప్యూటర్లలో తెలుగు ఉపకరణాలను చేర్చటానికి సాంకేతిక నిపుణులైన భాషాభిమానులు విశేషకృషి మొదలుపెట్టారు. వికిపీడియా విజ్ఞాన సర్వస్వం తెలుగులో కూడా అందుబాటులోకి రావటం మొదలయ్యింది. ఇంటర్నెట్‌లో తెలుగు వెబ్‌సైట్లు, బ్లాగులూ వేల సంఖ్యలో అవతరించాయి. ఇంకా కొత్తవి వస్తున్నాయి కూడా! ఇవన్నీ ఆహ్వానించదగిన పరిణామాలు!!

***

కృష్ణాజిల్లా రచయితల సంఘం జాతీయ తెలుగు రచయితల మహాసభలలో 2006 తెలుగుభాష సాంకేతికాభివృద్ధి పైన చర్చావేదికలు నిర్వహించింది. తెలుగు పీపుల్ డాట్ కామ్ ఇంకా ఇతర వెబ్ సైట్ నిర్వాహకులను ఆహ్వానించి కంప్యూటర్లలో తెలుగు వాడకంపైన ఒక ఆలోచన కలిగించింది. ఆ తరువాత, 2007లో తెలుగు పసిడి డాట్ కామ్ అనే వెబ్ సైట్‌ని ప్రారంభిస్తూ, ఇంటర్నెట్లో తెలుగువాడకం, తమ రచనలను నెట్లో ఉంచటాల గురించి, రచయితలకు అవగాహనా మరియు శిక్షణా శిబిరాన్ని కూడా నిర్వహించింది. ఇవి ఇలా ఉండగా, 2011 ఏప్రిల్ 16న సిలికానాంధ్ర ఆధ్వర్యంలో హైదరాబాద్‌లోని మర్రి చెన్నారెడ్డి మానవవనరుల సంస్థ భవనంలో జరిగిన తొలి తెలుగు అంతర్జాల సదస్సు సాంకేతికంగా తెలుగు అభివృద్ధి గురించి కొన్ని కీలక నిర్ణయాలు తీసుకోవటానికి దోహదపడింది. కృష్ణాజిల్లా రచయితల సంఘం 2011 ఆగస్టులో నిర్వహించిన రెండవ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలలో "ప్రపంచ తెలుగు"ను సాధించే ప్రయత్నంలో భాగంగా యూనికోడ్ కన్సార్టియంలో సభ్యత్వాన్ని తీసుకోవటానికి ప్రభుత్వం సంసిద్ధత ప్రకటించింది.

భాషాభిమానులకు ఇది శుభవార్తే! విశ్వవ్యాప్తంగా ఉన్న 18 కోట్ల తెలుగు ప్రజలను తెలుగు నేలతో అనుసంధానం చేయగల్గింది ఒక్క తెలుగు అంతర్జాలం మాత్రమే. సెల్‌ఫోన్లు, టాబ్లెట్లు ఇంకా ఇతర ఉపకరణాలలో తెలుగు భాషలో సమాచార మార్పిడికి అంతర్జాలం చాలా తేలికైన, చవకైన అవకాశం అయ్యింది. అంతర్జాలం అనేది ఒక నిత్యావసర అంశంగా మారిపోయింది. అందులో తెలుగు కూడా ఒక భాగస్వామి కావటం సంతోషించాల్సిన విషయం.

ఈ అభివృద్ధి సాధనలో భాషోద్యమం నిర్వహించిన పాత్ర గణనీయమైంది. భాషోద్యమం అటు ప్రభుత్వంలోనూ, ఇటు ప్రజల్లోనూ కదలిక తెచ్చింది. తెలుగు కోసం నిలబడాలనే భావన క్రమేణా పెరుగుతూ వస్తోండగా, ఒక్క విద్యా వ్యవస్థలో తప్ప తెలుగు భాషాభివృద్ధికి ప్రత్యేకమైన అవరోధాలు తగ్గుతూ వస్తున్నాయి. విద్యారంగంలో కూడా తెలుగును తప్పనిసరి చేస్తూ, దాని పర్యవేక్షణ బాధ్యత తెలుగు ప్రాధికారిక సంస్థకు అప్పగించటం, అందుకు కావల్సిన అధికారాలను ఇవ్వటం ఈ దశలో మరో ముందడుగు. అయితే, ఈ నిర్ణయాలన్నీ సమర్ధవంతంగానూ, నిబద్ధతతోనూ అమలులోకి రావలసిన అవసరం ఉంది.

***

తెలుగునేల పైన శాసనాలకు కొదవ లేదు. క్రీస్తు శకారంభానికే తెలుగు నేలకు సంబంధించిన శాసనాలున్నాయి. అమరావతే అందుకు నిలువెత్తు సాక్ష్యం. అక్కడ దొరికిన శాసనాలలో నాగబు అనే తెలుగు అక్షరాలు కూడా కనిపించాయి. రాజులు పండితులకు దానం చేసిన గ్రామాలు, భూముల సరిహద్దులను పేర్కొనవలసి వచ్చినప్పుడు ప్రాకృత లేదా సంస్కృత భాషలలోనే వ్రాసినా, ఆ శాసనాలలో తెలుగు మూలపదాలను ఉపయోగించటం అనివార్యం అయ్యింది. విరిపర (విప్పర), చిన్నపుర, ప్రాలూరు, ముందూరు, కంబురం చెరువు, రేగ్రోసం, లెందులూరు మొదలైనవి ఈ శాసనాలలో పేర్కొనబడిన గ్రామాలు. ఈ శాసనాలలో గ్రామాల పేర్ల చివర పఱ్రు, పట్టు, పాడు, పాక, వూరు, చెరువు, పుండి, పూడి వంటివి వుండేవి. ఇవి తెలుగు పదాలే! వాటిని శాసనాలలో వాడారు కూడా!

శాసనం అనేది పదిమందికీ తెలియచెప్పే ఒక సమాచారం. ప్రాకృతంలోనో, సంస్కృతంలోనో ఆ శాసనాలు వ్రాయించిన కాలానికే తెలుగు భాష ఉంది. దాన్ని మాట్లాడే ప్రజలున్నారు. ఆ భాషలోనే మనుషుల పేర్లు, ఊళ్ల పేర్లు కూడా ఉన్నాయి. వాటి ప్రస్తావన కూడా ఆ శాసనాలలో ఉంది. అయినా తెలుగులో శాసనం లేదు కాబట్టి, ఆ శాసన కాలానికి తెలుగు భాష ఉన్నదంటే ఒప్పుకోని విచిత్ర పరిస్థితి మనది.

సంస్కృతం లేదా ప్రాకృతం శాసనభాషగా ఉన్న కాలంలో శాసనం వ్రాయటానికి తగినంత పరిణతి తెలుగు భాష పొందలేదని కొందరు వాదిస్తుంటారు. మనుషుల పేర్లు, ఊళ్ల పేర్లు, దేవతల పేర్లు స్పష్టమైన, స్వచ్ఛమైన తెలుగులో పెట్టుకోగలిగిన ప్రజల భాష

పరిపూర్ణమైనది కాదనటం అభ్యంతరకరమే! భాష లేకుండా, భావన లేకుండా పటిష్టమైన కోటలు గల రాజ్యాల నిర్మాణం, అంతర్జాతీయ వాణిజ్యం, అందుకోలేనంత ఉన్నత సంస్కృతి నిర్మాణం సాధ్యమయ్యేవేనా?

ఆ కాలంలో ప్రజల భాషలో శాసనాలు లేకపోవటానికి కారణం ఊహించలేనిది కాదు. ఇప్పటి రోజుల్లో ఆంగ్లమే తప్ప తెలుగు వాడకపోవటానికి ఏ ప్రభాషా వ్యామోహం కారణం అవుతుందో అదే ఆనాడూ తెలుగు శాసనాలను రానీకుండా చేసింది. అది సాధారణ ప్రజల్లో కన్నా శాసనకర్తల్లో ఎక్కువగా ఉండటం తెలుగు విషయంలో ఆది నుండీ ఉన్న దౌర్బల్యమే!

క్రీ.శ. 6వ శతాబ్ది చివరి పాదంలో రేనాడు తెలుగు చోళులు అని పిలువబడే ఆంధ్ర రాజులు తెలుగు భాషలో తమ రాజశాసనాలను జారీ చేయాలని భావించారు. కన్నడ భాషలో రాజశాసనాల రాక మనకన్నా వందేళ్ల ముందే, క్రీ.శ. 5వ శతాబ్ది నాటికే ఉందని అక్కడ దొరికిన శాసనాలనుబట్టి తెలుస్తోంది.

తెలుగు ప్రజలను తెలుగులో పాలించాలనే భావన చాలా ఆలస్యంగా ప్రారంభమై, రాయలవారి యుగం అంతరించే వరకు అరకొరగా అమలయ్యింది. ఆ తరువాత తెలుగునేలపైన మహమ్మదీయ పాలనలోనూ, బ్రిటీష్ పాలనలోనూ అధికారభాషగా తెలుగు ఊసే లేకుండా పోయింది.

* * *

ప్రజల భాష నేర్చుకుని, ప్రజల్ని ప్రజల భాషలో పాలించాలనే విధానానికి బదులు మెకాలే మహాశయుడు ప్రజలంతా ఇంగ్లీషు నేర్చుకుని ఇంగ్లీషు వారిగా మారిపోవాలని హుకుం ఇచ్చాడు. ఇప్పటికీ ఈ హుకుం అనధికారికంగా అమల్లోనే ఉంది.

అధికార భాష మూడు విషయాల్లో అవసరం అవుతుంది. 1. సాధారణ పాలనా రంగం. 2. న్యాయస్థానాలు, 3. విద్యారంగం – ఈ మూడింటిలోనూ తెలుగు స్థానే ఇంగ్లీషు స్థిరపడిపోయింది. దిగువ స్థాయిలో రెవెన్యూ న్యాయస్థానాలు తదితర పాలనా వ్యవస్థల్లో పారిభాషిక పదాలు ఇంగ్లీషులో చాలినన్ని లేని కారణంగా ఆ రంగాల్ని మాత్రం తెలుగులో వ్యవహారం నడిపేందుకు వదిలేశారు. అంతకు మునుపు మహమ్మదీయ పాలన కారణంగా అరబ్బీ, పర్షియన్ పదాలతో ఆనాటి మన తెలుగు నిండి ఉండి. బ్రిటిషర్లు దానినే న్యాయ, రెవెన్యూ వ్యవస్థల్లో కొనసాగించారు. బ్రిటిషర్లు వెళ్లిపోయినా

ఆరున్నర దశాబ్దాలుగా మనం తెలుగులో పాలనా పదాలను సృష్టించే శ్రద్ధ పెట్టలేకపోయాం. ఇందుకు ప్రభుత్వాలతోపాటు విశ్వవిద్యాలయాలు, మేధావులు కూడా సమాన బాధ్యులే!

క్రీ.శ. 650 నుండి 1750 వరకూ 1100 యేళ్లపాటు అధికారభాషగా ఎంతో కొంత వెలిగిన తెలుగుభాష బ్రిటీష్‌యుగంలో కొన వూపిరితో మిగిలింది. స్వంత ప్రభుత్వాలు ఏర్పడ్డాక ఉన్న ఊపిరి కూడా ఆగిపోవటం కొసమెరుపు.

ప్రపంచ మానవ ఏకత్వాన్ని సాధించటానికి, భాషాభిన్నత్వాన్ని, బహు భాషా విధానాన్ని గౌరవించాలని ఐక్యరాజ్య సమితికి చెందిన విద్యా వైజ్ఞానిక సంస్థ యునెస్కో నిర్ణయించింది.

జనం నాలుకల మీద ఆడే ప్రతి పదమూ, భాషల ఆకాశంలో ప్రకాశించే నక్షత్రమే! ప్రతీ భాష ఆయా భాషీయులకు ఘనమైనదే! ప్రతీ పదమూ ఘనమైనదే! వాటి గౌరవాన్ని నిలబెట్టవలసిన బాధ్యత భాషీయుల మీదే ఉంది" అనేది ప్రపంచ వ్యాప్తంగా అంతరించిపోతున్న భాషలను కాపాడేందుకు ఒక వ్యూహాన్ని నిర్మించుకోవాలని యునెస్కో సంస్థ నినాదం ఇచ్చింది. నినాదం కాదది, విధానం కూడా!

***

వ్యక్తి అస్తిత్వం అతని మాతృభాష వలనే ఋజువౌతుంది. వ్యక్తి ఏ భాషా జాతీయతకు, ఏ సాంస్కృతిక వారసత్వానికి, ఏ ప్రాంతానికి చెందినవాడో అతని భాష చెప్తుంది. అతని జాతీయతను, అతని ఉనికిని, అతని అస్థిత్వాన్నీ వ్యక్తపరుస్తుంది. మాతృభాషను కించపరచుకోవటం ద్వారా వ్యక్తి తన ఉనికిని తానే అవమానించుకుంటున్నాడు.

విద్యార్థి ఒక పాఠ్యాంశంలో వెనకబడి ఉండటం అంటే, అది ఆ పాఠ్యాంశానికే పరిమితమౌతుంది. కానీ, మాతృభాషలో వెనకబడి ఉంటే, ఆలోచనా శక్తీ, వ్యక్తీకరణమూ అనే రెండూ మౌలికమైన మేధో వ్యవస్థలు ఆ విద్యార్థి విషయంలో కుప్పకూలిపోతాయి.

మనిషి మనసు మాతృభాషలోనే లోతైన ఆలోచనలు చేస్తుందని మానవశాస్త్రం చెప్తోంది. తరగతి గదిలో బోధిస్తున్న విషయాన్ని విద్యార్థి మాతృభాషలోనే అర్థం చేసుకుంటాడు. ఆకళింపు చేసుకుంటాడు. అమ్మభాష సరిగా రాకపోతే, పాఠ్యాంశాలు అర్థం కాకుండా పోతాయి. చదువులోనూ, తెలివితేటల్లోనూ బిడ్డ వెనకబడిపోతాడు. ఇతర భాషల పరిజ్ఞానంతో పాటు తన భాష కూడా విద్యార్థులకు తెలియటం ఎంతో అవసరం కూడా! కానీ, మాతృభాషని నేర్పనీయకుండా, విద్యాలయాల్లోనూ, ఇంటాబయటా కూడా

మాతృభాష అనేదే వినిపించకూడదన్నంతగా తెలుగు నేలమీద ప్రాథమిక విద్యాబోధన సాగుతోంది. ఇది పిల్లల మేధోసంపన్నతను తక్కువ చేస్తుందని శాస్త్రవేత్తలు చెప్తున్నారు.

సామాజిక, సాంస్కృతిక, సమాచార మార్పిడి, సామాజిక బంధాలు ఏర్పడటం, సామాజిక అభివృద్ధి అనే అంశాలు కూడా అమ్మభాషతో ముడిపడి ఉంటాయి. విద్య వీటన్నింటిలోకీ ముఖ్యమైంది.

ప్రాథమిక విద్యను అమ్మభాషలోనే నేర్పించవలసిన అవసరాన్ని విద్యారంగం విస్మరించటం వలన విద్యార్థుల్లో గ్రహణశక్తి సన్నగిల్లిపోతోన్న వాస్తవాన్ని గమనించాలి. వివిధ భాషా సంస్కృతుల మధ్య సమన్వయం సాధించటం, అందరికీ సమానమైన, నాణ్యమైన విద్య నందించటం, జ్ఞానసమాజాలను (Knowledge Societies) నిర్మించటం, వివిధ సాంస్కృతిక వారసత్వాలను పరిరక్షించటం, శాస్త్ర, సాంకేతిక విజయాలు అందరికీ సమానంగా అందేలా చేయటానికి కావలసిన రాజకీయ నిర్ణయశక్తిని (Political will) సాధించటం మన ముందున్న కర్తవ్యాలు. పిల్లల్లో మాతృభాష పట్ల ద్వేషాన్ని కాకుండా ప్రేమను, గౌరవాన్నీ కలిగించేదిగా విద్యావ్యవస్థ ఉండాలి.

* * *

అద్భుతాలేమీ జరగకపోయినా, తెలుగునేలమీద తెలుగు భాషోద్యమం గణనీయమైన లక్ష్యాలనే నెరవేర్చగలిగింది. గతంతో పోలిస్తే "మా పిల్లలు తెలుగులో మాట్లాడరండీ" అని తల్లిదండ్రులు ఘనంగా అనటం తగ్గింది. టీవీల్లోనూ, ఎఫెమ్ రేడియోల్లోనూ వ్యాఖ్యాతల సంకర భాష తగ్గకపోయినప్పటికీ భాషాహంతకులను ద్వేషించే వారి సంఖ్య పెరుగుతోంది. ఇది గణనీయమైన మార్పే!

భాషను హత్యచేయటం వలన అక్షరాలు శపిస్తాయనే భావన మనలో కలగాలి. ఇది సంస్కృతిని కాపాడుకునే ప్రయత్నం. తెలుగువారై ఉండీ తెలుగులో మాట్లాడటానికి, చదవటానికి ఇబ్బంది పడటంలో ఏం న్యాయం ఉంటుంది...?

ప్రజల గుండె తలుపులు తట్టి, భాషా చైతన్యాన్ని కలిగించటం లక్ష్యంగా 2002 నవంబరు 1,2 తేదీలలో తెలుగువారి తొలి రాజధాని కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో ప్రారంభమైన తెలుగు భాషోద్యమం అనేక విజయాలకు నాంది పలికింది. 2004లో కృష్ణాజిల్లా

రచయితల సంఘం పునర్వ్యవస్థీకరణ జరిగింది. ప్రపంచస్థాయిలో తెలుగు భాషా చైతన్యాన్ని ప్రోది చేయటంలో కృష్ణాజిల్లా రచయితల సంఘం నిర్వహించిన పాత్ర గణనీయమైనది కాగా, దాని ప్రధాన కార్యదర్శి డా.జి.వి.పూర్ణచందు భాషోద్యమ నిర్మాణంలో ఒక సేనానిగా వ్యక్తిగతంగా నిర్వహించిన పాత్ర ఎన్నతగినది.

జాతీయస్థాయి భాషా సదస్సుల ఏర్పాటు, ప్రపంచ తెలుగు రచయితల మహాసభల నిర్వహణలు ఒక ఎత్తైతే, ఒక రచయితగా, పరిశోధకుడిగా, తెలుగు భాషా సంస్కృతుల మూలాలను తవ్వి తీసి, దాని ప్రాచీనత నిరూపించే విషయంలో పూర్ణచందు కొత్త దారులు నిర్మించాడు. కొనసాగవలసిన పరిశోధనలంటూ అంతకు మునుపు ఎవ్వరూ ఊహించని అనేక చారిత్రక సత్యాలను వెలుగులోకి తెచ్చాడు.

సింధు నాగరికతతో సమాంతంగా తెలుగునేలమీద జీవించిన మనుషుల సంస్కృతిని "కృష్ణా గోదావరి నాగరికత"గా పిలవాలని చరిత్రకారుల్ని కోరుతూ "సింధు కృష్ణలోయల నాగరికతల అధ్యయన సదస్సు" నిర్వహణ ఇందుకొక మచ్చుతునక.

వృత్తిరీత్యా వైద్యుడై ఉండి, భాష, చరిత్రల గురించి అతను వ్రాయడమేమిటని అప్పట్లో కొందరు ఆగ్రహించినప్పటికీ, పూర్ణచందు చెప్పిన విషయాలను పూర్వపక్షం చేయటంగాని, లేదా కొత్త అంశాలను చేర్చటంగానీ ఎవరూ చేయలేదు.

డా.జి.వి.పూర్ణచందు "నడుస్తున్న చరిత్ర" మాసపత్రికలోనూ, ఇంకా ఇతర పత్రికల్లోనూ తెలుగు భాష ప్రాచీనతపైన వ్రాసిన వ్యాసాలలో కొన్నింటిని ద్రావిడ విశ్వవిద్యాలయం "నైలూ నుండి కృష్ణదాకా" పేరుతోనూ, ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం "తెలుగే ప్రాచీనం" పేరుతోనూ గ్రంథాలుగా తీసుకువచ్చారు. 'తెలుగే ప్రాచీనం' గ్రంథాన్ని "తెలుగు హీ ప్రాచీన్ హై" పేరుతో, హిందీలోకి డా.వెన్నా వల్లభరావుతో అనువాదం చేయించి, దానిని 'ఆకరగ్రంథం'గా ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ ఢిల్లీ స్థాయిలో అందరికీ అందించారు. తెలుగు భాషకు ప్రాచీనతా ప్రతిపత్తి రావటంలో డా.పూర్ణచందు కృషి ఆ విధంగా ఎంతో ఉపయోగపడింది.

డా.పూర్ణచందు నిరంతర రచయిత. ప్రతీరోజు కనీసం ఒకటైనా రచన చేయకపోతే మర్నాడు రెండు వ్రాయాల్సినంత విస్తృతంగా వ్రాస్తున్న రచయిత. దాదాపు 9 వార, మాస పత్రికల్లో ఆయన శీర్షికలు వ్రాస్తున్నారు. ఇప్పటికి 116 పుస్తకాలు వెలువరించాడు. 2018 ప్రపంచ పుస్తక దినోత్సవం సందర్భంగా ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంస్థ కృష్ణాజిల్లా శాఖ వారు ఈ పుస్తకాల ప్రదర్శన ఏర్పాటు చేశారు.

1966లో చిన్నప్పుడు, పూర్ణచందు నాతోపాటు కొద్దికాలం అవనిగడ్డలో చదువుకున్నాడు. 1975 మచిలీపట్టణంలో 'స్పందన సాహితీ సమాఖ్య' నిర్వహించిన కృష్ణాజిల్లా రచయితల 4వ మహాసభల్లో మళ్ళీ నాకు పరిచయం అయ్యాడు. అప్పటినుండీ సాహిత్య కార్యక్రమాల్లో తరచూ కలుస్తూ ఉండేవాళ్లం.

1980లలో వచ్చిన మినీ కవితా ఉద్యమం నిర్మాణంలో పూర్ణచందు ముఖ్య పాత్ర పోషించాడు. మినీకవితకు లక్ష్యనిర్దేశం చేసిన వారిలో అతనూ ఉన్నాడు. అప్పటికి వచ్చిన అసలైన మినీ కవితలకు 300 దాకా ఏరి, వాటికి బొమ్మలు వేసి రాష్ట్రంను నలుమూలలా మినీ కవితా ప్రదర్శనలు నిర్వహించాడు. 1981లో అవనిగడ్డ హైస్కూల్లో నేను కూడా అతని మినీ కవితా ప్రదర్శన ఏర్పాటు చేయించాను. కవిత్వానికి ప్రదర్శన అనే ఆలోచన అతనిదే! అనేకమంది యువతీ యువకులు కవిత్వం వ్రాయటానికి ముందుకు వచ్చేలా అతని ప్రదర్శన తోడ్పడింది. రాళ్లబండి కవితాప్రసాద్ లాంటి ప్రసిద్ధ కవులు అనేకమంది ఆనాటి మినీ కవితా ఉద్యమంలోంచి వచ్చినవారే!

తెలుగుభాష కోసం అంకిత భావంతో పాటుపడ్తున్న వాడు పూర్ణచందు. భాషోద్యమ పరంగా నా సహచరుడుగా, సహోదరుడుగా నాతో కలిసి పనిచేస్తున్నాడు. ఏ అంశాన్నైనా సునిశితంగా పరిశీలించి, పరిశోధించి వ్రాయటం పూర్ణచందు అలవాటు. పరిశోధన కోసం ఎక్కువ సమయాన్ని వెచ్చిస్తాడు.

వివిధ పత్రికల్లో పూర్ణచందు వ్రాసిన అనేక పరిశోధనా వ్యాసాల సమాహారమే ఈ “తెలుగు కోసం” అనుశీలనా గ్రంథం.

తెలుగు భాష ప్రాచీనత గురించి, తెలుగు జాతి ప్రాచీనత గురించి, తెలుగు సంస్కృతి ప్రాచీనత గురించి ఎన్నో నవ్యనూతన ఆలోచనలు ఇందులో ఉన్నాయి. కొనసాగవలసిన పరిశోధనలకు ముడిసరుకు చాలా ఉన్నదిక్కడ. పరిశోధకులకు కరదీపికగా ఈ పుస్తకం నిలిచిపోగలదని నమ్ముతున్నాను. ☆

# సగౌరవంగా...

**- డా॥ జి.వి. పూర్ణచంద్**

ఇతర జీవజాలాన్నుంచి మనిషిని వేరుచేసి ప్రత్యేకంగానూ, ఉన్నతంగానూ, మానవీయంగానూ నిలబెట్టగలిగేది మాతృభాష.

అమ్మ కడుపులోనే నేర్చుకోవటం మొదలుపెట్టి, మనిషిగా జీవించటానికి తోడ్పడేది అమ్మభాష. మనిషితోపాటే భాష కూడా పుట్టింది. సమస్త జంతు జాలానికీ దేని భాష దానికుంది. అవి పరస్పరం సంభాషించుకుంటూనే ఉన్నాయి. ఈ భూమ్మీద మానవుడి అవతరణతోపాటే మానవభాష అవతరణ కూడా ఇలాగే జరిగింది. భాషచరిత్ర మనిషి చరిత్ర రెండూ ఒకటే. పరిణామక్రమంలో మనిషిలో ఎన్ని మార్పులు సంభవించాయో, భాషలోనూ అన్నీ సంభవించాయి.

"నిన్ను నీవు తెలుసుకో" అంటారు పెద్దలు. "నిన్ను నీ భాషలో తెలుసుకో" అంటే అన్ని ప్రశ్నలకూ సమాధానం వస్తుంది. ఇదే ముఖ్యమైన విషయం కూడా!

భాషా జాతిగా తెలుగు ప్రాచీనత గురించి జరిగిన అనుశీలన తక్కువ. తెలుగు శాసనం దొరికేంతవరకూ తెలుగువారు లేనట్టే చరిత్రవేత్తలు భావిస్తున్నారు. తెలుగు మూలాల కోసం వెదకులాట బాగా జరగకపోవటాన, బయటపడిన నిజాలు జనసామాన్యానికి సరిగా చేరకపోవటాన తెలుగువారిలో భాషపట్ల ఉండవలసిన మమకారం తక్కువైపోయింది.

అనగనగా ఒక రాజు అని మొదలయ్యే తెలుగు కథ మొదట చెప్పింది చరిత్రనే! కానీ, మొదటగా మరిచింది కూడా చరిత్రనే! ఇది తెలుగు విషయంలో ఒకింత ఎక్కువగా జరిగింది. చరిత్ర అనేది జాతి మొత్తానికి సంబంధించిన విషయం. అది కేవలం చరిత్రవేత్తలకు పరిమితం కాకూడదు. జనసామాన్యాన్ని చేరాల్సిన అంశాలలో చరిత్ర మొదటిది. వేదాంతం పండితుల కోసం, చరిత్ర జనం కోసం, కానీ ఆచరణలో ఇందుకు వ్యతిరేకంగా జరుగుతోంది.

ప్రజల్లో అమ్మభాషపట్ల మమకారం ప్రత్యేకంగా ఒక ఉద్యమం తెచ్చి కలిగించాల్సిన అవసరం ఏర్పడటమే దురదృష్టకరం. అమ్మను గౌరవించుకోమని చెప్పించుకునే స్థితిలో ఎవరూ ఉండకూడదు కదా! ప్రపంచవ్యాప్తంగా పెచ్చు పెరిగిన వాణిజ్యవ్యవస్థ, మన నేలమీద మనం వ్యామోహం కొద్దీ ఏర్పరచుకున్న విద్యావ్యవస్థ ఇందుకు ఆజ్యం పోస్తున్నాయి. అమెరికా వెళ్లిపోవటమే లక్ష్యంగా నిర్దేశించి చదువులు చెప్తున్నారు. దేశం దాటని వాళ్లు కొరగాని వాళ్లనే భావన బలపడిపోయింది. ఇదే అభివృద్ధి అనీ, మాతృభాష గురించి మాట్లాడటం అభివృద్ధి నిరోధకత అనీ, భావించుకోవటం గమనిస్తూనే ఉన్నాం.

ఈ పరిస్థితుల్లో మాతృభాషా పరిరక్షణ కోసం నడుం బిగిస్తూ తెలుగునాట భాషోద్యమం 2003 నుండీ ఉధృతంగా ప్రజల గుండెతలుపులను తట్టే ఎన్నో కార్యక్రమాలు చేపట్టింది. ఉద్యమ సారధ్యం వహించిన మహోదయులు మండలి బుద్ధప్రసాద్‌గారి సాహచర్యంలో భాషే ఊపిరిగా పనిచేసే అవకాశం దక్కింది. కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన బుద్ధప్రసాద్‌గారూ, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్‌గారూ, గుత్తికొండ సుబ్బారావుగారూ కలిగించిన ప్రేరణ భాషా పరిశోధనల వైపు నన్ను నడిపించింది.

నాకు నాలుగు దశాబ్దాల సన్మిత్రులు డా॥ సామల రమేశ్‌బాబు అండగా నిలబడి కొనసాగవలసిన పరిశోధనలకు ముడిసరుకు అనదగిన నా వ్యాసాలను తన "నడుస్తున్న చరిత్ర" మాసపత్రికలో వరుసగా ప్రచురించారు. ఆ కారణంగా ఆయన కొన్ని ఇబ్బందులు ఎదుర్కొన్నప్పటికీ, భాషకోసం మా నిబద్ధత ఆ వ్యాసాలను కొనసాగింప చేసింది.

ఆనాటి అధికార భాషా సంఘం అధ్యక్షులు డా॥ ఎ.బి.కె.ప్రసాద్‌గారు, ద్రావిడ విశ్వవిద్యాలయం ఉపకులపతి, భాషావేత్త ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణగారు దిశానిర్దేశం చేసి నన్ను నడిపించారు. ద్రావిడ విశ్వవిద్యాలయం పక్షాన "నైలూ నుండి కృష్ణదాకా", అధికార భాషా సంఘం పక్షాన "తెలుగే ప్రాచీనం" పుస్తకాలుగా నా వ్యాసాలు ప్రచురించి భాషా పరిశోధనల్లో నన్ను ముఖ్య భాగస్వామిని చేశారు. ఆ ఇద్దరికి నేను సద కృతజ్ఞుణ్ణి... అనటం చిన్నమాటే!

నా "తెలుగే ప్రాచీనం" గ్రంథాన్ని డా. వెన్నా వల్లభరావుగారితో హిందీలోకి "తెలుగు హీ ప్రాచీన్‌హై" పేరుతో అనువాదం చేయించి, ఆ హిందీ పుస్తకాన్ని తెలుగు భాషకు ప్రాచీనతా హోదాను అందించే విషయాన్ని పరిశీలిస్తున్న అధికారులకు, సంబంధిత

ప్రముఖులకు ఒక ఆకర గ్రంథంగా అందించి యార్లగడ్డ లక్ష్మీప్రసాద్‌గారు ప్రాచీనతా హోదా సాధనలో నన్ను భాగస్వామిని చేశారు. ఆయనకు ఏమిచ్చి 'కృతజ్ఞతలు' అని చెప్పగలను?

ఆ తరువాత డా॥తుర్లపాటి రాజేశ్వరి, మూర్తిగారలు " ది యాంటిక్విటీ ఆఫ్ తెలుగు" అని ఇంగ్లీషులోకి అనువదించారు ఆ దంపతులకు నా నమస్సులు.

వివిధ పత్రికల్లో నేను వ్రాస్తూ వచ్చిన వ్యాసాల్లో తెలుగు భాషా సంస్కృతులకు ప్రాధాన్యత నివ్వాలని నన్నుతరచూ హెచ్చరించింది బుద్ధప్రసాద్‌గారే! అలాగే, తెలుగు వారి ఆహార చరిత్ర గురించిన సమగ్ర అధ్యయనం జరగలేదని, ఆ దిశకు నన్ను మళ్లించింది కూడా ఆయనే! ఈ పుస్తకంలో ప్రతీ వ్యాసరచన వెనుక బుద్ధప్రసాద్‌గారి ప్రేరణ ఉంది. తెలుగు భాషోద్యమానికీ, ఈ "తెలుగుకోసం" పుస్తకానికి ఆయనే దళపతి.

2002-03లో ఆంధ్రభూమి దినపత్రికలో శ్రీ ఎం.వి.ఆర్.శాస్త్రిగారు అలనాటి ఆహారాలు పేరుతో ఒక శీర్షికని నాతో వ్రాయించారు. తెలుగువారి ఆహార పదార్థాల మూలాల గురించి వరుసగా అనేక వ్యాసాలను వ్రాశాను. 2010లో నా వ్యాసాలను "తరతరాల తెలుగు రుచులు" పుస్తకంగా ఎమెస్కో వారు ప్రచురించారు. ఇది "తెలుగువారి తొలి ఆహార చరిత్ర గ్రంథం" అని ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణగారు పేర్కొన్నారు. 2012లో "మన ఆహారం" గ్రంథాన్ని తెలుగు విశ్వవిద్యాలయం వారు, 2014లో "ఆహారవేదం" గ్రంథాన్ని శ్రీ మధులత పబ్లికేషన్స్ వారు ప్రచురించి, మన ఆహార సంస్కృతి గురించి ఎప్పటికప్పుడు నూతన విషయాలను అధ్యయనం చేసే అవకాశం నాకు కల్పించారు. తెలుగువారి ఆహార సంస్కృతి - ఆరోగ్య ప్రభావం" పైన నావి మొత్తం 12 పుస్తకాలు వెలువడ్డాయి.

2006లో "అలనాటి పట్టణాలు" (39 భాగాలు), 2007లో భోజనం కథలు (32 భాగాలు), 2009 "ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ-సమాజం" (10 భాగాలు) ప్రసారం చేసి రేడియో సంచాలకులు శ్రీ మంగళగిరి ఆదిత్యప్రసాద్, శ్రీమతి ముంజులూరి కృష్ణకుమారిగారు నాకు విశేష ప్రాచుర్యం కలిగించారు. వారికి నా కృతజ్ఞతలు.

"తెలుగుకోసం"లో పొందుపరచిన వ్యాసాలు ఆంధ్రజ్యోతి దినపత్రిక, ఆంధ్రభూమి, ఆంధ్రప్రభ, విశాలాంధ్ర దినపత్రికలలోనూ, తెలుగు వెలుగు, నడుస్తున్న చరిత్ర మాసపత్రిక,

నది, చిత్ర, భక్తిసుధ, తెలుగు విద్యార్థి, చినుకు, విశాలాక్షి మాసపత్రికలలోనూ, ఆంధ్రభూమి, నది వారపత్రికలలోనూ ప్రచురితమైనవే! ఆ యా పత్రికా సంపాదకులకు నా నమోవాకాలు.

నవ్యాంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక భాషా సాంస్కృతిక శాఖ రచయితలకు, కళాకారులకు బాగా చేరువయ్యింది. రచయితలకు ఆర్థిక సహకారం అందించి ప్రోత్సహించవలసిన ప్రభుత్వ సంస్థలు నిష్క్రియంగా ఉన్న నేటి పరిస్థితుల్లో రాష్ట్ర సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి ముందుకు వచ్చి ముద్రణకు ఆర్థిక సహాయం అందిస్తూ, రచయితలను ప్రోత్సహిస్తోంది. ఇందుకు ముఖ్య కారకులు కార్యనిర్వాహణాధికారి డా॥ దీర్ఘాసి విజయభాస్కర్‌గారు ఆయన స్వయంగా సాహితీవేత్త, కళాకారుడు, కేంద్ర సంగీత నాటక అకాడమీ బహుమతిని, 6 నంది పురస్కారాలను గెలుచుకున్న నాటక రచయిత, భాష కోసం నిబద్ధత కలిగిన ఒక అధికారిగా ఆయన చేసిన కృషి గొప్పది.

గాంధీ నాయకత్వంలో నడిచిన స్వాతంత్రోద్యమం తరువాత పుట్టిన నా బోటివాళ్లకు ఏకనాయకత్వంలో నడవటం అంటే ఏమిటో బుద్ధప్రసాద్‌గారి సాహచర్యంలో చూసే అవకాశం కలిగింది. బుద్ధప్రసాద్ గారికి, విజయభాస్కర్‌గారికి కృతజ్ఞతలు.

"తెలుగు కోసం" అనే ఈ అనుశీలనా గ్రంథాన్ని ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి ప్రచురణగా వెలువరిస్తున్నందుకు భాషా సాంస్కృతికశాఖ వారికి నా అభివాదాలు.

2009-10 తరువాత నేను వ్రాసిన వ్యాసాలను ఈ సంకలనంలో చేర్చటం జరిగింది. ఆయా పత్రికల్లో ఇవి ప్రచురితం అయినప్పుడు అసంఖ్యాకంగా పాఠకులను అలరించిన వాటిని ఎంపిక చేసి "తెలుగు కోసం" అనుశీలనా గ్రంథంగా తెస్తున్నాను. పాఠకాదరణను కోరుకుంటున్నాను.

ఇది తెలుగు నెనరు. మనసు నిండా తెలుగు నింపుకున్నా ఇది తీరనిది. ఇందరం వ్రాస్తున్నా వ్రాసింది గోరంతే! వ్రాయాల్సిన విషయాలు చాలా ఉన్నాయి. కాలం చాలని పరిస్థితి. వ్రాసిన దాంట్లో కొత్తదనాన్ని చూసి మెచ్చుకునే పాఠక సంపద నాకుంది. అదొక్కటే నాకు ఆ పాఠక దేవుళ్లిచ్చిన వరం.

# భాషోన్నతికి వెలుగుల దివ్వె "తెలుగు కోసం"

**- డా॥ దీర్ఘాసి విజయభాస్కర్**

తెలుగుభాష భవిష్యత్తే కాదు, ఆ భాష పుట్టుక, గతం కూడా ఒక సందిగ్ధావస్థలోనే ఉన్నాయి. సంస్కృతం, ప్రాకృతం, పాళీ, ఉర్దూ, హిందీ మొదలైన ఇతర భాషల ప్రభావ ప్రమేయాల వలన తెలుగు మూలాలు వెదుక్కోవటం కష్టసాధ్యమైపోయింది. ఈ నేపథ్యంలో డా॥ పూర్ణచంద్‌గారి 'తెలుగు కోసం' గ్రంథం ఒక దీపస్తంభం అని భావిస్తాను.

సంస్కృతంలో గానీ, పాళీలో గానీ ప్రాకృతంలోగానీ ఉన్న ఒక పదం తెలుగులో కూడా వాడకంలో ఉన్నప్పుడు అది తెలుగులోకి ఆ భాషలోంచి దిగుమతి అయి వచ్చిందనే తొందరపాటు అభిప్రాయానికి రావటం మంచిది కాదంటూ, తెలుగు నుండే సంస్కృతం, పాళీ, ప్రాకృతాలకు అనేక పదాలు వెళ్లి చేరాయని, మనవి ఇచ్చిన చేతులు కూడాననీ పూర్ణచంద్‌గారు సోపపత్తికంగా వివరించారు.

తెలుగు అనే పేరు ఎలా వచ్చిందో వెదకటానికి సంస్కృతాన్ని ఆశ్రయించి, త్రిలింగ శబ్దంలోంచి తెలుగు వచ్చిందనటాన్ని ఆయన ఆక్షేపించారు. 'తెల్' అనే ప్రోటో ద్రావిడ లేదా ప్రోటో తెలుగు రూపాయిని 'to tell = తెలియచెప్పు' అనే అర్థాన్ని ఆయన చూపిస్తున్నారు. ఇది ఒక కొత్త ఆలోచన. 'విద్' అనే ధాతువు విద్యకు ఎలా మూలమో 'తెల్' అనే ధాతువు తెలుగు పదానికి అలానే మూలం. 'పూర్వ తెలుగు' (Proto Telugu) భాష మాట్లాడిన ప్రజలు తమ సమకాలీన సమాజంలో చెప్పే పాత్ర పోషించి ఉంటారనే ఊహ ఆలోచనాస్ఫోరకమైనది కూడా!

'ఆంధ్ర' అనే శబ్దం గ్రీకు ధాతువు (ఆంథోస్ మనిషి)'లోంచి వచ్చిందనే పూర్ణచంద్ గారి ప్రతిపాదన చదివినప్పుడు ఆశ్చర్యం కలిగింది. ఆంధ్రపాలజీ అంటే మానవసంబంధ శాస్త్రం అని కదా అర్థం! ఇండో ఆర్యన్ భాషా కూటమికి చెందిన వైదిక ఆర్యభాష మాట్లాడిన ప్రజలు తమ భాషలో పిలిచిన పేరు ఇది. ఈ ఆంధ్రులే తెలుగు నేలమీద తెలుగు వారితో సంలీనం అయి ఆంధ్రజాతిగా నిలిచారని వివరిస్తారాయన. నిజంగా ఎంతో గొప్ప వివరణ ఇది... మన ప్రాచీనతకు, విశిష్టతకు ఇంతకన్నా గొప్ప ఋజువు ఇంకేం కావాలి?

తెలుగు కూడా ప్రాచీన భాషేనంటే డా॥పూర్ణచంద్ సంతృప్తి చెందరు. 'తెలుగే ప్రాచీనం!' అనేది ఆయన వాదన. ద్రావిడ కుటుంబంలో తెలుగే తొలిభాష అనీ, మూలద్రావిడులు తెలుగు వారేననీ, దక్షిణ భారతదేశంలో కృష్ణా, గోదావరి ముఖద్వారాల గుండా తెలుగు

నేలమీద తొలిగా ద్రావిడ మానవులు అడుగుపెట్టారనీ అనేక పరిశోధనాంశాలు ఈ గ్రంథంలో ఉన్నాయి.

ఆదిమయుగంలో తెలుగునేలమీద అనేక జాతుల ప్రజలు నివశించారని, వారంతా సంలీనమై జాతిపరంగా ఆంధ్రులుగానూ, భాషపరంగా తెలుగు వారుగానూ రూపొందారనే సిద్ధాంతానికి పూర్ణచంద్‌గారి ఆలోచనలు ఒక కొనసాగింపు. కేవలం జాతుల మధ్య యుద్ధాల్ని, సంఘర్షణల్నీ వర్ణించి ఇదే చరిత్రగా చదువుకొమ్మన్నారు చరిత్రకారులు. కానీ, ఏ జాతి చరిత్ర అయినా యుద్ధానంతరమే మొగ్గ తొడుగుతుంది. నిజానికి సంఘర్షణ తరువాత సహజంగా జరిగే వివిధ జాతుల సంలీనమే చరిత్ర. ఓడినవారు గెలిచిన వారికి బానిసలౌతారు. ఆ బానిసల ద్వారా కలిగిన సంతానం, ఆ రెండు జాతుల మిశ్రమ లక్షణాలతో ఒక కొత్త జాతిగా అవతరించి కొత్త చరిత్రను ప్రారంభిస్తుంది. ఏ దేశచరిత్రలో అయినా ఇదే జరుగుతుంది. వేర్వేరు జాతుల మధ్య ఈ సంలీనాలే జరిగి ఉండకపోతే, మానవజాతి ఏనాడో నిర్వీర్యమైపోయి ఉండేది. పటిష్ఠమైన జాతిగా తెలుగువారు రూపొందటానికి తెలుగు నేలమీద అనేక జాతుల సంలీనమే బలీయమైన కారణంగా పూర్ణచంద్‌గారు భావించారు. సుబ్బారాయుడు, సుబ్రహ్మణ్యస్వామి ఇద్దరినీ కలిపి ఒకే దేవతగా తెలుగువారు పూజించటానికి జాతుల సంలీనం, ఫలితంగా దేవతల సంలీనాలు ముఖ్యకారణం అంటారాయన.

కాలక్రమంలో ఉత్తరాదిలో హుణులు తదితర పాశ్చాత్య జాతుల దాడులు పెరగటంతో సురక్షిత స్థావరంగా తెలుగు నేలమీదకు చేరిన వైదికార్యులు ఇక్కడి ప్రజలతో సంలీనం కావటం వలన వైదిక దేవతలు, తెలుగు దేవతల సంలీనం కూడా జరిగిందంటూ, 'ఆంధ్ర విష్ణువే అసలు విష్ణువు' అనే వ్యాసంలో చక్కని వివరణ కనిపిస్తుంది. 'బెజ' దేవత, 'కా' దేవత, కొట్టి, కాట్టి, తుర్క, ఆంధ్రవిష్ణు, పులుమావి ఇలా తొలినాటి అచ్చ తెలుగు వేల్పుల గురించి ఒక మంచి వ్యాసం ఈ పుస్తకంలో ఉంది.

'మొక్కలయ్య మొక్కుల కథ' వ్యాసంలో వినాయకుడి ఆరాధనని తెలుగువారు ఏ విధంగా రూపొందించారో వివరించారు. స్కంధ (సుబ్రహ్మణ్యస్వామి) ఆరాధనను తెలుగువారే ప్రారంభించారని, శివుడు, విష్ణువు కూడా తెలుగువారి ద్వారానే వైదిక మతంలోకి ప్రవేశించి ఉంటారనీ అనేక ఆధారాలతో మనలో కొన్ని కొత్త ఆలోచనలను ప్రేరేపిస్తారాయన.

భారతదేశంలో తమ ప్రధాన ఆహారాన్ని "అన్నం" అని పిలుస్తున్నది ఒక్క తెలుగువారే! ఇందుకు ఒక కారణం ఉంది. 'అన్నం' అనే పదానికి ఆప్టే సంస్కృత నిఘంటువు నుండి ఆంధ్రుడు అనే పర్యాయపదాన్ని చూపిస్తూ, అన్నం తెలుగులోంచే సంస్కృతంలోకి వెళ్లిన పదం కావచ్చునంటారు డా॥ పూర్ణచంద్. పరిశోధకుడికి జాత్యభిమానం, భాషాభిమానం ఉన్నప్పుడే ఆలోచనలు జాతి ప్రాచీనతను నిరూపించే దిశగా సాగుతాయనేది వాస్తవం. 'వరి' అనే పదం తెలుగు నేలమీంచి ప్రాచీన సుమేరియా దాకా విస్తరించిన వైనాన్ని వివరిస్తూ ఆయన వ్రాసిన వ్యాసం ప్రతి ఒక్కరూ తప్పనిసరిగా చదవాలి.

గతంలో పూర్ణచందుగారు వ్రాసిన "తెలుగే ప్రాచీనం" గ్రంథం తెలుగు భాషకు ప్రాచీనతా హోదా రావటానికి ఒక ఆకర గ్రంథంగా ఉపయోగించింది. ఆ తరువాత ఆయన వ్రాసిన నైలూ నుండి కృష్ణదాకా గ్రంథం భాషా పరిశోధకులకు ఎన్నో విలువైన పరిశోధనలు చేయటానికి కావలసినంత ముడిసరుకును అందించింది. ఇప్పుడీ "తెలుగు కోసం" గ్రంథం తెలుగువాడిగా పుట్టినందుకు ప్రతీ తెలుగువాడు ఎందుకు గర్వించాలో, ఎందుకు చేయెత్తి జై కొట్టాలో సాధికారికంగా వివరిస్తోంది.

సంస్కృతంతో సంపర్కం వలన తెలుగుభాష ఒక సౌందర్యాన్ని సంతరించుకున్న మాట నిజం. ఆ భాషలోని వ్యాకరణ సూత్రాలు, వర్ణమాల, అలంకారాలు తెలుగు భాష పరిపుష్టినొందటానికి తోడ్పడ్డాయి. విస్తృతమైన భావజాలం, సాహిత్యం తెలుగులో రావటానికి సంస్కృతం నిర్వహించిన పాత్ర విస్మరించరానిది. దేశభాషలందు తెలుగు లెస్స అనీ, సుందర తెలుంగు అనీ, మధురమైన భాష అనీ, ఇటాలియన్ ఆఫ్ ఈస్ట్ అనీ తెలుగు భాషకు కీర్తి దక్కటానికి ఈ నేపథ్యం ఎంతగానో తోడ్పడింది కూడా! వందలాది ఏళ్లుగా సాగిన కాలవాహినిలో, తెలుగువారైన అనేకమంది మహాకవులు, శాస్త్రవేత్తలు, వేదాంతులు, తత్త్వవేత్తలు సంస్కృత భాషలో రచనలు చేసి ఆ భాషకు పుష్టినీ, జవసత్వాలను కలిగించిన వాస్తవాన్ని కూడా మనం మరిచిపోకూడదు. ఈ మహాకవుల ద్వారానే అనేక తెలుగు మాటలు సంస్కృతంలోకి చేరి, చివరికి అవి సంస్కృతంలోంచి వచ్చిన తెలుగు మాటలుగా మనం భ్రమపడే పరిస్థితి తెచ్చిన మాట కూడా చర్చనీయాంశమే!

'తెలుగు కోసం' గ్రంథంలో పంచదార అనే పదం నుండి పత్తిత్తు అనే పదందాకా ఎన్నో పదాలు తెలుగులో ఎలా ఏర్పడ్డాయో తనదైన విధానంలో పూర్ణచంద్‌గారు వివరించిన తీరు అద్భుతం అనిపిస్తుంది. మనలో చాలామంది ఏనాడూ ఆలోచించని విషయాలకు ఆయన ఒక ఆకారం కల్పించి మన ముందు నిలబెట్టారనిపిస్తుంది.

ప్రాచీన యుగంలో వైదిక ఆర్యులతో సహజీవనం, సమీపవర్తిత్వం కారణంగా తెలుగు భాషకూ, సంస్కృతానికీ పెద్ద తేడా లేదన్నంతగా తెలుగు మారిపోతే, ఆధునిక యుగంలో ఇంగ్లీషు వారి ఆధిపత్యానికి లోబడిన కారణంగానూ, పాశ్చాత్యీకరణ, ప్రపంచీకరణాల నేపథ్యంలో పెరిగిన ఆంగ్లభాషా వ్యామోహం కారణంగానూ తెలుగుకీ ఇంగ్లీషుకీ పెద్ద తేడా లేదన్నట్టు పరిస్థితి మారిపోయింది. అమ్మభాష పరిరక్షణ గురించి మాట్లాడేవారిని సంస్కృతభాషా వ్యతిరేకులని ముద్రవేసే వ్యక్తులు ముఖ్యంగా గమనించవలసిన అంశం ఇది.

ఏ భాషైనా మనుషులదే తప్ప దేవతలకు సంబంధించింది ఎంతమాత్రమూ కాదని ఛాందసంగా ఆలోచించేవారికి మరీ మరీ మనవి చేస్తున్నాను. జనం నాలుకలమీంచి సంస్కృతం ఎందుకు తప్పుకుందో ఆలోచిస్తే, అవే కారణాలు జనం నాలుకల మీంచి తెలుగును కూడా తప్పిస్తాయని గ్రహించవలసిందిగా కోరుతున్నాను. తమను కాపాడమని ఒక తెలుగుబిడ్డ దేవుణ్ణి కోరుకోవటానికి తెలుగు భాష ఎందుకు పనికిరాదని పూర్ణచంద్‌గారు

నిలదీస్తున్నారు. తెలుగువారికి తెలుగే దేవభాష అనే ఆయన అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

బిడ్డ పుట్టగానే చేసే తొలిరోదన అమ్మ భాషలోనే ఉంటుందని నిరూపిస్తూ, మనిషి మనసు అమ్మభాషలో ఏ విధంగా రూపొందుతుందో ఆయన చక్కగా విశ్లేషిస్తారు. మాతృభాష తెలీకుండా కేవలం ఇంగ్లీషు మాత్రమే నేర్పాలనే నేటికాలపు చదువుల రీతి వలన బిడ్డ మానసిక పరిణతి చాలినంత లేకపోతోందని ఒక వైద్యుడిగా ఆయన చెప్తోన్న విషయాన్ని విద్యావేత్తలు పట్టించుకోవాల్సిన అవసరం ఉంది.

భాష, సాహిత్యం, సంస్కృతి, చరిత్రల అనుశీలనా గ్రంథంగా వెలువడిన "తెలుగు కోసం" ఆలోచించే హృదయం ఉన్నవారి గుండె తలుపులు తడుతోంది. మన భాష పుట్టుక, పురోగతి, పతనం ఇటువంటి అంశాలపైన సరైన అవగాహనకు ఈ పుస్తకం ఒక దిక్సూచి కాగలదని నమ్ముతున్నాను. ఇంత విస్తృతమైన పరిశోధన అరుదుగా జరుగుతుంది. ఇవి కొనసాగవలసిన పరిశోధనలే! అధ్యయనం అనేది నిరంతరంగా జరగవలసిన అంశం. ఇతర పరిశోధకులు ఒక స్ఫూర్తిగా తీసుకుని తెలుగు భాషాభిమానంతో తమ పరిశోధనలను కొనసాగించాలని నేను కోరుతున్నాను. తెలుగువారికి ఒక మంచి ఆకరగ్రంథం ఇచ్చినందుకు పూర్ణచంద్‌గారికి ధన్యవాదాలు.

ఇవన్నీ పరిశోధనాపరంగా ఇతరులకన్నా భిన్నంగా పరిశీలన చేసిన పూర్ణచంద్‌గారి ఆలోచనలు, భాషోద్యమపరంగా డా॥ పూర్ణచంద్ నిర్వహించిన పాత్ర గురించీ, ఆయన ప్రస్తావించిన అంశాల గురించీ ఇక్కడ ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

త్వరగా తెలుగు భాషాభివృద్ధి ప్రాధికార సంస్థ ఏర్పాటు జరుగుతోన్న సందర్భంలో ఈ పుస్తకం ప్రాముఖ్యతను సంతరించుకుంది. ముఖ్యంగా "నుడికావలి" పేరున ఒక భాషా కాలుష్య నివారక సంస్థ ఏర్పాటు గురించి, నుడికలిమి లేదా పదనిధి ఏర్పాటు గురించి, సాంకేతిక తెలుగు గురించి, ప్రపంచ భాషగా తెలుగును తీర్చిదిద్దటం గురించి ఎన్నో ఆలోచనలను ఆయన అందిస్తున్నారు.

విశ్వవిద్యాలయాలూ, భాషావేత్తలు, చరిత్రవేత్తలు, సాంఖ్య, న్యాయ, వైశేషికాది తర్కవేత్తలు ఇందరు కలిసి చేయాల్సిన కృషిని పూర్ణచంద్‌గారు ఒక్కరే చేశారు. ఈ 'తెలుగు కోసం' ప్రతి ఒక్కరూ అక్షరం అక్షరం పరిశీలించవలసిన అధ్యయన గ్రంథం. ఇంతకన్నా భిన్నమైన ఆలోచనలు లేదా ఇంతకన్నా ఉన్నతమైన ఆలోచనలూ ఈ గ్రంథం చదివాక మనలో కలిగితే ఈ పుస్తకం నూరుశాతం విజయం సాధించినట్టేనని భావిస్తాను.

ఈ పుస్తకాన్ని ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి ప్రచురణగా వెలువరించటం ఆనందంగా ఉంది. తెలుగు భాషోన్నతికి వెలుగుల దివ్వెని అందించిన పూర్ణచందుగారికి ధన్యవాదాలు. భాషను కాపాడుకుంటే, భాష మనల్ని కాపాడుతుంది. ఎందుకంటే భాష వలనే మెదడు విస్తృతి పొందగలుగుతుంది కాబట్టి!

# గణపతి : మొక్కలయ్య మొక్కుల కథ

**బు**ద్ధి దేవర, పంటల దేవుడు, మొక్కలయ్య, చేటల్లాంటి చెవులుగలిగి జనంగోడు చక్కగా ఆలకించేవాడు, పసుపు రంగులో కనిపిస్తూ పచ్చదనాన్ని లోకాన నింపేవాడు, ధాన్యరాశిని ఆసనంగా చేసుకున్నవాడు, నిరాఘాటంగా రాయగల రాయస కాడు, పర్యావరణ పరిరక్షకుడూ అయిన గణపతి లోకానికొక శాంతి సందేశంగా నిలిచాడు. ఆయన పుట్టినరోజున మనం నేటి పర్యావరణం గురించి, రేపటి మన మనుగడ గురించి ఆలోచించుకునే అవకాశం కలిగించుకోవాలి!

చైనా బౌద్ధులు 'లాఫింగ్ బుద్ధ' రూపాన్ని, భారతీయులు వినాయకుణ్ణీ బుద్ధికి అధిదేవతలుగా రూపొందించుకున్నారు. వాస్తు పేరుతో, ఈ బుద్ధ, వినాయకుల బొమ్మల్ని దిష్టి బొమ్మలుగా పెట్టుకునీ బుద్ధిహీనతను ప్రదర్శిస్తున్నాం. వినాయకుణ్ణి నవ్వులాటకు తీసుకోవటం. పనికిరాని కార్టూన్లు గీయటం, తొక్కలో వినాయకుడు లాంటి విసుర్లు వేయటం, ప్రత్యేక హాస్య సంచికలు ప్రచురించటం ఇవి ఆయన్ని తక్కువ చేయటమే అవుతుంది.

మూషికాలు పంటల దొంగలు. గణపతి వాటిని అణచి ఉంచటానికి సాక్షాత్తూ పాముతో నడుం బిగించాడు. పంటని కాపాడాడు. అలా ఆయన 'పర్యావరణ పతి' అయ్యాడు. ఈ గణపతి కథ ఈ నాటిది కాదు, ఋగ్వేద కాలం నుండీ మొదలౌతుంది.

**'గణానాంత్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమం**
**జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పతా నశ్శృణ్వన్నూతిభి స్సీదసాదనం"**

ఋగ్వేదం రెండవ మండలంలో (23.01) కనిపించే గణపతి స్తుతి ఇది. ఇతరులకన్నా ఉన్నతులుగానూ, భిన్నంగానూ తమ గణవ్యవస్థ తమను నిలిపిందని భావించిన ఆర్యప్రజలు తమ గణపతులందరికీ ప్రతినిధిగా మహాగణపతికి హవిస్సులు అర్పించుకున్నారు. "గణానాంత్వా గణపతిగ్ం" గణాలకు పతి, కవిం కవీనా మేథావుల్లో కెల్లా మేథావి, "ఉపమశ్రవస్తమం" బాగా వినేందుకు ఉన్నతమైన చెవులు కలవాడు (మొరాలకించేవాడు), "జ్యేష్ఠరాజం బ్రహ్మణాం" వికాసం కలిగించిన తొలి పరిపాలకుడు, "బ్రహ్మణస్పతానః" మరింత వికాసం పొందేలా చేయగలవాడు, "శృణ్వన్నూతిభి స్సీదసాదనం" మొర వినగానే నూతన ఆలోచనలకు వేదికైనవాడు ...'హవామమేవ' మా హవిస్సులు గైకొనమంటూ వేడికోలు ఈ ఋక్కులో కనిపిస్తోంది.

సాయణభాష్యంలో గణానం అంటే దేవాది గణాలనీ, గణేశ అంటే వేద మంత్రాది స్తోత్రాలతో స్తుతించే వారి నాయకుడని అర్థం. ఈ విశేషణాలన్నీ ఋగ్వేద కాలంలో ఇంద్రుడిని ఉద్దేశించినవి! అప్పటికి ఇంద్రుడే గణపతి. మాక్స్‌ముల్లర్ క్రీ. పూ. 2,500-1800 నాటి ఋక్కుగా దీన్ని భావిస్తే, తిలక్ క్రీ.పూ. 6,000 నాటిదని, ఇతరులు, క్రీ.పూ. 3,000 నాటిది కావచ్చుననీ అన్నారు.

తరువాతికాలంలో, గణపతిని రుద్రుడి రూపంగా యజుర్వేదం భావించింది. నమకం చమకంలో "నమో గణేభ్యో గణపతి భ్యశ్చవో నమః" దేవగణాల రూపం వున్న నీకు నమస్కారం, దేవగణాలకు పతివైన నీకు నమస్కారం" అంటుంది.

దేవగణాలూ, దేవగణపతి ఇద్దరూ ఒక్కరే అయిన ఈ మహాగణపతి రుద్రుడి రూపంగా కనిపిస్తాడు. ఋగ్వేద కాలంలో ఇంద్రుడూ, తరువాతి యుగంలో రుద్రుడూ గణపతులుగా వ్యవహరించి వుంటారు. ఇది క్రీ.పూ. 1,000 నాటి సంగతి కావచ్చునని మాక్స్‌ముల్లర్ భావన.

హేరంబ, గణనాయక, గణేశ, ద్వైమాతుర, లంబోదర, గణాధిపతి, వక్రతుండ, కపిల, చింతామణి, దుంఠి (పద్మపురాణం), పిళ్ళారి, శ్రీ గణనాథ, కరివదన, లకుమికర, అంబాసుత, సిద్ధివినాయక (సంగీత శాస్త్రాల్లో), సుముఖ, ఏకదంత, గణకర్ణిక, వికట, విఘ్నరాజ, గణాధిప, ధూమకేతు, గణాధ్యక్ష, గజానన, వక్రతుండ, శూర్పకర్ణ, స్కందపూర్వజ (నిత్య పూజా విధానంలో) ఇలాంటి అనేక పేర్లతో, వాటికి తగిన లక్షణాలతో గణేశుడు వివిధ కాలాలలో కనిపిస్తాడు.

పరిణామ క్రమంలో పాత దేవతల స్థానే, కొత్త దేవతలు చేరటం సహజ పరిణామం. తొలుత ఇంద్రుడిదే ఆధిపత్యం. తరువాత రుద్రుడు ఆ స్థానంలో కనిపిస్తాడు. అతణ్ణి శివుడి రూపంగా చెప్పుకున్నారు. రుద్రుడు, శివుడూ ఒక్కరేనన్నారు. పంచభూతాలలో ఆకాశానికి విష్ణువు, వాయువుకు సూర్యుడు, అగ్నికి శక్తి (అంబ), భూమికి శివ, జలాలకు గణేశ అధిదేవతలుగా చేసిన వర్ణనలు వున్నాయి.

బహుశా జలాధిదేవత కావటం వలనే గణేశ ఉత్సవాలలో నిమజ్జనానికి ప్రాముఖ్యం వచ్చింది. కానీ, ఇది రాను రానూ అతి ధోరణిగా మారి చివరికి ఈ నిమజ్జనం అనేది జిప్సం, పీవోపీ, విషపు రంగులతో జలకాలుష్యానికి దారితీస్తోంది. ఇది వినాయక ద్రోహం, పర్యావరణ హత్య అని గట్టిగా చెప్పగలగాలి.

మనుస్మృతిలో, "విప్రానాం దైవతం శమ్భుః క్షత్రియాణాం తు మాధవా :/ వైశ్యానాం తు భవేద్ బ్రహ్మే శూద్రానాం గణ నాయకా :- బ్రాహ్మణులు సాంబుని, క్షత్రియులు విష్ణువుని, వైశ్యులు బ్రహ్మని, శూద్రులు గణనాయకుణ్ణి దేవతలుగా కొలవటం గురించి వుంది. మనువు కాలానికి దేవగణాధిపతి అయిన గణపతి శూద్రుల దేవుడిగా ఎందుకు మారిపోయాడనేది ప్రశ్నే! ఆర్యులతో ఆర్యేతర ప్రజల సంపర్కం జరిగినట్టే, వైదిక దేవతలూ, ఆర్యేతరుల దేవతల మధ్య కూడా సంలీనాలు జరిగాయి. పాత దేవతల స్థానే కొత్త దేవతలు రావటం పరిణామ క్రమంలో ఒక భాగమే!

మానవ జాతి చరిత్రని సంలీనాలే నిర్మించాయి. గానీ, సంఘర్షణలు కాదు. సంఘర్షణల తరువాత గెలిచిన వారికి ఓడిన వారు బానిసలౌతారు. గెలిచినవారి ద్వారా ఆ బానిసలు సంతానాన్ని కంటారు. ఆ సంతానానికి రెండు జాతుల సంలీన లక్షణాలు ఏర్పడతాయి. ఇద్దరి ఆచార వ్యవహారాలు, సంస్కృతులు, ఆహార అలవాట్లు ఆరాధనాపద్ధతులు కూడా మిశ్రితమై ఒక కొత్త జాతి ఏర్పడుతుంది. వారి వారి దేవతలు కూడా సంలీనమై కొత్త దేవతలు ఆరాధనా క్రమంలోకి వస్తారు. ప్రధాన ఆర్యదేవతలైన శివుడు విష్ణువు బ్రహ్మలకు తోడు గణేశ, కుమారస్వామి హనుమాన్ లాంటి పరివార దేవతలు అలా వైదిక దేవతలుగా వ్యాప్తిలో కొచ్చారు.

ఒకప్పుడు పంచాయతన పూజ వుండేది 'ఆదిత్యం, అంబికం, విష్ణు, గణనాథం మహేశ్వరం' అంటూ సూర్యుడు, అంబిక, విష్ణువు, గణపతి, శివుడు, ఈ ఐదు దేవతల అర్చననీ పంచయతన పూజ అన్నారు. శంకరాచార్యుడు (క్రీ. శ. 9వ శతాబ్ది) కుమారస్వామిని అదనంగా చేర్చి 'షణ్మత స్థాపనాచార్యుడు'గా ప్రసిద్ధుడైనాడని డా.పి వి కాణే మహాశయుడు పేర్కొన్నారు.

ఆర్య ఆరాధనా విధానంలోగానీ, ఆర్యేతరుల ఆరాధనా విధానాలలో గానీ తొలిరోజుల్లో జంతు బలి ప్రధానాంశంగా వుండేది. మాన్పించే లక్ష్యంతో శంకరాచార్యుల వారు షణ్మతాన్ని ప్రవేశపెట్టారు. ఉగ్రరూపులైన ఈ దేవతలను శాంతి దూతలుగా మార్చేందుకు కృషి చేశారు. గ్రామదేవతగా వున్న బెజవాడ దుర్గమ్మ విగ్రహం దగ్గర శ్రీ చక్రాన్ని ప్రతిష్టించి అమ్మవారిని శాంతమూర్తిగా చేశారని చెప్తారు. పశువుల తలలు నరికి ఆరాధించే విధానానికి బదులుగా కొబ్బరికాయ కొట్టి హారతి ఇవ్వటం, రక్తమాంసాల స్థానంలో మోదకాలు (తీపి వంటకాలు). నైవేద్యం పెట్టటం, షడ్రసోపేతమైన భోజనాన్ని మహానివేదన పెట్టటం కల్లు, సారాయికి బదులుగా పాయసాలు తాగటం లాంటి పద్ధతులు అమలుకు తెచ్చాడని చరిత్రకారుల భావన. ఈ ఘనత ఎవరిదైనా అది నిజంగా ఘనతే! అందువలన ఆరాధనా విధానం అహింసాత్మకం అయ్యింది. శాంతికోసం ఆరాధన అనేది ఒక అలవాటయ్యింది.

గణపతి ఆరాధనని గాణాపత్యం అంటారు. గాణాపత్యం ద్వారా గణపతి, వినాయక, విఘ్నేశ్వర, గజానన మూర్తులన్నీ కలగలిపి మహాశక్తిమంతమైన దేవతగా, ప్రథమ పూజనీయుడిగా రూపొందించు కున్నారు. సంస్కృత మహాభారతం అనుశాసన పర్వం (150-25)లో 'ఈశ్వరస్సర్వ భూతానాం గణేశ్వర వినాయకా' అని ఉంది. ఇది క్రీ.శ. తొలి శతాబ్ది నాటి రచన అనుకుంటే, ఆ కాలానికి విఘ్నేశ్వరుడి ప్రాధాన్యత గొప్పదని అర్థం అయింది.

గణేశ్వర, వినాయక గజానన, వక్రతుండ, మహాకాయ, లంబోదర, శూర్పకర్ణలాంటి పిలుపు లన్నీ అప్పటికే ఉన్నాయి. విఘ్నాలు సృష్టించటానికీ, వాటిని జయించి విజయం సాధించటానికీ ఈ విఘ్నేశ్వరుడే కారకుడైనాడు. లింగపురాణం శివుడి అంశతో గణపతి పుట్టినట్టు చెప్తుంది. మత్స్యపురాణంలో పార్వతి నలుగుబొమ్మ కథ కనిపిస్తుంది.

ఇంకో కథ కూడా ఉంది : పార్వతి నలుగు పెట్టుకుని ఆ మాలిన్యాన్ని నీటిలో కలిపిందనీ, ఆ నీటిని తాగిన మాలిని అనే రాక్షసి వెంటనే గర్భందాల్చి గణపతిని ప్రసవించిందనీ, పార్వతి ఆ బిడ్డను తీసుకువచ్చి పెంచిందనీ కథ చెప్తోంది. బహుశా ఇలాంటి కథల వలన విఘ్నాలు కలిగించేవాడుగా విఘ్నేశ్వరుణ్ణి కొందరు ప్రజలు భావించి ఉండవచ్చు. అలా కలిగించకుండా వుండాలని ప్రార్థించి, పూజించి వుండవచ్చు.

అంతకు మునుపు విఘ్నాలు కలిగించే శక్తిగా వున్న వినాయకుడు తరువాత కాలంలో విఘ్నాలు నివారించి విజయాన్ని, మేథా సంపత్తి, ఆహారాన్నీ, ఆరోగ్యాన్నీ ఇచ్చే శక్తిగా మార్పు పొందాడు.

'ప్రేతన్భూతగణాస్శ్చాన్యేయజన్తే తామస జనా' భూతప్రేతాది తామస జనులకు నాయకుడిగా వినాయకుడు కనిపిస్తాడు. దిష్టిబొమ్మగా వినాయకుణ్ణి పెట్టటం వెనుక ఈ విధమైన ఆలోచన ఒక కారణం కావచ్చు.

కీర్తిముఖాలు గోడలకు తగిలించే ఆచారం ఇప్పటికీ ఇంకా కొనసాగుతోంది. ఇవి క్రీస్తుశకం తొలి శతాబ్దినాటి ఆలోచనలు. భూతప్రేత పిశాచాదులు ఆయన అనుచరులే కాబట్టి, ఆయన్ని మంచి చేసుకుంటే వాటిని అదుపులో పెట్టి మనల్ని కాపాడతాడని నమ్మకం.

మోదః అంటే ఆనందం. తిన్నవారిని ఆనందింప చేస్తాయి కాబట్టి వీటిని మోదకాలు అన్నారు. తీపి ఉండ్రాళ్లే కాదు, లడ్డూలవంటి స్వీట్లన్నీ మోదకాలే! వినాయకుడికి వాటిని పెట్టి ఆయనను మంచి చేసుకోవాలనే భావన చాలామందిలో ఉంది.

నారాయణోపనిషత్తు (క్రీ.శ. 550) 'తత్పురుషాయ విద్మహే/వక్రతుండాయ ధీమహి/ తన్నో దన్తి ప్రచోదయాత్' అనే మూడు పాదాల మంత్రం చెప్పింది. జ్యోతిష శాస్త్రంలో గ్రహాల వక్రగతిని చెప్పటానికి ఉపయోగించే 'వక్ర' శబ్దాన్నీ గజాననుడి వక్రతుండానికి అన్వయిస్తారు పండితులు. వక్ర అంటే వెనుకకు కదలడం అని అర్థం.

జపాన్లో దొరికిన గణేశ విగ్రహంలో మరో ముఖం వెనుక వైపున ఉంటుంది. అంటే వినాయకుడు ద్విముఖుడు కూడా! వెనకవైపునకూడా దృష్టికల రక్షకుడు వినాయకుడని దీని భావార్థం.

'బోధాయన గృహ్యాశేష సూత్రం' 'బోధాయన ధర్మ శాస్త్రం'లలో చెప్పిన ప్రకారం విఘ్న, వినాయక, వీర, స్థూల, వరద, హస్తిముఖ, వక్రతుండ, ఏకదంత, లంబోదర మొదలైన పేర్లతో వేర్వేరు దేవతలు కనిపిస్తారు. బహుశా తరువాతికాలంలో వీళ్ళందరినీ సంలీనంచేసి, ఒక మహాగణపతిని ప్రతిష్టించుకుని ఉంటారు. హాలుడి గాథాసప్తశతిలోనూ, అమరకోశంలోనూ, బృహత్సంహితలోనూ, హర్షుడి నలచరిత్రలోనూ, గజాననుడి ప్రస్తావన ఉంది. కాబట్టి గజాననుడు క్రీస్తుశకం తొలి శతాబ్దాలలో రూపొంది ఉంటాడని భావించవచ్చు.

గణపతి ప్రస్తుత రూపం గుప్తులకాలంలో స్థిరపడిందని ప్రఖ్యాత చరిత్రవేత్త డి. చటోపాధ్యాయ అన్నారు. కార్డింగ్టన్ తన ఏనిషియంట్ ఇండియా గ్రంథంలో ప్రచురించిన గణేశ విగ్రహం క్రీ.శ. 5వ శతాబ్ది నాటిదన్నారు. ఆచార్య కుమారస్వామి కూడా గుప్తులకన్నా పూర్వంనాటి విగ్రహం కాకపోవచ్చని అభిప్రాయపడ్డారు.

కాణే మహాశయుడు 'వినాయకపూజ 6వ శతాబ్ది కాలంలో జరిగిందని వ్రాశారు. అనేకవిధాల పరిణామాలు చెందిన గణేశరూపం. గణేశ ఆరాధనా విధానం పదిహేను వందల ఏళ్ళక్రితం ఒక రూపానికి వచ్చాయని కాణే ప్రభృతులు తేల్చి చెప్పారు.

ద్రవిడాలజిస్టులు వినాయకుడు ద్రావిడుల దేవుడనే భావిస్తున్నారు. జాతుల సంలీనం, తద్వారా దేవతల సంలీనాల వలన వైదిక దేవతలతో ఈ ద్రావిడ గణపతి సంలీనం జరిగి ఉండవచ్చు. ఇందుకు తెలుగునేల ఒక వేదికను కల్పించి ఉండవచ్చు.

హాలుడి 'గాథాసప్తశతి' క్రీ.పూ. చివరి లేదా క్రీ.శ. మొదటి శతాబ్దాల కాలంలో వెలువడిన రచన. ఇందులో గజాననుడి ప్రస్తావన ఉన్నదంటే, ఆంధ్రప్రాంతంలో ఇప్పటికి 2000 ఏళ్ళక్రితమే వినాయకుడి ఆరాధన ఉందని అర్థం అవుతోంది. వి. రామసుబ్రహ్మణ్యం అనే పరిశోధకుడు 'సాంప్రదాయక సంస్కృతుల సంస్థ - మద్రాసు 'బులెటిన్ (యూనివర్శిటీ ఆఫ్ మద్రాస్, 1971)లో గణపతి, వినాయక, గజానన అనే వ్యాసంలో ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ 'నా తమిళ సోదరులు తొల్కాప్యం సంగమ సాహిత్యాలను క్రీస్తు పూర్వానికి తీసుకు పోవాలని చూస్తున్నారు. అలాంటి వారికి ఇది రుచించకపోవచ్చు అని వ్రాశాడు.

క్రీస్తుశకం తొలినాటి ఆంధ్రుల సాంఘిక చరిత్రకు హాలుడి 'గాధాసప్తశతి', గుణాఢ్యుడి 'బృహత్కథ'లు గొప్ప ఆధారాలు. వాటినే గాసట బీసట గాథలంటారు. గాథాసప్తశతిలో గజాననుడి ప్రస్తావన రాగా, తమిళంలో క్రీ.శ. ఆరవ శతాబ్ది వరకూ గణపతి గురించిన ప్రస్తావనే లేదని రామసుబ్రహ్మణ్యంగారు స్పష్టంగా చెప్పారు.

శాతవాహనులకన్నా ముందునాటి ఆంధ్రరాజులను ఆర్యులు ఆశ్రయించటం గురించి పద్మినీ సేన్ గుప్తా పేర్కొన్న విషయాలు గొప్పవి. ఇక్కడ ప్రస్తావనార్హం. వైదిక ఆర్యులు తెలుగు నేలపైన ఆశ్రయం పొంది ఇక్కడి ప్రజల ఆచార వ్యవహారాలను, దేవతలను

తమ సంస్కృతిలో కలుపుకున్నారు. మన దేవతలతో తమ దేవతలకు సంబంధాలు కలుపుకున్నారు.

హిందూమతం లేదా హిందూ ధర్మం ఏర్పడటంలో తెలుగువారి పాత్ర ఎంతైనా ఉంది.

మహాయాన బౌద్ధాన్ని ప్రవర్తింప చేసినవారు ఆంధ్రులు. వీళ్ళే గణపతిని విదేశాలకు తీసుకువెళ్లి ప్రచారం చేశారు. మహాయానం టిక్కెట్టు మీద గణపతి విదేశీయానం చేశాడని రామసుబ్రహ్మణ్యం గారు చమత్కరించారు.

'లాఫింగ్ బుద్ధా', లంబోదర వినాయక' రూపాల మధ్య సామ్యతకు తెలుగు బౌద్ధులు కారణం కావచ్చు నేది నమ్మదగిన ఊహే!

అమరావతి శిల్పాలలో కన్పించే యక్షుల శరీరాకృతిని పోలి ఉంటాడు గణపతి. గజముఖం తగిలించుకున్న తెలుగు యక్షరూపం ఆయనది!

గణపతిని బుద్ధికి, విజ్ఞానానికీ, పాండిత్యానికీ, మేధాసంపత్తికీ, శాంతి సౌభాగ్యాలకు, పచ్చదనానికి, పాడిపంటలకూ అధిదేవతగా ఆంధ్రులు భావిస్తారు.

ప్రపంచ శాంతిని కాంక్షించే తత్త్వం ఉన్నవారు ఆంధ్రులు. మొక్కలయ్యకు మొక్కులు తీర్చుకునే ఆరాధనా విధానాన్ని రూపొందించుకోవటంలో ఆంధ్రులు పర్యావరణ పరిరక్షణే ప్రధానంగా తీసుకున్నారు. మనం కూడా, పాత్ర ముఖ్యమైంది. వినాయకచవితిని ప్రపంచ శాంతి, పర్యావరణల ప్రాముఖ్యతని తెలియజెప్పే విధంగా జరుపుకుని ఆనందించగలిగినప్పుడే సార్థకత కలుగుతుంది.

ఇది ఆంధ్రులు దేశానికి అందించిన పెద్ద పండుగ. మొక్కల పండుగ. ఇండో యూరోపియన్ మూల భాషలో అంధ్ అంటే మనిషి, ఒక మొక్క అనే అర్థాలు కనిపిస్తాయి. అంథ్‌లోంచి ఆంత్రపాలజీ (మానవశాస్త్రం) పదం ఏర్పడింది. ఆంధ్ర శబ్దానికీ మూలం ఇదే! ఆంధ్ర శబ్దం మొక్కలను కూడా సూచిస్తుంది. ఆంధ్రుల దేవుడు మొక్కలయ్య. ఆయన మొక్కు అంటే పర్యావరణాన్ని కాపాడటమే.



# తొలి తెలుగువేల్పులు

తెలుగువారి దేవతలు అతి ప్రాచీనులు. వీళ్ళలో వైదిక, బౌద్ధ, జైన, శైవ, వైష్ణవాది మతాలు తెలుగు నేలకు చేరటానికన్నా ముందే, కొలుపు లందుకున్న అనేక తెలుగు దేవతలు ఈ కృష్ణాతీరంలో నెలకొని ఉన్నారు. వాళ్ళని మనం కొలుస్తూనే ఉండి ఉంటాం... కానీ, వాళ్ల పేర్లు మారిపోయాయి. దాదాపు అందరూ శైవ దేవతలుగా పూజలందుతూ ఉండటాన మనం ఆనాటి దేవతా రూపాలను గుర్తించలేకపోతున్నాం.

ఆనాటి పురుష దేవతలు శివుడు, రుద్రుడు, భైరవుడి అవతారాలుగానూ, స్త్రీ దేవతలు అమ్మవారి శక్తులుగానూ ఇప్పటికీ పూజలందుతున్నారు. అప్పటప్పటా వేల యేళ్ళనాటి ఆ దివ్యమూర్తుల ఆనాటి ఛాయలు మనకు దర్శనమిస్తూనే ఉన్నాయి. ఇక్కడి ఊళ్ళపేర్లు. ఇక్కడి నదుల పేర్లు, ఇక్కడి రాజుల పేర్లలో అలనాటి వేల్పుల పేర్లు కనిపించటమే ఇందుకు తార్కాణం.

ఈ అలనాటి వేల్పులు నూరుశాతం తెలుగు దేవతలే! వాళ్ళ పేర్లు తెలుగులోనే రూపొందాయి. ఈ తెలుగు దేవతల మూలాలను తరచి చూస్తే, తెలుగు జాతి మూలాలు దొరుకుతాయి. తెలుగు భాష ప్రాచీనత వెల్లడౌతుంది.

జర్మన్ దేవగణాలను ఇతరులు క్షుద్రదేవతలుగా భావించినప్పుడు జాకోబ్ గ్రిమ్మ్ అతని సోదరుడు కలిసి (Teutonic Mythology ని నిర్మించారు. (Jacob Grimm's Deutsche Mythologie (1835) 19వ శతాబ్దపు బ్రిటిష్ జానపద సాహిత్యవేత్తలకు సైతం గ్రిమ్మ్ సోదరులు మార్గదర్శకులయ్యారు. మన కాకతి, ఏకవీర, ఎల్లమ్మ, పోలేరమ్మ, పోతరాజు, కూనలమ్మ, అక్కలు ఇలాంటి దేవతలపైన కూడా ట్యుటోనిక్ మైథాలజీ విధానంలో పరిశోధనలు జరగాల్సిన అవసరం ఉందని ఆరుద్ర 'జనకళ-రంజనకళ' అనే వ్యాసంలో వ్రాశారు.

చరిత్రగతిని పరిశీలిస్తే, రెండు జాతులు పరస్పరం సంఘర్షించుకున్నప్పుడు ఓడిన జాతి గెలిచిన జాతికి బానిస అవుతుంది. గెలిచినవాళ్ళు బానిస స్త్రీల ద్వారా సంతానాన్ని కంటారు. ఆ సంతానానికి ఆ రెండు జాతుల మిశ్రమ లక్షణాలూ ఉంటాయి. రెండు జాతుల సంస్కృతులు, భాషలు, ఆచార వ్యవహారాలతో పాటు దేవతలు కూడా సంలీనం అవుతారు. ఆ ఇరు దేవతల మధ్యా వరుసలు, బంధుత్వాలూ ఏర్పడతాయి. ఒక దేవుడికి ఇంకో దేవత భార్యగానో, సోదరిగానో మారుతుంది. ఒక కొత్త జాతి, ఒక కొత్త చరిత్ర ఏర్పడి సమాజం కొత్తపోకడలతో ముందుకు సాగుతుంది. సంఘర్షణానంతరం సంలీనాలే మానవజాతి చరిత్రను నడిపించాయి. తెలుగు నేల మీద జాతుల సంలీనానికి చారిత్రక ఆధారాలు వెదకాల్సిన సమయం ఇది.

ఇప్పటికి కనీసం 3000 ఏళ్ళ క్రితం, ఏలి, ఎహువల, తూర్క, కొట్టి, చాత, కాట్టు, బెజ వగైరా దేవతలను తెలుగు నేల మీద ఆరాధించి ఉంటారనటానికి కొన్ని సాక్ష్యాలు ఉన్నాయి. ఈ దేవతల్లో సుమేరియన్, బాబిలోనియన్ ఆఫ్రికన్ మూలాలున్న దేవతలూ కనిపిస్తారు. జాతుల వ్యాపన క్రమంలో భాగంగా, ఆఫ్రికన్, మెడిటరేనియన్ జాతులు తెలుగునేలమీద స్థానిక జాతులతో సంలీనమైన వైనం కనిపిస్తుంది.

**'బెజ' దేవత :** నైలూ నదీ తీరాన సుడాన్, ఈజిప్ట్‌లలో 'బెజ' ప్రజలు ఇప్పటికీ ఉన్నారు. వీళ్ళు బెజదేవతని ఆరాధిస్తారు. నైలూ నుండి కృష్ణ దాకా సాగిన జాతుల వ్యాపనంలో కృష్ణాతీరాన స్థిరపడిన ఆఫ్రికన్ 'బెజ' ప్రజలు తమవెంట ఈ 'బెజ' దేవతని కూడా తెచ్చి ఉండవచ్చు. వీళ్ల భాషను Bedauye అంటారు. మాహెస్ అనే దేవుడు వీళ్లకు మూల పురుషుడు. బెజ దేవత పేరున బెజవాడ ఏర్పడి ఉండవచ్చు. ఆఫ్రో ఆసియాటిక్ భాషల్లో చాదిక్, కుషైటిక్, ఒమోటిక్ మరియు బెదాయి భాషలు ముఖ్యమైనవి.

**'కా' దేవత :** క్రీ.పూ. 3,200లో ఈజిప్ట్‌ని 'కా' చక్రవర్తి కృష్ణా ముఖద్వారం దగ్గర శ్రీకాకుళాన్ని రాజధానిగా పాలించాడని "అఖిలాంధ్రావనికి తొలి రాజధాని శ్రీకాకుళం" వ్యాసంలో శ్రీ టేకుమళ్ల రామచంద్రరావు ప్రతిపాదించారు. ఈ 'కా" ప్రజలు 'కా' అనే దేవతని ఆరాధించేవాళ్ళు. కా, కాల, కాళ అనేవి నలుపు అనే అర్థాన్ని సూచిస్తాయి. కుళం అంటే నది, కా+ కుల = 'కా' (నల్లని) నది. దాన్నే సంస్కృతీకరించి కృష్ణానదిగా పిలిచారు. కాకులం అంటే కృష్ణానది. కాకులేశ్వరుడు 'కృష్ణ ఒడ్డు దేవు'డన్న మాట. 'కా' దేవత కృష్ణా తీరాన ఇలా దేవుడిగా వెలిసింది. కాకుళేశ్వరుడు ఉన్న ఈ ఊరు శ్రీకాకుళంగా ప్రసిద్ధి పొందింది.

నైజీరియాలో "Ka River" ఉంది. అది నైగర్ నదిలో కలుస్తుంది. అక్కడే 'E1 Kurru' అనే నగరం ఉంది. కృష్ణాజిల్లా నిడుమోలు దగ్గర కూడా ఎలకుర్రు ఉంది. అది కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి జన్మస్థలి. ఎల్లకర్రు అనే ఊరు నెల్లూరు జిల్లాలో కూడా ఉంది. అక్కడ రాతియుగం నాటి అనేక ఆధారాలు దొరికాయి.

రాయలసీమలోనూ, బళ్ళారిలో కూడా ఇలాంటి ఆధారాలు అనేకం కన్పిస్తాయి. ఇక్కడి నుండి బయల్దేరిన ద్రావిడ గణాలు, కొంకణి, గుజరాతు మీదుగా సింధు నగరాలకు చేరి, ఆ నాగరికతలలో ముఖ్య పాత్ర పోషించారన్నది ఫ్రాంక్లిన్ సి సౌత్' వర్త్ అనే భాషా చారిత్రకవేత్త పరిశోధన.

తద్దినం పెట్టే అలవాటు ఈ 'కా' ప్రజలకుంది. వారి నుండి మనకు, మన ద్వారా వైదిక సంస్కృతిలోకి సంక్రమించి ఉండవచ్చు. కాకుల్ని పితృదేవతలుగా (harbingers) భావించే అలవాటు వీళ్ళకీ ఉంది.

**ఆంధ్రవిష్ణు :** కౌండిన్య సుచంద్రుడి కొడుకు ఆంధ్రవిష్ణువనే రాజు, ఈ 'కా' రాజ్యాన్ని ఏలే నిశుంభుణ్ణి ఓడించాడు. ఆంధ్ర సామ్రాజ్యం నెలకొల్పాడు. ప్రజలు ఆంధ్రవిష్ణువుని ఆరాధించసాగారు. "నిరీశ్వరా పరేదేశాః ఆంధ్రః ఏకోస్తి సేశ్వరః/ యత్రాస్తే భగవాన్ విష్ణుః ఆంధ్ర నాయక సంజ్ఞయా – దేశపరమైన దేవుడు ఒక్క ఆంధ్ర దేశానికే ఉన్నాడు. ఆయన ఆంధ్రభాషా దేవుడైన ఆంధ్ర విష్ణువు. ఆంధ్ర నాయకుడు, తెలుగురాయుడు అని ఆయనకు పేర్లున్నాయి...

సంకిచ్చ జాతకం, ఘటజాతకం అనే బౌద్ధ జాతక కథలలో అంధకవెణ్హు పేరుతో ఆంధ్ర విష్ణువు గురించి ఉంది. బుద్ధుడు వసుదేవుడు (కృష్ణుడుగా) పుట్టి, ద్వారకా నగరానికి కావలిగా ఉన్న ఒక గొప్ప గాడిద కాళ్ళు పట్టుకుని మచ్చిక చేసుకొని, దాని సాయంతో ద్వారకను బంధించాడట. ఈ వసుదేవ కృష్ణుణ్ణి సంకిచ్చ జాతకకథ అంధకవెణ్హుగా పేర్కొంది. అది ఆంధ్ర విష్ణు శబ్దానికి అంధకవెణ్హూ పాళీ భాషా రూపం కావచ్చు. వసుదేవుడంతటివాడు గాడిద కాళ్ళు పట్టుకొన్నాడనే సామెత తెలుగు నేలమీదే ఎక్కువ ప్రాచుర్యంలో ఉండటానికి కారణం అంధకవెణ్హు ఆంధ్రవిష్ణువు కావటమే!

**కాట్టి దేవత :** క్రీ.శ. తొలి శతాబ్దాలనాటి కుమార విష్ణువు అనే పల్లవ రాజు ఇచ్చిన శాసనాల్లో కాట్టిశర్మ, కొట్టిశర్మ, తూర్కశర్మ లాంటి పేర్లు కనిపిస్తాయి. కాట్టి, కొట్టి, తూర్క అనేవి ఆనాటి దేవతల పేర్లే! 'కాట్టు' లేదా కాట్టి దేవత పేరున కాట్రేనిపాడు లాంటి ఊళ్ళ పేర్లు ఏర్పడి ఉండొచ్చు. కాటమరాజు పేరులోని కాటయ్య ఈ కాట్టి లేదా

కాట్టు దేవతే అయి ఉంటాడు. పల్నాటి కాటేశ్వరుడి దయ వలన కాటమరాజు పుట్టాడని అతని కథలో ఉంది. కొండవీటిరెడ్డి రాజుల్లో కాటయ్య వేముడు ఉన్నాడు. 'కాట్టు'కు 'కాడు' (అడవి) వికృతి రూపం అయితే కాట్టురేడు అడవి దేవర అవుతాడు. 'కాడువెట్టి' అంటే కాట్టు దేవుడి దాసుడని। ఇది పల్లవరాజుల్లో బిరుదునామం. కాడవరాయ అనేది దీని రూపాంతరంగా పండితులు భావించారు.

**కొట్టి** : కొట్టి అనే ఇంటి పేరు గలవారు. ఈనాటికీ ఉన్నారు. తొలి పల్లవుల కాలానికి అంటే 1700 యేళ్ళ క్రితం కొట్టి దేవత ఆరాధన ప్రాచీన కాలంలో కృష్ణాతీరంలో ఘనంగా ఉండేదన్నమాట. అయితే, వైదిక ధర్మాలను స్వీకరించి బ్రాహ్మణులుగా మారిన వ్యక్తులు శర్మ శబ్దాన్ని తమ పేర్లకు చేర్చుకుని దానాలు పొంది ఉండవచ్చు. వైదిక ధర్మాలను స్థాపించడానికి ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, పల్లవులు కూడా విశేష కృషి చేసిన సంగతి చరిత్ర ప్రసిద్ధమే!

**తుర్క** : దుర్గ అనే దేవత పేరుకు ఈ తుర్క దేవత మూల రూపం కావచ్చునని శ్రీ వేదం వెంకటరాయశాస్త్రి అభిప్రాయపడ్డారు. తూర, తువర అంటే వర్ష తుంపర. వర్షాధిదేవతగా 'తూర' 'తూర(క)' లేదా 'తూర్క' దేవతను కొలిచి వుంటారని గోష్ఠి వారు ప్రచురించిన "తెలుగు మఱుగులు" గ్రంథంలో ఒక అభిప్రాయం కనిపిస్తుంది. అయితే, తువర శబ్దానికి సుక్షేత్రం,మంచి వాసన గల నేల అనే అర్థాలు కూడా ఉన్నాయి. నేలతల్లిని తువరదేవతగా కొలిచి ఉండవచ్చు. 'తువరి కంది' 'తువరక' అనే మొక్కలు కూడా ఉన్నాయి. తువరకుడు అంటే గడ్డం మీసం లేనివాడు. బహుశా అనార్యుడు అనే అర్థంలో ఈ పదం ఏర్పడి ఉండవచ్చుననుకుంటాను.

**చిత్రరథస్వామి** : సాలంకాయనులు తాము "చిత్రరథస్వామి పాదానుజ్ఞాతస్య = చిత్రరథస్వామి పాదానురక్తుల"మని శాసనాలలో పేర్కొన్నారు. ఆ దేవుడు సాలంకాయనుల కులదేవతే కావచ్చు. శివుడి అవతారంగా ఈ దేవుణ్ణి భావించి ఉండవచ్చు. త్రిపురాసుర సంహారం సమయంలో భూదేవి రథంగా మారి శివునికి సహకరించింది. అలా చిత్రరథం కలవాడు కాబట్టి, శివునికి చిత్రరథస్వామి అనే పేరు వచ్చి ఉంటుందని పండితుల భావన.

**పులుమావి** : క్రీ.పూ. 1వ శతాబ్ది నాటి శాతవాహనుల శాసనాలలో ఎక్కువగా కనిపించిన దేవత ఈ పులుమావి. పులుమావి పేరుని 'వాసిష్ఠీపుత్ర పులుమావి' ఇలా. తమ పేర్లలో శాతవాహన ప్రభువులు చేర్చుకునేవాళ్ళు "రఞ్ఞోవాసిట్ఠీ పుతస సిరి పులు

మావిస" అనీ, "అరహణకు వాహిట్టీ మాకణకు తిరు పులుమావికు" అనీ శాసనాలలో పులుమావి పేరు కనిపిస్తుంది. 'పులిల అంటే 'తెల్లుగడ్డి'. 'మావి అంటే పిండాన్ని ఆవరించి ఉండే పొర. పులుమావి అంటే రెల్లు గడ్డి మావిపొరగా పుట్టినవాడు అని! ఇది కుమారస్వామికి సంబంధించిన కథ. కుమారస్వామి తమిళ దేవుడనే వాదానికి ఈ శాతవాహన శాసనం ఒక అపవాదు. కుమారస్వామి ఆరాధన తొలుత తెలుగు నేల మీదే ఆరంభమయ్యిం దనటానికి ఆధారాలున్నాయి. 'పులు', 'మావి' ఈ రెండూ తెలుగు మాటలే! పులు, పూరి, కసవు అనేవి గడ్డికి తెలుగు పేర్లు. కసవు శబ్దంలోంచి కుశ ఏర్పడిందని, పులకేశి అనే పేరులో కేశి ఇదేనని రాంభట్ల కృష్ణమూర్తి పేర్కొన్నారు. పురి లేదా పూరి మొక్క నెమలి పురి విప్పినట్టు ఉంటుంది. పురి విప్పటం అనేది ఈ పురి మొక్కని బట్టే వచ్చి ఉండవచ్చు.

**శ్రీ ఉత్పత్తి పిడుగు :** ఉత్పథము అంటే చెడ్డదారి. దాని పాలిట పిడుగు అయిన దేవుడు "శ్రీ ఉత్పత్తి పిడుగు" జాలాముఖ శైవులు కొలిచిన కాలాముఖ అర్జున దేవత ఈ శ్రీ ఉత్పత్తి పిడుగు అని పరిశోధకులు చెప్తారు.

**ఎంకి :** సుమేరియన్ దేవతల్లో ఒకరు ఈ ఎంకి. భూమి దేవత. రాంభట్ల కృష్ణమూర్తిగారు ఈ ఎంకి వెంకటేశ్వరుడిగా మారి ఉండవచ్చని అభిప్రాయపడ్డారు. భూమికి ఆకాశానికి మధ్య ఉన్న వాయువుని ఎన్లిల్ అంటారు. 'అను', 'ఎన్ లిల్', 'ఎన్కి', 'నిన్ హుర్సగ్' వీళ్ళంతా సుమేరియన్ దేవతలు. సుమేరియన్ చక్రవర్తి సార్గన్ మన పురాణేతిహాసాలలో సగరుడుగానూ, అతని కొడుకు ఆహ్ 'మెనిస్ అసమంజసుడిగానూ కనిపిస్తారు. శాతవాహనులకు పూర్వకాలం నుండి గుప్తుల కాలం వరకూ జరిగిన వర్తక వాణిజ్యాల పుణ్యాన మధ్యధరా సముద్ర తీరంలోని సుమేరియన్, బాబిలోనియన్ సంస్కృతులకు చెందిన వర్తకులు కూడా ఇక్కడ స్థిరపడి ఉండవచ్చు. వారి ద్వారా వారి దేవతలూ ఈ నేల మీద కొలుపులు పొంది ఉండవచ్చు. వారంతా తెలుగు సమాజంలో కలిసిపోయి ఉండవచ్చు.

**ఎల్లి :** ఎల్లి కూడా సుమేరియన్ దేవతే! ఎల్లమ్మ, ఏకూరయ్య ఏకోరామయ్య లాంటి దేవతానామాలకు మూలం ఈ ఎల్లి కావచ్చని రాంభట్లగారు పేర్కొన్నారు.

**బెజవాడ కనకదుర్గ :** ఇంద్రకీలాద్రి మీద అనేక యుగాలలో అనేక దేవతలు వెలిశారు. వారిలో చివరి దేవత కనకదుర్గమ్మ కావచ్చు. తన అన్నల చేత అనుమానించబడి ఆత్మహత్య చేసుకున్న ఒక శీలవతి గ్రామదేవతగా మారగా, జనం ఆమెకు గుడి కట్టి

పూజించారని ఆమే దుర్గగా మారిందని నేలటూరి వెంకట రమణయ్యగారు వ్రాశారు. ఈ కథ ఏ కాలం నాటిదో తెలీదు. విష్ణుకుండిన ప్రభువు బెజవాడ మాధవవర్మ తన కొడుక్కి మరణశిక్ష విధించి ఆశ్రిత పక్షపాతం లేని పాలన అందించినందుకు మెచ్చి దుర్గమ్మ కనకవర్షం కురిపించి కనకదుర్గ అయ్యిందని శాసనాధార ఐతిహ్యం చెప్తోంది.

**కాకతి :** కాకతి ఒక జైన కులదేవత. ఏకవీర దేవతారాధకులుగా బయలుదేరిన కాకతీయులు ప్రోలయరాజు వరకూ జైనులుగా ఉండి, ఆ తరువాత శైవులుగా మారారు. యథారాజా తథా ప్రజా అన్నట్టే ప్రజలూ రాజుని అనుసరించారు. 'రాజానుమతం ధర్మం' అని కదా ఆర్యోక్తి.

**ఏకవీర :** ఏకవీర కూడా శైవదేవతే అయి ఉంటుందని సురవరం ప్రతాపరెడ్డి వ్రాశారు. "కాకతమ్మకు సైదోడు ఏకవీర అని ప్రసిద్ధి. రెడ్డి రాజుల కాలంలో కూడా ఏకవీరని కొలిచారని సాహిత్యాధారాలు చెప్తున్నాయి.

**గోళకీ మఠాలు :** వీరశైవులు జైనమఠాలకు పోటీగా గోళకీ మఠాలను స్థాపించారు. కాకతి గణపతిదేవుడు కృష్ణాతీరాన గోళకీ మఠం అధిపతి విశ్వేశ్వర శివాచార్యుడికి ఒక ఆయుర్వేద ఆసుపత్రి, ప్రసూతి చికిత్సా కేంద్రం, మూలికావనాలు ఏర్పాటుకు ఇచ్చిన దాన శాసనం 'మందడం' గ్రామంలో ఉంది.

**గొల్లక్క :** పాలమూరు దగ్గర ఈ గోళకీ మఠాన్నే గొల్లక్క గుళ్ళు అని పిలుస్తున్నారని సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాశారు. కోటప్పకొండ దగ్గర కూడా ఒక గొల్లక్క గుడి ఉంది. కాకతీయ రాజుల ఆదరణ పెరుగుతున్న కొద్దీ శైవంలోకి బ్రాహ్మణుల ప్రవేశం పెరుగుతూ వచ్చింది. బ్రాహ్మణుల చేరికతో వీరత్వాన్ని తగ్గించుకుని శైవం వర్ధిల్లసాగింది. సహజంగానే వీళ్ళు శివాలయాల్లో పూజారులుగా స్థానం సంపాదించుకున్నారు. అప్పటివరకూ పౌరోహిత్యం నెరపిన తంబళ్ళు ఆ స్థానాన్ని కోల్పోసాగారు. "ముని శివుడి 'చటబుట్టిననాట' నుండీ చెనసి తంబళి భజించిన చొప్పలేదు" అని బసవపురాణంలో సోమనాథుడు ఈ స్థితిని పేర్కొన్నాడు. శైవాన్నే నమ్ముకుని ఇతర వృత్తి వ్యాపకాలకు దూరమైన తంబళ్ళు ( తమ్మళ్ళు, దమ్మళ్ళు) సమాజంలో వెనుకబాటుతనాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఈనాటికీ అదే స్థితి వారి విషయంలో కొనసాగుతోంది.

**జోగులాంబ :** జోగుల అంబ అనే పేరును బట్టి ఈమె తొలుత జైనుల దేవత కావచ్చునని చరిత్రవేత్తల అభిప్రాయం. బౌద్ధం ముందుగానే అంతరించగా, జైనం మరో 500 యేళ్ళ తరువాత తెలుగు నేల మీద అంతరించింది. మన తొలి ప్రాచీన దేవతలు,

బౌద్ధ దేవతలూ, జైన దేవతలు వీళ్ళంతా శైవ దేవతలుగా మారిపోయారు. అదొక సామాజిక పరిణామక్రమం. ఇప్పటికీ గ్రామ దేవతలంతా శైవ సాంప్రదాయంలోనే పూజలందుకుంటూ ఉండటం గమనార్హం.

**రేణుక :** ఆలంపూర్‌లోని బ్రహ్మేశ్వరాలయంలోని తలలేని నగ్న దేవత విగ్రహం గురించి సురవరం ప్రతాపరెడ్డిగారు ప్రస్తావించారు. కాకతి దేవత నగ్నదేవత అనీ, ఆలంపూర్‌లో ఈ విగ్రహం కాకతి దేవతా విగ్రహం కావచ్చునని ఆయన అభిప్రాయం. స్థానికులు దీన్ని ఎల్లమ్మ విగ్రహంగా పిలుస్తుంటారు. ఎల్లమ్మ, రేణుక ఈ ఇద్దరూ కాకతి దేవతా రూపాలేనని పండితులు చెప్తారు. పరశురాముడు తన తల్లి తల నరికిన కథని బట్టి తలలోని ఈ విగ్రహాన్ని రేణుకగా భావిస్తున్నారేమో తెలియదు. రేణుక లేదా ఎల్లమ్మని సంతానదేవతగా కొలుపులు చేస్తారు.

**మైలారుదేవుడు :** మైలారుదేవుడు కాకతీయుల కాలంలో పూజలందుకున్న దేవుడే! తొలుత జైన దేవుడు. తదుపరి భైరవుడి అవతారంగా మారి ఉండవచ్చు. "కలౌ మైలారు భైరవా" కలియుగంలో మైలారుదేవుడే భైరవుడు అని ప్రజలు నమ్మి కొలిచారు.

**వీరగుడ్డములు :** వీరమరణం పొందిన వీరుడిని పూజించే ఆచారం గురించి సురవరం వారు వ్రాశారు. పల్నాటి యుద్ధంలో అసువులు బాసిన వీరులను పూజించేవారు. ఈ పూజ కోసం ప్రత్యేకంగా వీరగుడ్డాలుండేవి.

**కలని పోతులయ్య, గురిజాల గంగాంబ :** శ్రీనాథుడు క్రీడాభిరామంలో

**"కులము దైవతంబు గురిజాల గంగాంబ**
**కలని పోతులయ్య చెలిమికాడు**
**పిరికి కండలేని యరువది యేగురు**
**పల్లెనాటి వీరబాంధవులకు"**

అనే పద్యంలో కలని పోతులయ్య, గురిజాల గంగాంబ, పిరికి కండలేని 27మంది పల్నాటి వీరుల్ని దేవతలుగా పేర్కొన్నాడు. బహుశా పల్నాటి వీరులు కావచ్చు. లేదా ఆ కాలం నాటి గ్రామ దేవతలు కావచ్చు.

**గోగులమ్మ :** "కోమలార్ధేందు ధరుకొమ్మ గోగులమ్మ" అనే వాక్యాన్నిబట్టి గోగులమ్మ కూడా ఒక దేవతగా కనిపిస్తుంది.

**శ్రీ మండతల్లి** : "మహిత గుణము తల్లి శ్రీమండ తల్లి" ఇలా స్తుతిపాత్రమైన అనేక దేవతలు ఆ కాలంలో ఉండేవారు.

వీళ్ళుకాక **నూకాంబ, ఘట్టాంబిక, మాణికాదేవి** పేర్లు కూడా కనిపిస్తాయి.

ఆ కాలం నాటి సింహాసన ద్వాత్రింశతిలో "కామాక్షికిని, మహాకాళికి, చండికి/ నక్కజియ్యకు, కాశి కంబికకును/ వింధ్య వాసిని, కేకవీరకు, మున్నుగా నెల్ల వేల్పులకు బిందించి మ్రొక్కి "ఈ పట్టికలో ఆనాటి వేల్పుల పేర్లు మనకు కనిపిస్తాయి. కామాక్షి, మహాకాళి, చండి, కాశిక, అంబిక, వింధ్యవాసిని, ఏకవీర వీళ్ళంతా శైవదేవతలే! ఇందులో 'బిందించి మొక్కటం' అనే పదానికి కల్లు బిందె (కుండ)ని ఇచ్చి మొక్కటంగా సురవరంవారు ఒక అర్థాన్ని చెప్పారు.

**మూలకూరమ్మ** మూలకూరమ్మ అనే ఒక దేవత రెడ్డి రాజులకు కులదేవత. ఈమె దేవాలయం గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలోని అమీనాబాదు గ్రామంలో ఉందని రెడ్డి సంచిక (పుట 69)ని ఉటంకిస్తూ సురవరం వారు వ్రాశారు.

"వీరులు దివ్యలింగములు" అనే ప్రసిద్ధ చాటుపద్యంలో ఆ చాటుకవి. "చనిపోయిన వీరులు లింగములై పూజలందిరి" అని వ్రాశాడు. ఈ పద్యం చెన్నకేశవ స్వామే బ్రహ్మనాయుడనీ, కల్లుపోతరాజు కాలభైరవుడని, అంకమ్మ అనే దేవత అన్నపూర్ణ అయ్యిందని చెప్తుంది.

ప్రాచీన దేవతలే వివిధ కాలాలలో వివిధ పేర్లతో ప్రసిద్ధి పొందారని, బలి,సుర, చద్ది వీటిని నైవేద్యాలుగా సమర్పించుకునే వారనీ అర్థం అవుతోంది. ఈ దేవతలలో పూజాదులు బ్రాహ్మణేతరులే చేసేవాళ్ళు. కాలక్రమంలో ఈ గుడి పూజారులుగా బ్రాహ్మణుల ప్రవేశం తరువాత గ్రామ దేవతలు కూడా అష్టోత్తర శతనామాలతో ముగ్గురమ్మల మూలపుటమ్మ అవతారాలుగా పూజలందటం ఒక ముఖ్య పరిణామం.



# ఆంధ్ర మహావిష్ణువే అసలు విష్ణువు

ఆంధ్ర మహావిష్ణువే హిందూ సంస్కృతిలో విష్ణువుగా మారాడు. ఋగ్వేద రూపకల్పన జరిగే సమయంలో పూర్వ తెలుగు ప్రజల సాహచర్యం ఉన్నదనడానికి ఆంధ్ర విష్ణువుకు సంబంధించిన అంశాలు బలమైన సాక్ష్యాలనిస్తున్నాయి.

ఆంధ్ర మహా విష్ణువు తెలుగువారి ఆరాధ్య దైవం. కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో ఆంధ్ర విష్ణు దేవాలయం ఉంది. శ్రీకృష్ణదేవరాయలు ఈ దేవుణ్ణి దర్శించుకొని స్వామి ఆదేశం మేరకు ఆముక్తమాల్యద గ్రంథ రచనకు ఉపక్రమిస్తున్నట్లు రాసుకున్నాడు. “నేను తెలుగు వల్లభుణ్ణి” అని స్వామి స్వయంగా తనకు చెప్పినట్లు కూడా పేర్కొన్నాడు.

ఆంధ్రులకూ విష్ణువుకూ సంబంధం ఏమిటీ... కొన్ని ప్రత్యేక పరిశోధనాంశాలు విష్ణువుని ఆంధ్రుల దేవుడిగా నిరూపిస్తున్నాయి. హిందూ సంస్కృతిలో విష్ణువుని ప్రవేశపెట్టినవారు ఆంధ్రులేనని వీరి వాదం.

ద్రావిడ భాష మాతృకలో (ప్రోటో ద్రవిడియన్) విష్ అనే రూపం కనిపిస్తుంది. 1. all 2. big 3. great అని దీనికి అర్థాలను ద్రవిడియన్ ఎటిమాలజీలో విశ్లేషించారు. ద్రావిడ భాషలో విష్ శబ్దానికి సమస్తం, పెద్దదైన, గొప్పదైన అనే అర్థాలు కనిపిస్తుంటే, ఆర్యుల విష్ శబ్దానికి సర్వ వ్యాపకుడు అని అర్థం కనిపిస్తుంది.

“విశతీతి విష్ణుః అని విష్ణు శబ్దాన్ని నిర్వచిస్తూ “విష్ణువుకు గల విశ్వమ్, విష్ణుః అను నీ రెండు నామంబులును వ్యాప్తినే దెల్పుచు నుండియు. విశ్వ శబ్దము పూర్తిని,

విష్ణు శబ్దము వ్యాప్తిని చెప్పుటచే పునరుక్తి దోషము లేదు. అని విష్ణు సహస్రనామాలకు పరాశర భట్టరుల భాష్యాన్ననుసరించి చేసిన వ్యాఖ్య చెప్తోంది.

ఋగ్వేదంలో విష్ణువుకు సంబంధించి 5 లేక 6 సూక్తాలలో మాత్రమే వర్ణన కనిపిస్తుంది. దేవతలందరికంటే గొప్పవాడు ఊరుగాయుడు, ఊరుకర్ముడు, మూడు పాదాలు కలిగినవాడుగా ఋగ్వేదంలో కనిపిస్తాడు. ఈ మూడు పాదాలతో భూమి, అంతరిక్షం, స్వర్గాలను విష్ణువు ఆక్రమించాడట. మూడో పాదం స్వర్గానికి నేత్రం కాబట్టి స్వర్గాన్ని "విష్ణుపదం" అన్నారు.

ఋతుచక్రాన్ని త్రిప్పేది ఈయనే! సూర్యుడే వ్యాప్తి శీలాన్ని బట్టి విష్ణువుగా స్తుతులు పొందాడు. శుక్ల యజుర్వేదంలో విష్ణువు యజ్ఞానికి అధిష్ఠాతగా కనిపిస్తాడు. యజ్ఞమే విష్ణువుగా కీర్తించబడింది.

ఈ విష్ణువు ఆర్యుల దేవతా...? ఆర్యేతరులైన ద్రావిడుల దేవతా...? చారిత్రక దృష్టితో చూస్తే కొన్ని వాస్తవాలు వెలుగులోకి వస్తాయి.

S.K. చటర్జీ "the Aryan Vishnu the spreading one" as a name for the sun was combined with a Dravidian sky God VIN, VINNU to give the later Hindu notions of Surya Narayana అన్నారు. సర్వ వ్యాపకుడు అయిన ఆర్యుల విష్ణువు సూర్యుడికి ప్రతిరూపం. ఈ దేవతని ద్రవిడుల అంతరిక్ష దేవత విన్ (లేదా) విణ్ణు రూపంతో కలుపుకోవడం వలన సూర్యనారాయణ రూపం ఏర్పడి ఉంటుందని చటర్జీగారి భావన.

1912లోనే "Life in the Ancient India in the age of Mantras" అనే గ్రంథంలో పి.టి. శ్రీనివాస అయ్యంగార్ విష్ణు అనేది నిస్సందేహంగా ద్రావిడ పదమేనని రాశాడు. నూరు సంవత్సరాల నాటి ప్రకటన అది. అప్పట్లో ఆయన వాదనని ఎవ్వరూ పట్టించుకోకపోవడానికి హిందూ దేవతలంతా ఆర్యులేననే ఒక నమ్మకం ముఖ్య కారణం కావచ్చు. అసలు ఆర్యజాతి అనేది ప్రత్యేకంగా ఉన్నదా...?

ఆర్య భాష మాట్లాడిన ఆనాటి ప్రజలు నార్డిక్ జాతులవారే...? అంతేకానీ, ప్రత్యేకంగా ఆర్యజాతి అనేది లేదని చటర్జీగారి అభిప్రాయం. ఋగ్వేదంలో "అన్యవ్రతులు" (ఆర్యేతరులైన ప్రజలు) చాలామంది ఉన్నట్లు అనేక ఋక్కుల్లో కనిపిస్తుంది. వీళ్లు మొదటగా తారసపడింది సింధూ నగరాలలోనే.

R.C. Majumdar, H.C. Roy Chowdary & Kalikinkar Datta ఈ ముగ్గురూ రూపొందించిన "An Advanced History of India గ్రంథంలో "... the Indus Valley people were either Sumerians or Darvidians. These two races might have been identical or different. The dravidians at one time inhabited the whole of India, including the Punjab, Sindh and Baluchistan and gradually migrated to Mesopotamia. The fact that Dravidian Language is still spoken by the BRAHUI people of Baluchistan is taken to lend strength to this view." అని పేర్కొన్నారు. సింధు నగరాలలో నివసించిన ప్రజలు సుమేరియన్లు గానీ ద్రవిడియన్లుగానీ అయి ఉండాలి. సుమేరియన్లు ద్రవిడియన్లు ఒకరే కావచ్చు. వేర్వేరూ కావచ్చు ద్రవిడియన్లు ఒక దశలో పంజాబ్, సింధు బెలూచిస్తాన్‌తో సహా పూర్తి భారతదేశం అంతా వ్యాపించి ఉండేవారు. క్రమేణా వీళ్లే మెసపటోమియా వరకు వెళ్లి ఉండాలి. ద్రావిడ భాషలలో ఒకటైన "బ్రాహుయీ"ని బెలూచిస్తాన్ తదితర ప్రాంతాలలో ప్రజలు ఇంకా మాట్లాడుతూనే ఉన్నారంటే ఈ వాదనకు మరింత బలం చేకూరుతోంది".

ఆర్యభాష మాట్లాడిన ప్రజలకు అడుగడుగునా ద్రవిడియన్లు ఎదురయ్యారు. ఆర్యులు వీళ్లని దాస, దస్యు ఇలా రకరకాల పేర్లతో పిలుచుకున్నారు. తమకన్నా అత్యున్నత నాగరికులనీ, సంపన్నులనీ, బలమైన నగరాలు కలిగినవారని, వారి స్త్రీలు పాలతో స్నానాలు చేస్తారని ఇలా వర్ణించుకున్నారు.

దాస, దస్యాది ఆర్యేతర ప్రజలు సంపన్నులుగా ఉన్నంతకాలం ఈ విధమైన ప్రశంసలు బాగానే పొందారు. సింధు నగరాల పతనం తర్వాత ఈ దాస దస్యులే నల్లవాళ్లుగా, అస్పృశ్యులుగా, బాహ్యులుగా, బానిసలుగా నిందించబడ్డారు. బతికి చెడిన వాడి పరిస్థితి ఆనాటి దాస, దస్యాది ఆర్యేతర వర్గాలది. వీళ్లలో తెలుగువారూ ఉండి ఉండవచ్చు. వ్యాపారాలు పడిపోయి, ఉత్తరాదిలో ఆర్యుల ప్రాబల్యం పెరుగుతున్న కొద్దీ ద్రవిడియన్లు తల మూలస్థానమైన దక్షిణాదిలో కేంద్రీకరించసాగారు.

నిజానికి, మౌర్యుల పాలన వరకూ ఉత్తర భారతదేశం సాంస్కృతికంగాను, మతపరంగాను, భాషాపరంగాను పటిష్టంగానే ఉంది. మౌర్యుల పతనం తరవాత ఉత్తరాదికి కష్టకాలం దాపురించింది. బాక్ట్రియన్లు, శకులు, సిధియన్లు, కుషాణులు... బార్బేరియన్ జాతులన్నీ ఉత్తరాదిని చుట్టుముట్టసాగారు. తర్వాతి కాలంలో వాళ్లు బౌద్ధులుగా మారారు. వీళ్ల బారి నుంచీ ఆర్య ధర్మాల్ని సంరక్షించుకోవడానికి సురక్షిత స్థావరాలను వెదకుతూ

ఆర్యులు దక్షిణాదికి వలస కట్టారు. పద్మినీసేన్ గుప్తా "every day life in Ancient India" గ్రంథంలో South India became the truer representative of Hindu culture because it was more stable and more protected" అని రాశారు. "దక్షిణ భారతదేశం నిజమైన హిందూ సంస్కృతికి ప్రాతినిధ్యం వహించింది. ఎందుకంటే అది సురక్షితంగానూ, సుస్థిరంగానూ వుంది" అని. దక్షిణాదిలో వారు వేసిన తొలి అడుగు తెలుగు నేలపైనే తెలుగువారితో సంపర్క లేకుండా తమిళ కన్నడ దేశాలకు వెళ్లలేరు.

ఉత్తరాదిన బర్బరుల దాడితో మొదలైన అల్లకల్లోలం మరో వెయ్యేళ్ల తర్వాత మొఘల్ చక్రవర్తుల దాడులతో మరింత అయ్యింది. ఈ పరిస్థితుల్లో ఉత్తరాదిలోని ఆర్యులకు తెలుగు నేలే దిక్కయ్యిందట. "Builders, Artistes, Artisans and Craftsmen went South because of the invasions in the North, Trade flourished and Aryans found a welcome home in the Andhra kingdom which stretched from the Bay of Bengal to the Arabian Sea and afforded a stable Civilised Empire where the immigrants could take shelter" అని పద్మినీసేన్ గుప్తా పేర్కొన్నారు. ఆర్యులకు ఆంధ్రులు తలుపులు బార్లా తెరిచి స్వాగతం పలికారట. ఆర్య ధర్మాలలో ఆంధ్రుల ధర్మాలు సంలీనం అయి కొత్త హిందూ ధర్మం ఈ నేల మీదే అవతరించింది అంటారామె!

హెరిటేజ్ ఆఫ్ ఇండియా సిరీస్‌లో భాగంగా 'పి. చెంచయ్య' అనే పండితుడు "a History of Telugu literature" అనే వ్యాసంలో "the Telugus may have been in the remote past a Dravidiyan people possessing a non Aryan Culture, but they seem to have lost their Dravidian identity very early in their History. In Historical times, they were so completely Aryanised in religion, Language and Literature, that for all practical purposes they may be treated as Aryans-although their indigenous dravidian influence continued to make it self felt".

తెలుగువారు ఒకప్పుడు ద్రవిడియన్లు! ఆర్యేతర సంస్కృతీ వికాసాలు కలిగినవారే. కానీ, కాలక్రమంలో వాళ్లు తమ ఆర్యేతర సంస్కృతిని వదులుకున్నట్టు కనిపిస్తోంది. చారిత్రక యుగం మొదలయ్యేనాటికే తెలుగు వారు ద్రావిడ సంస్కృతికి దూరంగా ఉన్నారు. చారిత్రక యుగాలలో వీళ్లు పూర్తిగా ఆర్యీకరణం చెందినవారిగా కనిపిస్తారు. మతపరంగానూ, భాషాపరంగానూ, సాహిత్యపరంగా కూడా ఆర్యుల వ్యవహార విధానాలనే

అలవరచుకున్నారు. అన్ని విధాల బౌద్ధ యుగంనాటికి తెలుగువారు ఆర్యులుగానే ఉన్నారు. అయితే, వారి సొంత ఆచార వ్యవహారాలు ఆర్య ధర్మాలలో ప్రముఖమైనవిగా మారడంతో ఆంధ్రులు ఆర్యులుగా జీవించడానికి అవకాశాన్నిచ్చిందని చెంచయ్యగారు విశ్లేషించారు.

ఇక్కడ విన్సెంట్ స్మిత్ చెప్పిన అంశం ముఖ్యమైంది. "early Indian History as a whole cannot be viewed in the perspective until the non-Aryan institutions of the South receive adequate Treatment" దక్షిణాదిలోని ఆర్యేతరుల చరిత్రని సమగ్రంగా విశ్లేషిస్తేగానీ అఖండ భారతదేశపు తొలినాటి చరిత్రని నిర్మించడం సాధ్యం కాదంటారాయన.

ఇంత చర్చకు ముఖ్య కారణం, ఆంధ్రుల విష్ణువు ఆర్యుల విష్ణువుగా మారేందుకు గల అవకాశాలను అన్వేషించడమే! Prof. Jean Przyluski అనే పరిశోధకుడు మిథిక్ సొసైటీ క్వార్టర్లీ జర్నల్ 1935 జనవరి సంచికలో "the name of the God Vishnu and Krishna-legend" అనే వ్యాసాన్ని ప్రచురించారు. ఇది 18వ ఓరియంటలిస్ట్స్ కాంగ్రెస్ (Legend) లో చేసిన ప్రసంగపాఠం. యల్.వి. రామస్వామి అయ్యర్ దీన్ని ఫ్రెంచ్ నుంచి ఇంగ్లీష్ లోకి అనువదించి ఈ సంచికలో ప్రకటించారు. ఈ పరిశోధకుడు ఆంధ్ర విష్ణువే అసలు విష్ణువు అని నిరూపించే ప్రయత్నం చేశారు. డెక్కన్ భూభాగంలో ఆంధ్ర విష్ణువు మూలాలను వెదకడం ఆయన లక్ష్యం.

మహారాష్ట్రలోనే పండరీపురంలో విష్ణువుని విఠల పేరుతో కొలుస్తారు. విఠ్ఠ, విఠోబా, విఠ్ఠ రూపాలు కూడా కనిపిస్తాయి. కన్నడంలో బిఠ్ఠ అంటే విష్ణువు. బిఠ్ఠ, బిఠ్ఠి, బిఠ్ఠదేవ, అనే పేర్లున్న కన్నడ రాజులు కన్పిస్తారు.

తెలుగు రాజవంశీకులలో బేత అనే పేరు కనిపిస్తుంది. బేతవోలు అనే ఊరుపేరు, త్రిభువనమల్లు బేతరాజు అనే కాకతీయ రాజవంశీకుడి పేర్లలో బేత శబ్దం ఈ విధంగా విష్ణుసంబంధమైనదే.

బౌద్ధ జాతక కథలలో ఘటజాతకం (పాళీ నెం 355, 454), సంకిచ్చ జాతకం (పాళీ నెం. 530)లలో విష్ణువు పేరు వెణ్హు లేదా వెస్సు అని కనిపిస్తుంది. విధు, వెష్ణు అనే నామాంతరాలు కూడా కనిపిస్తాయి. విధ-విష్ణుగానూ, వెధ-వెష్ణుగానూ రూపాంతరం చెంది ఉండవచ్చు. మహా పరినిబ్బాన సుత్త (దీఘనిక-2) అనే బౌద్ధ గ్రంథంలో వెధదీప (విష్ణుద్వీప) ప్రస్తావన కనిపిస్తుంది.

## బుద్ధుడు చెప్పిన కృష్ణుడి కథ :

ఘటజాతక కథలో ఘటకుమారుడనే మంత్రికి బుద్ధుడు స్వయంగా కృష్ణుడి కథని చెప్పి నిర్వేదం పోగొడతారు. ఈ కథలో దేవగర్భ, ఉపసాగరుడు దంపతులు, నందగోప, అంధకవెణ్ణు దంపతులు ముఖ్యపాత్రలు. కంసుడి బారి నుంచి తనకు పుట్టిన మగపిల్లల్ని రక్షించుకోవడానికి దేవగర్భ తన పిల్లల్ని అంధకవెణ్ణు దగ్గరకు చేర్చి అక్కడ పుట్టిన ఆడపిల్లల్ని తన దగ్గరకు చేర్పించుకొంటుంది.

ఆ విధంగా వాసుదేవ, బలదేవ, చందదేవ, సూర్యదేవ, అగ్గిదేవ, వరుణదేవ, అజ్జున, పజ్జున, ఘటపండిత, అంకుర అనే 10మంది మగపిల్లలు అంధకవెణ్ణు పుత్రులుగా పెరుగుతారు. దుష్టశిక్షకులుగా వీళ్లని రూపొందించి కంసుని చంపించడంలో ఈయన పాత్ర ప్రముఖమైంది. జంబూద్వీపం యావత్తూ వాసుదేవుడిచేత జయింపచేస్తాడు.

ఈ కథలో మంచి ముగింపు ఉంది. కొడుకు మరణించినప్పుడు దుఃఖంలో మునిగిపోయిన వాసుదేవుడికి అతని తమ్ముడు ఘటపండితుడు మరణ రహస్యం వివరించి విషాదాన్ని పోగొడతాడు. గీతలో కృష్ణుడు చెప్పిన గీతని ఈ జాతక కథలో వాసుదేవుడికి అతని తమ్ముడు చెప్పాడు. అందుకే ఈ కథ చెప్పిన బుద్ధుడు తాను ఆ జన్మలో ఘటపండితుణ్ణనీ, "సారిపుత్త" వాసుదేవుడిననీ పేర్కొనడం గమనార్హం.

ఈ కథని ప్రస్తావించిన Prof. Jean Przyluski "ఆంధ్రుడైన విష్ణువు సాధించిన విజయం ఇది" అని వ్యాఖ్యానిస్తాడు. ఈ విష్ణువు ద్రావిడ సంబంధీకుడే అయి ఉండాలనేది ఆయన నిశ్చితాభిప్రాయం. "A Theogony in which the ancestral God is called VISHNU, the Andhra, could only have been of Dravidian origin" అని, కృష్ణుడికి సంబంధించిన ఇలాంటి కథల్ని పోల్చి చూస్తే ఆ శ్రీ మహావిష్ణువే పాళీ భాషలో చెప్పిన అంధక విష్ణువు అనీ, వాసుదేవుడూ, బలదేవుడూ లాంటి దేవతలకు పితృదేవత లేదా మూలదేవత అయి ఉండాలంటాడాయన.

ఈ బౌద్ధ జాతక కథనసురించే మహాభారతకథ కూడా నడిచింది. వాసుదేవుణ్ణి జర అనే రాక్షసి (ముసలితనం) పట్టి పీడించినట్లు కవిత్రయ భారతంలో మౌసలపర్వంలో రాసిన విషయం ఇందుకు సాక్ష్యం. కృష్ణుడి పరివారం తాగిన మైకంలో ఒకరినొకరు నరుక్కొని చంపుకోవడం కూడా ఘట జాతకంలో చెప్పిన విషయమే. అంటే, ఈ కథలు

ఆంధ్రులనుంచే అటు ఆర్యులకీ, ఇటు బౌద్ధులకూ అంది ఉంటాయని మనం ఊహించవచ్చు.

ద్వారకానగరాన్ని మంత్రశక్తులున్న ఒక గాడిద కావలి కాస్తుంది. శత్రువు వచ్చినప్పుడు అది బిగ్గరగా అరవగానే ద్వారకానగరం శత్రువుకు అందకుండా గాలిలోకి లేస్తుందట. వాసుదేవుడు వెళ్లి ఆ గాడిద కాళ్లు పట్టుకొని ప్రార్థించి అది అరవకుండా చేసి ద్వారకను జయిస్తాడు. వసుదేవుడంతటివాడు గాడిద కాళ్లు పట్టుకున్నాడు అనే తెలుగు సామెత జనం నోట ఈ నాటికీ నానుతోందంటే ఘట జాతకంలో కథ తెలుగునాట ఎంతో ప్రాచుర్యంలో ఉండేదని అర్థం చేసుకోవచ్చు.

నాగార్జున కొండ శిథిలాల్లో ఘటజాతక కథని చెక్కిన ఫలకాలు దొరికాయి. ఋగ్వేదం (8-72-8) లో "సజాత్యా" అనే పదం కనిపిస్తుంది. అంటే ఏ జాతి ప్రజలకు ఆ జాతి దేవతలె ఉంటారు. రెండు వేర్వేరు జాతులు సంలీనం చెందినప్పుడు ఆ ఇద్దరి దేవతలు కూడా సహజంగానే సంలీనం చెందుతారు.

విష్ణువు విషయంలోనూ ఇదే జరిగింది. ఆర్యేతరులైన ఆంధ్రుల విష్ణువు ఆర్యుల దేవుడయ్యాడు. ఆంధ్రులు స్వయంగా తాము ఆర్యులుగా మారారు.

ఇది ఋగ్వేదం రూపుదిద్దుకొంటున్న దశలోనే, సింధు నాగరికత చరమాంకంలోనే, డెక్కన్ భూభాగంలోనే జరిగి ఉంటుందని భావించవచ్చు. ఆర్యుల అభిజాత్యం ఈ కథల్ని యథాతథంగా అంగీకరించనీయకపోవడంతో తరువాతి కాలాలలో అవి బౌద్ధ గ్రంథాల ద్వారా వెలుగులోకి వచ్చి వుంటాయి. ఘట జాతక కథ ఆంధ్రుల కోణంలో కృష్ణుడి జీవిత చరిత్రని చెప్పిన బౌద్ధగ్రంథం, హరివంశం, భాగవతపురాణాలు ఆర్యుల వాదననుసరించిన గ్రంథాలు.

**పురాణేతిహాసాలు** మన వారసత్వసంపదగా ఎంత ముఖ్యమైనవో, పాళి భాషలో పదిలంగా ఉన్న బౌద్ధ జాతక కథలు కూడా అంతే ముఖ్యమైనవి. వాటిని మనవి కానట్టు వదిలేయడం వలన ముఖ్యంగా తెలుగువారి చరిత్రని వదిలేసుకొంటున్నాం.

శాతవాహనులు తమని ఆంధ్రభృత్యులుగా చెప్పుకున్నారు. ఫ్యూడల్ వ్యవస్థలో ఒక రాజవంశం తమని తమ ప్రజలకు సేవకులమని చెప్పుకున్నారంటే నమ్మలేము. ఆంధ్రభట్ట అనే పదాన్ని ఆర్యులు ఆంధ్రభృత్య అని వక్రీకరించి ఉంటారని కొందరు

చెప్తారు. కానీ, ఆంధ్ర అంటే విష్ణువు (Andhra, the vishnu) కాబట్టి ఆంధ్రభృత్యులంటే విష్ణుసేవకులని prof. Jean Przyluski అభిప్రాయపడ్డారు.

కృష్ణుడితో ఆంధ్రులకు సంబంధాలు ఉండేవనడానికి సముద్రంలో మునిగిన ద్వారకలో వాణిజ్య వ్యవహారాలలో ద్రావిడులదే పైచేయని ప్రొఫెసర్ యస్.ఆర్. రావు చెప్పిన పరిశోధనాంశాలే సాక్ష్యం.

## అంధకుడి కథలు :

1. అంధకుడి సంతతే ఆంధ్రులయ్యారని జైనసాహిత్యం కూడా చెప్తోంది. బౌద్ధంలోంచి జైనంలోకి, జైనంలోంచి బౌద్ధంలోకి మతం మారి దేవతల శాపానికి గురై అంధకుడు అంధుడైపోయాడనీ, అతని సంతానం కూడా అంధులే అయ్యారనీ, వీళ్లే ఆంధ్రులయ్యారని ఈ జైన కథ చెప్తోంది.

2. శైవ సాహిత్యంలో అంధకుడు శివపార్వతుల మూడవ పుత్రుడు. పార్వతి ఒకసారి సరాగంగా శివుడి కళ్లు మూసిందట. ఆ క్షణంలో విశ్వం అంతా చీకటి ఏర్పడిందట, ఆ సమయంలో శివుడి శరీరంలోంచి పుట్టినవాడే ఈ అంధకుడు. ఆ శిశువుని పెంచమని పార్వతి హిరణ్యాక్షుడికి ఇచ్చిందట. ఒంటికాలు మీద తపస్సు చేసి వరబలగర్వితుడైన అంధుడికి దుర్యోధనుడు, విఘాసుడు, హస్తి అనే ముఖ్య అనుచరులున్నారు. వీళ్లు ఒకరోజు పార్వతిని చూసి ఆమె ఎవరో తెలియక అంధకుడికి చెప్పారు. అంధకుడు ఆ అందగత్తెను చెరబట్టే ప్రయత్నం చేయిస్తాడు. శివుడితో ఘోరమైన యుద్ధం జరుగుతుంది. శుక్రాచార్యుడు అంధకుడి సైన్యాన్ని తిరిగి బ్రతికిస్తున్నాడని కోపించి శివుడు శుక్రుడిని మింగేస్తాడు. శివుడి ఉదరభాండంలో మూడు లోకాలనూ దర్శించుకొని తనను విడుదల చేయవలసిందిగా ప్రార్థిస్తాడు శుక్రుడు. శివుడు అతన్ని తన శుక్రం ద్వారా బయటకు విడుదల చేస్తాడు. శుక్రుడికి ఆ పేరు అలా వచ్చింది.

3. గ్రీకు పురాణాలలో ANTAEUS తో హెర్కులస్ పోరాడిన కథలో నేలను తాకిన ప్రతిసారీ ఆంత్యూస్ మహాకాయుడిగా ఎదుగుతాడు. శైవసాహిత్యంలో అంధకుడితో పోరినంతసేపూ నేలమీద పడిన అతని ప్రతి నెత్తురు చుక్కలోంచి అనేకమంది అంధకులు పుట్టుకొస్తారు. అందుకని శివుడు అతన్ని విరిచి నెత్తురు నేల మీద

పడకుండా ఒక పాత్రలోకి పడతాడు. అతని శరీరాన్ని అమాంతం ఎత్తి సూర్యరశ్మికి మాడి మసి అయ్యేలా చేస్తాడు. గ్రీకు కథలో హెర్క్యులస్ కూడా ఆంత్యేస్‌ని ఇలానే చంపుతాడు.

★ అంధక విష్ణువుల మీద శైవుల దాడి ఈ కథలలో స్పష్టంగా అర్ధం అవుతోంది.

★ ఒకరినొకరు అన్యమతస్థుల్ని అసురులుగా చిత్రించుకున్నారని కూడా స్పష్టం అవుతోంది. తెలుగు నేల ఈ కథలకు ప్రధాన వేదిక కావడమే ఇక్కడ ముఖ్య విషయం.

ఆంధ్ర అనేది జాతిపరమైన శబ్దం. తెలుగు అనేది భాషాపరమైన శబ్దం. రెండూ ఒకే ప్రజలకు వర్తించే పదాలు. ఆంధ్రులు వేరే జాతి ప్రజలనీ, వాళ్లు ఎక్కడినుంచో వచ్చి తెలుగువారిలో కలిసిపోయారనే వాదన సరికాదనీ, ఆంధ్రులు తెలుగువారేనని, ఆది నుంచీ డెక్కన్ భూభాగంలోనే నివసించారని అర్ధం అవుతోంది.

ఆంధ్రుల సొంత సంస్కృతి, ఆచార వ్యవహారాలన్నీ ఆర్య ధర్మాలతో సంలీనం చెంది, ఒక కొత్త హిందూ సంస్కృతి రూపొందేందుకు అవకాశం ఏర్పడింది. అది డెక్కన్ భూభాగంలో జరిగింది.

ఆంధ్రులకు సంబంధించిన కథలు అటు ఆర్య పురాణాలలోకి, ఇటు బౌద్ధ జాతక కథల్లోకి సమానంగానే వ్యాపించాయి. ఎవరి దృష్టికోణంలోంచి వాళ్లు వాటిని మలచుకొని ప్రచారం చేశారు.

అంధకుడు అసురుడనే భావంతో ఆంధ్రులు అతని కథల్ని తమ కథలుగా చెప్పుకోవడానికి ఇష్టపడి వుండకపోవచ్చు. కానీ, పండితులు ఆంధ్ర విష్ణువుని ఏ కారణం చేత విస్మరించారో తెలియదు. "నేను తెలుగు వల్లభుణ్ణి" అని స్వయంగా స్వామి చెప్పుకున్నా స్పందించలేదు మనం.



# తొలి "స్కంద ఆరాధకులు" తెలుగువారే

**తొ**లి శాతవాహనుల కాలానికే తెలుగు నేల మీద స్కంద కార్తికేయ ఆరాధన వుంది! శ్రీ పర్వతంగా పిలువబడిన నాగార్జున కొండ దగ్గర స్పష్టమైన కొన్ని ఆధారాలు ఇక్ష్వాకుల కాలానివి కూడా దొరుకుతున్నాయి. శాతవాహనులు, ఇక్ష్వాకులు, పల్లవులు స్కంద కార్తికేయ ఆరాధనా విధానాన్ని తెలుగు నేల మీద విస్తరింపచేయటమే కాకుండా, దక్షిణాన తమిళనాడుకు కూడా అందించారు.

బాలసుబ్రహ్మణ్యం (బాలదేవుడు), కుమారస్వామి (యౌవనయోధుడు) షణ్ముఖే శ్వరుడు (జ్ఞాన సంపన్నుడు) మహాసేనాని (యుద్ధనిపుణుడు) కామదేవత (వల్లి,దేవసేనల భర్త) పళని (యోగీశ్వరుడు), మురుకన్ (ప్రసన్నవదనుడు, సుందరుడు, ప్రేమాధిష్ట దేవత) ఇలా వివిధ పాత్రలు పోషించి, ఇంత వైవిధ్యభరితమైన దేవతారూపం ఏర్పడటానికి గల చారిత్రక, సామాజిక నేపథ్యాన్ని మనం అధ్యయనం చేయటం అవసరం.

## ఆంధ్రశాతవాహనులలో స్కందారాధకులు

శాతవాహన చక్రవర్తుల్లో పులుమావి పేరుతో ఇద్దరు ముగ్గురు రాజులు కన్పిస్తారు.

మొదటి పులుమావికి సంబంధించిన ఒక నాణెం మీది బ్రాహ్మీలిపిలో ఆంధ్రప్రాకృత భాషలో "రానో వాసితిల్ పుతస శిరి పులుమావిశ" అనీ, "అరహనకు వహిత్తి మాకనకు తిరు పులుమావికు–" అని రాసి వుంది.

మత్స్య, వాయు పురాణాలలో పులూమావి, పటుమావి, పులూమా అనే పేర్లు కన్పిస్తాయి. ఈ నాణెం చూసిన తర్వాత పులుమావి అనేదే అసలు పేరని స్పష్టం అయ్యింది.

'పులుమావి' స్వచ్ఛమైన తెలుగు పేరు! దాని అర్థాన్ని వెలుగులోకి తెచ్చినవాడు శ్రీ చీమకుర్తి శేషగిరిరావు. ఇది ప్రాకృతమో, సంస్కృతమో కాదనీ, కేవలం తెలుగుపదం అనీ ఆయన గట్టిగా చెప్పారు. ఆయన చెప్పిన ఉపపత్తి ఇది :

'పులు' అంటే రెల్లుగడ్డి. మావి అంటే అమ్మ కడుపులో పెరుగుతున్న శిశువును ఆవరించివున్న మావి పొర. 'పులుమావి' అంటే, "గడ్డి" మావిపొరగా పుట్టినవాడని! అల్లసాని పెద్దన "కానుప పులు వేలుపు పద వాలుగన్న చోటు–" అనే ప్రయోగం చేశాడు.

శేషగిరిరావు గారి ప్రకారం పులు అంటే రెల్లుగడ్డి! ఇది తెలుగుపదమేనా? దేశ్యవ్యుత్పత్తి ఈ పదానికి ఉన్నదా?

జి. బ్రొన్నికోవ్ రూపొందించిన 'ద్రవిడియన్ ఎటిమాలోజికల్ డిక్షనరీ'ల్లో "మూల ద్రావిడ భాషా " (Proto Dravidian) రూపాన్ని, అందులోంచి ఏర్పడిన దక్షిణ ద్రావిడ పూర్వ రూపాన్ని, దాని ద్వారా రూపొందిన పూర్వతెలుగు రూపాన్ని (Proto Telugu) అందించారు. ఈ నిఘంటు ప్రకారం పుల్ అనే ప్రోటో ద్రవిడియన్ పదానికి Tiger (పులి), bad, dinty, Pollution (పులు), Sour (పులుపు, పులుసు) small dry stick (పుల్ల), (పులు:పిలు) Bird (పిట్ట, పక్షి–గుడ్లగూబ–పులుగు, పులుగురాయుడు = గరుత్మంతుడు) ఇలా అనేక అర్థాలు అందించారు. ఇవిగాక గడ్డి అనే అర్థాన్ని కూడా ఇచ్చారు.

Protoform = Pul(-i)

Meaning = grass

South Dravidian Protoform = Pul/Pil

Telugu Protoform = Pull/Pill

Gondwan Protoform = Pul/Pil

దీన్నిబట్టి పులు, పుల్లు, పులి, పుల్లి – పదాలు తొలినాటి ద్రావిడ భాషలో కూడా 'గడ్డి' అనే అర్థంలోనే వున్నాయని అర్థం అవుతోంది.

పుల్ = గడ్డి (కన్నడ)

పుల్ = గడ్డి (తమిళ)

పుల్లువరి = మేతపన్ను (DEDR 4300)

పులు, పుల్లు, పిల్లు పదాలకు కసవు, గడ్డి అనే అర్థాలను ఆచార్య కోరాడ మహాదేవ శాస్త్రిగారి దేశ్య వ్యుత్పత్తి నిఘంటువులో చూడవచ్చు.

పలువురు నడచెడు తెరువునఁ బులుమొలవదు, మొలచెనేని బొదలదు... వేమా (వేమన శతకం) అని కవి ప్రయోగం ప్రసిద్ధమే!

'పులు' తెలుగులో ఇంకా అనేక పదాలు ఏర్పడటానికి కారణం అయ్యింది. తెలుగు వ్యుత్పత్తి కోశంలో ఈ పదాలు కన్పిస్తాయి.

| | | |
|---|---|---|
| పులవర్తి | = | పశువులు మేపుటకు చెల్లించవలసిన పన్ను |
| పుల్లరి | = | పుల్లు+అరి = పన్ను = మేతపన్ను |
| పుల్లరి మాన్యము | = | పశువులు గడ్డి మేయటానికి ధర్మార్థం విడిచిన పొలము |
| పులుగాసి, పులుకాసి | = | తృణంలాంటిది. |
| పులకాసి పురుగు | = | ఆకుపచ్చని చిన్న పురుగు |
| పులుగుడిసె | = | పక్షుల్ని వేటాడేవాడు తాను మరుగున వుండటం కోసం కట్టుకున్న చిన్నగుడిసె. |
| పులుంగడ్డి | = | ఒక రకం కలుపు గడ్డి |
| పులుచూలి తాత | = | పులు + చూలి = కుమారస్వామి అతని తాత హిమవంతుడు |
| పులుచూలి సవితి తల్లి | = | గంగమ్మ |
| పులుచెలికె | = | కొత్తగా సాగు చేయక విడిచిన భూమి |
| పులుదాలి | = | గడ్డికుమ్ము = గడ్డివాములో వుంచి వెచ్చవేయటం |
| పులువంట | = | తృణదాన్యం పైరం |
| పులుమానిసి | = | అల్పుడు, ప్రాభవం కోల్పోయినవాడు. గడ్డిపరక కన్నా హీనమైనవాడు. |
| పులువడు | = | గడ్డిలా అవటం, నలగటం |
| 'పులుమావి' | = | గడ్డి బిడ్డ |

ఈ నిరూపణలను బట్టి స్కంద కుమారస్వామికి తెలుగువారు ఒక తెలుగుపేరు పెట్టుకున్నారంటేనే, ఆ స్వామికి క్రీ.పూ. 2వ శతాబ్ది నాటికే ఇక్కడ ఎంత ఆరాధన వుండి వుండేదో మనం ఊహించవచ్చు.

ఇప్పుడు ఇంకొంచెం ముందుకు వెళ్ళి ఆలోచిద్దాం. తల్లి ద్రావిడ భాషా పదాలకు చాలా వాటికి ప్రోటో ఆఫ్రో ఆసియాటిక్ భాషారూపాలతో అతి సమీపత్వం కన్పిస్తుంది. ఈ నిరూపణలు కూడా పరిశీలించండి:

Berber = Fur = Kind of grass

Western Chadic = Pur = Tobacco Flower, Flower, grass

Central Chadic = Fur = Flower

Bedauye (Beja) = Far = Flower

Low east Cushitic = Fur = Kind of grass

Omotic = Pur = Flower

ఇలాగే, Pir అనే రూపం పండు, కంకి, గింజ అనే అర్థంలో కూడ కన్పిస్తుంది.

మొత్తం మీద ఫుల్, ఫుర్ అనే రూపాలు గడ్డి (లేదా పువ్వు) అనే అర్థంలోనే అక్కడ కన్పించటం కేవలం యాదృచ్ఛికం కాదు.

1. బాల దేవతల ఆరాధనా విధానానికి ప్రాచీన ఈజిప్షియన్, మెడిటరేనియన్ నాగరికతలలోనే బీజాలున్నాయి. అవి తెలుగు నేల మీదకు ప్రసరించాయి.

2. 'బాల క్రీస్తు' కథ జుడియో క్రిస్టియన్ మైథాలజీలో కన్పించటం, బాలకృష్ణుడు, బాలసుబ్రహ్మణ్యం కథలు హిందూపురాణాలలో ఏర్పడటం వెనుక ఈ ప్రాచీన నాగరికతల ప్రభావం వుంది.

3. ఈజిప్ట్ నుంచి తెలుగు నేల మీద కృష్ణాజిల్లా మోపిదేవి వరకూ విస్తరించిన నాగదేవత (Serpent Worship) ఆరాధన గురించి మనం అధ్యయనం చేయవలసింది చాలా వుంది.

4. నాగేంద్రుడుని ఆరాధించటం అనేది - సుబ్రహ్మణ్యస్వామిని ఆరాధించటం అనే అర్థంలోకి మారిపోవటం వెనుక సామాజిక, చారిత్రకాంశాల్ని మనం మరింత లోతుగా పరిశీలించవలసి వుంది.

5. బాలదేవతారాధన. నాగదేవతారాధనలు ద్రావిడులవి! దక్షిణాదిలో వాటికి తొలి కేంద్రం తెలుగు నేల, తెలుగువారి నుంచే ఈ ఆరాధనా విధానాలు తమిళ నేలను చేరాయి. అందుకు మరికొన్ని ఆధారాలను పరిశీలిద్దాం.

# మురుగ - స్కంద - సుబ్రహ్మణ్యం

మురుకన్ (లేదా) మురుగన్ ఈనాటి తమిళనేల మీద ఒక ప్రాంతానికి చెందిన కొండజాతి ప్రజలు ఆరాధించిన ద్రావిడ దేవత. ఈయనను ఆర్యుల స్కందదేవతతో ముడిపెట్టిందెవరు?

కాంచీపురం వరకూ రాజ్య విస్తరణ చేసిన శాతవాహనులు, వారి కాలంలో రాజ ప్రతినిధులు (గవర్నర్స్)గా వున్న ఇక్ష్వాకులు, వారి తర్వాత గుంటూరు జిల్లా పల్నాడు నుంచి (పల్లవ బొగ్గం) కంచిని రాజధానిగా చేసుకొని తెలుగు తమిళ నేలలను ఏలిన పల్లవులు - వీరందరూ స్కంద - కార్తికేయ ఆరాధనా విధానాన్ని తమిళనాట ప్రవేశపెట్టేందుకు కారకులే!

బుద్ధుడిని విష్ణువు దశావతారాలలో ఒకడుగా అంగీకరిస్తూ, బౌద్ధులను వైదిక మతంలోకి ఆహ్వానించినట్టే, తమిళ నేల మీద ఒక దేవతగా ఆరాధించబడ్తున్న మురుగన్ భక్త ప్రజలను వైదికంలోకి ఆహ్వానించేందుకు స్కంద కార్తికేయ + మురుగన్ సంస్కృతుల సమ్మేళనం జరిపి వుంటారని ఒక ఊహ.

శిలప్పదికారంలో (క్రీ.శ. 4వ శతాబ్ది) మురుగన్ శైవ మతానికి చెందినవాడిగా తొలి సాహిత్య ఆధాగం కన్పిస్తుంది. 7వ శతాబ్దికి చెందిన నక్కిరర్ (తిరుమర్గతృపదాయ్) 14వ శతాబ్దికి చెందిన కసియప్ప శివశరియర్ (కంధపురాణం)లలో మురుగన్‌కు సంబంధించి ఆధారాలు దొరుకుతాయి.

భక్తి ఉద్యమం నడుస్తున్న మధ్యయుగాల కాలంలో అంటే, క్రీ.శ.9-10 శతాబ్దాల కాలంలో సంస్కృత పండితులు శివపురాణం రూపొందించారు. ఆ కాలంలో తెలుగువారి మహాసేనాని (కార్తికేయ రూపం) తమిళుల మురుగన్ ఉత్తరభారతీయులు స్కంద - కార్తికేయ రూపాలన్నీ కలగలసిపోయి వుంటాయని ఊహిస్తున్నారు.

వేలన్ (శూలధారి)గా వున్న ఆదిమజాతుల దేవత - మురుగన్ సర్వోన్నతమైన, అందమైన పురుషుడు)గా మారటం ఆదిమ సంస్కృతి - నాగరిక సంస్కృతిగా మారటంగా

భావించాలని కె. సదాశివన్ అనే పరిశోధకుడు పేర్కొన్నాడు. TOTEMISM ANIMISM TRIBALISM CULTURISM (మొక్కల్ని ఆరాధించటం జంతువుల్ని ఆరాధించటం నమ్మిన దేవతకు జంతుబలులిచ్చి ఆరాధించటం సాంస్కృతిక దేవతారాధన) ఈ పరిణామక్రమంలో దేవతా వ్యవస్థ రూపొందింది. భక్తి ఉద్యమంలో వివిధ సాంస్కృతిక దేవతలు తమలో తాము విలీనం చెంది కొత్త రూపాలను సంతరించుకొన్నారు. వివిధ దేశాలలో, దేవతల కథల్లో కూడా సారూప్యత కన్పిస్తుంది.

బాలసుబ్రహ్మణ్యం, బాలకృష్ణుడు, బాల ఏసు ఈ ముగ్గురూ తండ్రులతో ప్రమేయం లేకుండా కన్యలకు పుట్టిన దేవతలే! SUPER NOVA STARS బాల ఏసుని సంరక్షించినట్లే, కార్తికేయుణ్ణి కృత్తికలు (నక్షత్రాలు) సంరక్షించాయి. శివుడి వీర్యాన్ని ధరించి ఆరుగురు బిడ్డలకు ఆరుగురు కృత్తికలు జన్మనివ్వగా, ఈ ఆరుగురునీ పార్వతి ఏకం చేసి ఒకే బిడ్డగా రూపొందించిందనీ, ఆరు ముఖాలు -12 చేతులతో ఆ బిడ్డ స్కంద, కుమార కార్తికేయ నామాలతో ప్రసిద్ధుడయ్యాడనీ పురాణ కథ.

ఆరు కోణాలు గల నక్షత్రం (six pointed star) శూలాయుధం, నెమలి వాహనం, ఓంకారనాదంతో సంబంధం తారకాసురుడిపై యుద్ధం ఇవన్నీ మెడిటరేనియన్ నాగరికతా కాలం నాటి కథలేనని అరీభియోన్యూనిజ్ - Murukan-Christ and Vale Supernova అనే పరిశోధనా పత్రంలో పేర్కొన్నారు. ఇక్కడ పరిశీలనాంశాలు కొన్ని ఉన్నాయి.

1. ఉత్తర భారతదేశంలో గణేశుడికున్నంత ప్రాధాన్యత అతని తమ్ముడు కుమారస్వామికి లేదు.
2. కానీ, తెలుగునేల మీద మహాసేనానిగా అతను ప్రసిద్ధి పొందటానికి సుమేరియా ఈజిప్టు నాగరికతలతో తెలుగువారికి నేరుగా సంబంధాలు నడవటమే కారణం.
3. తెలుగు నేలపైన ఇక్ష్వాకుల కాలం నాటి క్రీ.శ. 2వ శతాబ్దికి చెందిన - మహాసేనాని విగ్రహం రాతితో చెక్కినది, కంచుతో చేసినదీ రెండూ నాగార్జున కొండలో దొరికాయి. నిలబడిన భంగిమలో వున్న మహాసేనానికి ఎడమ చేతిలో శూలం, కుడి చేతిలో కోడి ఈ విగ్రహంలో కన్పిస్తాయి.

ధోవతి కట్టి, నడుము పైన దీక్షా వస్త్రం బిగించి వుంటుంది. శాతవాహన, ఇక్ష్వాకుల కాలం నాటి తలపాగ పెట్టుకొని వున్నాడు. చెవులకు కుండలాలున్నాయి.

తెలుగు నేల మీద స్కంద - కార్తికేయ ఆరాధన వుండేదనటానికి ఇదే తొలి ఆధారం. ఇక్కడే ఈ స్వామికి ఒక గుడి కూడా ఉండేదని పురావస్తు ఆధారాలు చెప్తున్నాయి.

4. తమిళ నేల మీద మురుగన్ లేదా స్కంద రూపాలకు సంబంధించి సంగ సాహిత్యం ఆధారాలు తప్ప ఆ స్వామి రూపానికి సంబంధించిన పురావస్తు ఆధారాలు ఏమీ దొరకలేదు. తమిళనాడు కన్నా ముందే స్కంద ఆరాధన తెలుగు నేల మీద వుండేదనటానికి భారత పురావస్తు సర్వేక్షణవారు చేసిన పరిశోధనలే సాక్ష్యం. ఈ విగ్రహం వివరాలు అందించిన ఆనాటి అసిస్టెంట్ సూపరెంటెండింగ్ ఆర్కియాలజిస్ట్ శ్రీ డి. కన్నబాబుగారికి కృతజ్ఞతలు.

5. R.S. Seth అనే పరిశోధకుడు "Skand Kumara in North India" అనే వ్యాసంలో "క్రీ.శ. 7వ శతాబ్దికి చెందిన ఛాందోగ్యోపనిషత్‌లో స్కంద - వైదిక యుగం నాటి సనత్కుమార మహర్షేనని (తమ్ స్కంద ఇత్యచక్షతే...) వుంది. ఈ ఉపనిషత్తు కాలానికి స్కంద ఒక మహిమాన్విత దేవతేగాని, యుద్ధదేవత కాదు" అని పేర్కొన్నాడు. ఎం. ముఖోపాధ్యాయ - "ఇండియన్ హిస్టారికల్ క్వార్టర్లీ (VVI (1931) పేజీ 310) లో వ్రాసిన వారి వ్యాస సారాంశం ఇది :

"ఉపనిషత్తుల రూపకల్పనలో క్షత్రియుల ప్రభావం ఆ రోజుల్లో బాగా వుంది. బ్రాహ్మణాలు క్షత్రియాధిపత్యాన్ని అంగీకరించి, వారి అభిమానాన్ని పొందటానికి కృషి చేశాయి. బ్రహ్మవిద్య క్షత్రియులకూ తెలుసుననే భావనని కల్గించాయి. సనత్కుమారుడు దేవసేనానిగా, మహాసేనానిగా మారటం రాజ్యాధికారంలో వున్నవారు బ్రహ్మవిద్యా విశారదులనే భావనను కల్గించటమే! ఉపనిషత్తులు కూడా క్షత్రియ ప్రాధాన్యతనే అనుసరించాయి.

6. ఎ.కె. చటర్జీ ప్రకారం బుద్ధుడి జీవిత కాలానికే స్కంద ఆరాధన (క్రీ.పూ. 6వ శతాబ్ది) వుండేదని! కౌటిల్యుడు స్కందని సేనాపతి, మహాసేనాని - అనే అన్నాడు. మౌర్య చక్రవర్తులు శివ, స్కంద దేవతా విగ్రహాలు చేయించి అమ్మేవారని (Images of Siva, Skanda Gods were sold by the Mourya Kings for replenishing the Royal coffers) కూడా పేర్కొన్నాడు.

7. తెలుగు నేల మీద స్కంద ఆరాధన మౌర్యుల కాలంలో ప్రవేశించిందని మనం గట్టిగా నమ్మవచ్చు. తర్వాతి కాలంలో స్కందని స్థానిక దేవతలతో సంలీనం

చేసుకోవటంతో నాగదేవతారాధన, స్కంద దేవతారాధన కలగలసి వుంటాయి. సుబ్రహ్మణ్య షష్టిరోజున పుట్టలో పాలు పోసే ఆచారం ఇలానే వచ్చింది. సుబ్రహ్మణ్య స్వామికి ఇష్టం అని, ప్రతినెలా షష్టి తిథి రోజున పుట్టలో పాలు పోసే ఆచారం ఇప్పటికీ తెలుగువారికుంది.

8. సు-బ్రహ్మణ్య (Good + related to Vedas) గొప్ప వేద విజ్ఞానం కలవాడు అని ఈ పదానికి అర్థం. ఇది స్కంద-కార్తికేయ-సుబ్రహ్మణ్య - దేవతారూపం యుద్ధ దేవతగా మారటానికి ముందున్న భావన అయి వుండవచ్చు.

9. ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ "some contributions of South India to Indian Culture" అనే గ్రంథంలో చెప్పిన "ది రైజ్ ఆఫ్ పల్లవాస్" అనే అధ్యాయం చాలా ముఖ్యమైంది.

   శాతవాహనులు ప్రధానం విష్ణు, శివలతోపాటు నానాఘాట్ శాసనం ప్రకారం స్కంద దేవతారాధకులు.

   It is that broad culture that the Pallavas carried into Tamil country, when they moved into the Northern part of it- పల్లవులు స్కంద సంస్కృతిని వాళ్ళు ఆంధ్ర నుంచి ఉత్తర తమిళనాడుకు చేరినప్పుడు తమతో తీసుకువచ్చారు. అని కృష్ణస్వామి అయ్యంగార్ స్పష్టంగా పేర్కొన్నారు.

10. స్కంద కుమార ఆరాధన ఉత్తర భారతదేశంలోంచి దాని ఆరాధకులైన రాజవంశీకుల కారణంగా దక్షిణాదిన తొలుత తెలుగు నేల మీదకు చేరి ఇక్కడ కొన్ని పరిణామాలను పొందుతూ తమిళనేలను చేరింది. అక్కడ మురుగన్ సంస్కృతిలో సంలీనం చెంది వుంటుంది! ఇందులో అలెగ్జాండర్ ప్రస్తావన తేవటం వలన కథ పక్కదారి పట్టింది!

## వలసవాదం : అలెగ్జాండర్ దాడి కథ

ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీతో లాలూచీ పడిన బ్రిటిష్ చరిత్రవేత్తలు భారతదేశ ప్రాచీనతని తగ్గించగలిగినంత తగ్గించటానికి చేసిన కుట్రలో భాగంగానే అలెగ్జాండర్ భారతదేశాన్ని సాంస్కృతికంగా జయించాడని, ఈజిప్ట్‌లో ఆయనే స్వయంగా ఒక ఫారో (దేవత) అనీ, ఇక్కడ స్కంద దేవతగా అవతరించాడనీ అనేక కథలు సృష్టించారు.

క్రీ.పూ. 327 అలెగ్జాండర్ రాకకు ముందు భారతదేశంలో ఏమీ లేదని నిరూపించటం వీళ్ళ లక్ష్యం. భారతదేశ చరిత్ర క్రీ.పూ. 327 నుంచే మొదలయ్యిందంటారు. అంతకు మునుపుదంతా చరిత్ర పూర్వయుగం. దానికి చారిత్రక వాస్తవికత లేదని దబాయిస్తారు.

భారతీయ సంస్కృతి, జైనబౌద్ధాలు, పురాణాలు ఇవన్నీ అలెగ్జాండర్ తర్వాతవేనంటారు. జర్మనీలో జరిగిన ఒక చరిత్ర సెమినార్‌లో బుద్ధుడి కాలాన్ని అలెగ్జాండర్ తర్వాత – క్రీ.పూ. 240గా తేల్చి చెప్పారు. ఇలా వుంటాయి. కుట్రదారులు కుహనా పరిశోధనలు!

గ్రీకు ఫిలాసఫీ తెలుసుకున్న తర్వాతే బుద్ధులాంటి తాత్త్వికులు భారతదేశంలో తయారయ్యారని చెప్పటం ఈ కుట్రలో భాగం!

నీదీ నీదీ అనుకొనేది ఏదీ నీది కాదని చెప్పటం ఈ కుట్రకు ముఖ్యోద్దేశ్యం. గ్రీకులు జ్ఞానభిక్ష పెడితే, బ్రిటీషర్లు మనకు నాగరికతా భిక్ష పెట్టారనటం ఇందుకు పరాకాష్ఠ. తద్వారా బ్రిటిష్‌వారి కాలనైజేషన్ – వలస పాలన – విధానాన్ని సమర్థించటం బ్రిటిష్ చరిత్రకారుల ఎత్తుగడ. స్కందను ఇందుకోసమే అలెగ్జాండర్‌తో పోలుస్తూ రాశారు. ఆ వలలో పడిన తమిళులు కొందరు తమని గ్రీకులతో పోల్చుకొని ఆనందపడి వుండవచ్చు. కానీ, తద్వారా తెలుగు తమిళ కన్నడ సంస్కృతులకు మూలమైన తల్లి ద్రావిడ సంస్కృతి ఈ దేశానికి పెట్టిన భిక్షని మరిచిపోవటం దురదృష్టకరం.

'ద్రావిడ' అనగానే దాన్ని ఈనాటి తమిళనాడుకు, తమిళభాషకు అన్వయించటానికి అలవాటుపడిన తమిళ పరిశోధకులు స్కంద కార్తికేయ ఆరాధన "తమిళనాడు" కన్నా పూర్వమే తెలుగు నాట వుండేదని, దాన్ని తెలుగువారైన తొలి పల్లవులు తమిళనాటికి చేర్చారని నిరూపితం అయినప్పుడు నేల మీదకు దిగి వచ్చి వాస్తవస్థితిని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించి వుండవలసింది. కానీ, అలెగ్జాండర్ 'తోక'ని పట్టుకొని తమను తాము తక్కువ చేసుకొన్నారు తమిళులు.

అలెగ్జాండర్ పర్షియాని దాటగానే ప్రపంచం ఆవలి అంచుని దాటేసినట్లు గ్రీసు జియోగ్రాఫర్స్ రాసుకున్నారు. ఇండియన్ జియోగ్రాఫర్స్ రెచ్చిపోయి అలెగ్జాండర్ భారతదేశాన్నే కాదు ముల్లోకాల్నే జయించాడన్నారు. మనవాళ్లలో ఇంత దాస్యభావం ఎందుకొచ్చింది? బ్రిటిష్ చరిత్రకారులు గ్రీసు చరిత్రకారులు జాతి దురహంకార రచనల్ని

తెచ్చి ఇండియాలో పాఠ్యాంశాలుగా పెట్టి బోధింపజేశారు. వాటిని చదివిన ఇండియన్ గురువులు అనే చిలకపలుకుల్ని తమ విద్యార్థులకు బోధించారు.

"అలెగ్జాండర్ దండయాత్ర" అనే మాయాకథ వలన కలిగిన ప్రభావాలను విన్సెంట్ ఆర్థర్ స్మిత్ – "ది ఆక్స్‌ఫర్ట్ హిస్టరీ ఆఫ్ ఇండియా" గ్రంథంలో చక్కని విశ్లేషణ చేశాడు.

1. భారతదేశం మీద హెలెనిస్టిక్ గ్రీకుల ప్రభావం క్రీ.పూ. చివరి శతాబ్దాలలో గాని, క్రీ.శ. తొలి శతాబ్దాలలో గానీ ఏ కొద్దిగానైనా వుంటే అది పరోక్షమే గాని, ప్రత్యక్షం కాదు. గ్రీసు ప్రభావం భారతదేశం లోతుల్లోకి చొచ్చుకొచ్చిన దాఖలాలు లేవు.
2. క్రీస్తుకు ముందునాటి నుంచే చెక్కు చెదరకుండా వర్ణ వ్యవస్థపైన ఆధారపడి భారతీయ సామాజిక వ్యవస్థ నడుస్తున్నప్పుడు గ్రీసు ప్రభావం ఈ దేశంపైన పడిందని ఎలా భావించగలం?
3. యుద్ధ విద్యల్లోగాని, యుద్ధతంత్రంలోగాని, గ్రీకులే ఇక్కడినించి కొన్ని కొత్త విషయాలు నేర్చుకున్నారు గాని, వాళ్ళు మనవాళ్ళకు నేర్పగల్గిందేమీ లేదు!
4. అనేకమంది సాధు సన్యాసుల్ని, తత్త్వవేత్తల్ని వధింపచేశాడనే పేరుపడిన అలెగ్జాండర్ నుంచి ఏదో నేర్చుకోవటానికి భారతీయులు పాటుపడ్డారనటం, అలెగ్జాండర్‌ని 'భక్తి'తో స్వాగతించారనటం అర్థం లేని విషయాలే!

5. విన్సెంట్ ఆర్థర్ స్మిత్– అలెగ్జాండర్ నరహంతకుడిగానే భావించాడు. అమానుషమైన నేరస్థుడన్నాడు.

6. గ్రీకు తత్త్వవేత్తలు పైథాగరస్ (క్రీ.పూ. 550), ప్లేటో (క్రీ.పూ. 427–347) వీళ్ళంతా భారతదేశాన్ని సందర్శించి, ఇక్కడి తత్త్వవేత్తలతో సంభాషించినవారే! సోక్రటీస్ పైన భారతీయ ప్రభావం వుందని చాలామంది పరిశోధకులు పేర్కొన్నారు. ఈ నిజాన్ని గ్రీసు చరిత్రకారులు చాలామంది జీర్ణించుకోలేకపోయారు. ఇండియాని అలెగ్జాండర్ జయించాడనే కథని ప్రచారంలోకి తెచ్చి బలవంతంగా పాఠ్యాంశాలలో పెట్టి చదివింపచేశారు.

అందుకని భారతదేశంలో చరిత్ర అధ్యయనం చేస్తున్నవారు భారతీయ ఆధారాలను విదేశీ ఆధారాలతో "క్రాస్ చెక్" చేసుకోవాలే గానీ, విదేశీ ఆధారాలతో భారతీయ చరిత్రను తొందరపడి ప్రకటించవద్దని విన్సెంట్ స్మిత్ కోరుతున్నారు.

"The myth Romance and Historicity of Alexander and his Influence on India" అనే వ్యాసంలో శ్రీ కె.వి. రామకృష్ణారావు అనేక కొత్త ఆలోచనలు రేకెత్తించారు. 2000వ సంవత్సరంలో మారిషస్‌లో జరిగిన స్కంద - మురుగన్ ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్‌లో సమర్పించిన పరిశోధనా పత్రం ఇది. ఇందులో స్కందని అలెగ్జాండర్‌తో ముడిపెట్టడాన్ని ఆయన పూర్తిగా ఆక్షేపించాడు.

వామనుడు పొట్టివాడైనా ముల్లోకాలను జయించాడనే కథ ఆధారంగా పొట్టివాడైన అలెగ్జాండర్ ముల్లోకాలను జయించాడని వాళ్లు వ్రాసుకుంటే, అందుకు తమిళులు తమని తాము కించపరుచుకొంటూ అలెగ్జాండర్‌కి సరెండర్ కావటమే విడ్డూరం- అంటాడాయన.

స్కంద కార్తికేయ గురించి ఎన్నో ప్రశ్నలకు మనకు తగిన సమాధానాలు కావాలి. ప్రత్యేకంగా అధ్యయనం చేయవలసిన కొన్ని అంశాలను పరిశోధకుల దృష్టికి మరొకసారి తీసుకువస్తున్నాను - సహృదయంతో పరిశీలించండి.

1. అవెస్తా దేవత SROASA (లేదా) SRUASA అనే అహురమజ్దా అనుచరుడికీ, 'స్కంద'కూ వున్న సంబంధాలు వెదకాలి.
2. తెలుగు నేల మీద స్కంద కార్తికేయ ఆరాధన కచ్చితంగా ఎప్పుడు మొదలయ్యిందో ఆధారాలు సంపాదించాలి.
3. నైలు నుంచి కృష్ణ దాకా సాగిన చరిత్ర గమనంలో స్కంద పాత్రను పరిశీలించాలి.
4. తెలుగు "మహాసేనాని" దేవతకు నెమలి వాహనం లేదు. కుడిచేతిలో కోడి, ఎడమ చేతిలో శూలం మాత్రమే వున్నాయి. ఈనాటి సుబ్రహ్మణ్యస్వామికి ఇది పూర్వ రూపంగా గుర్తించాలి.
5. చంకమ్ యుగంలో కురవజాతి కొండ ప్రజలు ఆరాధించిన మురుగన్ తమిళుల స్వంత దేవత. ఇతనినీ, కుమారస్వామినీ కలిపి ఒకే దేవతగా రూపొందించారని తమిళులూ అంగీకరిస్తున్నారు. అయితే మురుగన్ చారిత్రక ప్రాధాన్యతని సింధు నాగరికత కాలం వరకూ తీసుకువెళ్ళేందుకు ఐరావతం మహదేవన్ కృషి చేస్తున్నారు. గాజుల జత ఆకారంలో రెండు అండాకార వృత్తాలు కలిసి వున్న గుర్తు మురుగన్ (మురుగులు = గాజులు) దేవతకు అక్షరాకృతిగా ఆయన సింధులిపిలో ఉంది. దానిని నిరూపించే ప్రయత్నం చేశారు. అయితే, అస్కో పర్పోలా కూడా కొంతవరకు ఈ వాదనతో ఏకీభవించటం విశేషం.

6. మురుగన్ మౌలికంగా యుద్ధదేవత. 'కొర్రవాయ్' (భూదేవి) అతని తల్లి. నెమలి, కోడి, ఏనుగు, మేక, పాము ఇతని నేస్తాలు. శూలం ఇతని ఆయుధం. ఎర్రనివాడు, కామదేవత కూడా. స్కందతో ఇతని సంలీనం తర్వాత కుమారస్వామిని యుద్ధదేవతగా శివపురాణంలో ప్రకటించి వుంటారని కొందరు పరిశోధకులు భావిస్తున్నారు.

7. మురుగన్ అగస్త్యుడికి స్వయంగా తమిళం బోధించినట్టు, మొదటి చంకమ్‌కు అగస్త్యుడే అధ్యక్షత వహించగా, రెండవ చంకమ్‌కు సాక్షాత్తూ మురుగనే అధ్యక్షస్థానంలో వున్నాడని తమిళసాహిత్య గ్రంథాలు చెప్తున్నాయి. ఆ విధంగా తమిళం 'దేవభాష' అని చాటుకోవడం ఈ కథలో లక్ష్యంగా కన్పిస్తుంది... దేవుడే స్వయంగా నేర్పాడు కాబట్టి! తమిళ భాషా సంస్కృతులు మురుగన్‌తో ముడిపడి మొదలై అభివృద్ధి చెందాయి.

8. తెలుగువారు 'పులుమావి' అనే పేరుతో పిలిస్తే, తమిళులు దాన్ని సంస్కృతీకరించి శరవణన్ అన్నారు. 'శర' అంటే దర్భ.

9. జంతుబలులతో బ్రాహ్మణేతర పూజారులతో వేలన్ (ముఖ్య భక్తుడు) వెరియాట్టు (మురుగన్ ఆరాధనా నృత్యరూపం)లతో ఒక గ్రామదేవతగా ఆరాధించబడిన మురుగన్, స్కందతో సంలీనమై వైదిక - సాంస్కృతిక దేవతగా మారి శైవ మత ప్రముఖుడిగా విస్తృతి పొందాడు. శివపురాణం కారణంగా తమిళనాట పొందినమురుగు షణ్ముఖేశ్వర రూపమే దేశవ్యాప్తంగా పూజార్హం అయ్యింది!

10. క్రీ.శ. 820-898 కాలానికి చెందిన చాళుక్యరాజు యుద్ధమల్లుడు బెజవాడ (విజయవాడ) దుర్గామల్లేశ్వరస్వామి దేవస్థానంలో వేయించిన శాసనం కొన్ని విశేషాలను చెప్తోంది.

గుంటూరు జిల్లా చేబ్రోలు రాజధానిగా యుద్ధమల్లుడు పాలించాడు.

బెజవాడలో గొరగలకు (శైవులకు) ఒక మఠాన్ని కట్టించి అందులో శైవేతరులు చేరకూడదని ఒక కట్టడి చేశాడు. అందుకు ఒక నిఘా అధికారిని నియమించాడు.

తొలుత - తన రాజధాని చేబ్రోలులో కుమారస్వామి కోసం ఒక గుడి కట్టించాడు. గుంటూరు జిల్లా చేజెర్ల, చేబ్రోలు ఇవి కుమారస్వామికి ప్రసిద్ధ ఆరాధనా కేంద్రాలు

ఆ రోజుల్లో, చేబ్రోలులో మతకల్లోలాలు చెలరేగడం వలన కుమారస్వామికి భద్రత లేదని భావించి, విగ్రహం బెజవాడ తీసుకువచ్చి ఇక్కడ గుడి కట్టించి ప్రతిష్ఠించినట్లు మధ్యాక్కర వృత్తమాలికలో ఈ శాసనంలో పేర్కొన్నాడు.

క్రీ.శ. 8-9 శతాబ్దాల కాలంలో కుమారస్వామి తెలుగునేల మీద ప్రముఖ ఆరాధనా దేవతగా వున్నాడనటానికి ఈ బెజవాడ యుద్ధమల్లుడి శాసనం ప్రత్యక్ష సాక్ష్యం!

11. భక్తి ఉద్యమం మొదలైనాక క్రీ.శ. 9-13 శతాబ్దాల కాలంలో శివుడు - విష్ణువు ప్రధాన దేవతలుగా రావటంతో కుమారస్వామి, వినాయకుడు ఇతర దేవతలు శివ, విష్ణులకు పరివార దేవతలయ్యారు. క్రీ.శ. 13-14 శతాబ్దాలలో తమిళులు కుమారస్వామి మురుగన్ సాంప్రదాయాన్ని పునరుద్ధరించి ఆయనను ప్రధానదేవతగా అర్చించటాన్ని కొనసాగిస్తున్నారు.

కానీ, తెలుగు నేల మీద ఇందుకు భిన్నంగా జరిగింది. ఇక్కడ ఒక ఆచారం లేదా అలవాటుగానే మిగిలిపోయింది. నాగదేవతరాధన, సుబ్రహ్మణ్యారాధన కలిసిపోయి నాగేంద్రుడిని సుబ్రహ్మణ్యం పేరుతోనే వ్యవహరించటం తెలుగువారికి ఒక ఆచారంగా మారింది!

12. కృష్ణాజిల్లా మోపిదేవి - ఒకనాటి నాగదేవతారాధనా కేంద్రం - ఈనాటికి సుబ్రహ్మణ్యేశ్వరుడి ఆరాధనా కేంద్రగానే వుంది. చెవులు కుట్టించుకొని మొక్కుబడులు తీర్చుకునేందుకు ఈ స్వామిని ఆరాధించే ప్రాచీన ఆచారం ఇక్కడ కొనసాగుతూనే వుంది. నాగేంద్ర సుబ్రహ్మణ్యస్వామి - కనీసం 2300 ఏళ్ళుగా తెలుగువారికి ఆరాధనీయుడుగా వున్నట్లు ఆధారాలు చెప్తున్నాయి. ఇంకా అంతకుముందు నుంచీ ఇక్కడ వెలిసి వున్నాడేమో తెలియదు.

1937లో ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్‌లో ఎస్. గోపాలపిళ్ళై, సమర్పించిన ఒక పరిశోధనా పత్రాన్ని (ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్ ప్రొసీడింగ్స్ Vol IX త్రివేంద్రం గవర్నమెంట్ ప్రెస్ - 1937, pp.955-977) బైటకు తీసి, దానికి మరికొన్ని మషాలాలు జోడించి, ఆ వ్యాసాన్ని ఇంటర్నెట్‌లో పెట్టి దానికి పెద్ద ప్రాచుర్యం కల్పించారు. ప్రపంచ చరిత్రని తమిళులు ఎలా వక్రీకరిస్తారో, తమకు అనుకూలంగా చరిత్రని ఎలా మలచుకోగలుగుతారో ఈ వ్యాసాన్ని చదివితే ఎవరికైనా అర్థం అవుతుంది.

ఈ వ్యాసంలోని ముఖ్యాంశాలను పరిశీలిద్దాం.

1. అలెగ్జాండర్ పురుషోత్తముణ్ణి, ఇతర భారతీయ రాజుల్ని ఓడించి, ఇండియాని జయించి, ఈ దేశాన్ని తన గుప్పెటలో పెట్టుకున్నాడు.

2. అలెగ్జాండర్ మహానుభావుడు. కారణజన్ముడు, అవతార పురుషుడు, అతను ఏ దేశాన్ని జయించినా, అక్కడి ప్రజల్ని, వాళ్ళ సంస్కృతిని, వారి మత విశ్వాసాలను గౌరవించాడు.

3. పర్షియన్ల పట్ల తీవ్ర శతృత్వం కారణంగా వారి మత గ్రంథాలను విధ్వంసం చేయించాడు. ఇలాంటివి ఒకటీ రెండు ఉదాహరణలు మాత్రం చాలా అరుదుగా జరిగాయి.

4. అరబ్బులు అలెగ్జాండర్‌ని ISKANDER DHU'LQUANEEN పేరుతో ఒక దేవుడిగా కొలుస్తారు. రెండు కొమ్ముల దేవుడని ఈ పదానికి అర్థం. ఇస్లామ్ ఈ 'ఇస్కందర్'ని (సికిందర్) తమ మతప్రవక్తల (PROPHET) లో ఒకరిగా గౌరవించింది.

5. భారతదేశంలోకి ఇలా దైవస్వరూపిడిగా ప్రవేశించిన ఏకైక ఆర్య చక్రవర్తి అలెగ్జాండర్.

6. పర్షియన్లే, అలెగ్జాండర్‌ని దేవుడిగా కొలిచినప్పుడు భారతీయులు ఎందుకు కొలవరు...? ఇదంతా ఒక కుట్రతో కూడిన నిశ్శబ్దం (Conspiracy of Silence) . మాథ్యూ ఆర్నాల్డ్, పి.ఎ. స్మిత్ లాంటి పరిశోధకులు ఇదే అభిప్రాయాన్ని ప్రకటించారు కూడా!

7. 'ఇస్కందర్' పర్షియన్ పేరుని 'స్కంధ' అని భారతీయులు సంస్కృతీకరించారు. స్కూలుని – ఇస్కూలు అన్నట్లే స్కంధ, ఇస్కంద పదాలు రెండూ ఒకటే.

8. సంస్కృత సాహిత్యంలో స్కంధ అంటే కుమారస్వామి. షణ్ముగం, అర్ముగం, మురుగన్‌లాంటి తమిళపేర్లతో పిలువబడిన సుబ్రహ్మణ్యస్వామి, ఈ కుమారస్వామి ఒక్కరే! 'కార్తికేయుడు' కూడా ఈయనే! 'స్కంధ' అని పిలువబడిన అలెగ్జాండర్ మా "మురుగన్" అవతారమే!

9. అలెగ్జాండర్ ఒక రాకుమారుడు. 'కుమార' అంటే సంస్కృత భాషలో 'స్కంధ' అని! ఆయన యుద్ధదేవుడు. సేనాని కూడా. 'సేనాని' అంటే కుమారస్వామే.

10. 'స్కంధ' అంటే శక్తిధరుడు. త్రిశూలధారి. అలెగ్జాండర్ ఆయుధం బల్లెం.

11. పర్షియన్ ప్రభువు దరియస్ (DARIUS) ని అలెగ్జాండర్ సంహరించాడు. స్కంధ అనే కుమారస్వామి తారకాసురుడిని జయించాడు. "దరియస్" పదం 'తారక' పదానికి గ్రీకురూపమే! దార, తార, పదాలు సంరక్షణనే సూచిస్తాయి.

12. దరియస్ తర్వాత పర్షియాలో "ఆహుర మజ్ద' మత ప్రాబల్యం అంతరించిపోయింది. అకిమెనిడ్ రాజవంశ పాలన ముగిసింది. గ్రీకుల చిరకాలవాంఛ నెరవేరింది.

13. 'స్కంధ'ని మహిషాసుర మర్దనం చేసినవాడుగా చెప్తారు. ఆహురమజ్ద అంటే అసురుల సంరక్షకుడు అని! 'ఆహుర మజ్దా'ని కనుమరుగు చేయటం అంటే, అసుర సంహారం పూర్తి చేయటం అని! స్కంధ అసుర సంహారం చేసినవాడు కాబట్టి, అలెగ్జాండర్ అంటే కుమారస్వామే!

14. అలెగ్జాండర్ బాక్ట్రియా రాకుమారి రోగ్జానాని పెళ్ళిచేసుకున్నాడు. స్కాంధ పురాణం ప్రకారం, కుమారస్వామి దేవసేనని పెళ్ళాడాడు. రోగ్జానా అంటే, రజ్ = వెలుగు అని, దేవసేనలో దివ= వెలుగు.

15. అలెగ్జాండర్ భారతదేశానికి వచ్చినప్పుడు చంద్రగుప్తుడు చాలా చిన్న కుర్రవాడు. అలెగ్జాండర్ మీద ఆరాధనాభావం పెంచుకొని, ఆయన బొమ్మకు పూజలు చేసేవాడు.

16. కుమారస్వామి వాహనం నెమలి. అందుకే మౌర్య చక్రవర్తులు మయూరం పేరునే తమ వంశనామంగా చేసుకున్నారు. నెమలి తమిళుల స్వంత పక్షి!

17. జియస్ (ZEUS) కుమారుడు దయానీసస్ (DIONYSUS). శివుడి కుమారుడు స్కాంధ. జియస్ శబ్దం 'శివ' శబ్దానికి రూపాంతరమే!

18. జియస్ అంటే, TRIOPHTHALMOS మూడు కన్నులవాడు. శివుడు త్రయంబకుడు, ముక్కంటి!

19. ఈజిప్టుల TUESDAY తమిళభాషలో చెవ్వ (CEVVA) వేదభాషలో DYAUS (ద్యైవస్), గ్రీకుభాషలో ZEUS జియస్‌గా మారింది. అనేకమంది గ్రీకుదేవతలు ఇలా హిందూ దేవతలుగా మారిపోయారు.

20. అలెగ్జాండర్ ఇండియాని జయించిన తర్వాతే, స్కంధ భారతీయ సాహిత్యంలో కన్పించాడు. వైదికపరమైన సాహిత్యంలో స్కంధ లేదు. ఛాందోగ్యోపనిషత్తులో

"స్కంధ –సనత్కుమా"రుడి పేరు కనిపిస్తుంది. అలెగ్జాండర్ కారణంగానే ఈ పేరు ఏర్పడింది.

ఇలా సాగుతుంది ఈ 40 పేజీల వ్యాసం. ద్రావిడ అనే పదం ఎక్కడ కన్పించినా దాన్ని 'తమిళ' అనే పదంగా మార్చి చరిత్రను వక్రీకరించే ప్రయత్నంలో భాగంగా వండిన వ్యాసం ఇది! తల్లి ద్రావిడ భాషాకాలంలో జరిగిన చారిత్రకాంశాలన్నింటినీ ఏరి ఈనాటి తమిళభాషకు ఆపాదింపచేయటం ఈ వ్యాసం లక్ష్యం.

'ద్రావిడ' పదాన్ని 'తమిళ' పదానికి పర్యాయపదంగా చిత్రించి, చరిత్రని తమిళులకు అనుకూలంగా మార్చే కుట్ర కాల్డ్‌వెల్ కాలానికే మొదలయ్యిందని నా భావన.

ఇంతకీ అలెగ్జాండర్‌ని కుమారస్వామితో పోల్చడం వలన తమిళులు ఆశించిన ప్రయోజనం ఏమిటి?

1. ప్రాచీన ప్రపంచ నాగరికతలన్నింటికీ తమిళులే మూలం అని నిరూపించటం.
2. ఈజిప్ట్ నాగరికతని ప్రాచీన తమిళభాష మాట్లాడిన ప్రజలే నిర్మించారని నమ్మించటం.
3. సుమేరియా, పర్షియా, ఇరాన్, ఇరాక్‌లలోని దేవతా పురుషులంతా తమిళులేనని, వాళ్ళే భారతదేశంలో కూడా దేవతలుగా చెలామణీలో వున్నారని, వీళ్ళ పేర్లను సంస్కృతీకరించి - శివ, స్కంధ - ఇలా మార్చుకున్నారని ఒప్పించటం.
4. ఈ భూమి పుట్టకముందు, రాయిరప్పా పుట్టకముందే తమిళభాష పుట్టిందని అడ్డంగా బుకాయించటం!

ఇదంతా చదివిన తర్వాత– తమిళులు ఎంతో పకడ్బందీగా అలెగ్జాండర్ –స్కంధ కథని నడిపించారుగానీ, ఒక మౌలిక సత్యాన్ని మరిచిపోయారని అనిపిస్తోంది.

అలెగ్జాండర్ భారతదేశంలోకి వచ్చేవరకూ ఇక్కడ "స్కంధ" లేదు అనడం వలన, క్రీ.పూ. 300 కన్నా పూర్వం భారతదేశంలో జరిగిన చారిత్రక సాంస్కృతిక పరిణామాలతో తమిళులకు ఎలాంటి సంబంధమూ లేదని వారు అంగీకరించినట్లైతోంది!

ఇక్కడ తెలుగువాడు అడగవలసిన ప్రశ్న ఏమంటే, శివకుమారుడు కుమారస్వామిని తమిళులు హైజాక్ చేసి కేవలం తమిళదేవుడిగా ఎలా చిత్రించుకోగలరని?

నన్నెచోడుడు కష్టించి రాసిన కుమారసంభవం ఓ అరవ దేవుడి కథా...? ఎంత అన్యాయం???

## అలెగ్జాండర్ ఇండియాని నిజంగా జయించాడా?

నిజానికి అలెగ్జాండర్ అడుగుపెట్టింది ఈనాటి పాకిస్తాన్ భూభాగంలోని పెషావర్ వరకే! జేలమ్ నది పశ్చిమతీరంలో అలెగ్జాండర్ సైన్యంతో విడిది చేసి వున్నాడు. DIODORUS ప్రకారం, అతను అప్పటికే వెనక్కి వెళ్ళిపోవాలని గట్టిగా నిర్ణయించుకుని ఉన్నాడు. తన ఆధీనంలోని పెషావర్ ప్రాంతానికి ఫిలిప్స్‌ని తన ప్రతినిధిగా నియమించాడు.

ఆర్.సి. మజుందార్ (ది క్లాసికల్ అక్కౌంట్స్ ఆఫ్ ఇండియా కలకత్తా - 1981) ప్రకారం తక్షశిల దాటిన తర్వాత SOPHYTIS అనే రాజ్యం వుంది. ఇది డియోడొరస్ రికార్డు ఆధారంగా చెప్తున్న చారిత్రక అంశం కాబట్టి, ఈ పేర్లన్నీ గ్రీకు భాషలో కన్పిస్తున్నాయి. ఈ రాజ్యానికి EMBISAROS పాలకుడు. ఇతని పొరుగు రాజ్యం పురుషోత్తముడు (PORUS) పాలిస్తున్నది. ఈ ఇద్దరూ అలెగ్జాండర్‌కు వ్యతిరేకంగానూ, వారి శత్రువైన తక్షశిల రాకుమారుడు అంభి అలెగ్జాండర్ అనుకూలంగానూ నిలబడ్డారు.

జేలమ్ నది ఆవలి ఒడ్డున జరిగిన ఈ యుద్ధంలో అలెగ్జాండర్ గుర్రం BUCAPHELA మరణించిందట. STRABO ప్రకారం ఇది స్వల్పకాలం జరిగిన యుద్ధం. ఇందులో అలెగ్జాండర్ గెలవనూ లేదు. పురుషోత్తముడు ఓడనూ లేదు. అది అసంపూర్తిగా ముగిసింది...అంతే!

ఆ యుద్ధంలో పురుషోత్తమ సేనలదే పైచేయి అయ్యింది. అలెగ్జాండర్ వైపు జననష్టం ఎక్కువ జరిగింది. ఇందుకు కొన్ని చెప్పుకోతగ్గ కారణాలను ఆర్.సి. మజుందార్ చక్కగా విశ్లేషించారు :

1. గుర్రం పైన కూర్చుని యుద్ధం చేసే ఆశ్వికుడు ఒక చేత్తో గుర్రం కళ్ళాలను పట్టుకుని రెండో చేత్తో ఆయుధాన్ని ప్రయోగించవలసి వుంటుంది. ఆ రోజుల్లో కాళ్ళకు 'రికాబు' (STIRRUP) తగిలించుకొనే పద్ధతి గ్రీకులకు తెలియదు. రికాబుని గుర్రానికి కట్టి కాళ్ళు అందులో దూర్చి కూర్చుంటే అశ్వకుడు రెండు చేతుల్తో ఆయుధాలు ప్రయోగించటానికి అవకాశం ఉంటుంది. రికాబును అప్పటికే భారతీయులు వినియోగంలోకి తెచ్చారు. క్రీ.శ. 2వ శతాబ్ది తర్వాతే రికాబు వాడకం పాశ్చాత్యులకు తెల్సింది. పురుషోత్తమ సేన విజయానికి ఇదొక కారణం.
2. జి.యన్.పంత్ ఇండియన్ ఆర్చరీ అనే గ్రంథంలో (ఆగమ కళాప్రకాశన్, ఢిల్లీ - 1978) పురుషోత్తమ సేన రథాలను ఎక్కువగా వినియోగించిందనీ, పైకప్పు ఉండటాన అందులో నిల్చున్న రథికుడు సురక్షితంగా బాణ ప్రయోగం

చెయ్యగలుగుతాడనీ, బహిరంగస్థలంలో నిలబడ్డ కాల్బలం ఎంత బాణ ప్రయోగం చేసినా రథికుడిదే పైచేయి అవుతుందని, అలెగ్జాండర్ ఎక్కువమందిని నష్టపోవటానికి ఇది ఇంకొక కారణంగా చెప్తారు.

3. అలెగ్జాండర్ చాలా త్వరగా పరాజయ ప్రమాదాన్ని గ్రహించాడు... పర్షియాని జయించినంత సులువుగా ఇండియాని హస్తగతం చేసుకోలేనని, వెను తిరగడమే మేలని గుర్తించాడు. పర్షియాలో దరియస్ చక్రవర్తి పిరికితనంతో తననూ, తన రాజ్యాన్ని బలి చేసుకున్నాడు. ఇక్కడ పోరస్ అనబడే పురుషోత్తముడు ధైర్యంగా నిలబడి యుద్ధ కౌశలాన్ని ఉపయోగించాడు. అలెగ్జాండర్ సేన అప్పటికే అలసిపోయి ఉంది.

4. అలెగ్జాండర్ యుద్ధరంగం నుంచి తతను తాను విరమించుకొని బాక్ట్రియాకు తిరుగు ప్రయాణమై వెళ్ళిపోయాడు. యుద్ధం అసంపూర్తిగా ముగిసింది

5. మజుందార్ ప్రభృతులు ప్రకారం - అలెగ్జాండర్ వెళ్ళిపోయిన తర్వాత కూడా పురుషోత్తముడు రాజుగా కొనసాగాడు. కాబట్టి అలెగ్జాండర్ భారతదేశాన్ని జయించి పాలించాడని, గ్రీకు దేవతల్ని తెచ్చి ఇక్కడ హిందూ దేవతలుగా ప్రకటించి పూజింపచేశాడనీ... ఇవన్నీ కట్టుకథలే!

భారతదేశంలో గ్రీకు నాగరికత ప్రభావం అలెగ్జాండర్‌తో మొదలయ్యింది కాదు. అతనికి అనేక వందల ఏళ్ళకు పూర్వం దక్షిణ భారతదేశం నుంచి, ముఖ్యంగా డెక్కన్ భూభాగం నుంచి గ్రీస్, రోమ్, ఆఫ్రికా, మద్య ఆసియా దేశాలతో సహా ఆసియా, ఆఫ్రికా, యూరప్‌లోని అనేక ప్రాంతాలతో వర్తక, వాణిజ్య సంబంధాలు నడిచాయి. వాటిలో డెక్కన్ ప్రజల పాత్ర ముఖ్యమైంది!

అలెగ్జాండర్‌కు భారతదేశం కొత్తగానీ, దక్షిణాది ప్రజలకు, ముఖ్యంగా ఆనాటి తెలుగువారికి గ్రీకులూ పర్షియన్లు చిరపరిచితులే!

కుమారస్వామి మతాన్ని అలెగ్జాండర్ తెచ్చి భారతదేశంలో ప్రవేశపెట్టాడని, స్వయంగా అలెగ్జాండరే కుమారస్వామి అనీ, ఆ విషయాన్ని గ్రహించలేక పోయిన భారతీయులు అలెగ్జాండర్‌ని మామూలు మనిషేనని అనుకున్నారని తమిళులు ఈ వ్యాసంలో మొత్తం భారతీయుల్ని ఎద్దేవా చేయటాన్ని గమనించవచ్చు. అలెగ్జాండర్ ఇండియాని జయించాడని, భారతీయులు అతనికి బానిసలయ్యారనీ బుకాయిస్తూ తమిళులు తామే గ్రీకులం అన్నంతంగా రాసుకొంటున్నారు.

# శూద్రుడికీ ఉపనయనం : : సుశ్రుతుడి సంస్కరణ

ఉపనయనం అంటే దీక్ష ఇవ్వటం. దీక్ష అనేది ఒక గొప్ప కార్యానికి ఉపక్రమించే నిర్ణయం. ఈ దీక్షని గురువు శిష్యుడికి ఇస్తున్నాడు. ఆ శిష్యుడు శూద్రుడైనా సరే గురువు ఉపనయనం చేసి దీక్ష ఇవ్వాలంటాడు ఆచార్య సుశ్రుతుడు.

"శిష్యుడి ఉపనయనం (దీక్ష) గురించి తెలియజేస్తుంది కాబట్టి ఇది 'శిష్యోపనీయ అధ్యాయం'. భగవాన్ ధన్వంతరి పేరుతో సుశ్రుత సంహితలో అధ్యాయం వ్రాశాడు.

క్రీ.పూ. 600-1000 మధ్య కాలంలో ఆచార్య సుశ్రుతుడు జన్మించి ఉంటాడని భావిస్తున్నారు. బుద్ధుడికి ఈయన సమకాలికుడు కావచ్చు. బౌద్ధం ప్రభావం కూడా తనను ఆయన పైన ఉండవచ్చు. తాను కాశీరాజైన 'దివోదాస ధన్వంతరి' శిష్యుడిగా సుశ్రుతుడు చెప్పుకున్నాడు.. అధర్వణ వేదంలో కూడా సుశ్రుతుడి ప్రస్తావన కనిపిస్తుంది. ఆయుర్వేదం అధర్వణ వేదానికి ఉపవేదం. అధర్వణవేదం ఎక్కువగా శాస్త్ర సాంకేతిక రంగాలకు చెందిన అంశాలకు సంబంధించినదిగా వేదవిదులు భావిస్తారు. సుశ్రుతాచార్యుడు అధర్వణ వేదకాలం నాటి ప్రాచీనుడే!

బుద్ధుడి బోధనల ప్రభావాన కావచ్చు, సంస్కర్త హృదయం వలన కావచ్చు, మనుషుల్ని విడదీసే మత విధానాలపట్ల వ్యతిరేకత వలన కావచ్చు, లౌకిక విద్యల్ని మతం లోంచి వేరు చేయాలని సుశ్రుతుడు గట్టి ప్రయత్నమే చేసినట్టు ఈ "శూద్ర శిష్యోపనయనం" అధ్యాయంలో మనకు కనిపిస్తుంది. భారత దేశంలో విద్య రెండు రకాలుగా కనిపిస్తుంది. మొదటిది లౌకిక విద్య. ఇది కుల, వర్ణ భేదాల కతీతంగా (సెక్యులర్)

మనుషు లందరూ నేర్వదగింది. రెండవది మతపరమైన (రెలిజియస్) విద్య. దానికి మతాలు, కులాలు వర్ణభేదాలు, అంటరాని తనం, స్త్రీ పురుష వ్యత్యాసాలతో సహా సమస్త అడ్డుగోడలూ ఉంటాయి.

"విశ్వామిత్ర సుతం శిష్య మృషిం సుశ్రుత మన్వశాత్", "విశ్వామిత్ర సుతాం శ్రీమాన్ సుశ్రుతః" అనే సుశ్రుత సంహిత లోని వాక్యాలు సుశ్రుతుడు విశ్వామిత్రుడి పుత్రుడని చెప్తున్నాయి. మహాభారతం అనుశాసన పర్వంలో విశ్వామిత్రుడి వంద మంది కొడుకుల్లో శ్యామ, గార్గి, జాబాలితో పాటు సుశ్రుతుడు కూడా ఉన్నాడని ఉంది. మొత్తం మీద వీళ్ళంతా సమకాలికులైన సంస్కర్తలు.

ఆచార్య నాగార్జునుడు సుశ్రుత సంహితను సంస్కరించి, ఆ గ్రంథానికి పెంపుగా 'సుశ్రుత సంహిత ఉత్తర తంత్రం' రచించటాన్ని బట్టి సుశ్రుతుడు నిస్సందేహంగా నాగార్జునుడి కన్నా చాలా పూర్వుడని తేల్తోంది.

ఆర్యులు తొలినాళ్ళలో మ్లేఛ్ఛుల కన్నా భిన్నమైన వ్యక్తులుగా కనిపించటానికి యజ్ఞోపవీత ధారణ చేశారు. కాలక్రమాన ఆర్యేతర సంస్కృతులకు చెందిన ప్రజలు ఆ సమాజంలో చేరుతూ రావటంతో ఆర్య సమాజం విస్తరించింది. అది నాలుగు వర్ణాల వ్యవస్థకు దారి తీసింది. ఆ నాలుగో వర్ణం వారికన్నా ఆధిక్యత చాటుకోవటానికి మొదటి మూడు వర్ణాల వారూ యజ్ఞోపవీత ధారణ కొనసాగించారు. బ్రాహ్మణ క్షత్రియుల మధ్య సుదీర్ఘకాలం ఆధిపత్య పోరు జరిగింది. ఆ తర్వాత బ్రాహ్మణాధిక్యత బలపడింది. క్షత్రియులు రెండవ స్థానం లోనూ వైశ్యులు మూడవ స్థానంలోనూ సరిబెట్టుకున్నారు. శూద్రులకు ఏ స్థానమూ లేదు. సుశ్రుతుడు ఈ స్థానాలను రూపుమాపాలనుకున్నాడు.

ఈ నేపథ్యంలో సంఘంలో వ్రేళ్ళూనుకున్న వర్ణవ్యవస్థ పెడదారిన పడుతున్న దశలో సుశ్రుతాచార్యుడు వైద్యవిద్యను అన్నికులాలవారికీ సమాన గౌరవంతో అందించేందుకు చేసిన ప్రయత్నమే ఈ అధ్యాయం.

ఏ వర్ణానికి లేదా కులానికి చెందిన వాడైనా సరే వైద్య విద్యను అభ్యసించటానికి వస్తే, అతనికి వైద్య గురువు ఉపనయనం చేశాకే విద్యను నేర్పాలి. ఉపనయనం అయినవాడు విద్యార్థిగా వచ్చినా అతనికి మళ్ళా ఉపనయనం చేయాల్సిందే. విద్యార్థుల మధ్య ఉపనయనం అయిన వారూ, ఆ అర్హత లేనివారు అనే భేదాలు తలెత్తే ప్రమాదం ఉంటుంది కాబట్టి, "మళ్ళీ ఉపనయనం" అనే సిద్ధాంతం తెచ్చాడాయన.

అనుపనీతుడు అంటే ఉపనయనం చేయించుకునే అర్హత లేని శూద్ర విద్యార్థికి కూడా విద్యారంభ ఉపనయనం చేయాలన్నాడు.

"మన్త్ర వర్జమనుపనీత మధ్యాపయేదిత్యేకే" విద్యారంభ ఉపనయనం మంత్రంతో పని లేకుండా, జంధ్యం అవసరం లేకుండా జరగాలి. మూడు వర్ణాల వారికే పరిమితమైన మంత్రం, జంధ్యంతో కూడిన ఉపనయనాన్ని సుశ్రుతుడు లౌకిక విద్యలు నేర్పేందుకు ఉపయోగించ దలచ లేదు. శూద్రులతో సహా అన్ని వర్ణాల వారికీ మంత్రరహిత, యజ్ఞోపవీత రహిత ఉపనయనం చేసి విద్యారంభ దీక్ష ఇవ్వాలని గురువులకు సూచించాడు.

స్త్రీలకు వైద్య విద్య నేర్పరాదనే నియమం ఎక్కడా లేదు కాబట్టి, విద్యార్థినులు కూడా ఈ మంత్ర రహిత, యజ్ఞోపవీత రహిత ఉపనయనానికి అర్హులేనని అర్థం చేసుకోవాలి.

సుశ్రుతుడు వైద్యక గురువు కాబట్టి, వైద్య విద్యకోసం వచ్చే విద్యార్థికి ఉపనయనం తప్పనిసరి అని చెప్పాడు. ఇదే సూత్రం అన్ని లౌకిక విద్యలకూ వర్తిస్తుంది. ఈ విద్యారంభ దీక్షను సుశ్రుతుడు 'ప్రతిజ్ఞసూత్రం' అన్నాడు.

మనిషి, వ్యాధి, ఔషధం, క్రియాకాలం ఈ నాల్గింటినీ పురుషాది చతుష్టయం అంటారు. వీటిని బోధించే శాస్త్రానికి విద్యార్థి యొక్క వర్ణం లేదా కులంతో పనిలేదన్నది సుశ్రుతుడి అభిప్రాయం. విద్యార్థిగా వచ్చిన వ్యక్తి స్త్రీయా పురుషుడా అనే చర్చతో కూడా నిమిత్తం లేదు. ఏ విద్యార్థి అయినా ఉన్నత విద్య లేదా వృత్తి విద్య నేర్చబోయే ముందు తప్పనిసరిగా తాను తన విద్యను లోకహితానికి, పరహితానికీ మాత్రమే వినియోగిస్తానని ప్రతిజ్ఞ చేయటమే ఈ ఉపనయన విధి. ఉపనయనం అంటే 'విద్యార్థి ప్రతిజ్ఞ'.

శాస్త్రాలకు మంత్రాలతో సంబంధం లేదనీ, విద్యారంభ ఉపనయనాలకు మంత్రం అవసరం లేదనీ, ద్విజత్వం (రెండోసారి పుట్టే అర్హత) లాంటి అంశాలతో లౌకిక విద్యారంభ ఉపనయనానికి సంబంధ లేదనీ సుశ్రుతుడి అభిప్రాయంగా కనిపిస్తుంది.

సుశ్రుతుడు అనుసరించిన ఈ మార్గం వైదిక ధర్మాలకు నూరుశాతం వ్యతిరేక మైనదే! శూద్రుడికి ఉపనయనం అంటే ఆనాటి వర్ణవ్యవస్థలో అది తీవ్రమైన అంశమే! వైద్యానికి, వైద్యుడికీ కులమతాలతో నిమిత్తం లేదని చాటికి చెప్పటానికే ఉపయనం విధానాన్ని ప్రతిపాదించాడు సుశ్రుతుడు.

"బ్రాహ్మణ స్త్రయాణాం వర్ణానా ముపనయనం కర్తుమర్హతి, రాజన్యో ద్వయస్య, వైశ్యే వైశ్యస్యైవేతి, శూద్రమపి కులగుణ సంపన్నం" ఏ కులం వాడైనా, కులాన్ని బట్టి గాక గుణ సంపన్నతను బట్టి ఉపనయనం చేసి విద్య నేర్పాలన్నాడు. బ్రాహ్మణ గురువు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాల విద్యార్థులకు ఉపనయనం చేయవచ్చు. క్షత్రియ గురువు వైశ్య శూద్ర విద్యార్థులకు, వైశ్యుడు వైశ్యులకు, శూద్రుడు శూద్రులకూ విద్యారంభ దీక్ష ఇవ్వచ్చునన్నాడు. అన్ని కులాలవారికీ ఉపనయనం చేసే బాధ్యత, చేయించుకునే హక్కు ఉన్నాయని ప్రకటించాడు.

ఈ సూత్రాన్ని తనకు తన గురువైన సాక్షాత్తు భగవాన్ ధన్వంతరే చెప్పాడనీ, దీన్ని ప్రతి ఒక్కరూ పాటించాలన్నాడు. వేద విద్యల సంగతి అలా ఉంచితే వైద్యం లాంటి లోకోపకారక, లౌకిక విద్యలు జన సామాన్యానికి చేరువ కావాలంటే వైద్యుడికి కులపరమైన ఆధిక్య భావన ఉండకూడదని ఈ ఉపనయన తర్కం స్పష్టం చేస్తోంది.

బసవడు జంధ్యంతో కూడిన తనకు ఉపనయనం అక్కరలేదని తండ్రితో వాదించినప్పుడు ఆ తండ్రీ కొడుకుల మధ్య సంభాషణని పాల్కురికి సోమన బసవపురాణంలో గొప్పగా వర్ణిస్తాడు. "ఇతరుల కన్నా అధికుణ్ణని చాటుకోవటానికే అయితే ఈ ఉపనయనం నాకు అవసరం లే"దని బసవడు తిరస్కరిస్తాడు. మెడలో తాడు (జంధ్యం) వేసుకుని, అంటరాని తనాన్ని పాటించే వాళ్ళను "తాటిమాలలు" అని నిందించాడు... తాడుని మాలగా ధరించేవాళ్ళనే అర్థంలో! బసవడికన్నా కనీసం వెయ్యేళ్ళకు పైగా పూర్వుడైన సుశ్రుతుడు మంత్రాన్ని, యజ్ఞోపవీతాన్ని రద్దుచేసి అన్ని కులాలవారికీ విద్యారంభ ఉపనయనం చేయాలనటం ఆయన సంస్కర్త హృదయాన్నే చాటుతుంది. ఉత్తి అలంకారప్రాయమైన జంధ్యాన్ని ఆయన రద్దు చేశాడు.

మంత్రం లేని ఉపనయనం ఎలా చేయాలో సుశ్రుతుడు విధివిధానాలు సూచించాడు:

పంచాంగం చూసి తిథి వారనక్షత్రాల ప్రకారం మంచిరోజు ఎంచుకోవాలి. తూర్పు లేదా ఉత్తర దిక్కులో పరిశుద్ధ స్థలంలో హోమగుండం ఏర్పరచాలి. అలికి, దర్భలు పరిచి దేవతల్నీ విద్యావంతుల్నీ వైద్య ప్రముఖుల్ని పిలిచి గౌరవించాలి. ప్రతీ దైవాన్నీ, ప్రతీ ఋషినీ అశ్వనీ దేవతల్నీ భగవాన్ ధన్వంతరినీ భరద్వాజ, ఆత్రేయాది పూర్వ వైద్యుల్ని ఉద్దేశించి హోమం చేయాలి.

"తతో௨గ్నింత్రిః పరిణీ యాగ్నిసాక్షికం శిష్యం బ్రూయాత్" హోమానంతరం విద్యార్థులను అగ్ని చుట్టూ మూడు సార్లు ప్రదక్షిణం చేయించి, ఆ అగ్ని సాక్షిగా వాళ్లచేత ప్రమాణం చేయించాలి.

## విద్యార్థి చేయాల్సిన ఆ ప్రమాణాలు ఇవి:

"కామం, క్రోథం, లోభం, మోహం, అహంకారం, ఈర్ష్య, కఠినంగా మాట్లాడటం, చాడీలు చెప్పటం, అబద్ధాలాడటం, సోమరితనం, అపకీర్తికర పనులు వీటిన్నింటినీ వదిలేస్తాను. గోళ్ళు పెంచను, జులపాలు లేకుండా జుట్టు కత్తిరించి కొద్దిపాటిగానే ఉంచుకుంటాను. మనసు పరిశుద్ధంగా ఉంచుకుంటాను, మంచి నడవడితో లోకహితంగా ఉంటాను. విద్యార్థిగా ఉన్నంతకాలం కాషాయం బట్టలే కట్టుకుని, సకలవ్రత బ్రహ్మచర్యాన్ని పాటిస్తాను. గురువు చెప్పినట్టే ఆచరిస్తాను, గురువు అనుమతితోనే ఏ పనైనా చేస్తాను"

ఇలా విద్యార్థి చేత అగ్ని సాక్షిగా ప్రమాణం చేయిస్తాడు గురువు. భారతీయులకు 'అగ్నిసాక్షి' అనేది వెయ్యి ప్రామిసరీ నోట్ల కన్నా ఎక్కువ నమ్మకమైంది. దానికి తిరుగు లేదు. "ఒక వేళ ఈ ప్రతిజ్ఞను ఉల్లంఘిస్తే అధర్మాన్ని పొందుతాననీ, నేర్పిన విద్య ఫలించదనీ, కువైద్యుడిగా చెడ్డ పేరు వస్తుందని కూడా ఈ "అగ్ని'సాక్ష్యం"లోనే చెప్పిస్తాడు.

అల్లసాని పెద్దనగారి 'మనుచరిత్ర'లో 'ఉపనయన ప్రతిజ్ఞ' లేకుండా దొంగతనంగా వైద్యం నేర్చుకోవటానికి ప్రయత్నించిన ఇందీవరాక్షుడనే ఓ విద్యార్థి కథ ఉంది. అతను అవిధేయుడనీ, అయోగ్యుడనీ ఇందీవరాక్షుడికి వైద్యం నేర్పటానికి బ్రహ్మదత్తుడనే గురువు నిరాకరిస్తాడు. కానీ ఆ గురువు తన విద్యార్థులకు చెప్పే వైద్య పాఠాలు రహస్యంగా విని వైద్యం అంతా వచ్చేసిందనుకుంటాడీ ఇందీవరాక్షుడు. నువ్వు నేర్పక పోయినా నేను నేర్చుకున్నా నంటూ గురువుని వెక్కిరిస్తాడు. ఉపనయన ప్రతిజ్ఞలు లేకుండా వైద్యం నేర్పటం తప్పు కాబట్టి, గురువు అతన్ని బ్రహ్మరాక్షసుడివై పొమ్మని శపిస్తాడు. ఆ క్షణంలో అతన్ని ఒక భయంకర శక్తి ఆవహించినట్టు, తాను భూమ్యాకాశ పాతాళాల దాకా పెరిగిపోయిన భావన పొందినట్టు, లోకాల్ని కబళిస్తున్నట్టు, సముద్రాల్ని తాగేస్తున్నట్టు అన్పించిందని ఇందీవరాక్షుడు స్వారోచిషుడికి చెప్పినట్టు "అభ్రమండలి మోచునందాక నూరక/పెరిగినట్లొ మేను నరవరేణ్య" అనే పద్యంలో పెద్దనగారు వర్ణిస్తాడు.

వైద్యవిద్యార్థికి నిబద్ధత కావాలి, సోషల్ కమిట్‌మెంట్ అనేది ముఖ్యం. మతదృష్టిలోంచి ఇవతలకు వస్తేనే వైద్యం పరిపూర్ణంగా నిర్వహించ గలుగుతాడు. అందుకే, ఉపనయనం చేసి, ఆత్మన్యూనతా భావం లోంచి బయటకు తెచ్చి, సామాజిక బాధ్యతను ప్రతిజ్ఞ చేయించి వైద్యం నేర్పించాలన్నాడు సుశ్రుతుడు.

ఉపనయనం విద్యారంభానికి ప్రతీక అయితే, స్నాతకం విద్య ముగింపుకు ప్రతీక. ఈ యుగంలోనూ, అన్ని విద్యలూ నేర్చిన విద్యార్థులకు పట్టాలిచ్చే కార్యక్రమాన్ని ఇప్పుడు మన విశ్వవిద్యాలయాలు 'సుస్నాతకోత్సవం' అంటున్నారు. అన్ని మతాలవారూ ఈ స్నాతక వ్రత వేడుకలలో పాల్గొని, స్నాతకులౌతున్నారు కదా!. సుశ్రుతుడి పద్ధతిలో విద్యారంభ ఉపనయనాన్ని కూడా అలాంటి మతాతీతమైన అంశంగానే భావించాలి. స్నాతకానికి కులాల పట్టింపు లేనప్పుడు ఉపనయనానికి మాత్రం దేనికుండాలి? విద్యార్థి తాను తన చదువుని లోకహితానికే వినియోగిస్తాననే వాగ్దానం చేయటం ఒక మంచి సాంప్రదాయం.

తెలుగువారి పెళ్ళిళ్లలో మొదట స్నాతకం వేడుక జరుగుతుంది. స్నాతకం చేసి అప్పుడు 'పెళ్ళికొడుకు'ను చేస్తారు. పెళ్ళికొడుకు తాను కాశీకి పోయి చదువుకుంటానని మారాం చేయటం, కాబోయే బావమరది వచ్చి గడ్డం కింద బెల్లం ముక్క పెట్టి బ్రతిమాలు కోవటం ఇదంతా పెళ్ళికి ముందు జరిగే స్నాతకంలో వేడుకలా సాగే ఒక తంతు. కులాలతో నిమిత్తం లేకుండా స్నాతకాన్ని అందరూ పాటిస్తున్నారు. ఉపనయనాన్ని కూడా అలా కులాలతో నిమిత్తం లేకుండా లోకానికి ఉపయోగపడేలా చదువుకుని రాణిస్తాననే ఒక సంకల్పం చెప్పుకునేందుకు విద్యార్థికి అవకాశం ఇవ్వటం మంచిది.

ప్రతి విద్యాలయంలోనూ "విద్యార్థి ప్రతిజ్ఞా విధానాన్ని" ప్రవేశపెట్టటం అవసరం. దానికి ఉపనయనం అనే పేరు అభ్యంతరం అయితే సుశ్రుతుడే "ప్రతిజ్ఞ సూత్రం" అనే నామాంతరాన్ని సూచించాడు. మన విద్యా వ్యవస్థకు ప్రతిజ్ఞ సూత్రాల్లోని సూక్ష్మం అవగతమైతే మంచిదే!



# బౌద్ధయుగంలో సభాసంప్రదాయాలు

**న సా సభా యత్ర న సంతి వృద్ధాః న తే వృద్ధాయే న వదంతి ధర్మం**
**నాసౌ ధర్మో న సత్యమస్తి న తత్సత్యం యచ్ఛతే నాభ్యుపేతం**

(వృద్ధులు లేకపోతే అది సభ కాదు. ధర్మాన్ని చెప్పనివాళ్ళు వృద్ధులు కారు. సత్యం లేనిదే ధర్మమూ కాదు. లోకకళ్యాణానికి పనికిరానిది సత్యమూ కాదు. లోకకళ్యాణం కోరే సత్యాన్ని మాత్రమే ప్రబోధించే జ్ఞాన వృద్ధులు కూర్చున్నదే సభ అనిపించుకుంటుంది...)

మగధ రాజు అజాతశత్రువు బుద్ధుడికి సమకాలికుడు. ఆయన ఒకసారి వజ్రదేశం మీద దండయాత్రకు బయల్దేరాడు. ఆ విషయం చెప్పి, ఆశీస్సులు తీసుకోవలసిందిగా తన ప్రతినిధిని బుద్ధుడి దగ్గరకు పంపుతాడు. అప్పుడు బుద్ధుడు ఆనందుణ్ణి "వజ్రదేశీయులు క్రమం తప్పకుండా సభలు నిర్వహిస్తున్నారా?" అనడిగాడు. ఆనందుడు– 'తను విన్నంత వరకూ అవును' అని చెప్తాడు. "సజావుగా పౌరసభలు నిర్వహించే వారిపైన దాడి చేయరాదు. వీలైనంత మేర వారి అభివృద్ధికి పాటుపడాలి" అని బుద్ధుడు ఆ ప్రతినిధికి చెప్తాడు.

ఏ దేశంలో లేదా ఏ రాష్ట్రంలో లేదా ఏ గ్రామంలో చట్టసభలు సజావుగా నడుస్తాయో అక్కడ ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుందనే బుద్ధసందేశం ఈ కాలానికి మరీముఖ్యంగా వర్తిస్తుంది. సభా సాంప్రదాయాల నిర్వహణా విధానాలను ప్రపంచానికి చాటినవాడు బుద్ధుడు. ఆయన తొలుత బౌద్ధసంఘాల నిర్వహణకు ఈ నియమావళిని రూపొందించాడు. పంచాయితీస్థాయి సభలు, అసెంబ్లీలు, పార్లమెంటు సభల నిర్వహణక్కూడా ఇవే సూత్రాలు శిరోధార్యాలుగా కనిపిస్తాయి.

**సంథాగారం :** సభను నిర్వహించే సభాస్థలిని 'సంథాగారం' అంటారు. అది ఏదైనా బౌద్ధ ఆరామంలో కూడా జరగవచ్చు. సభాఏర్పాట్లు చేయటంలో చాలా అనుభవం కావాలి. ఎవరిని ఏ వరుసలో కూర్చోబెట్టాలో వారి వారి అధికారిక హోదాలననుసరించి (ప్రోటోకాల్) ఆసనాలు సర్దించి, ఆసీనుల్ని చేయటం పెద్ద పని!

**ఆసనపణ్ణాపక :** సభానిర్వహణలో శిక్షణ పొందిన నిపుణుడు. బుద్ధుడు సూచించిన ప్రకారం, సభలో ఈ ఆసనపణ్ణాపకుడిగా పనిచేసే వ్యక్తికి బౌద్ధభిక్షువుగా కనీసం 10 సంవత్సరాల అనుభవం ఉండాలి.

**ఆదసకమ్ నిసీదనమ్ :** బౌద్ధసంఘాల సభల్లో హాజరైన సభ్యులు కూర్చోవటానికి చాపలు, రగ్గులూ వగైరా (seating arrangements) ఏర్పాటుచేస్తారు. అదే చట్టసభలు లేదా రాజ్యసభల్లో అయితే ఉన్నతాసనాలుంటాయి.

**సమగ్గస :** ఒక బౌద్ధసంఘంలో సభ్యుల కనీస హాజరుని సమగ్గస (కోరం) అంటారు. ఆయా సమావేశాల ప్రాధాన్యతను బట్టి ఏ సమావేశానికి ఎంత కోరం ఉండాలో నిర్దేశిస్తారు. కోరం నియమాన్ని సభ విధిగా పాటించాలి.

బౌద్ధసంఘాల్లో కనీసం 10 మంది కోరంగా ఉండాలనేది నియమం. పదిమంది కూడా లేని సభలో చర్చించి, నిగ్గు తేల్చేది ఏముంటుంది? "పట్టుమని పదిమందికూడా లేరక్కడ" అనే తెలుగునానుడికి ఈ బౌద్ధ నియమం మూలం కావచ్చు.

కోరం పూర్తికాకుండానూ, నియమాలు పాటించకుండానూ మొక్కుబడిగా సభ జరిపితే ఆ సభ చేసిన తీర్మానాలు చెల్లనివౌతాయని బుద్ధుడు ప్రకటించాడు. నిర్దేశిత కాలం ప్రకారం క్రమం తప్పకుండా నిర్వహించాలి. బౌద్ధభిక్షువు తన కనీస బాధ్యతగా సభకు వెళ్ళాలి.

సభ్యుల కనీస హాజరులేని కారణంగా కొన్ని బౌద్ధసంఘాల గుర్తింపుని బుద్ధుడు రద్దు (cancellation of charter) చేశాడంటే ఈ కనీస సభ్యుల సంఖ్యకు (కోరం) బుద్ధుడు ఎంత ప్రాముఖ్యం ఇచ్చాడో అర్థం అవుతోంది.

మరీ దూర దూర ప్రాంతాలకు చెందినవారు సభ్యులుగా ఉన్నప్పుడు, వాటికి మాత్రం ఈ కోరం నియమాన్ని కొద్దిగా సడలించి, 10 నుండి 4 వరకు తగ్గించారు.

కానీ, కోరం తగ్గున్న కొద్దీ ఆ సభ ప్రాధాన్యత కూడా తగ్గిపోతుంది (మహావగ్గ 131.2).

తక్కువమంది చర్చల్లో పాల్గొన్నపుడు తీసుకునే నిర్ణయాలకు విలువ కూడా తక్కువగానే ఉంటుంది. కోరం కోసం

**చతుర్వర్గసంఘం :** సభ్యుల హాజరు (కోరం) నలుగురు సరిపోయే బౌద్ధసంఘాన్ని చతుర్వర్గసంఘం అంటారు. ఇలా ఐదుగురు సరిపోయే సంఘం, పదిమంది సరిపోయే సంఘం, ఇరవై ఇంకా ఆపైన సభ్యులు సరిపోయే సంఘాలని మహావగ్గ గ్రంథం బౌద్ధ సంఘాలను ఐదురకాలుగా వర్గీకరించింది.

ఎక్కువకోరం ఉండే సంస్థ నిర్వహించే సభలో మౌలిక విషయాలను రాజ్యాంగ విషయాలను ఇంకా అత్యంత ప్రాధాన్యత కలిగిన విషయాలను చర్చకు చేపట్టేందుకు వీలుంటుంది.

అత్యంత తక్కువ కోరం ఉన్న సంస్థ సాధారణ విషయాలకు పరిమితంగా సభను నిర్వహిస్తుంది. సామనేరులు అంటే కొత్తగా చేరిన పురుషభిక్షువులకు, భక్షుణిలు, శిఖ్కమానాలు (కొత్తగా చేరిన భిక్షుణిలు novices) వీరికి కోరం నియమంలో కొంత సడలింపు నిచ్చిన దాఖలాలు కూడా కనిపిస్తాయి.

సభామర్యాదల అంతర్జాతీయ ప్రామాణికగ్రంథం "Robert's Rule of Order" గ్రంథంలో కోరం (quorum) గురించి ఇలా ఉంది : "A Quorum is minimum number of Voting Members who must be present at a properly called meeting in order to conduct business in the name of the group" అని! 'కోరం' లేకపోతే, ఆ సభని కొద్దిసేపు వాయిదా వేసి సభ్యుల్ని రప్పించే ప్రయత్నం చేయాలని లేదా కోరం లేని సభలో తీసుకున్న నిర్ణయాలను తదుపరి సమావేశం పూర్తి కోరంతో జరిపి అందులో 'రాటిఫై (ratify) చేసుకోవాలని కొన్ని ఉపాయాలు ఈ గ్రంథంలో ఉన్నాయి.

కానీ, ఇలా ఆదరాబాదరా నిర్ణయాలు చేసి అంగీకరింపచేసుకోవటం ధర్మస్థాపనకు ఉపయోగపడేది కాదని, బుద్ధనీతిని పాటించటం మంచిదని బౌద్ధసంఘాల కోరం నియమం మనకు సూచిస్తోంది.

**నిర్ణయాల పునఃపరిశీలన :** ఒక సమావేశంలో కోరంలాంటి నియమాలను పాటించకుండా వగ్గనిర్ణయాలు (అనైతికరీతిలో అధర్మ నిర్ణయాలు) చేసినప్పుడు తదుపరి సభలో దాన్ని లేవనెత్తి ప్రశ్నించే అధికారం సభ్యులకు ఉంటుంది. అంటే రాటిఫై చేయకుండా నిలిపివేయవచ్చు.

**నూరుశాతం హాజరు :** అర్హులైన సభ్యులు పూర్తిస్థాయిలో హాజరైన సభని 'సమ్ముఖా' అంటారు. సభ చిన్నదైనా ఈ సభలో తీసుకునే నిర్ణయాలకు పవిత్రత ఎక్కువ ఉంటుంది.

**ప్రతిపాదనలు చేయటం :** ప్రతిపాదిత అంశాన్ని జ్ఞప్తి అంటారు. జ్ఞప్తిని సభ దృష్టికి తీసుకురావటాన్ని (ప్రతిపాదన చేయటం) (business that comes up with Motion) 'జ్ఞప్తిస్థాపనం' అన్నారు. ఆ తీర్మానంపైన చర్చ సాగడాన్ని జ్ఞప్తికర్మ అంటారు. చర్చ అనంతరం తీర్మానాన్ని పైకి అందరికీ బిగ్గరగా వినిపించేలా చదవటాన్ని అనుశ్రావణం అన్నారు. తీర్మానానికి ఉపయోగపడని ప్రసంగాలను చేయకుండా ఆపే అధికారం సభాపతికి ఉంటుంది. అలాంటి ప్రసంగాన్ని 'అనగ్ర' అన్నారు.

**మినిట్స్ రికార్డు చేయటం :** ఒక సమావేశం జరిగిన తీరు, తీర్మానాలను చర్చకు పెట్టిన తీరు, వాటిని ప్రవేశపెట్టిన వారి పేర్లు, తీర్మానం పూర్తి పాఠం, సభ్యుల అభిప్రాయాలు, తీర్మానానికి ఆమోదం వచ్చిందా లేదా లాంటి వివరాలను పొందుపరిచే ప్రత్యేక అధికారులు బౌద్ధసంఘాల్లో ఉండేవాళ్ళు.

**ఉత్తవచన :** చర్చకు వచ్చిన చర్చనీయాంశం ఉత్తవచన.

**పచ్చానుస్తిత వచన :** ఉత్తవచనాన్ని చర్చకు పెట్టిన విధానం (transactions) తెలిపేది పచ్చానుస్తిత వచన

**సమగ్రసభ :** సక్రమంగా జరిగిన సభను సమగ్ర (సమగ్గ అనీ, అసంపూర్తిగా జరిగిన సభని అసమగ్ర లేదా వగ్గ (వ్యగ్ర) అనీ పిలుస్తారు. తెలుగులో వగతెగటం అంటే సమస్య పరిష్కారం కావటం అనే నానుడికి ఈ "వగ్గ" శబ్దం మూలం కావచ్చు. చాలాకాలం తేలకుండా బాధిస్తున్న కోర్టు కేసులాంటి ఒక సమస్యని 'వగ్గ' లేదా 'వగ' అంటారు.

**'వ్యగ్రు'డు :** తొందరపాటుతనం కలవాడు.

**వగ్గకమ్మం :** కోరం లాంటి నియమాలను పట్టించుకోకుండా హడావిడిగా సభను జరిపించటం.

**అకమ్మం :** "అకమ్మం నచ కరణీయం" అనేది సూత్రం అకమ్మం అంటే అనాచరణీయం అని చేయకూడదని!

**కిచ్చయత (కర్తవ్యత) :** సంఘానికి సంబంధించి చేయవలసిన విధి విధానాలు.

**'కరణీయత' :** సంఘం రూపొందించుకున్న నియమావళి ప్రకారం సంఘం నెరవేర్చవలసిన బాధ్యతలు (obligation):

**ఆంక్ష (విప్పు) :** సభకు హాజరై తీరాలని ఆదేశించే అధికారం బౌద్ధసంఘాలకుంది.

సభ్యుల్లో అలసత్వం ఆవహించకుండా ఇది నిరోధిస్తుంది.

**అవలోకన కర్మ :** సభకు హాజరై తీరాలని ఆంక్ష (విప్పు) జారీ అయినప్పుడు, అనారోగ్యంలాంటి కారణాలతో సభకు రాలేని స్థితిలో ఉన్న ఒక సభ్యుడు ముందస్తు అనుమతి పొందటాన్ని 'అవలోకన కర్మ' అన్నారు.

**సభానిర్వహణ :** "సిమత్థకమ్ (సిమాస్థకమ్) సంఘం సోథెత్వా ఛ్ఛన్దరహానామ్ ఛ్ఛన్దమ్ ధరిత్వా సమగ్గస అనుమతీయ తిక్క్ 'హతుమ్ (త్రిక్రిత్వహ్) సావెతా కాతబ్బ కమ్మమ్" అని బుద్ధ ఘోషుడు 'సమన్త పాసాదిక' గ్రంథంలో వ్రాశాడు. దీన్ని ఉదహరిస్తూ, రాధా **కుముద్ ముఖర్జీ ఇలా అనువదించారు :** "This enumerates all the conditions for the validity of samgha proceedings such as 1. Its fullness of Quorum, (samaggasa), 2. Its composition including only members who were qualified members present or absent, 3. Collection of votes of all qualified members present or absent, 4. Consent of the samgha to the agenda, 5. The announcement of the business or motion for three times (trikrivah)" సభకు పూర్తికోరం (సమగ్గస) ఉండటం, అర్హులైన సభ్యులు హాజరయ్యేలా చూడటం, ఎన్నికలు సక్రమంగా జరపటం, చర్చనీయాంశాలకు ముందుగా సభ అనుమతి పొందటం, ప్రతిపాదనలను, తీర్మానాలను మూడుసార్లు ప్రకటించటం (త్రికృత్వా) ఈ పంచసూత్రాలు నాణ్యమైన సంఘానికి మూలమైనవిగా బుద్ధఘోషుడు పేర్కొన్నాడు.

**తీర్మానాల ప్రతిపాదన :** తీర్మాన ప్రతిపాదకుడు మొదట తను ఒక తీర్మానాన్ని ప్రతిపాదించదలచినట్టు ప్రకటిస్తాడు. ఈవిధంగా ప్రకటించటాన్ని జ్ఞప్తి అన్నారు. తీర్మానానికి నోటీసు ఇవ్వటం జ్ఞప్తి. ఈ జ్ఞప్తిని సభ ఆమోదించవచ్చు లేదా తిరస్కరించవచ్చు.

**'జ్ఞప్తిపేతవ్య' :** "దయచేసి గౌరవసభ్యులు నిశ్శబ్దంగా వినండి (Your attention please) అనటాన్ని 'జ్ఞప్తిపేతవ్య' అంటారు.

**ప్రాపత్కాల :** సభ తీర్మానం ఆమోదించటానికి సిద్ధంగా ఉండటాన్ని 'ప్రాపత్కాల' అంటారు.

**"ఏషాజ్ఞప్తి" :** తీర్మానం చర్చకు వచ్చిందనటాన్ని ఏషాజ్ఞప్తి అంటారు.

**జ్ఞప్తి :** తీర్మానాన్ని ప్రవేశపెట్టటం.

**ద్వంద్వ :** వైరి పక్షం.

**వ్యుత్రమణం :** వైరుధ్యం.

**సంఘతిథ :** ఎవరి రాకతో కోరం పూర్తవుతోందో ఆ సభ్యుడు.

**గణపూరక :** "Whip" జారీచేయటం.

**ఉపసంపద :** రాజ్యోత్సవం.

**ఞట్టి (natti):** సభలో ప్రశ్న వేయటం.

**సంఘగణ :** ప్రభుత్వం ఏర్పాటుచేయటం.

**సభా నిర్వహణ :** సభలో విషయం చర్చకు వచ్చినప్పుడు మాట్లాడే అవకాశం వచ్చిన వ్యక్తి తప్పనిసరిగా మాట్లాడాలి. ఏమీ మాట్లాడని వ్యక్తి ఆ విషయాన్ని అంగీకరించినట్టుగా భావించబడ్తుంది. సభాపతి తీర్మానాన్ని పైకి ఇలా చదవాలి : "సభ్యులారా! దయచేసి వినండి. ఫలాన భిక్షువు ఈ తీర్మానాన్ని ప్రతిపాదిస్తున్నాడు. దీనికి సభామోదాన్ని (ordination) కోర్తున్నాడు. దానిని చర్చకు స్వీకరించటానికి ఈ సభ సిద్ధంగా ఉన్నదా...?" అని సభాపతి చర్చ ప్రారంభించటానికి సభ అనుమతి కోరతాడు.

**భాషేత్ :** సభ్యులు ఒక్కరినే మాట్లాడించేందుకు అనుమతించటం. "సభ్యులారా! ఈ తీర్మానానికి ఆమోదం తెలిపేవారు దయచేసి మౌనంగా ఉండమంటూ, వ్యతిరేకంగా ఉన్నవారిలో ఒక్కొరొక్కరినే పిలిచి మాట్లాడమని కోరటం బాసేత్.

**తీర్మానాన్ని ప్రవేశపెట్టే పద్ధతి :** సభాపతి బిగ్గరగా ఉచ్ఛైస్వరంతో "మొదటిసారి చదువుతున్నాను-ఏతర్థమ్ వదామ్" అంటూ తీర్మానాన్ని చదువుతాడు. "రెండవసారి చదువుతున్నాను" (జ్ఞప్తి ద్వితీయం). మూడోసారి చదువుతున్నాను జ్ఞప్తి తృతీయం అంటూ మూడుసార్లు సభాపతి తీర్మానాన్ని చదివితీరాలి.

**త్రికృత్వా :** సభా నిర్వహణలో ఇది ఒక నియమం. దీని ప్రకారం సభలో ఏ అంశాన్నైనా మూడుసార్లు చదవాల్సిందే! (తృతీయామపి అర్థమ్వదామ్) ఇప్పటిలాగా మైకులు, జిరాక్స్ మెషీన్లు, కార్బన్ కాయితాలు లేవు కాబట్టి, తీర్మానం కాపీలు సభ్యుల చేతుల్లో ఉండవు కాబట్టి, మూడుసార్లు అందరికీ వినపడేలాగా బిగ్గరగా చదవటం తప్పనిసరి. 'ముచ్చటగా మూడోసారి' అనే తెలుగు పలుకుబడికి మూలం ఈ బౌద్ధ సభా విధానంలో ఉంది.

మూడుసార్లూ ప్రకటించిన తరువాత సభలో ఎవరూ వ్యతిరేకంగా మాట్లాడకపోతే ఆ సభ "క్షమతి సంఘస్య తస్మాత్తుష్ణిమ్ ఏవమ్ ఏతమ్ ధారయామితి" అని ఆ తీర్మానం సభామోదం పొందినట్టుగా భావిస్తారు.

**సంఘకర్మ :** ఆమోదించబడిన తీర్మానం "సంఘకర్మ" (an act of Sangha) అవుతుంది.

**కర్మవచా :** తీర్మాన పాఠం, అందులో వాడిన ప్రతి పదమూ "కర్మవచా" అవుతుంది. సర్వసమ్మత అందరి సంతృప్తితో, ఇది ఆమోదించబడిందని ప్రకటిస్తాడు సభాపతి.

**తీర్మానానికి వ్యతిరేకత :** సభ అసలు ప్రయోజనం ఏకాభిప్రాయం సాధన. ఎక్కడిదాకానో ఎందుకు, మనలో మనం మాట్లాడుకునేప్పుడే ఒక విషయం గురించి నలుగురూ నాలుగురకాల అభిప్రాయాలు చెప్పారనుకోండి...

**పరమావధి చర్చ :** ఏదైనా వివాదం ఏర్పడినప్పుడు 'ఒకసారి కూర్చుని నింపాదిగా చర్చిద్దాం' అంటాం. అలా కూర్చోవటమే సభ తీరటం. దాని పరమావధి చర్చ. చర్చల అంతిమలక్ష్యం ఏకాభిప్రాయ సాధన. బుద్ధుడు సభకు అందుకే అంత ప్రాముఖ్యత ఇచ్చాడు. ఇలాంటి చర్చ సంఘంలో చీలికను, గ్రూపిజాన్ని, ముఠాతత్వాన్నీ నివారిస్తుంది. అందుకని దీన్ని పరమావధి చర్చ అంటారు.

**తినవత్థారక :** ఏకాభిప్రాయసాధన కోసం చేసే ప్రయత్నం "తినవత్థారక". ఈ కార్యాన్ని చిత్తశుద్ధితో సంఘ భవిష్యత్తు దృష్టిలో పెట్టుకుని చేయాల్సి ఉంటుంది. గతుకు నేలల్ని గడ్డితో కప్పి సమం చేయటం లాంటిది తినవత్థారక అంటే ! సభ అనేది మేధావుల కూటమి కాబట్టి ఏకాభిప్రాయం అనేది సాధారణంగా ఉండదు. సభలో ప్రతి సభ్యుడూ చర్చలో పాల్గొనాల్సిందే! చర్చ నడిచే అంశం మీద ప్రతీ సభ్యుడికీ అవగాహన, అనుభవం, పరిశీలన, దార్శనికత ఉన్నప్పుడే ఆ చర్చకు సార్థకత !

**భండనం :** సభలో ఒక్కోసారి ఆగ్రహం కట్టలు తెంచుకు రావటం కూడా జరగొచ్చు. కలహాలూ ఏర్పడవచ్చు. వివాదాలూ కలగవచ్చు. చివరకి కథ సుఖాంతం కాకపోవచ్చు కూడా! ఆమోదం లేదా తిరస్కారాలలో ఏది జరిగినా ఏకాభిప్రాయంతోనే జరగాలి. చర్చకు వచ్చిన ప్రతిపాదన మీద వర్గాలుగా విడిపోయి, అది చివరికి సంఘంలో చీలికకు దారితీస్తే సభాపతి చొరవ తీసుకోవాలి. వివాద పడిన వర్గాలవాళ్ళు తమతమ ప్రతినిధుల్ని ఎంపికచేసుకోవాలి. ఆ వివిధ వర్గాల నాయకులతోనూ మాట్లాడి ఒక సమన్వయాన్ని సాధించే ప్రయత్నం చేస్తాడు. అందుకోసం ఏర్పరచే ప్రత్యేక సమావేశం కూడా అధికారికంగా సభామోదంతో నిర్ణయించబడాలి. అలా వివిధ గ్రూపులవాళ్ళూ కలిసి ఏకాభిప్రాయానికి వస్తే అది మళ్ళీ బౌద్ధ సంఘం ముందుకు చర్చకు రావాలి. సభామోదం పొందితే అది తీర్మానం అవుతుంది. ఒక్కోసారి ఈ బౌద్ధసంఘంలో తేలని విషయం అయినప్పుడు ఇంతకన్నా ఎక్కువ కోరం ఉన్న పెద్దసంఘానికి దీన్ని తీసుకువెళ్ళి అక్కడ చర్చకు పెట్టవచ్చు.

**ఉబ్బాహికాయ :** అప్పటికీ ఏకాభిప్రాయం కుదరకపోతే ఏంచేయాలి...? సభ్యులతో చర్చించేందుకు ఒక సెలెక్ట్ కమిటీని నియమిస్తారు. ఉబ్బాహికాయ అన్నారు దీన్ని ! సంఘం సాధారణ సభ (జెనరల్ బోడీ) అనుమతితో (సమ్మత) ఈ కమిటీ ఏర్పడుతుంది. శీల, ఆచార, బహుశ్రుత, సూత్రధార సూత్ర సన్నిచయ, వినయ సంపన్న (వినయ సూత్రాలలో నిష్ణాతుడు) గుణాలున్న వ్యక్తులను ఈ కమిటీలోకి తీసుకుంటారు. ఇది ఎప్పుడు కావాలని అనుకుంటే అప్పుడు సమావేశం అవుతుంది.

**వాలికా ఆరామ :** ఆహ్లాదకరమైన ప్రాంతంలో సమావేశాలు జరగాలి. అలాంటి ప్రాంతాన్ని వాలికా ఆరామ అంటారు.

**పూప సమేతుమ్ :** వివాదాన్ని పరిష్కరించటమే ధ్యేయంగా ఉబ్బాహికాయ (సెలెక్ట్ కమిటీ) పనిచేస్తుంది. ఉబ్బాహికాయలో సభ్యులు ఖచ్చితంగా తటస్థులై ఉండాలి. వీళ్ళు సభ్యులందరినీ కలిసి విషయాలు చర్చించటం పూపసమేతుమ్.

**ఉద్వాహక సభ :** సెలెక్ట్ కమిటీ జరిపే సభని 'ఉద్వాహక సభ' అంటారు. ఈ కమిటీ నిర్ణయం అందరికీ శిరోధార్యం.

**ఉత్కోతయతి :** ఎవరైనా కమిటీ నిర్ణయాన్ని ప్రశ్నించటాన్ని ఉత్కోతయతి అంటారు. అది శిక్షార్హనేరం అవుతుంది.

**ఛ్ఛందదాయకో :** ప్రశ్నించటానికి వీల్లేని తీర్పుని ఛ్ఛందదాయకో అన్నారు.

సమ్ముఖవినోయపద్ధతి : సంబంధిత వర్గాలను కూర్చోబెట్టి మాట్లాడి ఒప్పించే ప్రయత్నం (Proceeding in presence)

**కర్మాపన్న :** సంఘంలో అర్హులైన సభ్యులందరినీ కూర్చోబెట్టి మాట్లాడటం.

యద్భూయ శికాక్రియ : ఎటూ తేలని పరిస్థితుల్లో సంఘం పూర్తిస్థాయి సమావేశానికి పిలుపునిచ్చి ఓటింగుకు పెట్టడం ఒక పరిష్కారం. సగానికన్నా ఎక్కువమంది చేసిన నిర్ణయాన్ని శిరసావహించటం అని దీని భావం.

**సలాక :** "ఇదమ్ పథమమ్ సలాకమ్ నిఖిపామి" అంటూ కమిటీలో సభ్యులు రంగుల చెక్కముక్కలు (శలాక) ద్వారా తమ అభిప్రాయాన్ని రికార్డ్ చేస్తారు. ఓటు వేసేందుకు బ్యాలెట్ పేపరులా వాడేందుకు ఎరుపు ఆకుపచ్చ రంగుల చెక్కముక్కల్ని ( sticks-శలాక)బ్యాలెటింగ్‌కి ఉపయోగించేవారు అవునన్నవారు ఆకుపచ్చ చెక్కపుల్లని, కాదన్నవారు ఎర్రపుల్లనీ బ్యాలెట్ పెట్టెలో వేసేవారు వాటిని లెక్కించి గెలుపు ఓటములు నిర్ణయించేవారు.

**సలాకాగ్రాహాపకుడు :** ఎన్నికల అధికారి. ఆయన ఓటింగ్ ప్రక్రియని నిర్వహిస్తాడు. చ్ఛంద (నిష్పాక్షికదృష్టితో), దోషభయంతో కాకుండా స్థిరంగా, నిష్పక్షపాతంగా ఉండే వ్యక్తిని ఇందుకు నిర్ణయిస్తారు.

**చ్ఛంద :** అంటే స్వచ్ఛందంగా, స్వేచ్ఛగా ఓటు వేయటం.

**గూఠక :** రహస్య బ్యాలెట్ విధానంలో ఓటింగ్.

**సంకర్ణ జపకం :** ఇతరులకు వినిపించకుండా పోలింగ్ అధికారికి గానీ, సభాపతికిగానీ చెవిలో చెప్పటం

**వివటకం :** బహిరంగ ఓటింగ్

**అధర్మ :** రహస్య బ్యాలెట్ పద్ధతిలో పోలైన ఓట్లను శలాకాగ్రాహాపకుడు రహస్యంగా లెక్కిస్తాడు. ఓటింగ్ ప్రక్రియ సక్రమంగా జరగకపోతే అది 'అధర్మ'గా భావించి ఆ ఓటింగ్‌ని రద్దుచేసే అధికారం శలాకాగ్రాహకుడికి ఉంది.

**ధమ్మేన సమగ్గకర్మ :** నియమబద్ధంగా తీసుకున్న ధర్మనిర్ణయం.

ఈ సభామర్యాదల్నీ, సభాసాంప్రదాయాల్నీ, సభాగౌరవాన్నీ ఎంతో నాగరికతను సంతరించుకున్న మానవుడు అంతర్జాతీయంగా ఈనాటికీ అనుసరిస్తున్నాడు. బౌద్ధయుగంలో మేధావులు ప్రజాస్వామ్యానికి నాటిన బీజాలవి. సభలో కోరం ఆవశ్యకతని తొలిసారిగా చెప్పి కఠినంగా అమలు చేసినవాడు బుద్ధుడు. కోరంలేని సభను disqualify చేసినవాడు బుద్ధుడు. 'కోరం' అనే విధానానికి 'బుద్ధుడి పేరు పెట్టడం సమంజసం. సభకు జ్ఞానం, సత్యం, నిబద్ధత, నిజాయితీ అనేవి పర్యాయపదాలైతే, బుద్ధుడికి సభ అనేదే పర్యాయపదం అవుతుంది.

బుద్ధం అంటే గుర్తింపుపొందిన (రిజిష్టర్డ్) బౌద్ధసంఘాలలో ప్రసిద్ధుడైన బుద్ధభిక్షువు, జ్ఞాని అని! ధర్మం అంటే అలాంటి బుద్ధులు చర్చించి నిగ్గు తేల్చిన లోకకల్యాణ కారక నిర్ణయం అని! సంఘం అంటే అర్హత కలిగిన బౌద్ధభిక్షువుల సభ అని! బుద్ధం శరణం గచ్ఛామి/ ధర్మం శరణం గచ్ఛామి/సంఘంశరణం గచ్ఛామి అంటూ బుద్ధుడు చేసిన మార్గోపదేశం కేవలం బౌద్ధానికి పరిమితమైన అంశంకాదు, ఏ సంఘానికైనా, ఏ ధర్మానికైనా ఏ జ్ఞానికైనా వర్తించే విషయం. పంచాయితీలనుండి పార్లమెంటుదాకా అందరికీ వర్తించే సభా విధానాల సమాహారం ఇది. సభను కాపాడండి... సభమనల్ని కాపాడుతుంది అనే ఒక భావన ఈ విధాన రూపకల్పనలో మనకు స్పష్టంగా కనిపిస్తుంది.

# వైదికుల పరిభాష

వైదికాన్ని వృత్తిగా తీసుకున్న వ్యక్తులు తమలో తాము మాట్లాడుకోవటానికి, ఇతరులకు అర్థం కాకుండా ఉండటానికీ, తమకై తాము రూపొందించుకున్న పారిభాషిక పదాలు - కొన్ని ఇతరుల నోళ్ళలోనూ చేరి బాగా నాని, కొత్త తెలుగు పదాలుగా రూపొందించుకొన్నవి వున్నాయి. వాటిలో కొన్ని వైదిక మాండలికాలుగా మారినవి కూడా వున్నాయి. ఆ వైనాన్ని వివరించటం ఈ వ్యాసం ధ్యేయం. ఇటువంటి 'చాటుమాటలు' వ్యాపారపరంగా వైశ్యుల మాండలిక పరిభాషలో కూడా దొరుకుతాయి. అది ప్రత్యేకమైన పరిశోధనాంశం.

## 'యద్దేవా'

వైదికుల పరిభాషలో పుట్టి, మాండలికంగా మారి, ఇతరులు కూడా వాడటం మొదలుపెట్టడంతో సాధారణ తెలుగు పదంగా రూపొందిన వాటిలో "యద్దేవా" ఒకటి. 'హేళన' అనే అర్థంలో ఈ పదాన్ని అందరూ వాడుతున్నారు. దీన్ని సృష్టించింది వైదిక బ్రాహ్మణులే!

"యద్దేవా దేవహేళనమ్ -" అని మంత్రవాక్యం. ఈ మూడు పదాల వాక్యంలో 'యద్దేవా' తర్వాత దేవ, హేళనం అనే పదాలు వస్తున్నాయి. మధ్యలో "దేవ" అడ్డుగా వున్నా, యద్దేవా పదంతో హేళనం అనే పదాన్ని అర్థ విపర్యయం చెందించారు వైదికులు. 'యద్దేవా' అనగానే ఆ మంత్రం వచ్చినవాళ్ళకి దాని తర్వాత పదాలు దేవ, హేళన గుర్తుకొస్తాయి. ఎవరినైనా బైటవాడిని హేళన చేయదానికి ఉద్దేశించినపుడు 'యద్దేవా' అనగానే విషయం అవతలివాడికి అర్థం అయిపోతుంది. ఆ మంత్రం, దానిలోని ఈ

రహస్యమూ తెలియని వ్యక్తికి మాత్రం అర్థం కాకుండా వుండేందుకు వైదికులు ఈ రహస్య విధానాన్ని "సంజ్ఞ' (Code) పద్ధతిలో పెట్టుకున్నారు. తమలో తాము మాట్లాడుకునే పరిభాష ఇది.

హాస్య సంభాషణలకు సంబంధించి ఆంగ్లసాహిత్యంలో "యూఫమిజం" అని ఒక ప్రక్రియ ఉంది. ఒక కఠినమైన, బాధ కలిగించే పదాన్ని వాడవలసి వచ్చినప్పుడు దానికి బదులుగా, తేలికపాటి పదాన్నీ, సాధ్యమైనంత తక్కువ వ్యతిరేకభావం కలిగిన పదాన్నీ ఉపయోగించటం "యూఫమిజం"

ఇక్కడ ఇదే పద్ధతిని వైదికులు అనుసరించారు. వారు ఆశించిన ప్రయోజనాలివి:

1. తాము తిట్టదలచిన వ్యక్తిని కసితీరా తిట్టవచ్చు. ఎంత తిట్టినా ఆ వ్యక్తి వలన ఎలాంటి ప్రమాదమూ కలుగదు.
2. ఆ తిట్లలో ఒక్కటి కూడా తిట్టించుకున్న వ్యక్తికి అర్థం కాదు. అసలు తిట్టినట్టే తెలియదా వ్యక్తికి.
3. వినేవాళ్ళు కూడా తమ వాళ్ళయితే విని సంతోషిస్తారు. తమవాళ్ళు కాకపోతే ఎటువంటి ప్రమాదమూ ఉండదు. అర్థం కాదు కాబట్టి.

ఇలా తెలుగునాట, ముఖ్యంగా కృష్ణా, గుంటూరు, గోదావరి మండలాలలోని వైదికులు "యూఫమిజం" ప్రయోగాలు చాలా చేశారు. వాటిలో హేళన అనే అర్థంలో పుట్టి, వైదికేతరులైన ప్రజల భాషల్లోకి చేరిపోయింది ఈ "యద్దేవా".

వెధవ, త్రాష్టుడు, ఉద్వాసన, దేభ్యం - ఇలాంటి పదాలు వైదిక పరిభాషలో చాటుమాటలుగా పుట్టాయి. వాటికి నిఘంటువుల్లో అర్థాలు వెదకటం, సంస్కృత ఉత్పత్తి అర్థాలు సాధించాలని ప్రయత్నించటం అనవసరం.

## వెధవ

లోక సామాన్యంలో 'విధవ' వెధవ అయ్యింది. "ఆవిడకేమండీ... ఇంద్రాణి" అని ముఖాన పొగిడితే పాపం ఆ యిల్లాలు మురిసిపోతుంది- ఇంద్రుడి భార్యతో పోల్చాడని. కానీ, అంతరార్థం వేరు. "ఇంద్రాణీవా విధవా..." అని తైత్తిరీయంలో ఒక మంత్రం. "ఇంద్రుడి భార్య ఎన్నటికీ విధవ కాదు - ఇంద్రుడికి అపజయం లేదు-" అనే అర్థంలో

ఆ మంత్రం సాగుతుంది. అవన్నీ ఈ వైదిక పరిభాషకు అనవసరం. "ఇంద్రాణీ విధవా" మంత్రవాక్యంలో ఇంద్రాణి తర్వాత 'విధవ' అనే పదాన్ని తెచ్చి అర్థ విపర్యయం సాధించారు. "ఆవిడకేమండి... ఇంద్రాణి" అంటే ఆవిడ్ని "వెధవ ముం... అని తిట్టాడన్న మాట! ఈ విధవ 'వెధవ'గా మారి మగాళ్ళు కూడా ఇదే తిట్టుతిన్నారు. బ్రౌన్ నిఘంటువులో ఇంద్రాణి అనే పదానికి "Name of the wife of Indra, A sart of bracelet, a brahmin widow - Enugula 28 July, 1830" అని వుంది. ఇంద్రాణి అనే పదానికి బ్రాహ్మణ విధవ అనే వైదిక పరిభాషాపరమైన అర్థాన్ని ఏనుగుల వీరస్వామిగారు చెప్పారట. దీన్నిబట్టి ఈ తిట్లు బ్రాహ్మణేతర కులాలవాళ్లని తిట్టడానికి వుద్దేశించలేదని కూడా తెలుస్తోంది.

## త్రాష్టుడు :

ఈ పదాన్ని బ్రాహ్మణులే ఎక్కువగా ఉపయోగించినా జనసామాన్యంలో కూడా వ్యవహారంలో ఉంది. తిట్టాడని ఇప్పుడు అందరికీ తెలుస్తోంది. అంటే 'చాటు' ఏ మాత్రం లేదన్నమాట! కన్యాశుల్కంలో కరటకశాస్తుర్లు అగ్నిహోత్రావధానుల్ని త్వాష్ట శబ్దం ప్రయోగించి తిడతాడు.

"త్వాష్ట్రాః పశవః" అంటూ ఓ మంత్రం సాగుతుంది. "త్వష్టుడు" ఋగ్వేదంలో దేవతలకు రథాలు తయారుచేసి యిచ్చే శిల్పిగా కన్పిస్తాడు. అలాగే ఇంద్రుడికి శత్రువుగా కూడా కన్పిస్తాడు. వృత్రాసురుడు, త్వష్టుడు, పణులు వీళ్ళంతా ఇంద్ర శత్రువులు. ఈ మంత్రంలో 'పశవ' పదాన్ని త్వాష్టతో చేర్చి త్వాష్ట్ర అంటే పశువులాంటి వాడనే అర్థాన్ని వైదిక పరిభాష సాధించింది. త్వాష్ట్ర పదం లౌకిక వ్యవహారంలో త్రాష్టుడుగా మారింది. 'మలపత్రాష్టుడు' అంటే నీచాతినీచుడు అని అర్థంలోకి మారింది.

## ఉద్వాసన :

"వాడికి ఉద్వాసన చెప్పేశారు" అంటే, పనిలోంచి తొలగించారని! వెళ్ళగొట్టారని!

దేవతలను మొదట గౌరవంగా ఆహ్వానిస్తారు. ఆవాహన చేస్తారు. అర్చించుకుంటారు. తర్వాత గౌరవంగా వాళ్ళకి వీడ్కోలు పలుకుతారు.

సముఖం వేంకట కృష్ణప్పనాయకుడు అహల్యా సంక్రందనంలో ధైర్యం ఉద్వాసితమైందంటాడు. ఒక గొప్ప ప్రయోగం ఇది! వైదికేతరులు కూడా దీన్ని బాగా వాడటంతో ఇందులో "చాటు" ఉద్వాసితమయ్యింది! ఇప్పుడు అందరూ ఉద్వాసన చెప్తున్నారు – వదిలించుకోవటం అనే అర్థంలో!

## దేభ్యం :

వైదిక సాంకేతిక పదాలలో పుట్టిన ఒక చమత్కారం ఈ పదం. "తేభ్యశ్చాయం పిండః" అని తద్దినం మంత్రాలలో ఒక మంత్రం. "ఈ పిండం మీకోసమే! పితృదేవతల్లారా!" అని ఆహ్వానించటం బహుశా ఈ మంత్ర ప్రయోజనం కావచ్చు.

వైదిక పరిభాషలో ఇవతలి అర్థాన్ని అవతలి పదం మీదకి ప్రయోగించటాన్ని మనం గమనించాం. "నీ పిండం పిల్లులకు పెట్టా" అనేది బ్రాహ్మణుల్లో ఒక తిట్టు. బ్రాహ్మణులు కుక్కని నీచజంతువు అని పెంచుకోవడానికి ఇష్టపడరు. కానీ పిల్లుల్ని మాత్రం ఇంట్లో తిరగడానికి అంగీకరిస్తారు. ఎలుకల బారినుండి రక్షించుకోవటం కోసం కావచ్చు! ఇంట్లో తద్దినంరోజున పొరబాటున ఏ ఆహారపదార్థం అయినా పిల్లి ముట్టిందంటే, ఆ పూట తద్దినం రద్దయినట్టే! అందుకని తద్దినం పెట్టబోయే రోజుని పిల్లిని పట్టి కట్టేసేవారు. ఇదొక ఆచారంగా మారింది. కట్టేయటానికి పిల్లి దొరక్కపోతే తద్దినమే పెట్టలేనంత మూఢాచారంగా మారిపోయింది. "ఏరా! మీ నాన్న తద్దినం పెట్టావుట్రా అనడిగితే - "లేదండీ! పిల్లి దొరకలేదు" అని కొంటెగా సమాధానం చెప్పాడట ఒకడు.

"పిల్లి" పిండం ముట్టితే, తద్దినం రద్దు అవుతుంది కాబట్టి, నీ పిండం పిల్లులకు పెట్టా" అని తిట్టడం ద్వారా నీకు పరలోకాల్లో కూడా, తిండి దొరక కుండుగాక అని శపిస్తున్నారన్నమాట! 'పిండం' అనేది ఇక్కడ తిట్టుగా మారింది. "తేభ్య అయం పిండః" అనే మంత్రంతో 'పిండం' అనే తిట్టు "తేభ్యః" మీద చేరి, "తేభ్యం" అని తిట్టుగా మిగిలింది. తేభ్యం "దేభ్యం"గా లోక వ్యవహారంలో మారింది. "దేబె" అని తెలుగు తిట్టు పదానికి దేవురుగొట్టు, బికారి అనే అర్థాలున్నాయి. దేబెకీ, దేభ్యానికి ఏమైనా సంబంధం ఉందేమో పండితులు నిర్ణయించాలి!

## "ఉచిత భోజనం"

ఆ పూట భోజనం ఉచితంగా దొరుకుతుందేమోనని ఎదురు చూస్తున్నాడు ఒక బ్రాహ్మణుడు. "వయం దేవస్య భోజనం" అంటూ ఒక మంత్రం సాగుతుంది. ఈ మంత్రంలోని మూడు పదాల్లో 'భోజనం' ఇక్కడ ముఖ్యమైన పదం. 'వయం దేవస్య' అనగానే తర్వాతి పదం భోజనం ఆ మంత్రం వచ్చిన వాళ్ళందరికి స్ఫురిస్తుంది. అందుకని, తెలిసినాయన ఎక్కడినుంచో వస్తుంటే "వయం దేవస్య- ఎక్కడ?" అని అడిగాడు. దానికి

ఆ పెద్దమనిషి "దేవావై"లో అని జవాబిచ్చాడు. "దేవావై సత్రమానత" అనే మంత్రంలో దేవావై అనగానే 'సత్రం' అనే పదం గుర్తుకొస్తుంది. అదే సమాధానంగా చెప్పాడు.

సత్రంలో భోజనం దొరుకుతుంది అనేది ఈ సమాధానంలో రూఢి అయింది. ఇంకో అడుగు ముందుకు వేసి "తేజోవా వుందా?" అనడిగాడు. "తేజోవా ఆజ్యం" అని మంత్రం, అంటే "నెయ్యి వేసి పెడతారా?" అని! సుష్టుగా పెడ్తున్నారా అని అడగటం అంతరార్థం.

"ప్రక్రాంతమయ్యా" అనేది దీనికి రెండోఆయన ఇచ్చిన జవాబు, "ప్రక్రాంతం శ్రాద్ధకర్మ కారిష్యే" అనేది శ్రాద్ధకర్మల్లో మంత్రవాక్యం "ప్రక్రాంతం" అనడం ద్వారా అది తద్దినం భోజనం అని చెప్పాడు. అంటే షడ్రసోపేతంగా గారెలు పరవాణ్ణాలతో సుష్టుగా ఉంటుందనే! ఆ తర్వాత "యత్తే అగ్నే" అంటూ గుండె పగిలిపోయే విషయం చెప్పాడు ఆవాహన చేసిన దేవతలకు 'ఉద్వాసన' చెప్పేటప్పుడు "యత్తే అగ్నే తేజస్తే నాహం తేజస్వీ భూయాసం..." అంటూ మంత్రం చదువుతారు. ఇక్కడ "యత్తే అగ్నే" అనడం ద్వారా ఉద్వాసన చెప్పేశారు. భోజనాల సెక్షన్ మూసేశారు. ఇప్పుడు వెళ్ళినా ప్రయోజనం లేదని సంకేత భాషలో చెప్పాడన్నమాట! పాపం నిరాశగా వెనుదిరిగాడు మొదటాయన.

ఇలాంటిదే, "సత్యం త్వర్తేన ఎక్కడ?" అనే మరో సంకేత వాక్యం కూడా ఉంది. భోజనం చేయబోయే ముందు ఆచమన సమయంలో వాడే పదం "సత్యంత్వర్తేన" అనగానే ఎవరికైనా భోజనం గుర్తుకొస్తుంది.

## "లేదు పొమ్మన్నారు"

ఏమైనా ఇస్తారేమోనని ఆశపడ్డాడు ఒక బ్రాహ్మణుడు. "ఇచ్చారా" అనడిగాడు మిత్రుడు. "రమ్మన్నారు. 'ఏతత్సామగాయనం' చెప్పారు" అన్నాడతను. "ఏతత్సామగాయనం నాస్తి'' అనే మంత్రంలో రెండోపదం 'నాస్తి 'మొదటి పదాన్ని ఆక్రమించింది. 'ఏతత్సామగాయనం' అంటే "లేదుపో" అనే అర్థం అవతలివాడికి తెలిసింది! ఆ మంత్రం తెలియని వాళ్లకి ఈ సంభాషణ ఏమీ అర్థం కాదు.

## కరణాన్ని తిట్టటం

బ్రాహ్మణుల్లో వైదీకి, నియోగి శాఖాభేదాలు ఒకప్పుడు చాలా తీవ్రంగా ఉండేవి. తిరుపతి వేంకట కవులు, కొప్పరపు కవుల విరోధం గురించి పండితులందరికీ తెలుసు. నియోగుల్లో కొందరు వైదికవృత్తిని స్వీకరించిన వారున్నారు. నియోగులు మౌలికంగా

లౌకికులు. రాజోద్యోగులుగా మెలిగినవాళ్ళే మొదటినించీ! కరణాలుగా రాణించారు. "ఆ నియోగపోడు" అని తిట్టాలంటే ఎదురుపడి అనలేక "యోగశ్చ" అంటారు. ఆ "యోగశ్చ" ఏమంటాడు? అనడుగుతాడో వైదీకి. "యోగశ్చ కరణం చైవ సర్వం విష్ణుమయం జగత్" అని తద్దినం మంత్రంలో వస్తుంది. 'యోగశ్చ' అనగానే 'కరణం' స్ఫురిస్తాడు! కరణం అంటే నియోగి బ్రాహ్మణుడు.

ఇలాగే "మరుద్భ్యో వైశ్యం" అనే మంత్రంలో వైశ్యుని సూచించటానికి "మరుద్భ్యః" అంటారన్నమాట! చాటుమాటలు ఇలా ఉంటాయి.

## "యంబ్రహ్మ"

వాడొట్టి స్తబ్ధుడు, చలిమిడి సుద్ద, దేనికీ పనికిరాడు, వాడికి పిల్లనివ్వటం దానిగొంతు కొయ్యటమే అని చెప్పాలి. ఆ సంగతి ఇతరులకు అర్థం కాకూడదు. ఎలా? "ఆయన యంబ్రహ్మ గారండీ బాబూ!" అన్నాడు.

వేదాంతులంటే పడకకుర్చీ మేధావులనే అభిప్రాయం చాలామందికుంది. వైదికులకీ వుంది. తమను నిమిత్తమాత్రుల్ని చేసి, నిష్క్రియాపరుల్ని చేసి, భారం భగవంతుడి మీద వెయ్యమంటారని!

"యం బ్రహ్మ వేదాంత విదో వదంతి" అని మంత్ర వాక్యం. వేదాంతవిదుడు వచ్చి 'యంబ్రహ్మ' మీద పడ్డాడు. 'యంబ్రహ్మ' అంటే వట్టి 'చలిమిడి సుద్ద' అని! 'యంబ్రహ్మ అనడంతో ఆ వంశం అంతా పనికిరానిదనేటంత అర్థం వస్తోంది.

## ద్రాపి వెధవ

"ద్రాపే అంధసస్పతే దరిద్రం నీలలోహిత" అంటూ రుద్రం – నమకంలో మంత్రం వస్తుంది. ఇందులో 'ద్రాపి' అనగానే రెండు పదాలు 1. అంధస్మృతి, 2. దరిద్రం ఇవి గుర్తుకు వస్తాయి. కళ్ళున్న చూడలేని అంధుడు, పరమదరిద్రుడు, నీచ నికృష్టుడు - ఇన్ని తిట్లు తిట్టడానికి "ద్రాపి' అనే పదాన్ని వాడారు వైదికులు.

ఆముక్తమాల్యదలో యమున ప్రభు రాజనీతి సందర్భాన "ద్రవిణము నొవ్వగొంట, నొఅద్రాబలతో నిడుచుం; భూమిగొంత పలికి నిచ్చుచుంట..." అనే పద్యంలో ఈ 'ద్రాబ' అనే పదం కన్పిస్తుంది. కన్నడ నిఘంటువులో ద్రాబ అంటే aukword or useless అని

అర్థం... బ్రౌన్ ఈ పదానికి 'a fool' అనే అర్థం ఇచ్చాడు. ఇది బహుశా 'ద్రాపి' అనే వైదిక పరిభాషలోంచి వచ్చిన పదం కావచ్చని జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు "వైదికుల పరిభాషలు" అనే వ్యాసంలో పేర్కొన్నారు.

## పస్తు పడుకోవటం :

జనమంచి కామేశ్వరరావుగారి తల్లి "ఏమండీ! రాత్రి క్షేత్రమా?" అనడిగారట! ఏమన్నా తిన్నారా– పస్తు పడుకున్నారా... అని దానర్థం. మల్లవరపు విశ్వేశ్వరరావుగారూ జల సూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారూ ఆ అర్థం తెలిసి విస్తుపోయినట్లు జలసూత్రం రాశారు.

బ్రౌన్ నిఘంటువులో 'క్షేత్రము' అనే పదానికి అన్ని ఇతర అర్థాలూ ఇచ్చి, Starvation (This meaning is peculiar to Telugu) అని కూడా చెప్పాడు. వాడు కటిక క్షేత్రంగా వున్నాడంటే, He was starving all yesterday అని!

ఇలాంటివే ఇంకా ఎన్నో సంగతులున్నాయి.

**1. ఆరోహోరు :** స్త్రీపురుష సంగమం.

"ఆరోహోరు ముపబర్హస్య బాహుం" అనే మంత్రాన్ని గర్భాదానసమయంలో చదువుతారు. అయ్యగారు ఆరోహోరులో ఉన్నారంటే సానిదాని కౌగిట్లో ఉన్నాడని భావార్థం.

**2. కృపారసం :**

ఎదుటివాళ్ళ మీద తుప్పర్లు పడేలాగా మాట్లాడేవాడు. "నల్లనివాడు, కృపారసం పై జల్లెడు మోమువాడు" అనే పద్యంలోంచి 'కృపారసం' పైన జల్లేవాడు అంటే సొల్లు కార్చుకునేవాడని తిట్టడం లేదా నల్లని తుమ్మ మొద్దులా ఉన్నాడని తిట్టడం.

**3. అహం బ్రహ్మోస్మి :**

'భార్య గీసిన గీత దాటనివాడు, జోరూ కా గులాం – అని ఎవరినైనా తిట్టడానికి "ఈయన 'అహం బ్రహ్మోస్మి'గారండి–" అంటాడు. మా ఇంటికి నేనే యజమానిని అని చెప్పుకోవడానికి మా ఆవిడ నాకు అనుమతినిచ్చింది – అన్న ఇంగ్లీషు సామెతలాంటిదే ఇది!

**4. అఘమర్షణం :**

నీళ్ళలో మూడుసార్లు మునిగి ఈ "అఘమర్షణం" మంత్రం జపిస్తే "గురుతల్పగమనం" లాంటి మహాపాపాలు కూడా నశించిపోతాయని నమ్మకం. "పచ్చ

కాయితం చూపిస్తే పోలీస్‌స్టేషన్లో ఎంత నేరమైనా 'అఘమర్షణం' అయిపోతుంది"లాంటి ప్రయోగాలున్నాయి.

**5. 'బృహస్పతి' :**

"వారికేమండీ- బృహస్పతులు" అంటే ఆయనకు పెద్ద బుద్ధ వుందని!

**6. వషట్కారాలు :**

కొన్ని మంత్రాలు చదివేప్పుడు 'వషట్' అని బిగ్గరగా నొక్కి పలుకుతారు. ఎవరి మీద ఆఫీసర్ కస్సుబుస్సు లాడుతున్నాడనానికి వషట్కారాలు ప్రయోగిస్తున్నాడంటారు.

**7. కౌశలం :**

వేళ్ళు తెగకుండా కుశ - దర్భగడ్డి కోయడం కౌశలం ఈ పదాన్ని తెచ్చి జేబులు కత్తిరించే నేర్పరితనానికి చెప్పగలగటం వైదికులకే చెల్లింది.

**8. పూర్వాషాఢలు :**

పెళ్ళికో, పేరంటానికో వెళ్ళినప్పుడు మనతో కలిసి ఎవరు రాలేదో వాళ్ళని చూసి, వాళ్ళు రాలేదేమని అడుగుతారు. ఇలాగే మీ ఆయన రాలేదేమమ్మా అని భోజనాల దగ్గర అడిగాడు ఓ యజమాని! 'ఆయనకు వంట్లో బాగోలేదండీ! అన్నది ఇల్లాలు. "అయ్యో పాపం ఏమయ్యింది?" అని మళ్ళీ అడిగాడు యజమాని. అన్నాలు తినేప్పుడు నీళ్ళ విరేచనాలవుతున్నాయని ఆవిడ చెప్పలేకపోయింది... "పూర్వాషాఢలు కదండీ!" అందుకని!" అంది! ఆ ప్రశ్న అడిగినవాడికి అర్థం అయి వుంటుంది. పూర్వాషాఢ నక్షత్రానికి వరుణుడు అధిదేవత. నీళ్ళ విరేచనాల్ని జలదేవతతో సమన్వయం చేసిందావిడ - వినేవాళ్లకి ఇబ్బంది కలగలేదు.

**9. తద్దినం పెట్టేవాడి తమ్ముడు :**

నామమాత్రుడు, ఉపయోగం లేనివాడు వట్టి నిరర్థకుడు అని! మేక మెడ చన్నులాంటి వాడని!

**10. సత్పదార్థం :**

"ఇవ్వాళ వంటలో సత్పదార్థం ఏమిటీ?" అడిగాడు భర్త. ఈ పూటయినా కమ్మగా వంట చేశావా అని వ్యంగ్యంగా అడిగాడు. బదులుగా ఆమె. "రామరసం సిద్ధం" అంది! అంటే నీళ్ళచారు మాత్రమే వండానని! రామరసం చెడని పదార్థం కదా!

**11. ఏషాగాథలు :**

బ్రాహ్మణాలలో పూర్వగాథల్ని ఏషాగాథలంటారు. దాన్ని తెచ్చి వ్యంగ్యంగా ఇచ్చకపు మాటలకి ఉపయోగించారు వైదికులు. "ఓయి! చాలించరోచి మీ జగడాలు - నగరివారు ముహూర్తం నిర్ణయించుకుంటే ఏషాగాథలాడుచున్నారు-" అని మన్నారు దాస విలాసంలో రంగాజమ్మ ఈ పదాన్ని ప్రయోగించింది.

**12. ఆధ్వర్యవం :**

యజ్ఞం చేసే యజమానిని అధ్వర్యుడు అంటారు. అధ్వర్యుని అధ్వర్యవం (లేదా అధ్వర్యంలో) యజ్ఞం జరుగుతుంది. దీన్ని తెచ్చి కర్ర పెత్తనానికి వాడటం మొదలుపెట్టారు వైదికులు. రాను రాను 'నిర్వహణ' అనే అర్థంలో ఇది స్థిరపడిపోయింది. ఫలానా సంస్థ ఆధ్వర్యంలో ... అని దీన్నే వాడ్తున్నాం మనం ఇప్పుడు.

**13. అయమోదనం :**

"అయమోదనం మిత్యేకైక పిండమాదాయ" అనే తద్దినం మంత్రంలో 'పిండం' అనే పదం అయమోదనం మీద ప్రసరించింది. "అయమోదనంగాడు" అంటే తిండికి మాత్రం ఎక్కడున్నా తయారౌతాడని తిట్టడం.

**14. దర్భపోటు :**

ఇవాళ దర్భపోటు తగిలిందోయ్ - బైటకి రాలేను - అంటే తద్దిన భోజనం చేసి భుక్తాయాసంతో అవస్థపడ్తున్నాడని! ఆముక్తమాల్యదలో రాయలవారు దర్భపోటు తగిలినా, అది సరిపోక అక్కవాడకు వెళ్ళి అక్కడ అరకూడు మెక్కినవాడి గురించి వర్ణిస్తాడు 'అరకూడు' అంటారు. ప్లేట్ భోజనం అని అర్థం చేసుకోవాలి.

**15. అగస్త్యభ్రాత :** అగస్త్యుడికి తమ్ముడనే వాడే లేడు! వీరు సాక్షాత్తు అగస్త్యులవారి తమ్ముడంటే అడ్రసులేనివాడు, బేవార్సు, బికారి అని తిట్టడం.

**16. స్వాహా చేయటం :**

"కర్రాయస్వాహా, కంపాయ స్వాహా, ఇద్దరం చెరిసగాయ స్వాహా" అని మంత్రం చదివినట్టే చదువుతూ చెరిసగం పంచుకొందాం అన్నాడట ఓ పంతులుగారు. 'స్వాహా చెయ్యటం' అనేది వైదిక పరిభాషలోంచి లౌకిక మాండలికంలోకి ప్రయాణించిన పదం!

**17. సంభావనలకు చాటుపేర్లు**

| | | |
|---|---|---|
| ఆభరణం | : | బేడా |
| నక్షత్రం | : | పావలా |
| తదర్థం | : | అర్ధరూపాయి |
| శుభ్రం | : | రూపాయలు |
| శివనేత్రాలు | : | మూడు రూపాయలు |
| ప్రత్యామ్నాయ గోదానం | : | ఆరు రూపాయలు |
| దశావతారాలు | : | పది రూపాయలు |

**18. అంకురార్పణ :**

ఇది కూడా వైదికుల పరిభాషలోంచి పుట్టినపదమే! శుభకార్యం తలపెట్టినప్పుడు నవధాన్యాలు చల్లి, మొక్కలు మొలిపించటం ఒక ఆచారం పెద్ద కార్యక్రమాలు జరిగినప్పుడు గుర్తుగా ఒక మొక్కని నాటడం లాంటిదే ఈ అలవాటు. అంకురారోపణం - అంకురార్పణంగా మారింది.

శ్రీకారం చుట్టాడు. హరిఃఓమ్ అన్నాడు. అంకురార్పణ చేశాడు. ఇవన్నీ మంచి ప్రారంభానికి వాడే పదాలు! వైదిక పరిభాషలోంచి వచ్చి చేరాయి.

**19. "ఓం భూః" :**

"ఓం భూః అంటూ నిమ్మకు నీరెత్తినట్టు ముక్కు మూసుకొని కూర్చుంటే పిల్ల పెళ్ళి ఎలా అవుతుంది?" అని విసుక్కుంటుంది ఇల్లాలు.

**20. కైంకర్యం :**

దేవుడికి చేసే సేవల్ని కైంకర్యం అంటారు. ఇవ్వాళ ఏ గుడికెళ్ళినా అన్నీ ఆర్జిత సేవలే! అందినదాన్ని అందినకాడికి దండుకోవటం అనే అర్థంలో ఈ కైంకర్యం పదం వైదిక పరిభాషలోంచి లౌకిక వ్యవహారంలోకి మారింది.

**21. తద్దినం :**

తింటానికి మృష్టాన్నం దొరుకుతుంది గాని, పెట్టడానికి చాలా ఖర్చుతో కూడుకున్నది తద్దినం. ఆస్తులు రాయనోళ్ళకీ, దాచిపెట్టిన నిధులు ఆస్తుల్లో చూపనివాళ్ళకి,

వంశవ్యాధులు ఆస్తుల్లా పంచినవాళ్ళకీ ఆక్రోశిస్తూ బంధువులు పెట్టేదే తద్దినం. "ఇదో తద్దినం అయ్యింది", "వీడో తద్దినం అయ్యాడు నా నెత్తిన", "ఇంకో తద్దినం వుంది- అప్పుడే కష్టాలు తీరలేదు-" లాంటివి ఈ అర్థంలోంచే పుట్టాయి.

**22. నాందీపలకటం :**

వివాహాది శుభకార్యాలు జరిగేటప్పుడు పితృదేవతలను తలచుకొంటూ పాలు పొంగించి అన్నం పాయసం తయారు చేస్తారు. శుభకార్యాలకు ముందు నాందీ ముఖశ్రాద్ధం" పెడతారు... దీన్ని బట్టి "నాందీ పలికేశాడు" అనే మాట వైదిక పరిభాషలో పుట్టి లౌకిక వ్యవహారంలోకి చేరింది! నాటకాలలో నాందీ ప్రస్తావనలు చేస్తారు. ఆ నాందీ, ఈ 'నాందీ' ఒకే అర్థంలోంచి పుట్టాయి.

**23. అల్పాచమనం :**

మూత్రవిసర్జనం చేయటానికి ఇది పర్యాయపదం. మూత్ర విసర్జన చేసి వచ్చిన తర్వాత కాళ్ళు చేతులు కదుక్కుని మళ్ళీ ఆచమనం చేస్తారు. భోజనం చేసేటప్పుడు పెద్ద ఆచమనం. ఇలాంటప్పుడు చిన్న ఆచనమున్నూ! వైదిక పరిభాషలో అల్పాచమనాన్ని టాయిలెట్‌కి వెళ్ళాడని చెప్పటానికి వాడుతుంటారు. లఘుశంక తీర్చుకోవడం అనే ప్రయోగం కూడా వుంది. కాలు ముదుచుకోవటం అని కూడా అంటారు. ఈ మాటని మహిళలు ఎక్కువగా వాడతారు.

**24. పారమాత్మిక మంత్రం :**

వైఖానస కల్పసూత్రంలో 'పారమాత్మిక మంత్రాలు అనే అనువాకాలున్నాయి. వైఖానస వైష్ణవులకు మాత్రమే అవి తెలుసు. "పారమాత్మిక మంత్రం చదవ్వోయ్-" అన్నాడంటే శత్రువర్గం వాడున్నాడని అవతలివాణ్ణి హెచ్చరించటం... వైదిక పరిభాషలో! వైదికులకీ, వైష్ణవులకీ మధ్య వైరానికి సంబంధించిన విషయం ఇది.

**25. తొమ్మిదో అట్టం :**

అట్టం అంటే ఎనిమిది. తొమ్మిదవ అట్టంలో అన్నీ చనిపోయిన వారి కోసం చదివేవి వుంటాయి. అందుకని వైదికభాషలో "తొమ్మిదో అట్టం చదివేస్తాను" అంటే చంపేస్తాను. నరికేస్తాను అని తిట్టడం!

**26. సమిధలు వెయ్యటం :**

నిప్పు రాజెయ్యటం, విరోధం కల్పించటం, తగువుని పెంచటం, వాడు కూడా నాలుగు సమిధలు వేశాడంటే, అగ్నికి ఆజ్యం పోశాడని!

**27. అవధ్యుడు :**

అవాట్ అనే వేదశబ్దానికి హవిస్సుల్ని తీసుకెళ్ళి దేవతలకు అందించేవాడు అని అర్థం. అగ్నిని దేవత అంటారు. పోస్ట్‌మాన్ డ్యూటీ లాంటిదే ఇది. మంత్రాలు సరిగా రానివాణ్ణి అవీ ఇవీ అందించేందుకు చేతికింద మనిషిలాగా ఉపయోగించుకొంటూ నెమ్మదిగా తర్ఫీదు ఇస్తారు. వాణ్ణి ఆవాట్ లాగానే 'అందించేవాడు' అనే అర్థంలో 'అవధ్యుడు' అనే పదాన్ని సృష్టించి ఆ పేరుతో పిలిచారు. చివరికి ఈ 'అవధ్యుడి'ని ఇక్కడి విషయాలు అక్కడికి మోసేవాడు, మూటలు మోసేవాడు, చెంచాగిరీ చేసేవాడు - అనే అర్థంలో తిట్టుపదంగా మార్చేశారు.

**28. స్కూలుపిల్లలు సంజ్ఞలు :**

ఒంటేలు (చిటికెన వేలు చూపించటం - మూత్రానికి వెళ్ళాలని సంజ్ఞ)

రెంటికి (రెండువేళ్ళు చూపించటం - విరేచనం కోసం బహిర్భూమికి వెళ్లాలని సంజ్ఞ)

మూటికి (మూడువేళ్లు చూపించటం - దాహం అవుతోందని సంజ్ఞ)

ఇవి గురుకులాలలో చదువుకునే పిల్లలు పుట్టించిన సంజ్ఞలు. స్కూలు పిల్లలందరూ వీటిని తప్పనిసరిగా వాడుతుంటారు. ప్రపంచంలో మరే భాషలోనూ ఈ మూడుసంజ్ఞలూ లేవని పెద్దలు చెప్తారు. ఆ ఘనత తెలుగు వైదికులదే కావచ్చు.

కొన్ని పరిశీలిద్దాం :

**29. వాణాయిత్తం :** నోరు పారేసుకోవటం, నోటికొచ్చినట్లు ఘోరంగా తిట్టుకోవటం

**30. ఉపోషం :** పళ్లూ, పాలతో కడుపు నింపుకోవటం

**31. వైదికం :** అమాయకత్వం

**32. చాదస్తం :** లౌక్యం తెలియకపోవటం

**33. మొలతాడు వెధవలు :** కట్నం కోసం పీడించే అల్లుళ్ళు, మగ వెధవలు, మగాడిదలు.

**34. చెంబులు :** వైదీకులు

**35. దేవాదేవేషు అయ్యింది :** అయినవాళ్ళ మధ్య తగువులు – సిగపట్లు పట్టుకోవటం. మగవాళ్లకి సంబంధించిన వివాదాలు ఏర్పడినప్పుడు "చివరికి దేవాదేవేషు అయ్యింది" అంటారు.

**36. కంద చెక్కు తీసిన రంగు ముండా కొడుకులు :** తెల్లవాళ్ళు, బ్రిటిషర్లు

**37. లండన్ వెళ్లటం :** బహిర్భూమికి వెళ్లటం

**38. విబూదిపండు :** కోడిగుడ్డు

**39. నల్లకారం :** వెల్లుల్లికారం

**40. జలపుష్పాలు :** చేపలు

**41. బుట్టలోది :** ఉప్పు దీపం చుట్టూ కూర్చుని రాత్రి భోజనాలు చేస్తున్నప్పుడు "ఉప్పు" అంటే ఉఫ్‌న ఊదినట్టె దీపం ఆరిపోతుందని 'ఉప్పు' అని రాత్రిపూట పలకవద్దని చెప్తారు. బదులుగా బుట్టలోది, తట్టలోది, రాచిప్పలోది అంటారు.

**42. త్రిపాది :** గాలికి తిరిగేవాడు (ఆకాశంలో త్రిపాది నక్షత్రం చాలా వేగంగా తిరుగుతుందట)

**43. పశవస్సు :** పురుషావయవం (పశవస్సు జంభం అని "అన్నసూక్తం" లో వస్తుంది) అపరిచిత స్త్రీలతో చనువుగా వుండేవారిని పశవస్సు జాగ్రత్త– అని హెచ్చరిస్తాడు. సుఖవ్యాధులు, ఎయిడ్స్ తగులుకోగలవని! కుళ్లిన వంకాయివలె పురుషావయవం అవుతుందని సిఫిలిస్ వ్యాధి గురించి చెప్తూ భావప్రకాశ వైద్య గ్రంథం వివరిస్తుంది. అందుకని పశవస్సుని జాగ్రత్తగా కాపాడుకోమంటారు.

**44. అశ్మాచమే :** అంతా మట్టి, వట్టి వృధాప్రయాస (అశ్మాచమే – మృత్తికాచమే – అని మంత్రం)

**45. శన్నోదేవి :** శన్నోదేవీ అనే మంత్రం చదువుతూ పాలు పోస్తారు. "పొద్దున్నే ఏం తీసుకున్నావ్?" అనడిగితే 'ఏముందీ శన్నోదేవి గ్లాసు పాలు మాత్రమే తాగానని!

**46. అసావాదిత్యోబ్రహ్మ :** డొంక తిరుగుడుగా మాట్లాడటం సంధ్యావందనం చేసేటప్పుడు ఈ వాక్యాన్ని ఉచ్చరించి, తలచుట్టూ చెయ్యితిప్పి ముక్కును తాకుతారు.

**47. పంగనామాలు పెట్టటం :** నమ్మించి ద్రోహం చెయ్యటం

**48. హరికథలు చెప్పటం :** సుత్తికొట్టి విసిగించటం, లేనిపోనివి కల్పించి చెప్పటం.

**49. నీరుకాసుల వెధవ :** శవం చేతి మీద ధారగా నీరు పోస్తూ కాసును దానంగా పొందేవాడు. శనిదానాలు పట్టేవాడికన్నా అధముడని.

ఇలా వైదిక పరిభాషలోంచి మాండలికాలుగా మారి జనవ్యవహారంలోకి మళ్ళిన చాలా పదాలు ఇంకా వున్నాయి. పాతకాలంలో బ్రౌను దొరగారి తర్వాత, ఆధునిక కాలంలో ఆచార్య లంకసాని చక్రధరరావుగారు "తెలుగు వ్యుత్పత్తి కోశంలో వైదిక పారిభాషిక పదాలను అర్థ వివరణలతో సహా చాలా వాటిని అందించారు. అన్నింటినీ ఇవ్వటానికి ఇక్కడ "కాలం" చాలటం లేదు.

1933 ఆంధ్ర సారస్వత పరిషత్పత్రికలో "వైదికుల సంజ్ఞలు - పరిభాషలు" పేరుతో ఒక వ్యాసాన్ని పరాశరం గోపాలకృష్ణమూర్తి వ్రాశారు. ఈ వ్యాసంలో చాలా వివరాలున్నాయి. 1941 వృషసంవత్సరాది 'ఆంధ్రపత్రిక' సంచికలో 'వైదికుల పరిభాషలు' పేరుతో జలసూత్రం రుక్మిణీ నాథశాస్త్రి ఇంకొక వ్యాసం వ్రాశారు. అందులో కొన్ని వైదిక పారిభాషిక సంజ్ఞలకు మూలాలు వెదికే ప్రయత్నం చేశారు. 2003లో నేను కూడా 'మాటల ముచ్చట్లు' అనే గ్రంథంలో వైదికుల సరదా తిట్లు గురించి ఒక వ్యాసం వ్రాశాను. ఈ మూడింటి సమాహారమే ఈ "వైదికుల మాండలిక పరిభాష" వ్యాసం!

(కృష్ణా విశ్వవిద్యాలయం తెలుగు మాండలికాల మీద 2010 మార్చి 19, 20 తేదీలలో నిర్వహించిన జాతీయసదస్సులో సమర్పించిన పరిశోధనాపత్రం)



# అన్నమయ్య వంటకాలు

**ఇందిర వడ్డించ నింపుగను/చిందక యిట్లే భుజించవో స్వామి**
**అక్కాళపాశాలు అప్పాలు వడలు/పెక్కైన సయిదంపు పేణులును**
**సక్కెర రాసులు సద్యోఘృతములు/కిక్కిరియ నారగించవో స్వామి**
**మీరిన కెళంగు మిరియపు దాళింపు/గూరలు కమ్మనికూరలును**
**సారంపుబచ్చళ్ళు చవులుగ నిట్టే/కూరిమితో జేకొనవో స్వామీ**
**పిండివంటలును పెరుగులు/మెండైన పాశాలు మెచ్చి మెచ్చి**
**కొండలపొడవు కోరి దివ్యాన్నాలు/వెండియు మెచ్చవే వేంకటస్వామీ"**

అన్నమయ్య వర్ణించిన వేంకటస్వామి దివ్యాన్నాల పట్టిక ఇది. వీటిని ఇందిరాదేవి ఇంపుగా వడ్డించి తినిపిస్తోందట. వాటిని చిందకుండా అంటే ఒక్క మెతుక్కూడా వదలకుండా భుజించవో స్వామీ...... అంటున్నాడు అన్నమయ్య.

**అక్కాళ పాశాలు :** నేతి పాయసాలు

**అప్పాలు,వడలు :** బూరెలు, గారెలు

**పెక్కైన సయిదంపు పేణులు :** అనేక రకాల గోధుమ సేమ్యా వంటకాలు

**చక్కెర రాసులు, సద్యోఘృతములు :** పంచదారతో చేసిన క్రొన్నేతి వంటకాలు

**మీరిన కెళంగు మిరియపు దాళింపు గూరలు :** మిరియాల పొడి చల్లి వండిన తాళింపు కూరలు

కమ్మని కూరలును సారంపుబచ్చళ్ళు: కమ్మని కూరలు, చక్కని సుగంధ ద్రవ్యాలు వేసి చేసిన పచ్చళ్ళు

చవులుగ నిట్టే కూరిమితో జేకొనవో స్వామీ : ఇట్టే నోరూరే ఈ రుచుల్ని ఇష్టంగా తినవయ్యా స్వామీ

**పిండివంటలును పెరుగులు :** ఇంకా అనేక పిండివంటలు, పెరుగుతో చేసిన వంటకాలు

**కిక్కిరియ నారగించవో స్వామి :** అన్నీ దగ్గరగా పెట్టుకుని ఆరగించవయ్యా స్వామీ!

వీటిని 500 యేళ్ళ క్రితం అన్నమయ్య కాలంలో దేవుడికి పెట్టిన నైవేద్యంగా భావించవచ్చు. 'ఋగ్వేద ఆర్యులు' గ్రంథంలో రాహుల్ సాంకృత్యాయన్ చెప్పినట్టు, తమ దేవుడికి ఏ ఆహారం నైవేద్యంగా పెట్టుకున్నారో అది ఆ కాలం నాటి ప్రజల ఆహారం. అన్నమయ్య చెప్పిన వంటకాలను కూడా ఆ నాటి ప్రజల ఆహారంగా భావించవలసి ఉంటుంది. బూరెలు గారెలు, నేతి స్వీట్లు, మిరియాలు వేసి వండిన తాలింపు కూరలు, సుగంధభరిత పచ్చళ్ళు, పెరుగు వంటకాలు, పాలవంటకాలూ ఉన్నాయి.

ఇవే గదా ఇప్పుడు మనం తింటున్నవీ...అని అడగొచ్చు. కానీ, ఇప్పటికీ అప్పటికీ చాలా తేడా ఉంది...! చింతపండు రసం కలిపినవీ, అల్లం-వెల్లుల్లి దట్టించినవీ, నూనె వరదలు కట్టేలా వండిన వేపుడుకూరలు, ఎర్రగా మంటెత్తే కొరివి కారాలు, ఊరుగాయ ల్లాంటి మనం తింటున్న భయంకర వంటకాలేవీ అన్నమయ్య వంటకాల పట్టికలో లేవు. 500 యేళ్ళ ఆధునికతలో చింతపండు, మిరప కారం, నల్లగా వేయించిన కూరబొగ్గుల్ని మాత్రమే సాధించామని అన్నమయ్య వంటకాలు మనల్ని వెక్కిరిస్తున్నాయి. యాంటీ బయటిక్సు లేకుండానే మన పూర్వులు కమ్మగా వండుకుని తిన్నారు, జీవితాన్ని ఆరోగ్యంగా ఆనందించారు.

మనది ముప్పొద్దుల భోజన సంస్కృతి. ఉదయాన్నే పెరుగు/చల్లన్నం తినటం మన ఆచారం. అది ఇప్పుడు నామోషీ అయ్యింది. దాని స్థానంలో ఇడ్లీ, అట్టు, పూరీ బజ్జీ, పునుగులు తినటం నాగరికం అయ్యింది. అన్నమయ్య కాలానికి మిరప కాయలు మనకింకా పరిచయం కాలేదు. ఇప్పటి ఆవకాయ, మాగాయలాంటి ఊరగాయలు అప్పటి ప్రజలకు తెలీవు. అల్లం, శొంఠి మిరియాలనే కారపు రుచికి వాడుకునే వాళ్ళు. మిరపకారపు ఊరుగాయలు, చింతపండు పులుసు కూరలు ఎరుగరు. అదే వాళ్ళ ఆరోగ్య రహస్యం.

ప్రపంచీకరణం పాలిట పడ్డ మనకు పీజ్జాలు, బర్గర్లు పవిత్ర వంటకాలైనాయి. ఏడుకొండలవాడి దగ్గరికి సూటూ బూటూ వేసుకుని వెళ్ళి హాయ్ చెప్పి, ఐదు నక్షత్రాల చాక్లేట్లు నైవేద్యం పెట్టటం గొప్పగా భావించే రోజులు ఎక్కువ దూరంలో ఏమీ లేవు.

# తెలుగు పచ్చళ్ళ ముచ్చట్లు

**నల్లినదీ సంయుక్తం**
**విచారఫలమేవచ**
**గోపత్నీ సమాయత్తం**
**గ్రామ చూర్ణంచ వ్యంజనం"**

ఈ చాటువులో ఒక గొప్ప తెలుగు వంటకం ఉంది. బుర్రకి పనిపెడితే అదేమిటో తెలుస్తుంది.

నల్లి + నది =నల్లి + ఏరు = నల్లేరు

విచారఫలం = చింతపండు. లేత నల్లేరు కాడల్ని తీసుకొని దంచి, తగినంత చింతపండు వేసి నూరండి. అందులో... గో+పత్నీ = ఆవు+ఆలు=ఆవాలు అంటే, తగినంత ఆవపిండి నూరి కలిపి, గ్రామ+చూర్ణం=ఊరు+పిండి (ఊరుబిండి, ఊర్బిండి)ని తయారుచేసుకోమంటున్నాడు. రుబ్బిన లేదా నూరిన పదార్థాన్ని ఊరుపిండి అంటారు. పచ్చడికి ఇది పర్యాయనామం అనవచ్చు. "ఊరుపండు" అనే ప్రయోగం కూడా ఉంది.

మొత్తంమీద ఈ చాటుకవి ఎవరోగానీ, తెలుగుమాటల్ని సంస్కృతీకరించి విచారఫలం, గోపత్ని లాంటి మాటలతో తికమకపెట్టాడు. ఇంతకీ ఆయన చెప్పదలచింది లేతనల్లేరుకాడలను ఆవబెట్టి రోటిపచ్చడి తయారుచేసుకోవచ్చని! రోటిపచ్చడి అంటే తెలుగువారి ప్రీతికి ఇదొక గొప్ప ఉదాహరణ. నల్లేరు కాడల్ని మినపప్పు కలిపి రుబ్బితే వడియాలు పెట్టుకోవచ్చు. ఈ నల్లేరు వడియాలను "చాదువడియాలు" అంటారు. అట్లు కూడా పోసుకోవచ్చు. మినపప్పు లేకుండా ఆవపిండి కలిపి రుబ్బితే అది నల్లేరు రోటిపచ్చడి అవుతుంది. రుచికరం, ఎముకపుష్టినిస్తుంది.

ఈకాలంలో చాలామందికి తెలుగు చదవటం, పచ్చడి చేయటం రావు. పచ్చళ్ళలో తెలుగుదనం అసలే తెలీదు. అయినా పచ్చడితో పెనవేసుకున్న తెలుగు భోజనానికి సాటిలేదు. దేవతలకోసం సురనీ మానవులకోసం పచ్చడినీ సృష్టికర్త సృష్టించాడని తెలుగువాడి నమ్మకం. అమ్మవారు ప్రత్యక్షమై, ఒక పాత్రలో పచ్చడినీ, ఇంకో పాత్రలో అమృతాన్ని చూపించి, “నరుడా! ఏది కావాలి...?” అనడిగితే పచ్చడినే కోరుకున్నాడు తెలుగువాడు!

పచ్చడి తెలుగువారికి అన్నప్రసాదమే! “నువ్వులపచ్చడి”ని అమ్మవారికి ఇష్టమని నైవేద్యం పెడతారు. మనిషి మొదట తయారుచేసుకున్న వంటకం పచ్చడే అని నా అనుమానం. నిప్పు, నీళ్ళతో పనిలేకుండా పచ్చడి నూరుకోవటం మనిషి నేర్చిన మొదటి విద్య, ఉప్పు, కారాలు చేర్చి పచ్చడి చేసుకోవటం మనిషి నేర్చిన మొదటి నాగరికత.

పచ్చడి, మన ప్రాచీన వంటకాలలో ఒకటి. దానికి కూరతో సమాన గుణధర్మాలన్నీ ఉంటాయి. చేసే నేర్పుండాలి గానీ, కూరకన్నా పచ్చడే రుచిగా ఉంటుంది. పచ్చడి లేకపోతే కడుపు నిండినట్టు అనిపించదు. నిండదు కూడా! పచ్చడి మెతుకులే గతి అని, కూటికిలేనితనాన్ని అంటారుగానీ, పచ్చడి మెతుకులు లేకపోతే పంచభక్ష్యపరమాన్నాలు ఎన్నున్నా ఏం లాభం?

పచ్చళ్ళు రెండు రకాలుగా ఉంటాయి. ఏడాది పొడవునా నిలవుండేవి ఊరుపచ్చళ్ళు. వీటిని ఊరుగాయలు అంటున్నాం. అప్పటికప్పుడు తాజాగా తినేవి మామూలు పచ్చళ్ళు. “ఊరుగాయపచ్చడి” కన్నా భిన్నమైనదని చెప్పటానికి “రోటిపచ్చడి” అంటున్నాం. “ఆలు ఫలములు వెడనీళ్ళు పానకములు నూరుబండ్లూరుగాయలు తైరుపొంటి...” అని ‘ఘటికాచల మహత్మ్యం” కావ్యంలో తెనాలి రామకృష్ణుడు, “ఊరుబిండ్లూరుగాయలు బజ్జుల్ దధి పిండ ఖండములు నందార్పించెన్ దగన్” అని “రాజశేఖరచరిత్ర”లో మాదయగారి మల్లన ఊరుపండ్లు, ఊరుగాయలు రెండింటి గురించీ పేర్కొన్నారు.

వీటిలో ఊరుపండ్లు పైన మనం చెప్పుకున్నట్టు రోటిపచ్చళ్ళు కావచ్చు. కాయతో పెట్టింది ఊరుగాయ, పండుతో పెట్టింది ఊరుపండు కూడా కావచ్చు. టమాటా పండుతోనూ, చింతపండుతోనూ దోసపండుతోనూ, గుమ్మడిపండుతోనూ, వంగపండుతోనూ, కాకరపండుతోనూ ఇంకా చాలాపళ్ళతో ఊరుపండ్లు చేసుకుంటున్నాం. ఇది నిలవుండేదయితే ఊరుపండు. అప్పటికప్పుడు తినేదయితే పచ్చడి. రోటిపచ్చడి,

పచ్చడిని నంజు, నంజుడు, నంజు ఉపదంశం అనికూడా పిలుస్తారు. పప్పుదినుసుల్ని గానీ, కూరగాయల్ని గానీ మెత్తగా రుబ్బి, తయారుచేసే వ్యంజన విశేషం అని ఉపదంశానికి నిఘంటువు అర్థం.

ఉత్తరభారతీయులు రోటిపచ్చడిని 'చట్నీ' అనీ, ఊరగాయని 'అచార్' అనీ అంటారు. 'అచి', 'అచ్చర', 'అచ్చుడ్' మాటలు తెలుగుపచ్చడి పదానికి దగ్గరగా ఉన్నాయి. ఊరుగాయల్ని కూడా ఊరుగాయపచ్చడి అనే పిలుస్తాం మనం. తమిళంలో పచ్చటి, కన్నడ, తెలుగు భాషల్లో పచ్చడి పదాలు వ్యాప్తిలో ఉన్నాయి. ప్రాచీన అమెరికన్ రెడ్డిండియన్ భాషల్లో పచ్చడిని ఆక్సి, అహి, అచి ఇలా పిలుస్తుంటారు. 1563లో పోర్చుగీసులు పచ్చి జీడిపప్పుని ఉప్పునీళ్ళలో ఊరవేసి ఒక రకమైన ఊరుగాయని తయారుచేసారు. దానికి 'అచార్' పేరుపెట్టారని కే టీ అచ్చయ్య "భారతీయ ఆహారచరిత్ర నిఘంటువు"లోంచి పేర్కొన్నాడు. స్పానిష్ అక్సా (చిల్లీ)లోంచి అచార్ ఏర్పడి ఉంటుందని ఇంకొందరంటారు. మొత్తంమీద ప్రపంచభాషల్లో ఉన్న అచి, అక్సి, అహి, అచ్చుడ్, పచ్చడి, ఒకేమూలంలోంచి పుట్టిన పదాలు కావచ్చు. అది మూలద్రావిడ పదం అయిఉంటుంది. పచ్చడి ప్రపంచపరివ్యాప్తం అనేదే ఇక్కడ ముఖ్యాంశం.

15వ శతాబ్ది తరువాత మిరపకాయలు భారతదేశంలోకి ప్రవేశించాయి. పోర్చుగీసులది ఇందులో ప్రముఖపాత్ర. మిరియాల ఖరీదుకు రోసిపోయిన తెలుగువాళ్ళకి రోటిపచ్చళ్లకు మిరపకాయలు ఆశాకిరణాలై కనిపించాయి. ఆబగా 'కారాన్ని' సేవించాలని ఆత్రపడ్డారు. మిరియాల మాటే మరిచిపోయి, మిరపకారంతో ఊరుగాయ పచ్చళ్ళమీద, రోటిపచ్చళ్లమీద ప్రయోగాలు ప్రారంభించారు. వందలరకాల పచ్చళ్ళను తయారుచేసుకున్నారు. అప్పటిదాకా ఆయుర్వేద ఔషధాల తయారీ కోసం ప్రత్యేకించిన చింతపండుని వంటగదిలోకి తెచ్చారు. మిరపకాయ రారాజు అయితే చింతపండు, ఉప్పు రారాణులయ్యాయి.

ఆ రోజుల్లో డచ్చివాళ్ళు ఇదంతా గమనించారు. మనచేత పచ్చళ్లను తయారుచేయించి విదేశాలకు ఎగుమతులు చేశారు. ఆ సమయంలో ప్రతి తెలుగు ఇల్లూ పచ్చళ్ళ కంపెనీగా మారింది. 18వ శతాబ్దిలో మన ఊరుపచ్చళ్లని బ్రిటిష్‌వాళ్ళు అమెరికా వారికి పరిచయం చేశారని న్యూయార్క్‌టైమ్స్ పత్రిక రాసింది. 1869లో ఆలివ్ పికిల్ కంపెనీ వాణిజ్యపరంగా పచ్చళ్ళను తయారుచేసి అమ్మటం మొదలుపెట్టిన తొలి కంపెనీగా ఆహారచరిత్ర చెప్తోంది.

బ్రిటిష్‌వాళ్ళు, డచ్చివాళ్ళు మన పచ్చళ్లమీద గొప్పగా సంపాదించుకున్నారు. మనకు మాత్రం పచ్చడి మెతుకులే దక్కాయి. అయినా మనకదే పరమాన్నం కదా...! కేసు పోయినా చట్టం అంతా తెలిసిందనే ఆనందం లాగా పచ్చళ్ళు చేయటంలో సిద్ధహస్తులమనే ఖ్యాతి మనకు దక్కింది.

బండతో బాగా నూరటాన్ని బట్టి, ఒక వీరుడు శత్రువుని ఓడకొట్టటాన్ని పచ్చడి పచ్చడి చేయటం అనే జాతీయం ఏర్పడింది. మాంసంతో కూడా రోటిపచ్చడి చేస్తారు. దాన్ని నూరటానికి భుజబలం కావాలి. మాంసాన్ని నూరి పచ్చడి చేస్తే, దాన్ని నూరుమాంసం లేదా ఊరుమాంసం అనవచ్చు. నూరుపిండి, నూరుపచ్చడి అనే మాటలు జనవ్యవహారంలో ఊరుపిండి లేదా ఊర్బిండిగానూ రోట్లో నూరే పచ్చడి ఊరుపచ్చడి లేదా రోటిపచ్చడిగానూ మారిపోయాయి.

ఊరు(నూరు) పచ్చళ్లలో ఉత్తమమైనది ఉసిరికాయ తొక్కుపచ్చడి, నల్లపచ్చడి అనికూడా పిలుస్తారు. ఉసిరికాయ లోపలి గింజలు తీసేసి ఉప్పు కలిపి ఊరబెట్టి, రోట్లో నూరి నిలవబెడతారు. ఎప్పటికప్పుడు కొద్దిగా ఇవతలకు తీసి, కొత్తిమీద వగైరా కలిపి తాలింపు పెట్టుకొని తాజాగా తింటారు. పాత ఉసిరితొక్కు, పాత చింతకాయతొక్కు, మామిడితొక్కు తినదగిన పచ్చళ్లలో ముఖ్యమైనవి. చింతకాయ, గోంగూర, మామిడికాయ, వెలక్కాయ, టమోటా, కంద, వంయాయ, దోస, నిమ్మ, కాకర, క్యాలీఫ్లవర్ ఇలా రకరకాల కాయగూరలతో ఊరుపచ్చళ్ళు పెడుతుంటారు. ఈ ప్రక్రియలో ఊరుగాయలు చాలారోజులు నిలవుంటాయి. జాగ్రత్తగా జాడీలో వాసనగట్టి ఆరునెలలు బాగా మాగితే, అపకారం చేయకుండా ఉంటాయి. ఆయా కూరగాయల మంచిని పొందే వీలుంది.

పచ్చడిని తినటం ఒక గొప్ప. దాన్ని తయారుచేసుకోవటంలోనే ఆ గొప్పంతా ఉంది. మనవాళ్ళలో చింతపండుమీద వ్యామోహం పెరిగి ఇటీవలి కాలంలో ప్రతిదానిలోనూ చింతపండు రసం పోయటం మొదలుపెట్టారు. అందువలన అదనంగా ఉప్పు, కారం కలపవలసివస్తుంది. సాధ్యమైనంతవరకూ చింతపండు వాడకుండా బదులుగా టమోటా, చుక్కకూర లాంటివి కలుపుకుని పచ్చడి చేసు ుంటే అవి ఆరోగ్యానికి మంచివి. కూర ఎక్కువ అన్నం తక్కువ పద్ధతిలో తినాలంటే చింతపండు వెయ్యని రోటిపచ్చళ్ళు అనుకూలంగా ఉంటాయి.

పులవబెట్టకుండా పచ్చళ్ళను తయారుచేసేవిధానమే ఆరోగ్యదాయకం. రోట్లో నూరే పచ్చళ్ళు అనేక పేర్లున్నాయి. మచ్చుకు కొన్ని చూద్దాం.

**1. తొక్కు :** గోంగూరతొక్కు, చింతకాయతొక్కు, ఉసిరికాయ తొక్కు, ఇవన్నీ నిలవుండేలా తయారుచేసిన పచ్చళ్ళు. ఉప్పు కలిపి ఊరబెడతారు.

**2. తురుము పచ్చడి :** మామిడి, కేరట్, బీట్రూట్, క్యాబేజీ వీటిని తురిమి తాలింపు పెట్టింది తురుము పచ్చడి. తురుముగా కనిపించటం కోసం దీన్ని రోట్లో నూరకుండానే పచ్చడి చేస్తారు.

**3. ముక్కల పచ్చడి :** తాలింపుగింజలు, ఉప్పు, కొత్తిమీర వీటిని రోట్లో మెత్తగా నూరి, దోసకాయ, మామిడి, దొండ ఇలాంటి కాయల్ని చిన్నముక్కలుగా తరిగి కలిపి తాలింపు పెడతారు.

**4. పప్పుల పచ్చడి :** కందిపప్పు, శనగపప్పు, మినప్పప్పు, ఉలవలు ఇలాంటి పప్పుల్ని దోరగా వేయించి రోట్లో నూరి (లేదా రుబ్బి) చేసిన పచ్చడి. కందిపచ్చడిని పచ్చిపులుసుతోనూ, ఉలవపచ్చడిని మీగడతోనూ, తినాలని ఆయుర్వేద శాస్త్రం చెప్పింది. పెసరపచ్చడిని పెనంమీద చేత్తో వత్తి అట్టులా కాల్చి అన్నంలో ఆమ్లేట్ లాగా తింటారు.

**5. ఆవపచ్చడి :** రోట్లో నూరిన ఆవపిండిని పెరుగులో కలిపి తాలింపు పెట్టేది ఆవపచ్చడి.

**6. పెరుగుపచ్చడి :** కూరగాయల్ని నిప్పులమీద కాల్చిన బజ్జీపచ్చడిలో పెరుగు కలిపితే అది పెరుగుపచ్చడి. అరటి ఊచ(దూట)ను ఉడికించి రోట్లో నూరి చేసిన పెరుగుపచ్చడి చాలా రుచిగా ఉంటుంది.

**7. ఊర్బిండి :** రుబ్బిన పదార్థాన్ని ఊరుపిండి అంటారు. ముక్కలకు ఉప్పు రాసి, కొంతసేపు ఊరిన తరువాత రోట్లో వేసి నూరి తయారుచేసే పచ్చడిని ఊరుపిండి లేదా ఊర్బిండి అంటారు.

**8. ఊరు పచ్చడి :** దీన్ని రోటి పచ్చడి అంటున్నాం. పప్పుదినుసులు, కూరగాయముక్కలు వేయించి మిరపకాయలు కలిపి రుబ్బిన పచ్చడి ఊరుపచ్చడి.

**9. బజ్జీ పచ్చడి :** శ్రీనాథుడు బజ్జులు అనే వంటకం గురించి ప్రస్తావించాడు. ఏదైనా కూరగాయని నిప్పులమీద కాల్చి, రోట్లో వేసి నూరి, పప్పుదినుసులతో తాలింపు పెట్టిన పచ్చడినే ఆయన 'బజ్జు' అన్నాడు. అంటే బజ్జీపచ్చడి!

**10. ఊరగాయ పచ్చడి :** కూరగాయని ముక్కలుగా తరిగి, ఉప్పు కలిపి ఉంచడాన్ని ఊరబెట్టడం అంటారు.నిమ్మ, టొమోటో మామిడి, చింతకాయ, కంద, పెండలం, గోంగూర వీటితో ఎక్కువగా ఊరగాయ పచ్చళ్ళు పెడుతున్నాం.

**11. ఊరుపిండి పచ్చడి :** నువ్వులు, వేరుశెనగ గింజలు, ఆవాలు, కొబ్బరి ఇలాంటి వాటిలోని నూనెని తీసేసిన తర్వాత మిగిలే పిండిని తెలికిపిండి అంటారు. దాన్ని నీళ్ళలో గాని, మజ్జిగలో గాని నాలుగైదురోజులు నానబెడితే పులుస్తుంది. దానికి అల్లం, పచ్చిమిర్చి వగైరా చేర్చి రుబ్బి, తాలింపు పెట్టిన పచ్చడిని “ఊరుపిండి పచ్చడి” అంటారు.

**12. కూరపచ్చడి :** కూరగాయని మగ్గబట్టిన తరువాత కూరగానూ చేసుకోవచ్చు. పచ్చడిగానూ చేసుకోవచ్చు. కూర వండాక కూడా దాన్ని రోట్లో వేసి నూరితే కూరపచ్చడి అవుతుంది.

**13. ఆకు్కర పచ్చడి :** గోంగూరతో మాత్రమే కాదు, తోటకూర, పాలకూర, మెంతికూర, చుక్కకూర, గుంటగలగరాకు, లేత పారిజాతం ఆకులు, లేత సొర ఆకులు, లేత తమలపాకులు, కరివేపాకు, కొత్తిమీర, పొదీనా...ఇలా ఆకు్కరలన్నింటితోనూ రోటిపచ్చళ్ళు చేసుకోవచ్చు. పారిజాతం పచ్చం తరచూ తింటూ వుంటే కీళ్లనొప్పులు కూడా తగ్గుతాయి.

**14. పూలపచ్చడి :** మునగపూలు, అవిశపూలు, వేపపూలు మామిడిపూలు, క్యాలీఫ్లవర్ పూలు, గోంగూరపూలు ఇవి పచ్చడికి చాలా అనుకూలంగానూ, రుచికరంగానూ ఉంటాయి. వేపు పూలపచ్చడిని అన్నంలో ఒకటి రెండు ముద్దలు అయ్యేలాగా కలుపుకుని రోజూ తినటం వలన వగరు చేదు రుచులు కలిసి సమతుల్యఆహారం అవుతుంది. కాదేదీ పచ్చడి కనర్హం. పచ్చడి తినటం ఒక యోగం. పచ్చడితో భోజనం ఒక భోగం. ప్రపంచపచ్చడి ప్రియులారా! ఏకంకండి. పోయేదేమీలేదు కొన్ని రోగాలు తప్ప!

పచ్చళ్ళు కడుపులో మంటని తెస్తాయనే అపోహ కలగటానికి కొన్ని కారణాలున్నాయి. నిలవపచ్చళ్ళన్నీ ఎటుతిరిగి పులవబెట్టే ప్రక్రియలో (Fermentation) తయారౌతాయి కాబట్టి, అవి కడుపులో మంటకూ, పైత్యానికీ కారణం అవుతాయి. రోటిపచ్చళ్ళు ఏరోజు కారోజు తాజాగా తినటానికి ఉద్దేశించినవి. ఫ్రిజ్జులొచ్చాక నిలవబెట్టడం పెద్ద సమస్య కూడా కాదు. కాబట్టి రోటిపచ్చళ్ళలో నిలవకోసం చింతపండుని వాడకుండా ఉంటే,

అవి కడుపులో మంట, గ్యాసు, ఉబ్బరం లేకుండా ఉంటాయి. బలకరంగా ఉంటాయి. అదే కూరగాయతో చేసిన కూరకన్నా, పచ్చడిలాగా చేసుకుంటే ఎక్కువకూరని తినగలుగుతాం.

'తెలుగువారిప్రసాదం' 'ఉగాదిపచ్చడి' గురించి మాట్లాడకుండా ఎన్ని సంగతులు చెప్పుకున్నా అది అసంపూర్ణమే!

మనది ఆరు రుచుల భోజన సాంప్రదాయం. తీపి, పులుపు, ఉప్పు, కారం, వగరు, చేదు రుచులు తప్పనిసరిగా మన భోజనంలో ఉంటేనే అది సమతుల్య ఆహారం అవుతుంది. బెల్లం, చింతపండు, ఉప్పు, మిరియాలపొడి, మామిడి లేత పిందెలు (వడపిందెలు), వేపపువ్వు ఈ ఆరూ ఆరురుచులకు ప్రాతినిధ్యం వహిస్తాయి. వాటన్నింటినీ ఆ విధంగా తగు పాళ్లలో కలిపింది ఉగాది పచ్చడి. దీన్ని సంవత్సరానికి ఒకరోజు ఉగాదినాడు ఓ చెంచాడు తింటే సరిపోతుందనుకోవటం అపోహ. ప్రతిరోజు మన ఆహారంలో వగరు, చేదు కూడా ఉండాలని గుర్తుచేయటమే ఉగాదిపచ్చడి లక్ష్యం.

పచ్చడిని కూడా ప్రసాదంగా భావించే తెలుగువాడి ఔదార్యానికి ఔదల దాల్చాలి!

రోటిపచ్చళ్ళ గురించి ఒక పుస్తకం తేవాలనే వాసిరెడ్డి వేణుగోపాల్ ఆశయాన్ని అభినందించాల్సిందే! దాని వెనుక లోక ప్రయోజనం ఉంది.

మొన్న మొన్నటిదాకా మనవి ఉమ్మడికుటుంబాలు. మునిమనవడి నుండి ముత్తాతవరకూ పాతిక తక్కువ కాకుండా మనుషులుండేవాళ్ళు. కాబట్టి అన్నం ఎక్కువ కూర తక్కువగా ఉండే పద్ధతిలో ఎకానమీ వంటకాలను మనవాళ్లు కనిపెట్టారు. చింతపండు, శనగపిండి అందుకు బాగా తోడ్పడ్డాయి. ఇప్పుడు పరిమితకుటుంబం, అత్యంత పరిమిత కుటుంబం అనే పద్ధతిలోకి మన సామాజికవ్యవస్థ వచ్చేసింది. ఏ ఇంట్లో చూసినా ఇద్దరో ముగ్గురో మాత్రమే మనుషులు కనిపిస్తున్నారు. ఇలాంటప్పుడు ఎకానమీ వంటకాలు చేసుకోవాల్సిన అవసరం లేదు. అందుకని కూరగాయలు ఎక్కువగా తినటానికి తోడ్పడే విధంగా పచ్చళ్ళ తయారీని ప్రోత్సహిస్తున్నారు వేణుగోపాల్.

దేముడు గ్లాసుడు అమృతం త్రాగమని ఇస్తే, ఆ అమృతాన్ని పచ్చడిగా చేసి అందరికీ వడ్డిస్తుంది అమ్మ. నాలుగిళ్ళకు పంచిపెడుతుంది కూడా!

(శ్రీ వాసిరెడ్డి వేణుగోపాల్ వ్రాసిన రోటిపచ్చళ్ళు పుస్తకానికి ఇది నా ముందుమాట)

# 400 రకాల చేపలకు తెలుగు పేర్లు

సీ. కొరద దాసరికొయ్య కొఱ్ఱమీను నులస ము
చ్చంగి బేడిస జెల్ల చాఱమీను
వాలుగ ముకుదొమ్మ వల్లికతట్ట పు
త్తడికాసు పూమీను కడిసెలంబు
పక్కె చిత్తర నీరుపాపెర మలుగు మీ
నరుజు నిల్లెపుఁజేప యాకుజెల్ల
మిసి కల్గురుజు నడమీను తొల్లిక ఊతి
గొరక మాపురమును గుంటముక్కు

తే. మోరపక్కెర దొందును గూరముక్కు
పుల్లురుజు గెజ్జె గెండయు బొమ్మడాయ
యల్లె దమ్ముప్పు చేఁపయు గొల్లదొందు
పరిగె రొయ్యదియగు మీలఁబట్టునతఁడు

క్రీ.శ. 1770-75 కాలానికి చెందిన అయ్యలరాజు నారాయణామాత్యుడు హంస వింశతి గ్రంథంలో ఈ సీసపద్యంలో కొన్నిచేపల తెలుగు పేర్లు పేర్కొన్నాడు. కొరద, దాసరికొయ్య, కొఱ్ఱమీను, ఉలస, ముచ్చంగి, బేడిస, జెల్ల, చాఱమీను, వాలుగ, ముకుదొమ్మ, వల్లిక తట్ట, పుత్తడికాసు, పూమీను, కడిసెల, పక్కె, చిత్తర, నీరుపాపెర,

మలుగు, మీనరుజు, ఇల్లెపుచేప, ఆకుజెల్ల, మిసి, కలుగురుజు, నడ మీను, తొల్లిక, రాతి గొరక, మాపురం, కుంటముక్కు, మోరపక్కెర, దొందు, గూరముక్కు, పుల్లురుజు, గెజ్జె, గెండ, బొమ్మడాయ, అల్లె, దమ్ముప్పుచేప, గొల్లదొందు, పరిగె, రొయ్య మొదలైన చేపల పట్టిక ఈ పద్యభాగంలో మనకు కనిపిస్తుంది. ఈ 400 ఏళ్ళకాలంలో, పాత పేర్లు కొన్ని మరుగున పడిపోయి, కొత్తపేర్లు పుట్టుకొచ్చాయి. కొత్త రకాల చేపలు బంగాళాఖాతంలో చేరాయి. అమెరికన్, ఆఫ్రికన్, జపానీ, చైనీ ప్రాంతాలలోని జలచరాలను తెచ్చి చేపల చెరువులలోనూ, మంచినీటి సరస్సులలోనూ పెంచటం ప్రారంభించాక, కొత్త రకాల చేపలు, వాటికి తెలుగు పేర్లు వ్యాప్తిలోకి వచ్చాయి. వాటన్నింటినీ క్రోడీకరించే ప్రయత్నం ఈ వ్యాసం.

★ అక్కురాతి: "గ్లాస్ ఫిష్" అంటారు.

★ అడలం: "రైనోబేటస్ గ్ర్యాన్యులేటస్" దీని శాస్త్రీయ నామం. "స్కేట్ ఫిష్" అంటారు. వీటిలో తిరగలి దిమ్మ(బౌ మౌత్డ్ ఏంజెల్ ఫిష్), ఉలవ(షోవెల్ నోస్ రే చేప), రంపపుసొర(పాయింటెడ్ సా ఫిష్), చిన్న రంపపుసొర(స్మాల్ టూత్డ్ సా ఫిష్) రకాలున్నాయి.

★ అలమోసా: తెల్లని చిన్నపొలుసులున్న విదేశీ చేపలు. అమెరికా కొలరాడోలో అలమోసా నదీతీరాన పెద్ద చేపల పరిశ్రమ ఉంది.

★ అవలోసు: డాల్ఫిన్ చేపలకు ఇది తెలుగు పేరు. డాల్ఫిన్ అనేది హవాయీ పేరు. మాహిమాహి అనే నామాంతరం ఉంది.

★ అవిల: రాజనిఘంటువు, హంసవింశతిలలో వీటి గురించి ఉంది. క్యాలిఫోర్నియాలో అవిలా బీచ్, చేపల మార్కెట్ ప్రసిద్ధి.

★ ఆకుచేప: టార్డార్ చేపలని పిలుస్తారు.

★ ఆలచిప్ప: ఆలచిప్పల్లో ఐదారు రకాలు మనకు దొరుకుతున్నాయి. బుడితిగుల్ల, ఆలగుల్ల, ఆలచిప్ప, తలపు గుల్ల, డిప్పకన్ను, బూడిదిగుల్ల ఇలాంటి పేర్లతో కనిపిస్తాయి.

★ ఇంగిలక, ఇంగిలాలు : వీర్యపుష్టినిచ్చే చేపలుగా ప్రసిద్ధి.

★ ఈలు(Eel) చేపలు : పాము ఆకారంలో ఉంటాయి. నల్ల పాము, తెల్లపాము, పసుపు పాము అనే రకాలున్నాయి.

★ ఈసపిట్ట, ఈసుపుట్టి : స్కాటోఫేగస్ ఆర్గస్ అనేది దీని శాస్త్రీయ నామం.

★ ఉప్పుచేప, కరవాడు, వరుగు చేప: ఇవి ఉప్పులో ఊరవేసి ఎండించిన చేపలు. "దమ్ముప్పు చేప"ని హంసవింశతి పేర్కొంది.

★ ఉరుజు: మీనరుజు, కలుగురుజు, పుల్లురుజు అనే మూడురకాల ఉరుజు చేపలను హంసవింశతిలో ప్రస్తావించాడు.

★ ఉలస, ఉలుచ, ఉల్లం, ఉల్లింకచేప: హిల్సా చేపలంటే ఇవే! బెంగాల్ లో వీటిని ఎల్లిస్ చేపలంటారు. సారస్వత బ్రాహ్మణులు సరస్వతీ పూజ రోజున రెండు ఎల్లిస్ చేపలు నైవేద్యం పెడతారు. తెలుగులో పులసచేప, పలష్ అనికూడా అంటారు.

★ ఎంగళ్ళు: "ఇతిషా ఎలాంగేటా" దీని శాస్త్రీయ నామం. సన్న ఎంగళ్లు, కళ్ల ఎంగళ్ళు అనే రకాలున్నాయి.

★ ఎండు చేపలు: ఉప్పులో ఊరవేయకుండా ఎండించిన చేపలు.

★ కటిపరిగె: "సోరిచేప" అని కూడా పిలుస్తారు.

★ కడిసి: ˊడిసెల పేరుతో హంసవింశతి లో పేర్కొన్న చేప ఇదే కావచ్చు. నైరోబీలో "కడిసి"నది అంతర్జాతీయ చేపలగా మార్కెట్టుగా ప్రసిద్ధి.

★ కదురులు: వీటిని గార్ ఫిష్ అంటారు.

★ కలివింద:"కటిల్ ఫిష్" అంటారు. బుడ్డకలివింద, కోమిటిచంచులు, చారలకలివింద, కందవాయ, కోలకలివింద దొరుకుతున్నాయి.

★ కనగంత, కనగర్థలు, కొన్నగడత: మకెరెల్ చేపలని పిలుస్తారు.

★ కనిసె, బొంత: వీటిని ముల్లెట్ చేపలనీ, ఇండియన్ గోట్ ఫిష్ అనీ పిలుస్తారు. కనిసెలు, కట్టచేప, బొంతచేప, బొంతమీను, కొనిగ, మొయల, కనిశ, గురివింద, రాతిగురివింద రకాలున్నాయి. తెల్ల చేపల్ని పాలబొంత, వైట్ ముల్లెట్, మిల్క్ ఫిష్ అంటారు.

★ కప్పచిప్ప: నత్తగుల్లల్లాంటివి. కామోద్దీపనాన్ని కలిగించే వాటిలో ఇవి కూడా ప్రముఖమైనవి.

★ కరిమీన్, కర్రిమీన, ఇరిమీన, : అంతర్జాతీయ ప్రసిద్ధి. పెరల్ స్పాట్ ఫిష్ అని దీనికి పేరు.

★ కవ్వళ్ళు: సార్డయిన్ చేపలంటారు. ముంచుకొచ్చే ముసలి తనాన్ని నివారించటానికి, ఆల్జిమర్స్ వ్యాధిని తగ్గించే మందుల్లో వాడుతున్నారు. బళ్ళకవ్వళ్ళు, సూదిమూతి కవ్వళ్ళు, మంగలికత్తి కవ్వళ్ళు, నూని కవ్వళ్ళు రకాలు దొరుకుతున్నాయి.

★ కాకిబొచ్చె: చేపల చెరువులలో పెంచుతున్నారు. ఖరీదు తక్కువ.

★ కారచేప: పోనీఫిష్ అంటారు. సుదుముకార, బెందుకార, చారలకార, చందువకార, తట్టకార, చుక్కకార, చిన్ని చుక్కకార అనే రకాలున్నాయని మత్స్య పరిశోధకుడు శ్రీ సి వి శేషగిరిరావు వ్రాశారు.

★ కిలిమీను: పార్రెట్ ఫిష్ అంటారు. దంతాలు కలిగిన చేప. రంగుల్లో చూడముచ్చటగా ఉంటుంది.

★ కీలుపోతు: "క్రిసెంట్ టైగర్ పెర్చ్" చేపలని పిలుస్తారు.

★ కుచిక, కుచిల: "ఫ్లాగ్ టైల్ చేప"లంటారు. హవాయి దీవుల్లో 'ఆహోల్ హోల్' చేపలుగా ఇవి ప్రసిద్ధి. జెండాలా తోకలు ఉంటాయి.

★ కుమేను: ఖరీదయిన చేప. కిలో మూడువందల దాకా ధర పలుకుతుంది.

★ కొంజు: "లోబ్ స్టర్ పేరుతో" పిలవబడె రొయ్య జాతి చేప. వీటికి రెండు కొండేలు, పది పాదాలూ ఉంటాయి. వీటిని వల పట్టటానికి ప్రత్యేకమైన పడవలూ, పరికరాలు కావాలి. రాతిరొయ్య, కట్లరాతిరొయ్య, టపటపలు, మాదతరొయ్య అనే "లోబ్ స్టర్" రొయ్యలు మనకు దొరుకుతున్నాయని శేషగిరిరావు గారు వ్రాశారు.

★ కొలసు: "ఫ్లాట్ మౌత్" చేపలంటారు, కొలసి, గరుకు కొలసి అని రెండురకాలు మనకు దొరుకుతున్నాయి.

★ కొరమీను: మళయాళంలో కరిమీను, ఇంగ్లీషులో గ్రీన్ క్రోమైడ్ అంటారు. దీర్ఘవ్యాధులు వచ్చిన వారికి ప్రత్యేకంగా వండి పెడతారు.

★ గండుమీను: కార్ప్ ఫిష్ అంటారు. బొచ్చ గండుమీను అని కూడా కొన్ని ప్రాంతాల్లో పిలుస్తారు. రోహు అని ఉత్తర భారత దేశంలొ ఎక్కువ పిలుస్తారు. రోహితకం పేరుతో రాజనిఘంటువులో వర్ణించిన చేప ఇదే! ముఖం గుండ్రంగా ఉంటుంది. చేపలలోకెల్లా ఉత్తమమైనదిగా చెప్పబడింది. ఈ చేప చేదుకట్టు(గాల్ బ్లాడర్)ని విడిగా తీస్తారు. ఖరీదయిన ద్రవ్యం ఇది.

★ గుడిజెల్ల, తేడిజెల్ల, పెంకి జెల్ల, నల్లజెల్ల, తెల్లజెల్ల, జెల్లకొయ్యలు: క్యాట్ ఫిష్ లో వివిధ రకాల చేపల పేర్లు ఇవి. ఇవి మాంసం తినే చేపలు. వీటిని పెంచటం కోసం కబేళా నుంచి కుళ్ళిన మాంసాన్ని ఇతర జంతు వ్యర్థాలను తెచ్చి మేతవేస్తారు. ఆ విష పదార్థాల ప్రభావం ఆ చేపలను తిన్న వారిమీద ఉంటుంది. సిల్థి, ఎంగిలాయి అనే రెండురకాల క్యాట్ ఫిష్ లు ప్రస్తుతం దొరుకుతున్నాయి.

★ గురక, చినగురక, పెదగురక, తెల్లగురక, గొరసొలు, గొరకలు, తెల్ల, పుల్లిపన: ఇవన్నీ ఒకే చేపకు వివిధ ప్రాంతాల్లో పేర్లు అయి ఉంటాయి. వీటిని "జ్యాచేప"లని, క్రోకర్ చేపలనీ పిలుస్తారు. సార్డైన్ చేపలలో రకాలు ఇవి. కర్రిమూతి గొరస, గొరస, నల్లగొరస, చారగొరస, గెడ్డంగొరస, పల్లిగొరస, నల్లమచ్చల గొరస, విల్లిగొరస, పళ్ళగొరస, కాళ్ళగొరస, పండుగొరస అనే రకాలు ఉన్నాయని పరిశోధకుడు శ్రీ సి వి శేషగిరిరావు వ్రాసారు.

★ గుర్రము: "సింగ్నాథస్ టైఫిలస్" దీని శాస్త్రీయ నామం

★ గులివింద: వీటిని "థ్రెడ్ ఫిన్ బ్రీమ్స్" చేపలంటారు. వీటిలో ఎర్రగులివిందలు, బండి గులివిందలు అనే రకాలున్నాయి.

★ చంద్రకం, చంద్రిక, చాగలకం: "వైట్ పోం ఫ్రెట్" అంటారు. తెల్లగా, ఒడ్డూ పొడుగూ సమానంగా ఉండి పొలుసులు లేకుండా అందంగా ఉంటుంది. తెల్ల చందువ, నల్ల చందువ(బ్లాక్ పోం ఫ్రెట్) రకాలున్నాయి..

★ చారమీను: పసుపు రంగులో ఉండి వెనుక భాగంలో చారలుంటాయి. సంస్కృతంలో 'గర్గర' అంటారు.

★ చింతజెల్ల: బాగ్రస్ చీనా అనే శాస్త్రీయనామంతో పిలుస్తారు.

★ చుక్కల చందువ: మూన్ ఫిష్ అంటారు.

★ చెంగుడి రొయ్యి: గోదావరి జిల్లాల్లో ప్రసిద్ధి. ఎండించి దంచిన పొడిని పశువుల మేతలో కలుపుతారు.

★ చేపసెన: ఇవి చేపల గుడ్లు. వీటిని వేయించుకొని తింటారు. మగటిమిని పెంచుతాయి.

★ జెల్ల, జల్లమీను: జల్ల లేక జెల్ల అనేది పార్సీ పేరు. ఏసోక్స్ తెగకు చెందిన చేప ఇది. "స్ఫినా జెల్లో" దీని శాస్త్రీయ నామం. ఉబ్బసానికి వైద్యం. డ్రాగన్ ఆకారంలో ఉంటుంది. నారజెల్ల గుడిజెల్ల రకాలు దొరుకుతున్నాయి.

★ జెర్రిపోతు : అట్టలాగా బల్లపరుపుగా ఉంటుంది కాబట్టి, దీన్ని "సోల్ చేప" అంటారు. ఎండించి తింటారు కూడా!

★ టేకుచేప: "పేల్ ఎడ్జి స్టింగ్రే" చేప అని పిలుస్తారు. "స్టింగ్రే " చేపలు షార్క్ చేపల జాతికి చెందినవే. ఈ టేకుచేపల్లో ముల్లుటేకుచేపని "విప్ టెయిల్ స్టింగ్రే" అంటారు. కాట్లముల్లు టేకుచేప, జల్లుతిమిరి, తిమిరిటేకు, చుక్కల తిమిరిటేకు అనే రకాలున్నాయి. దెయ్యపుటేకు చేపని జెయింట్ డెవిల్ స్టింగ్రే అంటారు. ఇది పెద్ద టేకుచేప.

★ దాత్కూటం: కూట్టం అంటే మంచినీటి సరస్సు అని మళయాళ అర్థం. దానికి సంబంధించిన చేప కావచ్చు.

★ తంగత్: ఫిలిప్పీన్స్ లో "తంగత్" రేవు చేపల పరిశ్రమకు ప్రసిద్ధి. దాని పేరుతో ఏర్పడిన చేప పేరు ఇది కావచ్చు.

★ తిమింగలం: వేల్స్. తిమింగలం అనగానే హెర్మాన్ మెల్విల్లే రాసి 'మోబీ డిక్" నవల గుర్తుకొస్తుంది. పెద్ద శరీరం కలిగిన మహా మత్స్యం. మచిలీపట్టణానికి ఆ పేరు రావటానికి, బిందదు అనే జాలరి పెద్ద తిమింగలాన్ని పట్టుకొని తేవటమే కారణమని బందరు కైఫీయత్తులో ఉంది. "తిమ్మిని బమ్మి, బమ్మిని తిమ్మి చేయటం" అంటే బమ్మిడాయని తిమింగలం అని చెప్పి మోసగించటమే!

★ తిమిరమీను: కొర్రమీను కు మరో పేరు కావచ్చు.

★ తుండువ, రంగుచేప: "రెడ్ స్నాపర్" చేపలని పిలుస్తారు.

★ తూరీగలు: ఎగిరే చేప-ఫ్లయింగ్ ఫిష్ అంటారు. కార్ప్ ఫిష్ కు సంబంధించిన చేపలు. తెల్లగా నీటిలోంచి పైకి గెంతుతుంటాయి. "మిసిచేప"లని కూడా అంటారు. "గోపిరంగులు" అనే రకం కూడా ఉన్నాయి.

★ దబ్బర: పొడవైన ముఖం, పొట్టదగ్గర, తోక దగ్గర ఎక్కువ ముళ్ళుంటాయి.

★ దాసరి కొయ్య: హంసవింశతిలో పేర్కొన్న చేప. "దాసరికోరచేప" అనికూడా అంటారు.

★ నల్లజెల్ల: ఫైమెలోడస్ నెల్లా అనే శాస్త్రీయ నామంతో పిలుస్తారు. సైలూరస్ చేపలు అంటారు వీటిని.

★ పండుమీను, పండుచేప: "భేట్కీచేప" అంటారు. తెలుగువారికీ, బెంగాలీలకూ ఇష్టమైన చేప.

★ పండుగప్ప, పండుచేప: "జయింట్ సీ పెర్చ్" అంటారు దీన్ని.

★ పండుగొరక: "గ్రంటర్స్ చేప"లని పిలుస్తారు.

★ పరిగె: హంసవింశతి లో పేర్కొన్న పరిగె, నీరు పాపెం రెండూ యాంకోవీ చేపలే! కెల్బా చేపలనికూడా అంటారు. "చిన చేపను పెద చేప, చినమాయను పెనుమాయ" అన్నట్టు పెద్ద చేపలు ఈ యాంకోవీ చేపలను తిని బ్రతుకుతాయి. వీటిలో హానికర డొమోయిక్ ఆమ్లం ఉంటుంది. ఇది చేదుగా ఉంటుంది. ఆ చేదు పోయే వరకూ కడుగుతారు. పొరవ, పొట్టి పల్లిపొరవ, నెడుంపొరవ(మీసాల యాంకోవీ), తోక పరిగెలు(హైర్ పిన్ యాంకొవీ), నెత్తళ్ళు(కొమ్మెర్సన్స్ యాంకోవీ), బళ్ళనెత్తళ్ళు (బటావియన్ యాంకోవీ), నమలనెత్తళ్ళు(డేవిస్ట్ యాంకోవీ), గెడ్డం పొరవ, ఈక పొరవ(లాంగ్ జా యాంకోవీ) రకాలున్నాయి.

★ పాపర, పాపటమీను, పార,: వీటిని ట్రేవల్లి చేపలంటారు. తోకలపార, గుర్రంపార, కాళ్ళొదుగు, తలంపార, బండపార, పనుపుపార, పిల్లిఒదుగు,బొక్కొదుగు,తోలుపార, పసుపుతోలుపార, కంసాలితోలుపార, సన్నతోలుపార, చందువపార, అనే రకాలున్నాయని మత్స్యపరిశోధకుడు శ్రీ సి వి శేషగిరిరావు వ్రాశారు.

★ పీత: మందపీత, చుక్కలపీత, గేలాయిపీత, యెర్రిపీత, తేలురొయ్య అనే పీతలు దొరుకుతున్నాయి.

★ పుండికుప్ప: కాకినాడ, సోరంగి రేవుల్లో ఈ చేప ఎక్కువ దొరుకుతుందని, వంద పౌనుల బరువు తూగుతుందనీ, గోదావరి గెజిటీర్ లో ఉంది.

★ పెద్దమట్ట: కొబియా చేపలని పిలుస్తారు. పెద్దమట్ట, నల్లమట్ట అని రెండురకాల చేపలు దొరుకుతున్నాయి.

★ పోర: "హార్స్ మకెరెల్" అనే విదేశీ చేప ఇది. చల్లని సముద్రనీటిలో ఎక్కువ పెరుగుతుంది.

★ బడేమట్ట: బల్లి చేపలలో ఇది ఒకరకం చేప. బ్రష్ టూత్ లిజార్డ్ ఫిష్ అంటారు. ఇందులో పెద్ద బడేమట్ట, సన్న బడే మట్ట, ఇసుకదొందు లేక ఎసకదొందు రకాలున్నాయి. కృశించిపోతున్నవారికి ప్రత్యేకంగా వండి పెడతారు.

★ బుడతమాగ: "సాల్మన్ చేప"లంటారు. మాగచేప, నల్లమాచమాగ అనే రకాలున్నాయి.

★ బేడిచే, బేడిస: హంసవింశతిలో పేర్కొన్న చేప. సిల్వర్ ఫిష్ అంటారు. "సిప్రినస్ క్రిసోపేరియస్" అనేది దీని శాస్త్రీయ నామం. శఫరి, లంజబేడిస పేర్లను నిఘంటువులు ఇస్తున్నాయి.

★ బొచ్చె: "బుల్స్ ఐ" చేపలని పిలుస్తారు. ఎర్రమీను, ఎర్ర బొచ్చెలు, ఎర్రి చేపలు అనే రకాలున్నాయి. బెంగాల్ కార్ప్, జలపుష్పాలు గా ఇవి ప్రసిద్ధి. బొచ్చ, అయేర్, కాట్ల, రోహూ ఇవన్నీబెంగాల్ మైథిలీ బ్రాహ్మణులకు, బీహారీ కాయస్థులకు పవిత్రమైన చేపలు.

★ బొమ్మడాయ, దాసరి బొమ్మిడాయ: బొమ్మడాయలను హంసవింశతి ప్రస్తావించింది. ఈ నాటికీ తెలుగు నేలమీద ఇవి ప్రసిద్ధి.

★ మగజెల్ల: సాల్మన్ చేప అంటే ఇదే! "పోలింకమస్" తెగకు చెందినది. శాస్త్రీయంగా "హెమిక్యాంపూ మార్జినేటస్" అంటారు. "స్పైన్" చేపలని వీటికి పేరు. బుడత మగ అని కొన్ని ప్రాంతాల్లో పిలుస్తారు.

★ మట్టగిడస, మట్టగుడిసె,: అన్ని వ్యాధుల్లోనూ తినదగినవిగా వీటికి ప్రసిద్ధి.

★ మలుగు: మలుగు చేపల గురించి హంసవింశతిలో ఉంది. మల్గుమీను, పాపమీను, శృంగి అని కూడా పిలుస్తారు.

★ మల్లెమొట్ట: మొట్టమీను నల్లమొట్ట, ఎర్రమొట్ట అనే రకాలున్నాయి. "స్నేక్ హెడ్ చేప", "ముర్రెల్ చేప" అని పిలుస్తారు.

★ ముల్లువల: "ఊల్ఫ్ హెర్రింగ్" చేపలని వీటిని పిలుస్తారు. వీటిలో ముల్లువల, వల అని రెండు రకాలు మనకు దొరుకుతున్నాయి.

★ మాతి, మత్తి: గోధుమ వర్ణపు మూడుతోకల చేప అని పిలుస్తారు.

★ ముకుదొమ్మ: హంసవింశతిలో పేర్కొన్న చేప. ఆఫ్రికాలోని సియెర్రాలియోన్ ప్రాంతాలకు సంబంధించిన సాంఘిక జీవితం మీద వెలువడిన పుస్తకంలో 16వ శతాబ్ది నాటి ఒక ఆఫ్రికన్ జానపద గీతం ఇంగ్లీషు అనువాదం ఉంది. We eat Muku domma/Ye eat Wo domma /They eat E domma అంటూ ఆ పాట సాగుతుంది. ఇది ఆఫ్రికన్ చేప కావచ్చు.

★ ముచ్చంగి, ముచాంగి: హంసవింశతిలో పేర్కొన్న చేప. సింగపూర్ లో "చాంగి" అంతర్జాతీయ చేపల మార్కెట్ ఉంది. బహుశా ముచ్ చాంగీ అనే రెండుపదాల కూడికతో ఈ పేరు ఏర్పడి ఉండవచ్చు.

★ ముల్లువాలుగ: క్యాట్ ఫిష్ కు సంబంధించిన చేప

★ మృద్గం: వైట్ కార్ప్ అంటారు. మృగల్, అర్జు, యెర్రమోస పేర్లతో వివిధ ప్రాంతాల్లో పిలుస్తారు.

★ మెత్తడి, మెత్తళ్ళు: సముద్ర చేపలు: నూనె ఎక్కువగా ఉంటుంది.

★ రవ: దీని నడుము W ఆకారంలో ఉంటుంది. ముదురు నీలపు చేప.

★ మోరపక్కె, మోరపాక: మోరపక్కెర పేరుని హంసవింశతి ప్రస్తావించింది. దీన్ని స్వోర్డ్ ఫిష్ అంటారు.

★ మోసు: మంచినీటి సరస్సుల్లో ఎక్కువ పెరుగుతాయి. జాగ్రత్తగా తినకపోతే ముల్లు గొంతులో దిగబడుతుంది.

★ రంపపు సొర: యాహ్లా, హత్తూతిమీను అంటారు. "సా ఫిష్" పేరుతో ప్రసిద్ధం. మూతి రంపంలా ఉంటుంది. రంపపు సొర, చిన్న రంపపు సొర అనేకరకా లున్నాయి. ఇవి "స్కేట్ ఫిష్" కు సంబంధించిన చేపలు

★ రాగండి: చేపల పులుసు పెట్టుకోవటానికి అనుగుణంగా ఉండే చేప. చాలా మంది ఇష్టపడే చేప ఇది.

★ రొయ్య, సింకు రొయ్య: మృదువైన మాంసం. మెదడు వ్యాధుల్లో మంచివి. మగటిమిని పెంచుతాయి.కూనిరొయ్య,నీలకంఠ, పూరొయ్య, చింగుడురొయ్య, బొనుగురొయ్యలు మనకు దొరుకుతున్నాయని శేషగిరిరావు గారు వ్రాశారు.

★ రాతికొరుకు, రాతిగొరక: హంసవింశతిలో రాతిగొరక ప్రస్తావన ఉంది. స్నేపర్ చేపలకు సంబంధించినవి. రాక్ చేపలని పిలుస్తారు. ఎర్ర గొరక, సామర్లు అనే నామాంతరాలున్నాయి.

★ లత్తిచేప: ఎర్రగా ఉండేదనే అర్థంలొ ఈ పేరు వచ్చి ఉంటుంది. రక్తమత్స్యములనే పేరుతో, రాజనిఘంటువులో చెప్పిన ఎర్ర చేపలు.

★ వంజరం, వంజు, కోనెమ, ఎల్లరి: సీర్ చేపలని, కింగ్ ఫిష్ అనీ పిలుస్తారు. పట్టుకొన్నప్పుడు తిరగబడి పోరాడుతాయి.

★ వట్టిపరిగె: ఊరవేయకుండా ఎండించిన చేప. ఉప్పు చేపకన్నా మంచివని భావిస్తారు.

★ వడగవ్వ: ఇంగ్లీషులో మోజర్ర చేపలని పిలుస్తారు. జగ్గరి, కరిణిగవల, వరిపిండికూడెలు అనే నామాంతరాలున్నాయి.

★ వల్లిక, వల్లె, వల్లిక తట్ట: సిలురస్ బొయాలిస్ అనేది శాస్త్రీయ నామం.

★ వాలుగ: "ట్రిచివూరస్ లెప్ట్యూరస్" అనేది శాస్త్రీయ నామం. మంచినీటి షార్క్ చేపలివి. వాలువ అని కూడా పిలుస్తారు. చేపకు వాలుగ ఒక పర్యాయపదం. చేపకన్నులున్న సుందరిని "వాలుగకంటి" అంటారు. వాలుగడ అంటే, మీనకేతనుడు(మన్మధుడు). "వాలుగమీలుమిట్టిపడగ" "కొర్రమీనుల తండ్రి కొలుపులెంకలకిచ్చె, వాలుగలను సంగడీలకిచ్చె" కవిప్రయోగాలున్నాయి.

★ వాలుగటెంకి: పొలుసులెక్కువగా ఉండే చేప. "రైనోబేటస్ లేరిస్" దీని శాస్త్రీయ నామం.

★ వింజిలి, వింజరము: సీర్ ఫిష్ అంటారు. "ఇండో పసిఫిక్ సముద్రాల మత్స్యరాజం" అని దీనికి పేరు.

★ వెలిమొట్ట, వనమొట్ట, కుక్కమొట్ట, మొట్టచేప: "బోంబేడక్" చేపలని పిలుస్తారు. "బుమ్మలో చేప" లని బెంగాలీలు పిలుస్తారు. శకులము: బహుశా శల్కం అనే పేరుతో పిలిచే పొడవైన చేప ఇదే కావచ్చు. రెండు తెడ్లవంటి రెక్కలుంటాయి! దీని మాంసం ముసలితనాన్ని జయిస్తుందని రాజ నిఘంటువులో ఉంది.

★ శీలపోటు: "బర్రాకుడా" చేపలంటారు. శీలపోటు, చారల శీలపోటు అని రెండురకాలున్నాయి.

★ సావళ్ళు: డెస్మోడిమా పోలిస్టిక్టమ్ అనే శాస్త్రీయ నామంతో దీన్ని పిలుస్తారు. ఇది సముద్రం పైన కనిపించిందంటే భూకంపం గానీ సునామీ గానీ రానున్నదని ఒక నమ్మిక. సముద్రం లోపల భూకంపం స్పందనలను ఇవి పసిగట్టి నీటి పై భాగాలకు చేరతాయి.

★ సందువా చేపలు, నల్ల సందవ చేపలు: ఇవి సముద్ర చేపలు, నూనె ఎక్కువగా ఉంటుంది. వేడి చేస్తాయి. బలప్రదం. ఎక్కువగా తింటే బీపీని, వేడినీ పెంచుతాయి. పోమ్ ఫ్రెట్ట్ చేపలని పిలుస్తారు. వీటిలోనే తెల్ చేపలు కూడా ఉన్నాయి. పోమ్ ఫ్రెట్ సిల్వర్ అంటారు. చేదువళ్ళు, తెల్లసందవ అని కూడా తెలుగులో పిలుస్తారు.

★ సొరచేప,చొర, వేయి దంతాల మీను, సహస్ర దంష్ట్రి, చొరమీను, సోరంగి: పెద్ద షార్క్ చేపఅన్ని రోగాలలోనూ తినదగినవి. నల్లగా ఉండే సొరచేప అపకారం చేస్తుంది. షార్క్ చేపల్లో చాలా రకాలున్నాయి. బొక్కి సొర్ర(రిడ్జి బ్యాక్ క్యాట్ షార్క్), పులిబొక్కు సొర్ర (వేల్ షార్క్), చారల సొర్ర(జీబ్రాషార్క్), సిగసొర్ర(వైట్ చీక్ షార్క్), నల్లరెక్కల సొర్ర(బ్లాక్ షార్క్), పులి సొర్ర(టైగర్ షార్క్), పాల సొర్ర(సొర్ర), పసుపు కుక్క సొర్ర(యెల్లో డాగ్ షార్క్), కొమ్ము సొర్ర(యారోహెడెడ్ షార్క్) అనే రకాల సొర చేపలు మన ప్రాంతాల్లో దొరుకుతున్నాయని చేపల పరిశోధకుడు శ్రీ సి వి శేషగిరిరావు వ్రాశారు.

★ సోరంగి: సురంగీ అనికూడా అంటారు. "ఇండియన్ వైటింగ్ చేపలు" అని పిలుస్తారు. చేపల ప్రియులకు సొరంగి చాలా ఇష్టమైన చేప. "అరటికాసి" అని కృష్ణాజిల్లాలో అంటారు.

★ హింసా: "క్లుపియా పలసా" అనే శాస్త్రీయ నామం కలిగిన పెద్ద చేప. ధవళేశ్వరం దగ్గర బాగా దొరుకుతాయని బ్రిటిష్ కాలంనాటి గోదావరి గెజిటీర్ లో వ్రాశారు.

★ ఇవి కాక, గుర్తించవలసిన మరికొన్ని తెలుగు పేర్లున్నాయి: అల్లే, ఆకుజెల్ల, ఇంగిలిక, ఇల్లెపుచేప, కట్టచేప, కబళం, కలుగురుజు, కవసు, కొమ్ముచోర, కోయంగి, కొయ్యంగచేప,గడ్డిమోసు, గెజ్జె, గెండ, గొల్లదొందు, చలదంగం, చిక్రఫల, చిత్రఫలక, చిత్తర, చిత్రాయి,చిలిచిమం, చీరమీను, ఒడగల్లు, కంకత్రోటలు, కుంటముక్కు, గూరముక్కు, చంపలు, తొల్లిక, దొందు, నడమీను, నారజెల్ల, నాల్కచేప, పక్కే, పరిక, పూమీను, పోటగళం, మడిస, మడుగురొయ్య, మారుపు, మారువం, మావురం, మిసి, మురలం, ముల్తోలిక, రామలు, వందొందు, వాతికమీను, వోద్రము, వోదాలము, శిశుకము, సంకోచము, సవిదలు, సంపరం మొదలయిన పేర్లలో కొన్ని ప్రాచీన కాలంనాటి సాహిత్యాధారాల్లోంచి తీసినవి. వాటిలో కొన్ని ఇళ్ళ పేర్లుగానూ, ఊళ్ళపేర్లుగానూ ఉన్నాయి. క్షేత్రస్థాయిలో పరిశీలన చేస్తే మంచి సమాచారం దొరుకుతుంది. తెలుగుచేపల మీద లోతైన అధ్యయనానికి ఈ ముడిసరుకు ఉపయోగ పడుతుంది.



# నూటిడి అంటే నువ్వులద్దిన జీడి

శ్రీనాథ మహాకవి హరవిలాసంలో "ఉండ్రాళ్ళు నూటిడి పుండ్రేక్షులుం దేనె యనటిపండ్లు..." అంటూ నూటిడిని ప్రస్తావించాడు. అన్నమాచార్యులవారు "నువ్వులు, చిట్టిబెల్లాలు నువ్వుటిడియును జిన్ని మరుగులును ఎవ్వరు వేంకటపతి కెరిగించ నారగింప కివ్వకివ్వనవ్వ నాకించీజుండీ!" అంటూ, వేంకటపతికి ఆరగింపునిచ్చే ద్రవ్యంగా "నువ్వుటిడి"ని ప్రస్తావించాడు.

శ్రీ తిరుమల రామచంద్ర "సాహితీ సుగతుని స్వగతం" పుస్తకంలో "నువ్వులు కొట్టిన ఇడి నూటిడి" అని ఒక వ్యాసం ప్రచురించారు. శృంగారనైషధంలో శ్రీనాథుడు వ్రాసిన "ఉడువీథిహరినీల..." అనే పద్యానికి వేదంవారి వ్యాఖ్యను ఆక్షేపిస్తూ, కమ్మనూటిడి అంటే, నువ్వుపిండితో చేసిన వంటకం అని తేల్చిచెప్పారు.

బహుశా నూటిడి తీపి వంటకం అయిఉండాలి. ఆకాశమనే ఇంద్రనీలాల కంచంలో రాత్రి అనే ఇల్లాలు, మన్మథుడికి నెయ్యి, పరమాన్నాలతో పాటు చంద్రబింబంలాంటి నూటిడిని గోముగా వడ్డించగా చకోరాలు సహపంక్తిభోజనం చేయాలని తహతహలాడాయట!

ఇలాగే, అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయం కావ్యంలో "ఇడి రమ్మోని కుపాయనమ్ములు మనోభీష్టంబుగా బూరియలు వడలుం జక్కెర కజ్జికాయలును లాడ్వా లుక్కెరన్ పూర్ణపంగుడుముల్ గారెలు, బెల్లమండిగలు నౌగులు, కమ్మదాపట్లు నూటిడులు దోసెలు, నప్పముల్ సుకియలున్ హేరాళమై కన్పడన్..." అంటూ చేసిన ఒక వర్ణనలో కొన్ని చిరుతిళ్ళను పేర్కొన్నాడు. బూరెలు, వడల్, చక్కెరకజ్జికాయలు, లడ్డూలు, ఉక్కెరలు, పూర్ణంబూరెలు, కుడుములు, గారెలు, బెల్లమండిగలు, ఔగులు, కమ్మదాపట్లు, నూటిడులు, దోసెలు, అప్పాలు, సుకియలూ వీటిని ఒక మునికి వడ్డించటానికి తయారుచేయగా, హేరాళమై కనిపిస్తున్నాయట.

నూటిడి అంటే నువ్వుపిండి అనే అర్థం ప్రకారం, తెల్లనువ్వులను కొట్టినపిండిలో ఉప్పు, కారం తగుపాళ్ళలో కలిపిన నువ్వుపొడిని పితృకార్యాల సమయంలో తప్పనిసరిగా

వడ్డిస్తారు. ఇది జీర్ణశక్తిని పెంచుతుంది. విరేచనం చేస్తుంది. వాతవ్యాధులున్నవారికి మంచిది. లైంగికశక్తిని కూడా పెంచుతుంది. గర్భాశయ దోషాలు పోగొట్టి, నెలసరి వచ్చేలా పనిచేస్తుంది. కానీ, అన్నమయ్య నైవేద్యంగా వేంకటేశ్వరునికి పెట్టాలని కోరిన నువ్వుటిడి ఇది కాదనిపిస్తుంది. ప్రత్యేకంగా తయారుచేసిన తీపిపదార్థమే నూటిడి అయిఉండాలి.

తెల్లనువ్వుల్ని గానుగ ఆడిన తరువాత వచ్చిన పిప్పిని లేదా చెక్కని నువ్వుపప్పు చెక్క అనీ, తెలికిచెక్క అనీ అంటారు. ఈ తెలికిచెక్క పిండిని నూటిడి అనికూడా పిలిచి ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. కందిపప్పు ఉడికించి, ఈ తెలికిపిండినీ, వెల్లుల్లినీ కలిపి వండిన కూర చాలా రుచిగా ఉంటుంది. లివర్ వ్యాధుల్లో మంచిది. కీళ్లవాతం వ్యాధిలో మంచి చేస్తుంది. శరీరానికి నీరుపట్టిన వ్యాధిలో మేలుచేస్తుంది. కానీ, ఇది కూరగానే తప్ప చిరుతిండిగా తినేది కాదు కాబట్టి, ఇది నూటిడి కాకపోవచ్చు.

నువ్వులపిండి, తగినంత శొంఠిపొడి, ఉప్పు వేసుకొని గట్టి పెరుగులో కలిపి తాలింపు పెట్టుకుంటే దధిచంద్రికలా ఉండే కమ్మని పెరుగుపచ్చడి తయారవుతుంది. దీన్ని నూటిడి అనేందుకు కొంత అవకాశం ఉంది. ఇది కీళ్ళవాతం, అమీబియాసిస్ వ్యాధుల్లో గొప్ప ఔషధంగా పనిచేస్తుంది. అందరూ తినదగిన మంచి పెరుగుపచ్చడి, కానీ, శ్రీనాథుడు వర్ణించినట్టు నెయ్యీ, పరమాన్నాలతోపాటు మన్మథుడికి పెట్టదగిందిగా అనిపించటం లేదు.

శ్రీనాథుడు నూటిడిని సుధాంశు బింబంతో పోల్చాడు. చంద్రబింబంలా గుండ్రంగా ఉండేదనాలా... లేక తెల్లగా ఉండేదనాలా... అనే ప్రశ్నలు తలెత్తుతాయి. తెల్లగా, గుండ్రంగా ఉండేది అని అర్థ సమన్వయం చేస్తే, తెల్లనువ్వులు అద్ది, అప్పడాల ఆకారంలో చేసిన గుండ్రని జీడీల్లాంటి తీపిపదార్థం నూటిడి అయి ఉంటుందని ఒక ఊహ చేయవచ్చు లేదా, పొట్టు తీసిన నువ్వులనూ నానబెట్టి రుబ్బిన నువ్వులపిండిలో తురిమిన లేతకొబ్బరి, బెల్లం వీటితో చిమ్మిలి తయారుచేసి, చక్రిలాగా గుండ్రంగా చేసి, నువ్వుపప్పు అద్దితే అది నూటిడి కావచ్చు. నువ్వులకు సంబంధించింది కాబట్టి నౌజు, లౌజు, నౌజుండలు అనికూడా అంటారు. ఈ చక్రికలను అప్పాలమాదిరి నూనెలో వేయించినా రుచికరంగానే ఉంటాయి. అవికూడా నూటిడులు కావచ్చు.

శ్రీనాథ మహాకవి చేసిన వర్ణనలో నూటిడి, నెయ్యీ, పరమాన్నం ఇవి మూడూ మన్మథ కార్యానికి ఉపలబ్ధి చేకూర్చేవే కావటం గమనార్హం. నూటిడి ప్రాధాన్యత ఏమిటో దీన్నిబట్టి తేలికగా అర్థం అవుతుంది. కాబట్టి, పైన చెప్పిన ఏ రూపాలలో వండుకున్నా అన్నింటికీ ఈ గుణాలుంటాయి.



# "అన్నం - కూడు"

"భోజనాని విచిత్రాణి పానాని వివిధాని చ
వాచః శ్రోతానుగామిన్యస్త్వ చః స్పర్శసుఖాస్థథా..."

అంటూ మొదలయ్యే సూత్రం సుశ్రుత సంహిత చికిత్సా స్థానంలో ఉంది. మంచి కట్టు, బొట్టు కలిగిన నవయౌవన స్త్రీ పక్కనుండగా, చక్కని పాటలు, వినసొంపైన మాటలు వింటూ, విచిత్రమైన భోజనాలు, అనేక రకాల వంటకాలు, చిత్రమైన పానీయాలు తీసుకొని, తాంబూలం వేసుకొని, పూవులూ సుగంధ లేపనాదులు మత్తెక్కిస్తుంటే, స్పర్శాసుఖమైన ఆలోచనలతో, మనసుకు ఉత్సాహం ఇచ్చే చేష్టలతో సంతోషంగా ఉన్న ఎవరికయినా లైంగికశక్తి అనేది గుర్రంతో సమానంగా ఉంటుందని సుశ్రుతుడు పేర్కొన్నాడు.

లైంగిక సమర్థత విషయంలో గుర్రానికి పెట్టింది పేరు. గుర్రాన్ని వాజీ అంటారు. గుర్రమంత సమర్థతనిచ్చే ద్రవ్యాలను వాజీకరాలని (aphrodisiacs) పిలుస్తారు. పైన చెప్పిన కమ్మని భోజనాదులన్నీ మంచి వాజీకరాలేనని దీని అర్థం.

అన్నం అంటే, పోషించేదీ, ఆయుష్షునిచ్చేది, సంరక్షించేది! సంసార జీవితాన్ని సుఖమయం చేసేది అని 2000 యేళ్ళనాటి సుశ్రుతుడి నిర్వచనం.

'భావప్రకాశ' వైద్యగ్రంథంలో "భక్తమన్నం తథాంధశ్చ క్వచిత్కూరంచ కీర్తితం" అనే శ్లోకంలో అన్నానికి 'భక్త', అంధ', 'ఓదన', 'భిస్సా', 'దీదివి' అనే పేర్లున్నాయనీ, కొన్ని చోట్ల 'కూరం' అని కూడా అంటారనీ ఉంది. అంథ, కూరం శబ్దాలకు అన్నం అనే అర్థమే ఉందని ఈ వైద్యగ్రంథమే చెప్తోంది. కూరం అనేది అన్నానికి పర్యాయ పదం.

పదాల పుట్టుకకు సంబంధించిన నిఘంటువుల్లో 'కరి' అంటే తమిళంలో నలుపు అనీ, కారం కోసం మిరియాలు వాడేవారు. కాబట్టి, నల్లగా ఉండేదని అర్థంలో తమిళంలో 'కూర' పదం ఏర్పడిందని, అదే ఇంగ్లీషులో 'కర్రీ'గా మారిందనీ తమిళ చరిత్రకారులు వ్రాశారు.

మిరియాలనేవి పసుపులాగా రంగునిచ్చే వర్ణకాలు కావు. మిరియాలు వేస్తే ఏ ఆహార పదార్థమూ నల్లగా మారదు. తెలుగు పదసంపదను పరిశీలించకుండా ఇలా అబద్ధాలను ప్రచారం చేశారు.

ఆప్టే సంస్కృత నిఘంటువు (పే. 129)లో అన్నం అంటే, ఒక జాతి ప్రజలు, ఆంధ్రులు అనే అర్థాలున్నాయి. ఆంధ్ర భృత్యా అనే మాటను ఉదహరించి, 'ఆంధ్రరాజవంశము' అని దానికి అర్థాన్ని చెప్పారు. ఆంధ్రభృత్యులుగా శాతవాహనులు తమని తాము చెప్పుకొన్నది తాము ఆంధ్రరాజులమనే అర్థంలోనని, ఈ ఆంధ్రులను అన్నం పేరుతో కూడా పిలిచారని ఆప్టే నిఘంటువు వలన తెలుస్తోంది.

ఆంధ్ర అనే పదానికి అన్నం, ఆంధ్రులు అనే అర్థాలు కూడా వున్నాయి. స్వయంగా ఆంధ్రుల్నే అన్నం అని పిలిచినట్టు నిఘంటువులే పేర్కొంటున్నాయి. మరణం లేని వారనే అర్థంలో అమృతాంధసులనే పదం కనిపిస్తుంది.

కానీ, మన పెద్దలు జైన కథల్లోని అంథకుడి వృత్తాంతం తీసుకొని మనల్ని శాపగ్రస్తులుగా చిత్రించారు. పురాణేతిహాస బ్రాహ్మణాదులు భాషాజాతిపరంగా మనకు చేసిన అన్యాయం ఇది.

ప్రోటో ఇండో యూరోపియన్ పదరూపాల్లో 'అంథ్' శబ్దానికి మనిషి అనే అర్థమే ఉంది. anthropology అనే మానవ సంబంధ శాస్త్రంలో anth అంటే మనిషి, అంతేగానీ గుడ్డి కాదు. అంథ్ అంటే మనిషి. అంథ్ అంటే ఆంధ్రుడు. అంథ్ అంటే అన్నం, అన్నం

అంటే ఆంధ్రుడు. ఆంధ్ర శబ్దం భాషా జాతిగా మొత్తం తెలుగు ప్రజలకు వర్తించే పదం. ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే ప్రజలు ఆహారాన్ని అన్నం అనటం ఉంది.

తెలుగు ప్రజల్ని ఆంధ్రులని పిలిచింది ఆర్యులే! కాబట్టి ఆంధ్ర శబ్దానికి అర్థాన్ని ఆర్యభాషా కూటమి (ఇండో-ఆర్యన్ ఫ్యామిలీ ఆఫ్ లాంగ్వేజెస్)లో వెదకటం అవసరం. గ్రీకు, లాటిన్ భాషలు ఈ కూటమిలోనివే! లాటిన్ భాషలో 'అంధ్' అంటే మనిషి. సంస్కృతంలో కూడా అంధ్, అంటే మనిషే! ఉన్నతమైన మనుషులనే అర్థంలో "ఆంధ్రులు" పిలవబడ్డారు. 'అంధ్' అంటే అన్నం కూడా! అన్నానికి 'కూరం' అనే నామాంతరం వుంది. 'కూడు' అనే పదానికి 'కూరం' మూలం కావచ్చు.

అన్నం గురించిన విశేషాలు మరికొన్ని ఉన్నాయి. వియత్నాం దేశాన్ని 1945 వరకూ 'అన్నం దేశం' అనీ వియత్నా మీయుల్ని అన్నామైట్స్ అని పిలిచేవారు. బావోదాయి చక్రవర్తి 'వీయేత్-నమ్' అనే ప్రాచీన కాలం నాటి పేరు వ్యాప్తిలోకి తెచ్చాడని చరిత్ర. 16వ శతాబ్దిలో క్రైస్తవ మిషనరీల ద్వారా ఈ దేశం బైట ప్రపంచానికి తెలిసింది. అన్-నన్: అంటే, చైనా భాషలో 'దక్షిణ భాగం' అని అర్థం. అత్యంత ఆశ్చర్యకరంగా 'ద్రావిడ' పదానికి దక్షిణానికి వెళ్ళినవారు అనే అర్థమే ఉంది. పార్శీ భాషలో అన్నం అంటే, మేఘాలు. గేలిక్ భాషలో ఆత్మ. తమిళంలో హంస. టర్కీలో అమ్మ. అరెబిక్ భాషలో దేవుని వరం అని! 'తహ్మీమా అనమ్' అనే బంగ్లాదేశీ ఆంగ్ల రచయిత్రి పేరులో 'అనమ్' అంటే అర్థం వరపుత్రి అని!

భారతదేశం మొత్తం మీద ప్రధాన ఆహారంగా అన్నం తింటున్నది ఒక్క తెలుగువాళ్ళే! ఉత్తరాదివారు రోటీ అని, దక్షిణాదివారు సాపాటు అనీ పిలుస్తారు. అన్నంతో ముడిపడిన తెలుగువారి జీవన విధానం గురించి మనం మరో కోణంలోంచి అధ్యయనం చేయాల్సి ఉంది. ఇంతకీ అన్నం సంస్కృత పదమేనా? అయితే, ఆంధ్రుల్ని అన్నం అని అందుకే పిలిచారు.



# పంచదార-కొత్త సంగతులు

ఆదిమ మానవుడు అధిక శక్తిదాయకమైన పంచదార పదార్థాల కోసం ఎక్కువ వెదికాడు. కారం, మషాలాలకన్నా తీపి పదార్థాలే ముందు పుట్టాయి.

ప్రతి ఆహార ద్రవ్యంలోనూ అంతో ఇంతో పంచదార ఉంటుంది. దాన్ని శరీరానికి సక్రమంగా అందించటం ఎంత అవసరమో, అతిగా తీసుకోకుండా అదుపు చేయటం కూడా అంతే అవసరం.

పంచదార ఒక ఔషధం. దాన్ని ఔషధం లాగానే తీసుకోవాలి. అతి సర్వత్రా వర్జయేత్ అన్నారు. పంచదార విషయంలో ఇది మరీ ముఖ్యం.

## తెలుగు బౌద్ధుల కానుక-పంచదార

క్రీస్తుశకం తొలి శతాబ్దాల నాటి తెలుగు బౌద్ధులకూ, పంచదారకూ విడదీయరాని సంబంధం ఉంది. పాళీభాషలో "పన్ చెన్" అంటే, బౌద్ధపండితుడని అర్థం. పంచదార అంటే, పన్చెన్+దార=బౌద్ధ సన్యాసుల బహుమతి అని అర్థం.

ఒకప్పుడు బౌద్ధం విస్తరించి ఉన్న సముద్ర తీరపు తెలుగు ప్రాంతాల్లో ప్రజలు ఈనాటికీ పంచదార అనీ, తక్కిన తెలుగు ప్రాంతాల్లో చక్కెర అనీ పిలుస్తారు. దీన్ని బట్టి, పంచదారను తెలుగు బౌద్ధులే సృష్టించి ఉంటారని నమ్మకంగా అనిపిస్తుంది. పంచదార తయారీలో తెలుగు వారికి గల ప్రాధాన్యతకు ఈ నిరూపణ ఒక తార్కాణంగా చెప్పుకోవచ్చు.

దీన్ని నిరూపించటానికి బౌద్ధకాలపు తెలుగు సాహిత్యం ఏదీ దొరకనప్పటికీ క్రీ.శ. తొలిశతాబ్దాలకు చెందిన మహాకవి కాళిదాసు తెలుగువారి చెరకుతోటల గురించి చేసిన వర్ణన ముఖ్య ఆధారం. "ఇక్షుచ్ఛాయానిషాదిన్యస్తస్యగోప్తుర్గుణోదయమ్(రఘు. 4వ సర్గ, 20వ శ్లోకం)" అనే శ్లోకంలో చెరకు తోటల నీడలో కూర్చొని ఆడవాళ్ళు వరి చేలకు

కాపలాకాస్తూ రఘుమహారాజు జీవిత గాథని పాటలుగా పాడుకొన్నారని వర్ణిస్తాడు. ఇది 2000 యేళ్ళనాటి తెలుగువారికి చెరకు పంటతో ఉన్న అనుబంధాన్ని చాటి చెప్తోంది.

చెరకు, చక్కెర చక్కని తెలుగు మాటలే! జి బ్రొన్నికోవ్ రూపొందించిన ద్రవిడియన్ ఎటిమాలజీ నిఘంటువులో "చెరు-క్" అనేది 'మూల తెలుగు పదం'గా పేర్కొన్నారు. సెర్క్, చెర్-అక్, చెర్ ఓక్... ఇలా వివిధ ద్రావిడ భాషలలో చెరకుని పిలుస్తారు. దధిమండోదక దివ్యా: ఖండశర్కరవాలుకాః" అనే నిర్వచనం ప్రకారం శర్కర అంటే, చెరకు రసాన్ని ఘనీభవింప చేసిన తియ్యని పలుకులు అని. అరెబిక్ "షుక్కర్" లోంచి సంస్కృత శర్కర, ఇంగ్లీష్ షుగర్ పదాలు ఏర్పడ్డాయని కొన్ని నిఘంటువులు చెప్తున్నాయి. ఇటలీ వ్యాపారులు దీన్ని ఇంగ్లండుకు పరిచయం చేశారట. ఇటాలియన్ భాషలో జుక్కెరో, పోర్చుగీసు భాషలో అజుకర్, అచ్చుకర్, ఫ్రెంచ్ భాషలో సుక్రీ అంటే చక్కెర.

ఆఫ్రికన్లకు కూడా చెరకు అనాదిగా తెలుసు. ఆఫ్రో ఏసియాటిక్ భాషల మూలరూపాలలో "చర్" అనే పదానికి "ఒక చెట్టు" అని అర్థం కనిపించింది. ప్రాచీన ఈజిప్షియన్ "శర్", తూర్పు చాదిక్ భాషలో "చర్-క్" అంటే పొదలా పెరిగే చెట్టు అని అర్థం ఉంది. అంటే, తెలుగు చెరుకు పదానికి ఆఫ్రికన్ మూలాలు ఉన్నాయన్నమాట! నైలూ నుంచి కృష్ణ దాకా జాతుల వ్యాపనానికి ఈ చెరకు పదం ఒక సాక్ష్యం అవుతుంది. పొయ్యిలో పెట్టే ఇంధనానికి వంటచెరకు అనే ప్రయోగం ఉంది. సెరగు లేక చెరకు అంటే నరికి పోగులు పెట్టటం అని! ఇవన్నీ చెరకుతో తెలుగు రైతులకు గల అనుబంధానికి సాక్ష్యాలు.

## పంచదార చరిత్ర

న్యూగినియా ప్రాంతంలో 10,000 యేళ్ళ క్రితమే చెరకును పండించారని చరిత్ర చెప్తోంది. కాగా చెరకు రసం నుండి పంచదార తయారు చేసిన ఘనత భారతీయులకే దక్కుతుంది. అలెగ్జాండర్ సైనికులు ఇండియా నుంచి వెళ్ళేప్పుడు తేనెపొడి (honey powder) పేరుతో పటిక పంచదార పొడిని కొని తీసుకు వెళ్ళారట. అప్పటి దాకా పాశ్చాత్య ప్రపంచానికి చెరకు తెలిసినప్పటికీ పంచదార గురించి తెలీదు.

9 వ శతాబ్దంలో అరబ్బీ వ్యావసాయక విప్లవం తరువాత పంచదారతో తీపి పదార్థాల తయారీ అక్కడ ఒక పరిశ్రమగా అభివృద్ధి చెందింది.

క్రీ.శ. 606-647 శ్రీహర్షుడి కాలంలో భారతదేశం నుంచి వెళ్ళిన వర్తకులు చెరకు పంటను తాంగ్ చైనాకు పరిచయం చేశారు. అక్కడి పాలకుడు తాయిజాంగ్ ప్రోత్సాహంతో క్రీ.శ. 647లో చెరుకుని తొలిసారిగా పండించారు.

అమెరికా ఖండాన్ని కనుగొన్నాక అక్కడ చెరకు పంటకు అనుకూలతను గమనించారు. 16 వశతాబ్ది నాటికి షుగర్ పరిశ్రమలు బ్రెజిల్ మొదలైన దేశాల్లోకి విస్తరించాయి. ఆ విధంగా 17వ శతాబ్దపు పారిశ్రామిక విప్లవం రావటానికి పంచదార మిల్లుల వ్యాప్తి కూడా ఒక కారణం అయ్యింది. అయితే, అమెరికాలో చెరకు పంటలను పండించేందుకు బానిస కూలీల వ్యాపారానిక్కూడా ఇది దారితీసింది. చెరకు పంట కోసం 1838 వరకూ వెస్టిండీసుకు నాలుగు మిలియన్ల మంది ఆఫ్రికన్ కూలీల్ని బానిసలుగా పట్టుకెళ్ళారట.

చెరకు రసాన్ని మరగబెట్టి ఘనీభవింప చేసిన మొలాసెస్ లోంచి పంచదార తయారు చేసే పద్ధతిని 1850లో డేవిడ్ వెస్టన్ అనే అమెరికా శాస్త్రవేత్త కనుగొన్నాడు. ఇవన్నీ ప్రాచీన భారతీయ విధానాలకు పెంపులే!.

18వ శతాబ్దిలో బీట్ పంచదార (బీట్ రూట్ నుండి పంచదార) తయారీని Andreas Marggraf అనే జెర్మనీ శాస్త్రవేత్త అభివృద్ధి చేశాడు. కానీ, జెర్మనీ దీన్ని వాణిజ్య స్థాయిలో ఉత్పత్తి చేయలేకపోయింది. అంతలో నెపోలియన్ యుద్ధాల కారణంగా ఆనాడు ప్రపంచ వాణిజ్య రహదారులన్నీ మూసుకు పోవటంతో పంచదారకు కరువు ఏర్పడింది. బెంగాల్ గవర్నర్ ఈస్టిండియా కంపెనీ పక్షాన ఇంగ్లండ్ కు సరిపడినంత పంచదారని ఇండియాలో తయారు చేయించి పంపుతానని హామీ ఇచ్చాడట. అప్పటికప్పుడు బెంగాల్, బీహారు ప్రాంతాల్లో పంచదార ఫాక్టరీలు వెలిశాయి. అలా పంచదార ప్రధాన తీపి ద్రవ్యంగా వర్ధిల్లింది.

ఈ పంచదార తయారీలో తెలుగువారి పాత్ర గురించిన అధ్యయనం జరగలేదు. భారతదేశం అంటే ఉత్తరాది మాత్రమేననే చరిత్రకారుల అభిప్రాయం కారణంగా తెలుగువారి చారిత్రక పాత్ర గురించి కనీస పరిశీలనలు లేవు. 'పంచదార' అనే "పలుకు" వెనుక తెలుగువారి కృషి వుంది. చెరుకు పండించిన తొలి రైతులు తెలుగువారే! పంచదార మీద అధారిటీ వారిదే.



# పకోడీల్లో "కోడి"

**య**శోద తన ముంగిట ముత్యం బాలకృష్ణుడికి రకరకాల వంటకాలు చేసి, ప్రేమమీరా తినిపించింది. అందులో పకోడీలు కూడా ఉన్నాయని సూరదాసు వర్ణించాడు. అంటే, సూరదాసు కాలానికి పకోడీలు తెలుసన్నమాట. పకోడీలో "కోడి" ప్రత్యేకంగా కనిపిస్తోంది. ఈ "కోడి" ఏమిటీ?

'కోడి' అనే శబ్దానికి గుడ్డు పెట్టే కోడి అనే అర్థంతో పాటు, చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి పల్లంగా ఉన్న వైపున కట్టిన ఒక రాతి కట్టడం అనీ, కోడీ అనే ఒక "బంగారు ఆభరణం" అనీ అర్థాలు కనిపిస్తాయే గానీ ఒక భక్ష్యవిశేషం అనే ప్రత్యేకమైన అర్థం లేదు. కోడితనం అంటే హేళన. కోడిగం అంటే ఒక శృంగార చేష్ట, వంచన, కొంటెతనం!

సామాజిక వ్యవహారాలన్నింటికీ ఒక ఎన్ సైక్లోపీడియా లాగా ఉపయోగపడే "హంసవింశతి" తెలుగు కావ్యంలో 'కోడిబడి' అనే వంటకం గురించి ఉంది. పిల్లలు ఇష్టంగా తినే ఒక దినుసు, పిండివంట అని దీనికి శబ్దరత్నాకరం మొదలైన నిఘంటువుల్లో అర్థం ఇచ్చారు. పకోడీకీ ఈ కోడిబడితో సంబంధం ఉందా అనేది అనుబంధ ప్రశ్న! కోడితో చేసిన వడలు "కోడివడలు". ఈ "కోడివడ" జనవ్యవహారంలో కోడిబడిగా మారి ఉండవచ్చు. మరి ఈ "కోడి" ఏమిటీ? చికెన్ అనేయడం తొందరపాటు.

షుమారుగా పాతిక వరకు ద్రావిడ భాషలు మాట్లాడే ప్రజలు భారత దేశంలో జీవిస్తున్నారు. జి బ్రొన్నికోవ్ రూపొందించిన "ద్రవిడియన్ ఎటిమాలజీ" అనే నిఘంటువులో Kodi పదానికి "జొన్నలు" అనే అర్థం కనిపిస్తుంది. "కోళ్ళు" అంటే, జొన్నలు. చోళ్ళుగా కూడా ఇవి ప్రసిద్ధి పొందాయి. తైదులంటే, రాగులు. గంటె లంటే,

సజ్జలు. కోడిపిండి లేదా జొన్న పిండితో చేసిన చిరుతిండి వంటకాలను పకోడీ, చేకోడి పేర్లతో పిలిచి ఉంటారనే నిర్మాణాత్మక ఊహతో మనం కొంత ముందుకు కదలవచ్చు.

'పకోడీ' అనే వంటకం 'పకోరా' "పక్వవటుకం" అనే సంస్కృత పదం లోంచి ఏర్పడిందని కొందరి అభిప్రాయం. భారతీయ వంటకాలన్నింటినీ పంజాబుకో, గుజరాతుకో, బెంగాలీలకో అంటగట్టి రాయటం వలన, పకోడీల విషయంలో దక్షిణాది వారి పాత్ర , తెలుగువారి పాత్ర ఉన్నదని ఎవ్వరూ ఆలోచించినట్టు కనిపించదు. ఒకవేళ ఆలోచించినా తమిళం వరకూ చూసి వదిలేశారు. అనాదిగా తెలుగువారికి చరిత్ర పరంగా జరుగుతోన్న అన్యాయం ఇదే కదా!

చెకోడీలూ, పకోడీలూ అతి ప్రాచీనకాలం నుంచీ మనవే! వీటి మీద ఏ ఇతర జాతీయులకూ పేటెంట్ హక్కులు ఇవ్వాల్సిన అవసరం లేదు. "కోడి" అత్యంత ప్రాచీన ద్రావిడ పదం. వాటిని మొదట ద్రావిడ జాతులవారే తయారు చేశారు. మన నుంచే దేశమంతా అందుకున్నారు. ప్రపంచం అంతా ఇవి వ్యాపించాయి. ఇప్పుడంటే, చిరుతిళ్ల తయారీకి శనగ పిండి లేదా మైదా పిండిని తప్పకుండా వాడుతున్నారు గానీ, ఒకప్పుడు రాగులు, జొన్నలు, సజ్జలతోనే వీటిని చేసుకొన్నారు. ఇంతకీ 'చేకోడి' అంటే కోడిపిండి (జొన్నపిండి) ముద్దని బలపంలా చేసి చేతిమీద గుండ్రంగా ఉంగరంలా చుట్టి వేయించిన వంటకం.

'పకోడి' అంటే పక్వం కావలసిన ఉల్లి, వెల్లుల్లి వగైరా ద్రవ్యాలను జొన్నపిండిలో కలిపి వేయించిన వంటకం.

ఇలానే, కోడి వడలు, కోడి గారెలు, కోడిగవ్వలు, కోడి చక్కిలాలు వండుకొంటే షుగరు రోగులకు మేలు చేస్తాయి. పకోడీలను కూడా రాగిపిండితో వండుకొని చూడండి. తెలుగు సంస్కృతి రుచి తెలుస్తుంది. పకోడీలకు ఆ రుచిని ఇస్తున్నవి ఉల్లి, కరివేపాకు, అల్లమే గానీ శనగ పిండి కాదు. రాగిపిండి లేదా జొన్నపిండితో పకోడీలు వండి వడ్డిస్తే, చాలా బావున్నాయని అడిగి మారు వడ్డించుకొంటారు



# గింజల పండు

**స్తనగుళుచ్ఛ వధూ దేహదాడిమీ ల**
**తామతల్లికపై హోమ ధూమ మదరె**
**భర్త కభిమత రతిమహా ఫలవిపాక**
**మగుటఁ గోరి ఘటించుదోహద మనంగ**

(అల్లసాని పెద్దన విరచిత స్వారోచిష మనుసంభవము)

మనోరమా స్వరోచుల వివాహ వేడుకల్ను వర్ణిస్తున్నాడు పెద్దన. పెళ్లి సందర్భంగా పెద్దయెత్తున హోమం జరుగుతోంది. రకరకాల వనమూలికలు ఉపయోగిస్తో హోమం చేస్తున్నారు. హోమగుండంలోంచి హోమధూమం ఉవ్వెత్తున్న లేస్తోంది. గుత్తుల వంటి స్తనములతో, సన్నని నాజుకైన తీగలాంటి దానిమ్మ కొమ్మలా ఉన్న పెండ్లికుమార్తె మనోరమ శరీరానికి మూలికాయుక్తమైన పొగ తగుల్తోంది. దానిమ్మ మొక్కకి పరిమళద్రవ్యధూపం వేస్తే అది త్వరగా పుష్పించి ఫలిస్తుంది. ఈ హోమధూమం కూడా మనోరమకు ఆ విధంగా దోహదపడ్తుందని భర్త స్వరోచుడికి ఇష్టమైన 'రతిమహాఫలం'ని అందించటానికి అది దోహదక్రియలాగా ఉన్నదని వర్ణిస్తాడు పెద్దన.

లైంగికశక్తిని, పురుషుడిలో శుక్రకణాలను దానిమ్మగింజలు పెంపుచేస్తాయి. అందుకే దానిమ్మని 'బీజాలపండు' అంటారు. గ్రీకుల రతీదేవి "అఫ్రొడైట్"కి ఇష్టమైన ఫలం అనీ, లైంగిక శక్తిని ద్విగుణం బహుళం చేస్తుందనీ ప్రాచీన గ్రీకులు కూడా నమ్మారు. జొరాష్ట్రియనిజం ప్రకారం "దానిమ్మ" అనంతజీవితానికి సంకేతం.

3,500 ఏళ్ళ క్రితమే దానిమ్మను ప్రేమ సంకేతంగా చిత్రిస్తూ, సాల్మన్‌రాజు దేవాలయంలో కొన్ని గోడబొమ్మలున్నాయి. దానిమ్మపండు కిరీటం ఆకారంలో సాల్మన్‌రాజు

కిరీటము ఉండేదిట. బైబిలు 'సాల్మన్‌పాట' ప్రకరణంలో మానవుల ప్రేమబంధాన్ని సూచిస్తూ దానిమ్మని ప్రస్తావిస్తుంది.

ప్రాచీన ఈజిప్షియన్లకు ఎర్రదానిమ్మ పవిత్ర ఫలం. ఫారోలు (పితృదేవతలు) తిన్న పండు అని వారి నమ్మకం. "టుట్" అనే ఈజిప్షియన్ రాజు సమాధిలో ఆయనతోపాటు దానిమ్మ పండ్లున్న బుట్టకూడా ఉంది.

రోమియో జూలియట్లు కిటికీకి ఇవతల గదిలో పెళ్లి నిర్ణయం తీసుకుంటున్నారు! కిటికీకి అవతల దానిమ్మచెట్టుమీద కూర్చుని దానిమ్మపండు తింటోంది పక్షి... ఈ రెండింటినీ ఒక సింబాలిజంగా చిత్రిస్తాడు షేక్స్పియర్.

ప్రాచీన ఇటలీ రాణి "ఎలియోనోరా డి తొలెడో" కట్టుకునే బట్టలమీద దానిమ్మపండ్ల బొమ్మలు ఉండేవిట. ఏడుగురు సంతానానికి తల్లి ఆమె. మాతృత్వానికి చిహ్నంగా ఆమె ఈ 'దానిమ్మచీర' కట్టుకునేదిట.

అనార్కలి కథలో దానిమ్మ (అనార్) 'ప్రేమ'కు ప్రతిబింబం. "ఎండిపళ్లెంలోనా ఎన్నపూసెట్టీ దానిమ్మరసంలో జలకమాడిన వయ్యారి" గురించి భువనచంద్ర ఒక పాట రాశాడు. వెన్నరాసుకుని దానిమ్మరసం పట్టిస్తే చర్మం మృదువుగా నిగనిగలాడుతుంది. అదీ దానిమ్మరసంలో జలకమాడితే లాభం.

"హరి నఖర భిన్న మత్త మాతంగ కుంభ రక్త ముక్తాపల సదృశాని దాడిమీ ఫల బీజాని" తన ఎర్రని ముక్కుతో ఒక చిలుక దానిమ్మపండుని చీల్చి గింజలు తింటోంది. 'హరినఖం' (సింహం పంజా)తో మత్తగజ కుంభస్థలాన్ని చీల్చినప్పుడు ఎర్రని చిలుకముక్కుమీంచి ఎర్ర దానిమ్మరసం స్రవిస్తుంటే చీలిన ఏనుగు కుంభస్థలం మీంచి కారే రక్తంతో తడిసిన ముత్యాలహారంలోని ముత్యాల్లా ఆ దానిమ్మగింజలు ఉన్నాయని వర్ణిస్తున్నాడో కవి.

'దాడకం' అనే సంస్కృత పదానికి కోరపన్ను, పళ్ల సమూహం అని రెండర్థాలు ఉన్నాయి. దంతాల ఆకారంలోని గింజల సమూహం అనే అర్థంలో దానిమ్మని 'దాడిమః" అని పలిచారు. పుల్లపుల్లగా, తియ్యతియ్యగా ఉంటుంది కాబట్టి, తెలుగులో 'దాడినిమ్మ' అన్నారు. అది జనవ్యవహారంలో దానిమ్మ అయ్యింది.

దానిమ్మ నిండా గింజలు అంటే 'గ్రైన్స్' ఉంటాయి. కాబట్టి గింజలపండు అనే అర్థంలో 'పోమెగ్రనేట్' అని ఫ్రెంచిలోనూ ఆంగ్లంలోనూ పిలిచారు. గట్టి బెరడు కలిగింది కాబట్టి

'కరక' అనికూడా దీన్ని పిలుస్తారు.

కొన్ని దేశాల్లో క్రీస్తుకు స్వాగతం చెప్పేందుకు క్రిష్టమస్ రావటానికి ముందు దానిమ్మపండుని గుమ్మానికి వ్రేలాడదీస్తారట. బూడిద గుమ్మడికాయని మనవాళ్లు గుమ్మాలకు వ్రేలాడదీసినట్టు కొన్ని ప్రాంతాల్లో డిసెంబరు 31 అర్ధరాత్రి దానిమ్మపండుని ఇంటి మండిగానికి తగిలేలా గట్టిగా విసిరికొడతారు. ఎన్ని గింజలు ఇంట్లోకి ఎగిరిపడితే అంతగా ఆ ఇల్లు పుత్రపౌత్రాభివృద్ధితో కళకళలాడుతుందని! మనం ఎర్రగుమ్మడికాయనీ ఇలానే పగలకొడతాం. గుడికి కొబ్బరికాయల్లా చర్చికి దానిమ్మపండ్లు తీసుకువెళ్లే వాళ్లూ ఉన్నారు.

రాజుగారొకాయన దారితప్పి అలిసిపోయి, దప్పికతో బాధపడుతూ ఓ దానిమ్మతోట దగ్గర ఆగాడు. ఆయనే రాజని తెలియకపోయినా తోటమాలి దానిమ్మరసం తీసిచ్చాడు. దాహం, అలసట తీరాక ఆ రాజు "దానిమ్మ పళ్ళతో నందనవనంలా ఉన్న ఈ తోటని స్వాధీనం చేసుకోవాలి!" అని మనసులో అనుకుంటూ ఇంకొంచెం పళ్లరసం కావాలని అడిగాడు. తోటమాలి మరో పెద్ద దానిమ్మపండు కోసి పిండబోతే చుక్కరసం కూడా రాలేదు. ఎన్ని కాయలు కోసినా రసం రావట్లేదు. ఎందుకిలా జరుగుతోందని అడిగాడు రాజు.

"అయ్యా! దానిమ్మపండు దేవఫలం. రాజ్యాన్ని పాలించే రాజు సహృదయంతో పాలిస్తే దానిమ్మలు తియ్యరసాలు స్రవిస్తాయి. మొదటిసారి దానిమ్మను పిండినప్పుడు రాజు మంచి మనసుతోనే ఉన్నాడు. ఇంతలోనే రాజుగారికి ఏదో దుర్బుద్ధి పుట్టినట్టుంది. అందుకే, దానిమ్మలు తమ రసాలను ఉపసంహరించుకున్నాయి" అన్నాడు తోటమాలి.

పాలకులు మానవతా పరిధుల్ని దాటితే ప్రకృతి తన కరుణరసాన్ని ఉపసంహరించు కుంటుంది.



# తెలుగు అరిసె

సంక్రాంతిని తమిళులు పొంగలి పండుగ అని పిల్చుకుంటారు. అందుకని విష్యూ హేపీ పొంగల్ అని చెప్పుకొంటారు. తెలుగువారికి సంక్రాంతి అరిసెల పండుగ! పాయసాన్ని ప్రతీ పండక్కీ మనం వండుకుంటాం. కానీ, సంక్రాంతికి మాత్రం అరిసెలు తప్పకుండా వండుకుంటాం. అరిసెల పండుగరోజు అరిసె శుభాకాంక్షలు చెప్పుకోవాలి మనం...అంతగా ఇంగ్లీషులోనే చెప్పుకోవాలని ఉంటే విష్ యూ ఎ హేపీ అరిసె అనండి. అందులో తెలుగుదనం ప్రతిధ్వనిస్తుంది.

అరిసె మనది కాదనే అపోహ మనలో చాలామందికి ఉంది. అరిసెలు వండకుండానూ, తినకుండానూ మనకు సంక్రాంతి వెళ్లదు. పెళ్ళిళ్లకు, పేరంటాలకూ అరిసె ఈనాటికీ తప్పనిసరే! పాపాయి నిలబడి అడుగులేస్తోందంటే సంబరంగా అరిసెలు పంచుతారు. అరిసెలమీదే నడిపిస్తారు. ఇంగ్లీషువాడికి కేక్‌వాక్, క్యాట్‌వాక్‌లున్నాయి. మనది అరిసె నడక! అరిసె తెలుగింటి వైభోగానికి తీపిగుర్తు. తీపి భక్ష్యాలకు రారాజు అరిసె.

మన గ్రామాలలో ఆడవాళ్లందరూ ఒకచోట కూర్చుని సామూహికంగా అరిసెలు వండుకొంటారు. అరిసెలు తయారుచేయటంలో నిష్ణాతులైన మహిళలు వారికి సహకరిస్తుంటారు. బెల్లాన్ని పాకం పట్టేప్పుడు ఖరపాకం కాకుండా జాగ్రత్త పడాలి. అక్కడే అనుభవం అవసరం అవుతుంది.

అరిసె ఎంతచక్కని తెలుగుపేరూ...? మన నిఘంటుకర్తలు ఈ తెలుగుపేరును ఎలా విస్మరించారో అర్థంకాదు. గిడుగువారు ఆక్షేపించినట్టు సూర్యరాయాంధ్ర నిఘంటు కర్తలకు అరిసె తెలియదా...? అరిసె లేదా అరిశస్సు అంటే మొలలు, మూలవ్యాధి అనే అర్థమే ఇచ్చారుగానీ, కమ్మని తీపి భక్ష్యం అనటానికి చెయ్యి రాలేదు. "నల్లేరు రసము తోడం బెల్లం గల్కంబు పిండి చిటి బెల్లంబున్ జెల్లించి యాపు నేతన్ దెల్లంబైనట్టు దీనిన

దీరున్నరిసెల్" అని మొలలు తగ్గటానికి నల్లేరురసంతో చెప్పిన ఒక వైద్యప్రయోగాన్ని సూర్యరాయంధ్ర నిఘంటువు ఉదహరించింది. అర్శః అనే సంస్కృతపదానికి భ్రష్ట రూపం ఈ అరిసె. నిఘంటు కర్తలకు ఈ మూలశంక గుర్తుకొచ్చిందిగానీ తెలుగింటి తీపివంటకం గుర్తుకు రాకపోవటం ఆశ్చర్యమే! అరిసెలనే తెలుగు తీపి వంటకానికి ఈ అర్శః అనే సంస్కృత మూలవ్యాధికీ ఏ సంబంధమూ లేదు.

హర్షము, హరుసం, అరిచం, అరిసె అంటే ఆనందం. ఇవి సంస్కృత హర్షానికి తెలుగు రూపాలు. సంస్కృతంలో అరిసెని "అతిరసం" అంటారు. కానీ, ఈ పేరు కూడా అంతగా ప్రసిద్ధికాదు. సూర్యరాయాంధ్ర నిఘంటువులో అతిరసం అనే పదానికి ఒక భక్ష్య విశేషం అని సరిపెట్టారేగానీ, అక్కడ కూడా అరిసె అనే తెలుగుమాటని ఇవ్వలేదు.

తెలుగు నిఘంటువును కూర్చేందుకు కూర్చున్నవారికి కొన్ని తెలుగుమాటల పట్ల అసహనం ఉండడం ఆశ్చర్యమే! "అలివేణి నీ చేతి యతిరసరుచి రసజ్ఞానందమాయె నేమనగవచ్చు..." అని ఒక ఉదాహరణను పేర్కొన్నారు. శబ్దార్థ చంద్రికలో మాత్రం అతిరసం అంటే భక్ష్యవిశేషం, అరిసె అని అర్థాలు కనిపిస్తాయి. తెలుగు వ్యుత్పత్తి కోశంలో అసలీ పదమే ఇవ్వలేదు. ఆప్టే సంస్కృత నిఘంటువులో కూడా "అతిరస" అనే పదానికి భక్ష్య విశేషమైన అర్థమే ఇవ్వలేదు. మరి ఈ తెలుగు అరిసెలు ఎక్కడివి?

"అరిసి" అనే పదానికి తెలుగులో వరిబియ్యం అని అర్థం. అరిసెతో చేసే వంటకం కాబట్టి అరిసె అయ్యింది. కన్నడం, కొండభాషలలో అక్కి అంటె బియ్యం. తుళు, తమిళ భాషలలో అరి అంటె బియ్యం. బాగుచేసిన బియ్యాన్ని తమిళంలో అరిచి అని కూడా పిలుస్తారు. వరిగింజలపైన ఊక, తవుడు చిట్టు వగైరా తీసేయగా వచ్చిన బియ్యాన్ని అరి, అరిసి, అరిచి పేర్లతో పిలిచారు. "అరి" ద్రావిడ భాషా పదం! "వరి" బహుశా ఆస్ట్రోనేషియన్ "ముండా" తదితర భాషల్లోంచి స్వీకరించబడింది కావచ్చుననీ మైకేల్ విజ్జెల్‌లాంటి పండితుల అభిప్రాయం. వరిని paddy అనే అర్థంలో తెలుగులో ప్రయోగిస్తున్నాం. "నివ్వరి" అనే ధాన్యం కూడా ఉన్నట్టు కవి ప్రయోగాలను బట్టి తెలుస్తుంది. కేరళలోని పాలక్కాడులో "నివ్వార బియ్యం" పేరుతో ఎఱ్ఱని బియ్యం పండుతాయి. నివ్వరి బియ్యం అంటే ఈ కేరళ 'నివ్వార బియ్యమేనా అనేది పరిశీలించాలి.

అరి అనే తెలుగు పదానికి పన్ను, కప్పం అనే అర్థాలు కూడా ఉన్నాయి. అరి అంటే వరిపంట మీద విధించే పన్ను. పన్ను కట్టి రైతును అరికాపు అంటారు. యజమాని అయిన ప్రభువును అరుసు, అరసు అంటారు. ఇది తెలుగు దేశ్యపదం. తిమ్మరుసు తెలుగువాడే! అరుసు పదం మన వాడుకలోంచి తొలగిపోయింది. కన్నడం వాళ్ళు

కొనసాగించుకుంటున్నారు. పన్ను కట్టడానికి గడువు కోరటాన్ని లేదా ధాన్యంమీద ఋణం చేయటాన్ని అరువు అంటారు. ఇది చివరికి చేబదులు అనే అర్థంలోకి మారిపోయింది.

**చలిమిడి :**

ఆడబిడ్డని పంపేటప్పుడు చలిమిడిని ఒడిలో పెట్టి పంపుతారు. ఇడి అంటే మెత్తగాచేసిన పిండి అని అర్థం. మెత్తగా దంచటాన్నో రుబ్బటాన్నో చేస్తే ఇడియు అంటారు. ఎవరైనా వస్తాదు తన ప్రత్యర్థి చేతిలో చావు దెబ్బలు తిన్నప్పుడు కూడా ఈ ఇడియు అనేమాట వాడతారు. ఇడలి అంటే రుబ్బిన పిండి(ఇడి)తో చేసిన ఒక వంటకం. అది ఇడ్లీకి మూలరూపం. “ఇడికుడక” అంటే మెత్తగా దంచిన పిండిని తడిపి ముద్దగా చేసి, సన్నని దారపు పోగుల్లా సేమ్యా మాదిరి చేసి ఉడికించిన నూడుల్స్ ఉప్మాలాంటి వంటకం. ఈ ఇడి పదంలోంచే “చలిమిడి” కూడా వచ్చింది. దాని భావార్థం స్పష్టంగా ఎక్కడా నిర్వచించినట్టు కనిపించదు.

చలిమిడిని రెండురకాలుగా చేసుకుంటారు. ఒకటి తాత్కాలికంగా అప్పటికప్పుడు తినేందుకు చేసుకునేది. బియ్యప్పిండి, బెల్లం కలిపి నూరి పాలతో తడిపి ముద్దగా చేస్తే అది చలిమిడి. నిలవ ఉంచేందుకు తయారుచేసే చలిమిడి ఇంకొకటుంది. బెల్లంపాకం పట్టి అందులో బియ్యప్పిండి, నెయ్యి వేసి వండిన వంటకం ఇది. ఈ రెండింటిలో వండకుండా చేసుకున్నదే అసలైన చలిమిడి. చలి అంటే చల్లదనం, వేడి తగలకుండా తయారుచేసినదని అర్థం. ఉదయంపూట ఉపాహారంగా తినే పెరుగన్నాన్ని కూడా చలిది అనే పిలుస్తారు. గ్రామదేవతలకు, విజయదశమినాడు అమ్మవారికి చలిది నివేదన పెట్టే ఆచారం ఈనాటికీ ఉంది. ఈ చలిదన్నాన్నే చద్దన్నం అంటూన్నాం. దానికి నిన్నటి అన్నం, పర్యుషితాన్నం, పాచిన అన్నం అనే దుర్మార్గపు అర్థాలను అన్యాయంగా ఇచ్చారు. చలిదన్నానికీ ఉన్న తేడాయే పచ్చి చలిమిడికీ, పాకం చలిమిడికీ ఉంది.

పచ్చి చలిమిడే నిజానికి అసలైన చలిమిడి, పాకం చలిమిడిని విడిగా తినటానికి, అరిసెల తయారీకోసం ఉపయోగిస్తుంటారు. వేర్వేరు పద్ధతుల్లో చేసుకునే ఈ రెండు వంటకాలకూ చలిమిడి అనే పేరే స్థిరపడటంతో దాని మౌలికార్థం అందకుండా పోయింది.

బియ్యప్పిండి, బెల్లం, పాలు కలిపి ముద్ద అయ్యేలాగా దంచి పచ్చి చలిమిడిని సిద్ధంచేస్తారు. ఇది బలవర్ధకం. రుచికరం, పరిమితంగా తినవలసిన పదార్థం. అతిగా తింటే పైత్యం చేస్తుంది. కడుపులో యాసిడ్ పెరిగేలా చేస్తుంది. జీర్ణశక్తి బలంగా లేనివారికి హానిచేస్తుంది. పచ్చి చలిమిడికన్నా పాకం చలిమిడి ఎక్కువ అజీర్తి కలిగిస్తుంది. సరదాగా తినదలచుకుంటే చలిమిడిని బియ్యప్పిండికి బదులు రాగిపిండితో చేసుకుంటే ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటుంది. బాదంపప్పులు, జీడిపప్పులు, పిస్తాపప్పుల్లాంటివి కలిపి వండితే రాగి చలిమిడి తక్షణ శక్తినిచ్చేదిగా ఉంటుంది.

అరిసె తింటే ఆరునెలల రోగాలు బయటపడతాయని భయపడేవాళ్ళంతా ఈ చలిమిడికి దడిసి అలా భావిస్తారు. జీర్ణశక్తి తక్కువగా ఉన్నప్పుడు కష్టంగా అరిగేది ఏది తిన్నా ఆరేళ్ళ క్రితం వ్యాధులను కూడా గుర్తుకు తెస్తుంది. అరిసె అందుకు మినహాయింపుకాదు.

యోగరత్నాకరం వైద్యగ్రంథంలో దీనికి చక్కని వివరణ ఉంది. "శాలిపిష్టకృతా భక్ష్యా నాతి బల్యా విదాహీనః అవృష్యాగురవ శ్లేష్మః కపపిత్తప్రకోపనాః" అనే సూత్రంలో "బియ్యంపిండితో చేసిన భక్ష్యాలు ఏమంత బలకరంగా ఉండవు. పైగా వేడిచేస్తాయి. ధాతువృద్ధిని ఆపుతాయి. కష్టంగా అరుగుతాయి. కఫాన్నీ, పైత్యాన్నీ పెంచుతాయి...." అని చెప్పారు. ఇవి అరిసెలకు వర్తించే మాటలే! అందుకే, మనపూర్వులు చిరుతిళ్ళ తయారీకి గోధుమపిండినీ లేదా మినపపిండినీ ఎక్కువ వాడేవారు. గోధుమపిండితో చేసిన భక్ష్యాలు ఎక్కువ బలకరంగా, చలవచేసేవిగా, పైత్యవాతాలు తగ్గించేవిగా ఉంటాయి. మినపపిండితో చేసినవి బలకరంగా కపపైత్యాలను పెంచేవిగా ఉంటాయి. బియ్యం పిండి వంటకాలకు తెలుగింట వాడకం తక్కువ ఆరోజుల్లో!

నేతిలో వేయించిన భక్ష్యాలు పైత్య, వాతాల్ని హరిస్తాయి. నూనెలో వేయించినవి కంటి చూపును చెడగొడతాయి. వేడి చేస్తాయి. రక్తదోషాలను పుట్టిస్తాయి అని వైద్యగ్రంథం చెప్తోంది.

"దుగ్ధాలోడిత గోధూమ శాలి పిష్టాది నిర్మితాః వాతపిత్తహరా భక్ష్యా హృద్యా శ్శుక్ర బలప్రదాః" పాలతో కలిపిన గోధుమపిండి లేదా బియ్యంపిండితో చేసిన వంటకాలు పైన చెప్పిన దోషాలను కలగనీయకుండా ఉంటాయి. వాత, పిత్త దోషాలను తగ్గించి, గుండెకు మేలుచేసేవిగా, ధాతువర్ధకంగా, బలకరంగా ఉంటాయి... అని ఈ సూత్రానికి అర్థం. "గౌడికాగురవో భక్ష్యా వాతఘ్నాః కఫ శుక్రలాః" అంటే బెల్లంతో చేసిన భక్ష్యాలు కష్టంగా అరుగుతాయి. కానీ, వీర్యవర్ధకంగా ఉంటాయి, వాతాన్ని తగ్గిస్తాయి. కఫాన్ని పెంచుతాయి" అనే సూత్రమూ ఉంది.

పై సూత్రాలను బట్టి రెండు విషయాలు నిర్ధారణ అవుతున్నాయి.

1. పాలతో బియ్యంపిండిని కలిపి వండితే అరిసెలు చెడు చెయ్యకుండా ఉంటాయి. పాకంపట్టి తినాల్సిన అవసరం లేదు.

2. నూనెకు బదులుగా నెయ్యి వాడితే అరిసెలు మేలు చేస్తాయి.

3. బెల్లానికి బదులుగా పంచదార వాడితే తేలికగా అరుగుతాయి. వీటిని దృష్టిలో పెట్టుకొని ఈ యోగరత్నాకరం వైద్యగ్రంథం "ఘీవరి" అనే వంటకాన్ని ఉదహరించింది.

**ఘీవరి అంటే పంచదార అరిసె.**

వస్త్రగాలితం పట్టిన మెత్తని బియ్యంపిండిలో పంచదార, చిక్కగా కాచిన పాలు కలిపి ఉండలా చేసి, గుండ్రని ఆకారంలో వత్తి, నేతిలో వండితే దాన్ని ఘీవరి అంటారట."ఘృత సంబంధమైనది అనే అర్థం దీనిలో ఏమైనా ఉన్నదేమో తెలీదు. అరిసెలను ఘీవరి పద్ధతిలో వండుకోవటమే మేలని దీన్నిబట్టి అర్థం అవుతోంది. నెయ్యి, పాలూ, పంచదారలలో కూడా అంతా కల్తీమయంగా ఉన్న ఈ రోజుల్లో ఆహారపదార్థాల ఆరోగ్య ప్రభావం గురించి ఆలోచించటం అత్యాశే అయినా ఉన్నంతలో జాగ్రత్త పడదాం!

1. అరిసెలు రుచికరంగా, బలకరంగా ఉంటాయి. అందులో సందేహం లేదు. కానీ అవి సక్రమంగా అరిగినప్పుడే ఈ ప్రయోజనం సిద్ధిస్తుంది. అందుకని జీర్ణశక్తి బలంగా ఉన్నప్పుడే అరిసెల్ని పరిమితంగా తినాలి.

2. అతిగా తింటే ఈ అతిరసాలు కడుపునొప్పి కలిగిస్తాయి. వేడి చేస్తాయి. కఫాన్ని పెంచుతాయి. వాతపు నొప్పుల్ని కలిగిస్తాయి.

3. అరిసె తిన్న తరువాత గ్లాసు మజ్జిగలో వాము పొడిని కలిపి తాగితే తిన్న అరిసె తేలికగా అరుగుతుంది. వాము అరిసెల దోషానికి విరుగుడుగా పనిచేస్తుంది.

4. ధనియాలు, జీలకర్ర, శొంఠి ఈ నాలుగింటినీ 100 గ్రాముల చొప్పున కొని, వేర్వేరుగా మెత్తగా దంచి, అన్నింటినీ కలిపి, తగినంత ఉప్పు చేర్చి ఒక సీసాలో భద్రపరచుకోండి. అరిసెల్లాంటి కఠిన పదార్థాలను ఏవి తిన్నా ఈ పొడిని ఒక చెంచా మోతాదులో గ్లాసు మజ్జిగలో కలిపి తాగండి.

5. అరిసెలే కాదు, తీపి పదార్థం ఏది తిన్నా వెంటనే 'మంచినీళ్లు' తాగటం కన్నా గోరువెచ్చని నీటిని తాగటం మంచిదని శాస్త్రం.

అరిసెలు శత్రువులాగా మనలను భయపెట్టినవనే భావనలోంచి బయటకు వచ్చి తెలుగుదనాన్ని ఆరోగ్యవంతం చేసుకోవటం అవసరం కదా...! అరిసెలు తిన్నాక ఏ ఇబ్బందీ కలగకుండా ఉండాలంటే ఒక చిన్న ఉపాయం ఉంది. ధనియాలు, జీలకర్ర, వాము, శొంఠి ఈ నాల్గింటినీ సమభాగాలుగా తీసుకొని దంచి ఒక చెంచా పొడిని గ్లాసు మజ్జిగలో వేసుకొని, తగినంత ఉప్పు కలుపుకొని తాగండి. అరిసెలను భయపడకుండా ఆస్వాదించవచ్చు. వాటిని తిన్న తరువాత ఎలాంటి ఇబ్బందీ పెట్టకుండా హాయిగా అరిగిస్తాయి.

ఏడాదికీ అయిపోయింది కాబట్టి, వచ్చే ఏడాది మీ మిత్రులకు సంక్రాంతి శుభాకాంక్షల్ని అరిసె పేరుతో చెప్పండి. ఓ కిలో అరిసెలు తీసుకెళ్ళి కానుకగా ఇచ్చిరాండి.



# అలనాటి 'పోలిక'లే పుల్కాలు

"దోసియలు సేవియలు నంగర పూవియలు, సారసెత్తులు, జొత్తరలు చక్కిలంబులు..." అంటూ కాశీఖండం కావ్యంలో శ్రీనాథ మహాకవి "అంగరపూవియ" అనే వంటకాన్ని ప్రస్తావించాడు. సంస్కృతంలో అంగారపోళికా, అంగర పూవియ ఒకటేనని సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొంది. నిప్పులమీద కాల్చి చేసే వంటకం అని దీని భావం.

శ్రీనాథుడి తర్వాత 200 ఏళ్లకు వెలువడిన హంసవింశతి కావ్యంలో అయ్యలరాజు నారాయణామాత్యుడు "గారెలు బూరెలు మోరుండ లంగరొల్లెలు ...గూళ్ళాపిడలాదిగా గల భక్ష్యంబు" లను ప్రస్తావించాడు. గణపవరపు వేంకటకవి తన 'ప్రబంధరాజ వేంకటేశ్వర విజయం' కావ్యంలో "మోరుండలు మనోహరంబులు గారెలు బూరెలు మండెంగ లంగరొల్లెలు మణుగు బువ్వలు, పేణీ లొబ్బట్లు కడియపుటట్లు...." అంటూ కొన్ని వంటకాల పేర్లు చెపుతూ అంగరొల్లెలను గురించి పేర్కొన్నాడు. అంగర పోలియ, అంగ పూవియ, అంగరొల్లె, అంగరుల్లె లాంటి పేర్లను అనేక మంది కవులు ప్రస్తావించారు. బసవ పురాణంలో 'పోలె' అనే వంటకాన్ని ప్రస్తావించటాన్ని బట్టి తెలుగు నేల మీద కనీసం వెయ్యేళ్ళ చరిత్ర దీనికి ఉందని మనం భావించవచ్చు.

ఆప్టే సంస్కృత నిఘంటువులో "పోలికా" పదానికి గోధుమ పిండితో చేసిన భక్ష్య విశేషం అనే అర్థం ఉంది. గోధుమ పిండిని తడిపి, నెయ్యి లేక నూనెతో మర్దించి ముద్దగా చేసిన దాన్ని 'పోలి' అంటారు. ఈ పోలితో చేసిన వంటకం 'పోలిక' లేదా పోళిక. "పోళీ" అనే ప్రయోగం కూడా ఉంది. పలుచగా వత్తి, కాల్చిన రొట్టెని మరాఠీలో 'పోలెం' అంటారు.

ద్రావిడ భాషల్లో పొలి, పోలి పదాలు పొంగారు, పెద్దదగు అనే అర్థాలలో కన్పిస్తాయి. పూర్వ ద్రావిడ భాషలో p*l– పదానికి t* acquire, gain, pr*sper అని అర్థం. ద్రవిడియన్ ఎటిమలాకకల్ డిక్షనరీ DEDR 4550లో కూడా ఇదే అర్థం కనిపిస్తుంది. ఒత్తిన 'పోలి'ని కాలిస్తే పొంగింది 'పోలిక' కావచ్చు. ప్రాకృతంలో "పోలి–అ", సంస్కృతంలో "పోలిక" తెలుగు తదితర ద్రావిడ భాషల్లో పూప, పోపిక, పొల్చ, పోల్చ, పోళిక పదాలు కాల్చిన రొట్టె అనే అర్థాన్నే ఇస్తున్నాయి. నిప్పులమీద గానీ. సన్న సెగమీద గానీ కాల్చి తయారు చేసిన రొట్టెల్ని పోళి, పోలిక పుల్కా ఇలా పిలిచి ఉంటారని ఒక ఊహ చేయవచ్చు. పోళీ అంటే బొబ్బట్లు అని తెలుగు వ్యుత్పత్తి కోశంలో ఉంది. కన్నడంలో పోలిగె, మోళిగే అంటే, పెనం మీద కాల్చిన బియ్యపు పిండి రొట్టె అని!

ఇంకో కోణంలోంచి ఈ పదాన్ని పరిశీలిద్దాం: తెలుగులో "పోలు" శబ్దానికి ప్రాచీన యుగాల నుండీ వృత్తిపరంగా వస్తున్న మరో అర్థం కూడా ఉంది. ఇదే ముఖ్యమైంది కూడా...! కుండలు చేయటం కోసం జిగురు వచ్చేంతవరకూ మట్టిని మర్దించి సారె మీద లింగాకారంలో ఉంచిన ముద్దని 'పోలు' అంటారు. పోలుని సారె చక్రం మీద ఉంచి, లోపల బోలుగా ఉండేలా కావలసిన ఆకారం లోకి మలచటాన్ని 'పోలుపట్టటం' అంటారు. కుండల తయారీ మన ప్రాచీన విద్య. తెలుగువారి తొలినాటి విద్యలకు సంబంధించిన సాంకేతిక పదాలు తెలుగు భాషలోనే రూపొందుతాయి. జాతి ప్రాచీనతకు భాష ప్రాచీనతకు వృత్తిపరమైన పదాలు ఎంతగానో ఉపయోగిస్తాయి. క్రమేణా ఇలాంటి సాంకేతిక పదాలు నిత్యవ్యవహారం లోకి కూడా చేరి అనేక కొత్త అర్థాలనిస్తాయి. కుండల తయారీకి సంబంధించిన "పోలి" అనే పదాన్ని జిగురు వచ్చేదాకా మర్దించిన పిండి ముద్దకు తెచ్చి ఆపాదించటమే ఇందుకు తార్కాణం.

కార్తీక మాసం అమావాస్య వెళ్ళిన పాడ్యమి తెల్లవారు ఝామున పసుపు ముద్ద(పోలి)తో చేసిన గౌరమ్మను పూజించి, అరటి దొన్నెలలో దీపాలు వెలిగించి నీళ్ళలో వదులుతారు. పోలిని స్వర్గానికి పంపే కార్యక్రమం ఇది. పసుపు ముద్ద(పోలి) ఈ పూజలో ప్రధానమైంది. పోలి శబ్దం తడిపిన పిండి లేదా మట్టి ముద్దని సూచిస్తోంది. గోధుమ పిండితో పోలెను తయారు చేసి, పలుచగా గుండ్రంగా వత్తి, సన్న సెగను కాలిస్తే అది పోలిక. దాన్నే ఇప్పుడు పుల్కా అంటున్నారు. తెలుగు పోలిక పదానికి ఆధునిక రూపమే పుల్కా! వెయ్యేళ్ళుగా తెలుగు ప్రజలు కమ్మగా తయారుచేసుకుని ఆస్వాదించిన ఈ పుల్కాలు,

తందూరీ రోటీలు ఇవన్నీ, ఉత్తర భారతీయ వంటకంగా హోటళ్ళవాళ్ళు చెప్పడం విచిత్రం. పుల్కా తెలుగు మాటే తెలుగు వంటకమే!

శ్రీనాథుడు నిప్పట్లు, గొల్లెడలు, దోసియలు (కాశీ. 7-186) అంటూ నిప్పట్లు గురించి అదే గ్రంథంలో ప్రస్తావించాడు. ఇది శ్రీనాథుడి కాలం నాటి నూనె వెయ్యకుండా నిప్పులమీద కాల్చిన పుల్కా రోటీలు అయి ఉంటాయని, "అంగార పూవియలు" "అంగార పోళికలు" తందూరీ ప్రక్రియలో కాల్చిన రొట్టెకు వెన్నపూస పట్టించిన బట్టర్'నాన్'రోటీలు కావచ్చునని భావించవచ్చు.

భావప్రకాశ సంస్కృత వైద్య గ్రంథంలో అంగారకర్కటి అనే ఒక వంటకం గురించి వివరంగా ఉంది. గోధుమ పిండితో చేసిన పోలిని ఎర్రగా కాలుతున్ననిప్పులలో వేసి కాలుస్తారు. వేరుశనగ కాయలను తంపట వేసుకొనే పద్ధతిలో ఈ పోలిని కాలుస్తారన్నమాట! లేదా, వేడి కుమ్ములో పెడతారు. చల్లారిన తరువాత పైన మాడుబెరడును తొలగిస్తే లోపల బాగా మాగిన పిండి తెల్లని పువ్వులా విచ్చుకొని ఉంటుంది. దీన్నే బహుశా అంగార పూవియగా శ్రీనాథుడు పేర్కొని ఉంటాడు. తియ్యని పాలలో గానీ, కారపు సూపులో గానీ దీన్ని నంజుకొని తినవచ్చు. తెలుగువారి స్వంత బేకింగ్ ప్రక్రియ ఇది. తందూరి పొయ్యలు తెలియని ఆ రోజులలోనే నిప్పట్లు, అంగార పోళికలు, అంగార పూవియలు తయారు చేసుకొన్నారు మన పూర్వీకులు.



# పాణిని వ్యాకరణ సూత్రాలు - మాతృభాషా సంస్కరణలు

**"ప్రథమే హి విద్వాంసో వైయాకర్ణా వ్యాకరణ మూలత్వాత్ సర్వ విద్యానామ్!"**

"సర్వ విద్యలకూ వ్యాకరణం మూలం కనుక మొట్టమొదటిగా ఎంచదగినవారు వైయాకరుణులే" అంటుందీ శ్లోకం.

ప్రపంచ వాఙ్మయంలో సంస్కృత భాషలో వచ్చినంత వ్యాకరణశాస్త్ర విషయాలు మరే భాషలోనూ రాలేదని పాశ్చాత్య పండితులు కూడా అంగీకరిస్తారు. పాణినికి పూర్వం, పాణిని తర్వాత ఎంతోమంది వ్యాకరణవేత్తలు సంస్కృతవ్యాకరణ వాఙ్మయాన్ని సుసంపన్నం చేశారు. సంస్కృత భాషకు ఆ ప్రాముఖ్యత దాని వ్యాకరణ విశేషాల వలననే కలిగింది.

ప్రప్రథమంగా శబ్దస్వరూపాన్ని దాతు-ప్రత్యయాల విభాగాలుచేసి, విశ్లేషించి, పరిపూర్ణమైన ఒక వ్యాకరణ ప్రక్రియని వాడుకలోకి తెచ్చింది సంస్కృతమేనని మాక్డోనల్ లాంటి పండితులు పేర్కొన్నారు. ప్రపంచభాషల్లో సంస్కృతానికి ఈ ప్రాధాన్యత పాణిని వలనే కలిగింది. పాణినిని మినహాయిస్తే, భాషాశాస్త్రమే లేదు, సాంఖ్య, న్యాయ, వైశేషికాది ఆరు దర్శనాల మాదిరే పాణినీయ వ్యాకరణాన్నీ ఒక దర్శనంగా పండితులు భావిస్తారు.

పాణినికి పూర్వం వ్యాకరణ గ్రంథాల్లో ఇంద్రప్రణీతమైన ఇంద్రవ్యాకరణం ప్రసిద్ధంగా ఉండేది. ఆంజనేయస్వామి సూర్యుడి నుండి వ్యాకరణ రహస్యాలు పొందాడని కూడా చెప్తారు. ఇలా ఎందరో వైయాకరణులు భాషకొక స్థిరత్వాన్ని కలిగించటానికి చేసిన కృషిని సమన్వయం చేస్తూ, పాణిని తనదైన రీతిలో వ్యాకరణ సూత్రాలను ప్రతిపాదించాడు.

## పాణిని జీవితం :

పాణిని పుట్టిందిప్పుడనే విషయంలో చరిత్రవేత్తల మధ్య ఏకాభిప్రాయం లేదు. పాణిని ఎప్పటివాడో నిర్ధారించటం కష్టమే! క్రీ.పూ. 4 నుండి 7వ శతాబ్దాల మధ్య కాలానికి చెందినవాడు కావచ్చు. కొందరి అంచనాల్లో ఇంకా పూర్వుడు కూడా!

'పణిగోత్రం'లో పుట్టినవాడు పాణిని. ఇది ఫణి శబ్దానికి సంబంధించిన పదం కావచ్చు. ఆహీకుడనే నామాంతరం కూడా ఈయనకుంది. సంస్కృతంలో అహి అంటే పాము. శాలంకి, దాక్షిపుత్రుడు, శాలాతురీయుడు అనే పేర్లు కూడా ఈయనకున్నాయి. దక్షి అనేది ఒక సమాజం. నేటి పాకిస్తాను - కాబూలు సమీపంగా ఈ దాక్ష ప్రజలు ఉండేవారు. పాణిని ఈ దాక్షిపుత్రుడు. ఆ శాలాతురం ఈనాటి లాహూర్. శాలాతురంలో పుట్టడాన శాలాతురీయుడన్నారు.

**"సుబంధౌ బక్తిర్న :** క ఇహ రఘుకారే నరమతె/ధృతి ర్దాక్షీ పుత్రే హరతి హరిచన్దో ఽ పి హృదయమ్" అని సదుక్తి కర్ణామృతంలోనూ, "దాక్షీపుత్రస్య పాణినేః అని ఘుసంజ్ఞాసూత్ర మహాభాష్యంలోనూ కనిపించే ఆధారాల్ని బట్టి పాణిని ఈ దాక్షీపుత్రుడని తెలుస్తోంది.

పాణిని పేరుతో సంస్కృత వ్యాకరణాన్ని, పతంజలి పేరుతో యోగశాస్త్రాన్ని, చరకుడి పేరుతో చరకసంహిత అనే ఆయుర్వేదగ్రంథాన్నీ ఒకే వ్యక్తి వ్రాసినట్టు ఒక నమ్మకం ఉంది. నిజానికి, మిగతా ఇద్దరికన్నా పాణిని కనీసం 300 యేళ్ళ ముందువాడు.

పాణిని, కాత్యాయనుడు, పతంజలి ఈ ముగ్గురినీ మునిత్రయం అంటారు. పాణిని అష్టాధ్యాయికి పతంజలి మహాభాష్యం ప్రసిద్ధి పొందింది.

క్రీస్తుపూర్వం చివరి శతాబ్దివాడైన హాలచక్రవర్తి కాలంలో వ్యాకరణ విషయంలో తగాదాపడిన గుణాఢ్యుడు పైశాచీభాషలో వ్రాసిన బృహత్కథకు సోమదేవుడు కథాసరిత్సాగరం పేరుతోనూ, క్షేమేంద్రుడు బృహత్కథామంజరి పేరుతోనూ చేసిన అనువాదాలలో పాణిని ప్రస్తావన ఉంది.

పాణిని, కాత్యాయనుడు కలిసి చదువుకునేవారనీ, కానీ, పాణిని చదువులో వెనకపడి, తన చదువు పెంపుకోసం హిమాలయాలకు వెళ్ళి శివధ్యానం చేసి, ఒక కొత్త వ్యాకరణాన్ని వరంగా పొందాడని ఐతిహ్యం.

శివుడు ప్రసాదించిన ఆ వ్యాకరణ జ్ఞానంతో, వర్ణమాలకు మౌలిక సూత్రాలు రూపొందించి, వాటికి 'మహేశ్వర' లేదా 'శివసూత్రా'లని పేరుపెట్టాడు.

పాణిని ప్రతిపాదించిన వ్యాకరణసూత్రాలకు ప్రాచుర్యం రావటంతో అప్పటిదాకా వ్యాప్తిలో ఉన్న 'ఇంద్రవ్యాకరణం' లాంటివి మూలపడ్డాయనీ, కాత్యాయనుడు లాంటి పండితులు కూడా పాణినినే అనుసరించాల్సివచ్చిందనీ చెప్తారు. పాణిని చేసిన కృషిని చూస్తే, అది మానవమాత్రుడికి సాధ్యంకానిదిగా కనిపిస్తుంది. అందుకని దేవుడిచ్చిన వరంగానే ప్రతిఒక్కరూ భావించటం సహజం.

పతంజలి క్రీ.పూ. 600 నాటివాడు కావచ్చని మహామహోపాధ్యాయ శివదత్తశర్మ వ్రాశారు. కల్హణుడి 'రాజతరంగిణి'లో క్రీ.పూ. 336నాటి అభిమన్యుడనే రాజు పాణిని అష్టాధ్యాయికి పతంజలి చేసిన మహాభాష్య గ్రంథాన్ని కాశ్మీరానికి తెప్పించినట్టు ఉంది. కాబట్టి, పతంజలి క్రీ.పూ. 350కి పూర్వంనాటి వాడనీ పాణిని అంతకు 300 యేళ్ళ పూర్వుడనీ ఎక్కువమంది పండితులు నమ్ముతున్నారు. కొందరు పండితులు క్రీ.పూ. 6వ శతాబ్దినాటివాడని కూడా భావిస్తారు.

బోధిసత్త్వ మంజుశ్రీ వ్రాసిన "మూలకల్ప" గ్రంథం క్రీ.శ. 6వ శతాబ్దిలో సంస్కృతీకరించబడింది. దీన్ని 'క్రియాతంత్రగ్రంథం' అంటారు. అందులో పుష్పపురం పాలకుడు నందుడు ఎక్కువ సమయాన్ని పండితులమధ్య గడిపేవాడని, వరరుచి అనే బౌద్ధ బ్రాహ్మణుడు ఆయన దగ్గర మంత్రి అనీ, పాణిని ఆయన స్నేహితుడనీ ఉంది. ఈరకంగా చూసినా పాణిని క్రీ.పూ. 6వ శతాబ్దికన్నా పూర్వుడని, నేటికి 2,700 సంవత్సరాలనాటివాడనీ నిస్సందేహంగా భావించవచ్చు.

భర్తృహరి పేరున్న ఒక పండితుడు పతంజలి మహాభాష్యానికి 'మహాభాష్యత్రిపది', 'మహాభాష్య దీపిక' అనే 2 వ్యాఖ్యానాలు వ్రాశాడని సాంగ వైయాకరణసిద్ధాంత నిరూపణ అనే కారికాత్మకమైన "వాక్యపదీయం' నిర్మించాడని ఈ మహాభాష్యానికి వ్యాఖ్య వ్రాసిన కైయటుడు పేర్కొన్నాడు.

మహాభాష్యాన్ని కంఠస్థం చేసిన వామనుడు, జయాదిత్యుడు అనే ఇద్దరు పండితులు పాణిని సూత్రాల్ని తేలికగా బోధపరిచే ఉద్దేశంతో కౌశిక అనే "వృత్తి"ని వ్రాశారు.

క్రీ.శ.10నాటి రాజశేఖరుడి "కావ్యమీమాంస"లోనూ పాణిని గురించి కొన్ని విశేషాలున్నాయి.

**"అత్రోపవర్ష వర్షావిరహ ణిని పింగళావిహ వ్యాడిః**

వరరుచి పతంజలి ఇహ పరీక్షితాః ఖ్యాతిముపజగ్ముః" - అనే సూత్రం ఉంది. "ఉపవర్షుడు, వర్షుడు, పాణిని, పింగళకుడు, వ్యాడి, వరరుచి, పతంజలి మొదలైన

మహాపండితులు పాటలీపుత్రంలో తరచూ జరుగుతుండే శాస్త్రపరీక్షలు వ్రాసి ఉత్తీర్ణులై విశ్వవిఖ్యాతి పొందా"రని దీని భావం.

ఈ శ్లోకంలో గొప్ప చరిత్ర ఉంది :

"ఉత్తరమీమాంసకు వ్యాఖ్యానం వ్రాసిన ఉపవర్షుణ్ణి శంకరాచార్యులవారు "భగవానుప వర్షః" అని కీర్తించారు. ఆయన ప్రసిద్ధి అంతటిది.

వారి అన్నగారు వర్షుడు. ఆ వర్షుడి శిష్యుడే పాణిని.

పాణిని అనుజుడు పింగళకుడు. "పింగళచ్ఛందస్సు" అనే ఛందోగ్రంథం వ్రాశాడీయన.

పాణిని అష్టాధ్యాయి గ్రంథానికి "వ్యాడిసంగ్రహం" పేరుతో విస్తృత వ్యాఖ్యానం వ్రాశాడు వ్యాడి. పతంజలి మహాభాష్యానికి ఈ గ్రంథమే ఆధారం. పతంజలి ఈ "వ్యాడి" పండితుణ్ణి దాక్షాయణీయుడిగా పేర్కొన్నాడు. అంటే పాణిని లాగానే దక్షగోత్రీకుడని అర్థం. కొందరు ఈ 'వ్యాడి'ని స్వయాన పాణినికి మేనమామగా కూడా చెప్తారు.

వరరుచి పాణిని అష్టాధ్యాయికి 'వాక్యపదేయం' పేరుతో వార్తికాలు వ్రాశాడు. పతంజలి ఈ అష్టాద్యాయి గ్రంథానికి మహాభాష్యం వ్రాశాడు. క్రీ.పూ. 2వ శతాబ్దికి చెందిన పుష్యమిత్రుడికి ఈ పతంజలి సమకాలికుడు..."

ఇలా పాణినితో, అష్టాద్యాయితో సంబంధీకుల్ని ఒక ఐతిహాసిక క్రమంలో ఈ శ్లోకం పేర్కొంది. విష్ణు, వాయుపురాణాల్లో చంద్రగుప్తుడు, పుష్యమిత్రుడు నిర్వహించిన సభల గురించి ఉంది.

వ్యాడి, వరరుచిలతో పాటు జయాదిత్యుడు, వామనుడు కలిసి కాశికా వృత్తి వ్రాశారు. వీరిద్దరూ కాశీలో ఉండి రాయటం చేత దానికా పేరొచ్చింది. దీనికి 16వ శతాబ్దిలో అప్పయ్యదీక్షితులు 'సూత్రప్రకాశిక' అనే వృత్తి వ్రాశాడు. దయానంద సరస్వతి అష్టాధ్యాయీ భాష్యం వ్రాసి సుసంపన్నం చేశాడు.

పాణిని తర్వాత కాలంలో కాతంత్రకారుడు, చంద్రగోమి, క్షపణకుడు, దేవానంది, వామనుడు, అకలంక భట్టు, పాల్యకీర్తి, శివస్వామి భోజరాజు, బోపదేవుడు మొదలైన ఎందరో వ్యాకర్తలున్నారు.

హ్యువాన్‌త్సాంగ్ (Huen Tsang or Xuanzang) అనే చైనా బౌద్ధయాత్రికుడు క్రీ.శ. తొలి శతాబ్దాల్లో పాణిని పుట్టిన శాలాతురం గ్రామాన్ని సందర్శించి, అక్కడ అవిచ్ఛిన్నంగా పాణిని శిష్యపరంపర ద్వారా సంస్కృతాధ్యయనం కొనసాగుతోందనీ, పాణిని శిలావిగ్రహం కూడా అక్కడ ఉన్నదనీ వ్రాశాడు. అతి ప్రాచీనకాలంనుండి వాడుకలో ఉన్న సకల

శబ్దరాశినీ సమగ్రంగా వ్యాకరించి సామ్రాట్టుకు పంపగా ఆ ప్రభువు పాణినిని సమాదరించినట్టు పేర్కొన్నాడు. పాణిని చెప్పిన 4,000 వ్యాకరణ సూత్రాలను ఆమూలాగ్రం కంఠస్థం చేసినవారికి 1000 దీనారాలు బహుమతిగా ఇచ్చేవారట.

ద్విరూపకోశంలో, పూర్వపాణినీయం పేరుతో 24 సూత్రాలున్నాయి. అష్టాధ్యాయి గ్రంథం దీనికి మెరుగుపెట్టుకుని రూపొందినది. దీనిలో మాహేశ్వరసూత్రాలు, ధ్వనుల పుట్టుక, ఉచ్చారణ విధానాలను సూత్రబద్ధం చేశాడు. ధాతుపాఠంలో క్రియల మూలాల గురించి వివరించాడు.

జాంబవతీ పరిణయం (పాతాళ విజయం) అనే కావ్యాన్ని కూడా పాణిని వ్రాసినట్టు పండితులు చెప్తారు. కానీ ఆ గ్రంథం అలభ్యం. ద్విరూపకోశం అనే చిన్న గ్రంథాన్ని కూడా పాణిని వ్రాశాడనీ, అది లండన్ నగరంలో ఇండియా ఆఫీసు గ్రంథాలయంలో ఉన్నదనీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు వ్రాశారు.

'స్వస్తి పాణినయే తస్మై యస్య రుద్రప్రసాదతః

దో వ్యాకరణం కావ్య మను జామ్బవతీ జయమ్'' అని రాజశేఖరుడు తన సూక్తిముక్తావళి, హోరావళి గ్రంథాల్లో వ్రాసిన వాక్యాన్ని బట్టి జాంబవతీ జయం అనే కావ్యాన్ని అది వ్యాకరణ గ్రంథం వ్రాసిన పాణినియే వ్రాశాడని తెలుస్తోంది.

పాణిని కావ్యకర్త కూడా కావటం విశేషం. పాణినీ సూత్రాలలో ప్రకటితమైన ఉదాహరణలు కూడా పాణిని కాలానికి మంచి సాహిత్య సృష్టి జరుగుతూనే ఉన్నదని నిరూపిస్తున్నాయి.

ఏమీలేనిది, శూన్యయుగం అనుకునేకాలంలో బుద్ధుడు, పాణిని, పతంజలిలాంటి మేథోసంపన్నులు అద్భుతాలు చేసి చూపించారు.

ఒకవిధంగా ఆ నాటితో పోలిస్తే మనయుగం బాగా తక్కువగా తూగుతుంది...ముఖ్యంగా భారతదేశంలో పాణినికి ముందుకాలంనాటి స్మృతుల్లో "కావ్యాలాపాంశ్చ వర్జయేత్"లాంటి నిషేధాలు ఉన్నట్టు తెలుస్తోంది. వైదిక క్రతువులలో నిమ్నగమైనవారు కావ్యాలను చదవకూడదనే అభిప్రాయం బలంగా ఉండేది. వేషాలు వేసుకునే నటులతో సహపంక్తి భోజనాలను కొన్ని స్మృతులు నిషేధించిన సందర్భాలూ ఉన్నాతయి.

నిజానికి, దృశ్యకావ్యాలు (నాటకాలు), కావ్యాలు పుష్కలంగా వెలువడిన కాలమే అది! గద్య, పద్య, మిశ్రమ అని మూడురకాల కావ్యాలను వర్గీకరించి ఆనందించారు కూడా! కావ్యాలకు ఆనాడు పండిత పామర ఆదరణ ఉందిగానీ, మతపరమైన మద్దతు లేదని దీన్ని బట్టి అర్థం అవుతుంది.

**"అతయేవ మహాకావ్యం తత్కర్తా చ మహాకవిః**

**వాగ్వైదగ్ధ్య ప్రధానే ఽపి రస ఏ వాత్ర జీవితమ్"** మహాకావ్య కర్త మహాకవి అనీ, వాక్ వైదగ్ధ్యప్రధానం అయినప్పటికీ రసం కూడా ముఖ్యమని ఇలా కావ్యాలకు అనేక లక్షణాలు అప్పటికే చెప్పబడ్డాయి. వ్యాకరణం ఒకవైపున స్థిరీకరించబడుతున్న కాలంలోనే స్వతంత్ర కావ్యరచనలకు బీజావాపన కూడా జరిగినట్టు భావించాలి.

## పాణినికి తగిన గౌరవం :

కాశీలో పాణిని జన్మస్థలం నుండి తెచ్చిన మట్టితో కట్టిన పాణిని దేవాలయం ఉంది. భారతప్రభుత్వం 2004లో పాణిని గౌరవార్థం ఒక పోస్టల్‌స్టాంపుని విడుదల చేసింది.




సింహం వాతపడి పాణిని మరణించాడని పంచతంత్రంలోని ఒక శ్లోకం చెప్తోంది.

"సింహో వ్యాకరణస్యకర్తుర హరత్ ప్రాణాన్ ప్రియాన్ పాణినేః
మీమాంసాకృత మున్మమాథసహసా హస్తీ మునిం జైమినిమ్
ఛన్దోజ్ఞాన నిధిం జఘాన మకరో వేలాతటే పిఙ్గలమ్
అజ్ఞానావృత చేతసామతిరుషాం కోఽ ర్థస్తిరశ్చాంగుణైః"

వ్యాకరణ సింహం అనదగిన పాణినిని ఒక సింహం మింగేసింది! మీమాంస శాస్త్రకర్త జైమిని మహర్షిని ఒక ఏనుగు చంపేసింది! ఛందో జ్ఞాననిధి అయిన పింగళక మహర్షిని ఒక మొసలు పట్టింది! జ్ఞానమూర్తుల మరణానికి అజ్ఞాన చేతస్సం కారణం అవుతోందని ఈ శ్లోకం బాధని వ్యక్తం చేస్తోంది.

పాణిని మరణం త్రయోదశినాడు జరిగిందని అందుకే, త్రయోదశిని 'పాణినీయ అనధ్యాపక దినం' అంటారు. పూర్వం సాంప్రదాయంలో ఆ రోజున గురువులు శిష్యుడికి పాఠాలు చెప్పేవారు కాదు.

## మహేశ్వర సూత్రాలు

భారతదేశంలో సింధునాగరికత నడుస్తున్నకాలంలో సమాంతరంగా సుమేరియా, బాబిలోనియా తదితర మధ్యదరా సముద్రతీరప్రాంతాల్లో కూడా సమానమైన నాగరికతా

వైభవం నడిచింది. ఆ రోజుల్లో మాటల్ని వ్రాయటానికి వాళ్లు చేసిన ప్రయత్నాన్ని చిత్రలిపి అంటారు. ఒక్కో మాటకు ఒక్కో గుర్తు కనిపిస్తుంది. అది లిపి పదాల సమామ్నాయం.

నేటికి చైనాకుటుంబ భాషలు ప్రాచీన చిత్రలిపినే అనుసరిస్తున్నాయి. భారతదేశంలో సంస్కృతభాష విషయంలో ఇందుకు భిన్నంగా జరిగింది. సంస్కృత భాష వర్ణమాల చిత్రాల ఆధారంగా కాక, శబ్దప్రధానంగా ఏర్పడింది.

సంస్కృత వర్ణమాలలో 'అ-క్ష' వరకూ ఉన్న అక్షరాలకు మూలం నాదం. నాద ధ్వనుల్నే అక్షరాలుగా భావించారు. మౌలికమైన ఈ తేడాని అర్థంచేసుకోవాలి. ఇంగ్లీషు A అనే అక్షరం ఒక సంకేతంగా (గుర్తుగా) ఏర్పడగా, సంస్కృతంలోనూ, తెలుగు ఇతర భారతీయభాషల్లోనూ 'అ' అనేది ఒక ధ్వనిగా ఏర్పడింది. ఈ రెండింటికీ తేడాని అర్థం చేసుకుంటే సంస్కృతం సహా భారతీయ భాషల అభివృద్ధికి పాణిని వేసిన దారి ఎంత ఉన్నతమైనదో అర్థం అవుతుంది. సంస్కృత వర్ణమాలనే అన్ని భారతీయ భాషలు, ద్రావిడ, ముండా భాషలు కూడా వాడుకోవటాన్ని బట్టి ఈ ప్రాముఖ్యత ఎంతదో తెలుస్తుంది. అ ఆ ఇ ఈ లే కదా భారతీయభాషలన్నిటికీ మూలం...!

వేదాలలోనే ఈ విధంగా ధ్వని ప్రధానమైన అక్షర సమామ్నాయం గురించిన ప్రస్తావనలున్నాయి. ఆ ధ్వనులను దర్శించి, స్థిరీకరించినవాడు పాణిని.

"నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారం ఉద్ధర్తు కామః సనకాది సిద్ధాదినేతత్ విమర్శే శివసూత్ర జాలం" శివుడు ననాదఢక్కాం - గొప్పదైన డమరుకాన్ని మ్రోగిస్తుండగా నర్తనం ముగింపు సమయంలో శివఢక్క నుండి, నవపంచవారం (9+5=14) పద్నాలుగు దరువులున్న నాదం ఏర్పడింది.

ఈ నృత్యాన్ని సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులనే మహర్షులతోపాటు పాణిని తమ దివ్యచక్షువులతో దర్శించగలిగాడు. ఆ 14 దరువుల్నీ ఆకళింపు చేసుకున్నాడు పాణిని. వాటినే మహేశ్వర సూత్రాలు లేదా శివసూత్రాలు అన్నాడు.

వర్ణమాల క్రమాన్ని సూచించే మౌలిక శబ్దాలైన ఆ మహేశ్వర సూత్రాలు ఇవీ:

1. అ ఇ ఉ (ణ్) ;
2. ఋ ఌ (క్) ;
3. ఏ ఓ (ఙ్) ;
4. ఐ ఔ (చ్);
5. హ య వ ర (ట్) ;
6. ల (ణ్);
7. ఞ మ ఙ ణ న (మ్);
8. ఝ భ (ఞ్) ;
9. ఘ ఢ ధ (ష్);
10. జ బ గ డ ద (శ్);
11. ఖ ఫ ఛ ఠ థ చ ట త (వ్);
12. క ప (య్);
13. శ ష స (ర్);
14. హ (ల్);

ఈ సూత్రాల్ని ఆకళింపు చేసుకుంటే సంస్కృతభాష స్వరూపం అవగతం అవుతుంది.

ఈ 14 సూత్రాలమీద నందికేశ్వరుడొక భాష్యాన్ని వ్రాసినట్టు చెప్తారు. శ్రావణపౌర్ణమినాడు ఉపాకర్మ సమయంలో వీటిని పఠిస్తారు. నటరాజ డమరుక దరువుల నుండి ఉద్భవించిన ఈ మహేశ్వరసూత్రాలే సంస్కృత వ్యాకరణానికి మూలం. పూర్వం శివాలయాల్లో వ్యాకరణ దాన మండపాలుండేవి అందుకే!

శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం - అనే, ఈ నాలుగు వేదాంగాలూ భాషకి సంబంధించిన అంశాలు.

దైవపరమైన అంశాలకు మాత్రమే పరిమితం కాకుండా నైతికవిలువలు, ధర్మప్రవర్తనలతోపాటు వ్యాకరణం, ఛందస్సు, స్వరశాస్త్రం, ఆయుర్వేదం, వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం, ఖగోళశాస్త్రాల గురించిన రహస్యాలు ఎన్నో కనిపిస్తాయి.

వేదాలకు సంబంధించిన ఏ అంశమైనా పరమాత్మతో ముడిపడి ఉంటుంది. వైద్యం, ఖగోళవిద్య, ధనుర్విద్యల్ని కూడా ఆత్మవికాసానికి తోడ్పడేవిగా భావించటం వలన శాస్త్రీయ అంశాల్లో మతఛాయలు సహజంగా ఉంటాయి. అయితే, అది 9 భాషా సంస్కృతుల పరివ్యాప్తి అనే ముఖ్య లక్ష్యంతో సాగటం గమనార్హం.

వేద ప్రామాణ్యం అంటే ఆత్మనీ, పరమాత్మని అంగీకరించటం. మన దర్శనాలలో ఆత్మను అంగీకరించేవీ, అంగీకరించనివీ అని రెండు రకాల వర్గీకరణలున్నాయి. బౌద్ధ, జైన, ద్వారక దర్శనాలు వేద ప్రామాణ్యాన్ని, పరమాత్మనూ అంగీకరించలేదు.

ఇక్కడో విశేషం ఉంది : ఆత్మను, వేద ప్రమాణాలనూ అంగీకరించని జైనులు, బౌద్ధులూ ఆత్మను అంగీకరించిన ఆయుర్వేద ఖగోళ విద్యల్ని అత్యున్నతస్థితికి తీసుకువెళ్లారు. ఆత్మవాదులు, అనాత్మవాదుల్లో విభేదం ఆత్మతోనేగానీ, శాస్త్రాల మౌలిక సూత్రాలతో కాదని, ఆత్మ పరమాత్మలు శాస్త్ర రూపకర్మకు ముఖ్యమైన విషయాలు కాదనీ, మతప్రచారం శాస్త్రప్రచారం రెండింటినీ చేపట్టినప్పుడు శాస్త్రంలో మతం తొంగిచూడటం సహజమనీ దీన్నిబట్టి అర్థం అవుతుంది.

## లిపి అవతరణ

పాణినికి చాలా పూర్వమే అక్షరాల పొందిక గురించిన ప్రసక్తి వేదాంగాలైన ప్రాతిశాఖ్యలలో కనిపిస్తుంది. ఋగ్వేదం, తైత్తిరీయ ప్రాతిశాఖ్యలలోనూ, వాజసనేయి ప్రాతిశాఖ్యలోనూ భారతీయు ధ్వనిశాస్త్రానికి చెందిన ప్రస్తావనలున్నాయి.

లిపి ఏర్పడకముునుపు కూడా అక్షరాల గురించి భారతీయులకే కాదు ఇతర దేశీయులక్కూడా తెలుసు. కానీ, మన అక్షరం ధ్వనిరూపమేగానీ, దృశ్యరూపంకాదు. అక్షరం అంటే చేత్తో వ్రాసే ఒక శబ్దం కాదు. ఈ అంశాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి.

నాగేశభట్టుడు 'మహాభాష్య ప్రదీప వ్యాఖ్యానం' గ్రంథంలో "లిపిశ్వేవాక్షరబుద్ధిర్ అబుద్ధానాం" పామరులు అక్షరం అంటే లిపి అని పొరబాటు పడతారు- అంటాడు. పతంజలి, తన మహాభాష్యంలో, ఆకాశరూపకమైన శబ్దం, పలికేవాడి మాట రూపంలో వ్యక్తీకరించబడి, శ్రోతయొక్క బుద్ధిచేత గ్రహించబడుతుంది... అని నిర్వచించాడు.

మనం ఆడుతున్న మాటలన్నీ అక్షరాల సముదాయంగా ఏర్పడ్డవే! అక్షరం పక్కన అక్షరం పేర్చుకుంటూ ఉచ్చరిస్తున్నాం. పాణిని అష్టాధ్యాయిలో సూచించిన మహేశ్వరసూత్రాలలోని 'అ, ఇ, ఉణ్' వగైరా 1. సూత్రాలు అన్నిరకాల ఉచ్చారణలకీ మూలశబ్దస్వరూపాలు. మహేశ్వర సూత్రాలలోని 'అ' కారం అకార ఉచ్చారణలన్నింటిని సూత్రీకరించే శబ్దస్వరూపం. (అవర్ణాకృతిర్ ఉపదిష్టా స్వరమ్ అవర్ణకులం గ్రహీష్యతి, తథేవర్ణాకృతిః తథోవర్ణాకృతిః మహాభాష్యం 1:87).

లిపి ఏర్పడేవరకూ అక్షరాలు ధ్వనిరూపాలే! పాణిని, పతంజలి, కాత్యాయనుడు- వీరంతా దృశ్యరూపకమైన వర్ణనలతో శబ్దరూపాల్ని వివరించారు. ఉదాహరణకి, రూపం అంటే శబ్దరూపం, సరూపం అంటే ఒకేరకమైన శబ్దాలు, ఆకృతి అంటే అక్షరంయొక్క శబ్దచిత్రం. వ్యాకరణ వస్తువు లుప్తం అవడాన్ని 'అదర్శనం' అని వ్యవహరించాడు పాణిని.

ఈ వాడుకలన్నీ శబ్ద దృశ్యాలే! వీటికి వ్రాతరూపాన్ని కల్పించాక అవి అక్షస్వరూపాలయ్యాయి.

తిరుమల రామచంద్రగారు తన లిపి పుట్టుపూర్వోత్తరాలు గ్రంథంలో, అక్షరమాల ప్రస్తావన వేదకాలంలోనే ఉందని వ్రాశారు. వేదంలోగానీ, అష్టాధ్యాయిలోగానీ ఆ అక్షరం ప్రస్తావన ధ్వనిరూపమేగానీ, దృశ్యరూపంకాదు. మొదట ఈ తేడాని మనం గమనించాలి.

అక్షరేణా మిమతేసప్తవాణీ (1-164-24);

తతోవా అష్టాక్షరా గాయత్ర్యభవ దేవాదేశక్షరాత్రిష్టుప్ (ఐతిరేయ బ్రాహ్మణం);

ఉతత్వః పశ్యన్ నదదర్శవాచం ఉతత్వః శృణ్వన్ నశృణేత్యేవామ్ (కొందరు మాటను చూచీ చూడరు, కొందరు వినీ వినరు) (10-71-4).

**"అక్షరాణామకారోస్మి ద్వంద్వఃసామాసికస్య చ**

అహమేవాక్షయఃకాలో దాతాహం విశ్వతోముఖః" అక్షరాల్లో 'అ' కారం నేను. సమాసాల్లో ద్వంద్వ సమాసం నేను. అక్షయకాలాన్ని అంటే మహాకాలాన్ని నేను. విశ్వతోముఖుణ్ణి నేను. అందరినీ ధరించేవాణ్ణి, పోషించేవాణ్ణి నేనే!" (భగవద్గీత, 10.33)

**"శ్రోతోపలబ్ధిర్ బుద్ధినిర్గ్రాహ్యః ప్రయోగేణాభిజ్వలిత ఆకాశదేశః శబ్దః"** పతంజలి, మహాభాష్యం, నిర్ణయసంగ్రహం 1.87;

"లిపిష్వేవాక్షరబుద్ధిర్ అబుద్ధానాం" – మహాభాష్య ప్రదీప వ్యాఖ్యానం 1.21....

ఇలా అక్షరాలను దృశ్యమానం చేయటానికి సంబంధించి లిపికి పూర్వం కొంత ఆలోచనలు సాగాయన్నమాట.

తనకు ముందున్న వ్యాకరణ శాస్త్రవేత్తల మార్గంలో నడుస్తూ, బుద్ధికుశలతతో కొత్త సంవిధానాలను కనిపెట్టాడు పాణిని. బోధనలో సౌకర్యం కోసం 'వృత్తి' కూడా వ్రాశాడు. శబ్ద ఉచ్చారణ కోసం సూత్రాలతో ఒక శిక్షాగ్రంథాన్నీ వ్రాశాడు. ఇది కాలగర్భంలో కలిసిపోతే స్వామీ దయానందసరస్వతి మొదలైనవారు ప్రాచీనగ్రంథాల ఆధారంగా పునరుద్ధరించారు. పాణిని, పతంజలి, కాత్యాయనుడు వీరంతా దృశ్యరూకమైన వర్ణనలతో శబ్దరూపాల్ని వివరించారు.

**పాణిని వ్యాకరణ సూత్రాలు**

ధ్వనిశాస్త్రం అంటే అక్షర శాస్త్రమే! అదే వ్యాకరణ దర్శనం కూడా! వ్యాకరణమే అన్ని విద్యలకూ మూలం.

శబ్దోత్పత్తి, శబ్ద లక్షణాలను తెలిపే ఉపకరణం వ్యాకరణం. వ్యాకరణంతోపాటుగా శిక్ష, నిరుక్తం, ఛందస్సుల్ని వేదాధ్యయనానికి ఉపయోగించే భాషాశాస్త్రంలోని భాగాలుగా, వేదాంగాలుగా చెప్తారు.

వ్యాకరణం అంటే వ్యాకృతి ఉన్నది. ఒక భాష శబ్దస్వరూప స్వభావాలను వివరించేది, ఒక భాషలోని నియమనిబంధనలను, సాధురూపాలను విశ్లేషించేది వ్యాకరణం" అని నిర్వచనం.

**"ప్రయోగమూలం వ్యాకరణం"** : గ్రాంథికభాషకి లేదా కావ్యభాషకి సంబంధించింది వ్యాకరణం. కావ్యప్రయోగాల ఆధారంగా వ్యాకరణం వెలువడుతుంది.

వ్యాకరణశాస్త్రంలో శబ్దం ముఖ్యమైంది. సంగీత నృత్యశాస్త్రాలకూ శబ్దమే ప్రాణం. ఈ శబ్దాన్ని పరమాత్మగా వేదప్రమాణులు భావిస్తారు. శబ్దబ్రహ్మ, నాదబ్రహ్మోపాసనలాంటి పదాలు ఈవిధంగా ఏర్పడ్డాయి.

శబ్దాలను భావాలను వ్యక్తీకరించటంలో మౌలికసూత్రాలను పాణిని మాహేశ్వర సూత్రాలుగా పిలిచాడు. వీటినే వర్ణాలని పిలుస్తున్నాం.

డమరుకనాదంలో ఒక్కో దరువు ఒక్కో అక్షరంగా ఏర్పడిందని దీని తాత్పర్యం.

ధ్వనుల స్ఫుటీకరణవల్ల వాగ్రూపంలో వర్ణసమామ్నాయం ఏర్పడింది. కాలక్రమంలో ఆ వర్ణాలకి లిఖితరూపం కలిగింది.

సుదీర్ఘ పరిణామక్రమంలో సంస్కృత భాషలో ఏర్పడిన మార్పుల్ని వైయాకరణులు ఎప్పటికప్పుడు విశ్లేషిస్తూ వచ్చారు. వారందరి కృషిని సమన్వయం చేస్తూ పాణిని రచించిన

వ్యాకరణ గ్రంథం అష్టాధ్యాయి (లేదా అష్టక). భారతీయతకు అక్షరశోభను అలదిన తొలి సమగ్ర వ్యాకరణ గ్రంథం ఇది.

పాణిని సూత్రాలకు ఎందరో మహాపండితులు వార్తికాలు వ్రాశారు. వాటిలో పతంజలి వ్రాసిన మహాభాష్యం ప్రసిద్ధి. ఇందులో పతంజలి అనేకమంది ప్రముఖ భాషా వ్యాకరణ వేత్తలను స్మరించుకున్నాడు. వారిలో కాత్యాయనుడు, భారద్వాజుడు, సునాగుడు, క్రోష్ట, బాడవుడు అనే అయిదుగురు ముఖ్యులు.

వృత్తి అంటే వ్యాకరణ శాస్త్ర ప్రవృత్తి అని అర్థం. వార్తికం అంటే వృత్తికి వ్యాఖ్యానం. వార్తికకారుణ్ణే వాక్యకారుడు అనీ పిలుస్తారు. ఇందులో కాత్యాయనుని వార్తికం ప్రసిద్ధిపొందింది. కాత్యాయనుడికే వరరుచి, మేధాజిత్, పునర్వసు, కాత్యుడు అనే పేర్లున్నాయి. పాణిని, కాత్యాయనుడు సహాధ్యాయులైనప్పటికీ కాత్యాయనుడు పాణిని మార్గాన్ని స్వీకరించి, ఆయన సూత్రాలకు వ్యాప్తి కలిగించాడు. ఈ విషయాన్ని ఒక సూత్రంలో పతంజలి పేర్కొన్నాడు.

పాణినీయంపై పతంజలి వ్రాసిన భాష్యాన్ని మహాభాష్యం అంటారు. సూత్రంలో వార్తికంలో అభిప్రాయం భేదం వస్తే పాతంజలీయం మాత్రమే ప్రమాణంగా తీసుకోవాలని చెప్తారు.

సూత్రరచనలో అనువృత్తి, అధికారం, వివిధ సంజ్ఞలు, ప్రత్యాహారాలు, ధాతు, గుణపాఠాలు మొదలైన అనేక అంశాల్ని ఆధారం చేసుకొని పాణిని తన వ్యాకరణాన్ని రూపొందించాడు. సూత్రరచనలో అపూర్వమైన లాఘవాన్ని అంటే సంక్షిప్తతను సాధించాడు. ఏకమాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యంతే వైయాకరణ = సూత్రరచనలో ఒక మాత్రాకాలం లాఘవం సిద్ధించినా వైయాకరణులు పుత్రుడు పుట్టినంత సంతోషిస్తారట.

అష్టాధ్యాయికి వచ్చిన సమగ్ర వ్యాఖ్యానాల్లో కాశిక లేక కాశికావృత్తి మొట్టమొదటిది. క్రీ.శ. 7వ శతాబ్దికి చెందిన వామన, జయాదిత్యులు ఈ కాశికావృత్తికర్తలు. ఆధునికంగా ఆచార్య రవ్వా శ్రీహరి పాణినీయ అష్టాధ్యాయిని వామన జయాదిత్యుల కాశికావృత్తినీ తెలుగులోకి అనువదించారు.

## పాణిని సూత్రాలు - కంప్యూటరీకరణ

మాహేశ్వర సూత్రాలలో (Mahesvara aphorisms) మొదటి 6 సూత్రాలతోనే మొత్తం అక్షరమాలను గుర్తించవచ్చు.. అవి–

“అ ఇ ఉ (ణ్), ఋ ఌ (క్), ఏ ఓ (ఙ్), ఐ ఔ (చ్), హ య వ ర (ట్), ల (ణ్)– మాహేశ్వర సూత్రాలలోని ఈ ఆరింటిలో మొదటి నాలుగు అ ఇ ఉ (ణ్), ఋ ఌ

(క్), ఏ ఓ (ఙ్), ఐ ఔ (చ్)" = అ ఇ ఉ, ఋ ఌ, ఏ ఓ, ఐ ఔ (చ్) = 1వ సూత్రంలో 'అ' నుండి 4వ సూత్రంలో 'చ్' వరకూ ఉన్న అక్షరాలు అచ్=అచ్చులు. వీటిని స్వరాలు అంటారు.)

5వ సూత్రం హ య వ ర (ట్)లో 'హ' నుండి 14వ సూత్రంలో ల్ వరకూ ఉన్న వాటిని క్లుప్తంగా హల్ = హల్లులు అన్నారు.

రెండు పదాల కలయిక జరిగినప్పుడు సంధి అన్నారు. "ఏక: పూర్వపరయోః" పూర్వ పరస్వరంబులకు పరస్వరంబు ఏకాదేశంగా పరంబగుట సంధి... అని బాలవ్యాకర్త చిన్నయసూరి దీనికి వివరణ ఇచ్చారు.

స్వరం అంటే అచ్చు. పరం అంటే తర్వాతది అని.

రాముడు + అతడు = రాముడతఁడు.

ఉ + అ (పూర్వస్వరం ఉ + పరస్వరం అ) = 'అ' అయింది. ఏకాదేశం అంటే రెండింటి స్థానంలో ఒకటి రావడం.

సంస్కృత సంధుల్లో సవర్ణదీర్ఘ, గుణ, వృద్ధి, అనునాసిక, యణాదేశసంధులు. విసర్గసంధులు ముఖ్యమైనవి. అందరికీ తెలిసినవే అయినా మచ్చుకు ఒకటి రెండు సంధులను పరిశీలిద్దాం :

ఇకో యణచి : ఇకః యణ్ అచి అనేది యణాదేశసంధి సూత్రం; ఇకోయణచిః : ఇక్కులకు (ఇ-ఉ-ఋ) యణ్ణులు (య-వ-ర) పరమవుతున్నందువల్ల ఇది యణాదేశసంధి.

ఇక్ = ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ;

యణ్ = య్, ర్, ల్;

అచ్ = అచ్చులన్నీ

ఇ-ఉ-ఋలకు అసవర్ణాచ్చులు పరమైతే క్రమంగా య-వ-ర ఆదేశమవటాన్ని యణాదేశసంధి అంటారని ఈ సూత్రానికి తెలుగు వ్యాకర్తలు ఇచ్చిన వివరణ. ఇ-ఉ-ఋ స్థానంలో యణ్ణులు అంటే య, వ, ర - ఆదేశంగా వస్తాయి కాబట్టి యణాదేశసంధి అంటారు. ఆదేశం అంటే ఒక వర్ణం స్థానంలో మరొక వర్ణం వచ్చి చేరేది.

అతి + అంత = అత్యంత, సు + ఆగతం = స్వాగతం, గురు + ఆజ్ఞ = గుర్వాజ్ఞ, జయంతి + ఉత్సవం = జయంత్యుత్సవం; హిందూ + ఆర్యులు = హింద్వార్యులు, పితృ + ఆర్జితం = పిత్రార్జితం.

**అకఃసవర్ణె దీర్ఘః** : అ, ఇ, ఉ, ఋ వర్ణాలకు అవే వర్ణాలు పరమైతే వాటి దీర్ఘాలు ఏకాదేశంగా వస్తాయని ఈ సూత్రానికి భావం. ఇలా వచ్చిన సంధిని సవర్ణదీర్ఘసంధి

అంటారు. సవర్ణం అంటే ఉచ్చారణలో ఇంచుమించుగా సమానమైంది. అ – ఆ; ఇ – ఈ; ఉ – ఊలు సవర్ణాలు.

ఉదా : పరమ + అర్థము = పరమార్థము; రామ + ఆలయము = రామాలయము; కవి + ఈశ్వర = కవీశ్వర సు + ఉక్తి = సూక్తి; మాతృ + ఋణం = మాతౄణం.

ఇలా క్లుప్తీకరించి, సంకేతాత్మకంగా (కోడింగ్) వ్యాకరణ సూత్రాలను వ్రాశాడు పాణిని. పాణిని చేత నిర్మించబడిన, సంస్కరించబడిన, మెరుగుపరచబడిన సంస్కృతాన్ని ఆయనే ఇలా కోడింగ్ పద్ధతిలో పదిలపరిచాడు.

కంప్యూటర్లో ఒక భాషను వ్రాయటానిక్కూడా ఈవిధమైన కోడింగ్ పద్ధతినే పాటిస్తారు.

Computational Linguistics అనే శాస్త్ర విభాగం అభివృద్ధిచెందాక సంస్కృత భాషావతరణకు పాణిని చేసిన కృషిమీద కంప్యూటర్ భాషావేత్తలు దృష్టి సారించారు. 2007లో ప్రథమ సంస్కృత గణాంక (కంప్యూటేషనల్) మహాసభ జరిగింది. ఈ సదస్సులో 2700 యేళ్ల క్రితమే మానవ మేథ విశ్లేషించుకునేందుకు వీలుగా పాణిని సంస్కృతాన్ని కంప్యూటరీకరణం చేసిన వైనంపై చర్చ చేశారు.

బాకస్–నౌర్ అనే ఇద్దరు కంప్యూటర్ శాస్త్ర నిపుణులు యూనీకోడ్ పద్ధతిలో కంప్యూటర్ భాష ఆవిష్కరణకు కృషిచేసినవారు. కంప్యూటర్ భాషని ఆ ఇద్దరి పేరుతో బాకస్–నౌర్ విధానం అని పిలుస్తారు. వేల ఏళ్ళక్రితమే పాణిని భాష కోడింగ్ పద్ధతిని ప్రవేశపెట్టిన విధానం తెలిశాక పాశ్చాత్య పండితులు ఆశ్చర్యపోయారు. కోడింగ్ పద్ధతిని కంప్యూటర్లో ఒక భాషను వ్రాయటానికి పాణిని పేరు కూడా చేర్చి "పాణిని–బాకస్–నౌర్ పద్ధతి" అనే వ్యవహారనామం ఇప్పుడు వ్యాప్తిలోకి వస్తోంది.

"ఇ–సంస్కృతం" ప్రచారంలోకి రావటానికి Gottingen Register of Electronic Texts in Indial Languages (GRETIL) ద్వారా అందుబాటులోకి తెస్తున్నారు. సమస్యా పరిష్కరణలు (algorithms) ఇంకా ఇతర ఉపకరణాల సాయంతో సంస్కృత భాషను కంప్యూటరీకరించే ప్రయత్నాలు చేస్తున్నారు. ముఖ్యంగా సంధి, సమాసాలపైన దృష్టి కేంద్రీకరిస్తున్నారు. సంస్కృతంలో ఆగమ, ఆదేశ, లోప, ప్రకృతీభవాలను కంప్యూటర్ గుర్తించేలా ఉపకరణాలకోసం కృషి చేస్తున్నారు.

సంస్కృతం, తెలుగు సహా భారతీయ భాషలను డిజిటల్ ఫార్మాట్‌లో యూనికోడ్ పరిధిలోకి తెచ్చే కృషిలో భాగంగా Unicode (UTF-8) standard (4) ప్రకారం యూనికోడ్ కన్సార్టియం అంతర్జాతీయ సంస్థ విశేష కృషి చేస్తోన్నట్టు తెలుస్తోంది. కంప్యూటర్ ద్వారా

యూనికోడ్'లో తెలుగు వ్రాయటానికి ఇప్పుడు అవకాశాలు మెరుగుపడ్డాయి. కానీ డిజిటలైజేషన్ ప్రక్రియకు ఈ కృషి సరిపోదు. ఇంకా విస్తృతమైన పరిశోధన జరగాలి. సంధి, సమాసాల విశ్లేషకాలు (algorithms) అభివృద్ధి చెందితేగానీ ఇది సాధ్యంకాదు.

## ధ్వనిశాస్త్రం - వ్యాకరణ సూత్రాలు :

శిక్ష, ఛందస్సు, నిరుక్తము; వ్యాకరణం ఈ నాలుగూ వేదాంగాలు. వీటిలో శిక్ష, ప్రాతిశాఖ్యలు, ప్రత్యేకంగా ధ్వని శాస్త్రానికి సంబంధించిన ఉపాంగాలు, తైత్తిరీయ ప్రాతిశాఖ్య, ఋగ్వేదం ప్రాతిశాఖ్యలలోని ముఖ్యమైన భాగాలు పాణిని కాలానికే ప్రసిద్ధమై ఉన్నాయి. వేదోచ్ఛారణకి సంబంధించిన సూక్ష్మమైన, ప్రత్యేకమైన సూత్రాలు, విశ్లేషణ వీటిల్లో ఉంటుంది.

వైదికయుగం ఏనాటిదో తెలీదు. మనవాళ్ళు దాన్ని వేలాది సంవత్సరాల అవతలకు తీసుకువెళ్ళే ప్రయత్నం చేస్తే పాశ్చాత్యులు సాధ్యమైనంతవరకూ క్రీస్తుకు సమీపానికి తేవాలని ప్రయత్నించారు. ఈ రెండురకాల ఆలోచనా ధోరణులూ సత్యాన్ని వదిలి గాలిలో సాము చేశాయి. వైదికయుగానికీ, పాణిని కాలానికీ మధ్య చాలా వ్యవధానం ఉన్నమాట నిజం. కాలక్రమంలో వేదభాష జనం నాలుకలమీద ఆడుతూ పాణిని కాలానికొచ్చేసరికి అనేక పరిణామాలకు, విపరిణామాలకూ లోను కాసాగింది. వేద ప్రజలతో ఇతరుల సమీపవర్తనం, సహజీవనాల కారణంగానూ, నాగరికతా వ్యాప్తి కారణంగానూ వేదాలలోకి కొత్తపదాలు వచ్చి చేరసాగాయి. కొన్ని పదాలకు అర్థవిస్తృతి, అర్థవిపరీతాలు కూడా జరిగాయి. కొన్ని పదాలు వాడకం కోల్పోసాగాయి. కొన్ని పదాలు పండితులకు మాత్రమే పరిమితం కాగా, కొన్ని పండితుల కారణంగా మార్పులు పొందాయి.

అన్ని భాషల విషయంలోనూ ఇలానే ఎప్పుడూ జరుగుతుంది. వేదభాష విషయంలోనూ జరిగింది. స్వచ్ఛమైన వేదభాషకూ–జనవ్యవహారంలో ఉన్న వేదభాషకూ మధ్య తేడాలు పొడుసూపుతున్న కాలంలో పాణిని జన్మించాడు.

వేదోచ్ఛారణలో తప్పులు దొర్లడం, కొన్ని శబ్దాల ఉచ్ఛారణ పూర్తిగా లుప్తం కావటంతో దానిని ప్రమాణీకరించాల్సిన అవసరాన్ని పాణిని గుర్తించాడు. పాణిని కన్నా కనీసం 300 యేళ్ళ తర్వాత వచ్చిన పతంజలి మహాభాష్యం మొదటి అధ్యాయంలోనే "ధ్వనిశాస్త్రాన్ని శాస్త్రీయ పద్ధతిలో అధ్యయనం చెయ్యటానికి, లోపాల్లేకుండా వేదోచ్ఛారణను పరిరక్షించ డానికే ఈ వ్యాకరణ నియమాలు" అని స్పష్టంగా పేర్కొన్నాడు కూడా!

సరైన ఉచ్ఛారణని నేర్పడం కోసం వర్ణం, స్వరం, మాత్ర, బలం, సామం, సంతానం, అని ఆరురకాలుగా ధ్వనిని అధ్యయనం చేసేవారని తైత్తిరీయోపనిషత్తు చెప్తోంది. స్వర, వ్యంజనాలను వేరుగా గుర్తించడం, వ్యంజనాలని స్పర్శ, అంతస్థ, ఊష్మాలని

మూడురకాలుగా వర్గీకరించడం ఆనాటినుండీ ఉంది. అది సంగీత, నాట్యాది కళలే కాదు భాషాశాస్త్రపరమైన అంశాలక్కూడా వర్తించే విషయం. నాదంలోంచే అక్షరాలు పుట్టాయి. నాదంలోంచే భాషపుట్టింది.

కౌత్సుడు మొదలైన పాణిని ముఖ్య శిష్యులలో పూర్వపాణినీయులని, అపర పాణినీయులని రెండురకాల శిష్యులున్నారు. శిష్యుల శక్తిసామర్థ్యాలను బట్టి వ్యాకరణాన్ని పాఠభేదాలను ప్రవేశపెట్టి బోధించాడు.

ధాతుపాఠం, గుణపాఠం, ఉపాదిపాఠం అని పాణినీయంలో మూడురకాల పాఠభేదాలున్నాయి. పాణిని వ్యాకరణానికి కూడా అష్టాధ్యాయి, అష్టం, శబ్దానుశాసనం, వృత్తిసూత్రం, అష్టికా అని అయిదు పేర్లున్నాయి. వీటిలో అష్టాధ్యాయి పేరే ప్రసిద్ధమైంది.

అష్టానాం అధ్యాయ్యానాం సమహారం-ఎనిమిది అధ్యాయాల సమాహారంగా ఈ గ్రంథం వెలువడింది.

పాణిని, పతంజలి కాలాల్లో అటు వేదభాష, ఇటు సంస్కృతభాషలతోపాటు మూడవదైన శిష్టవ్యవహారభాష కూడా వ్యాప్తిలో ఉండేది. విస్తృతమైన వేద వాఙ్మయాన్ని సంస్కరించటానికి, జనవ్యవహారంలో ఉన్న భాషను స్థిరీకరించటానికి పాణిని కృషిచేశాడు.

వేద యుగానంతరం తొలినాళ్లలో సంస్కృతం ప్రజల భాషగానూ, మేథావులభాషగా, అనుసంధానభాషగా (లింగ్వాఫ్రేంకా-Lingua Franca) ఉండేది. పాణినీయంలో గ్రీకుపరమైన అంశాలను వెదికి, వాటినిబట్టి పాణిని అలెగ్జాండర్ తరువాతి వాడుగా చూపించే ప్రయత్నం కొందరు చేశారు. కానీ, అలెగ్జాండర్ కన్నా చాలాముందునుండే భారతదేశంలోని వివిధ ప్రాంతాలతో గ్రీకులకు వర్తక వాణిజ్య సంబంధాలు నడిచాయి. అలెగ్జాండర్ కన్నా ముందే గ్రీకుభాష భారతదేశానికి చేరిందనేది ముఖ్యవిషయం. పాణినికాలానికే చేరి ఉండవచ్చు కూడా!

చారిత్రకంగా చూస్తే, క్రీ.పూ. 326లో అలెగ్జాండర్ దండయాత్ర జరిగింది. క్రీ.పూ. 305లో మౌర్యులు గాంధారాన్ని (ఆఫ్ఘనిస్తాన్) గెల్చుకున్నారు. క్రీ.పూ. 150లో ఈ ప్రాంతాన్ని మౌర్యులనుండి బాహ్లికులు (బాక్ట్రియా) ఆక్రమించుకున్నారు. దాంతో గాంధారం, పంజాబు, సింధు, ముఖ్యంగా బాహ్లిక (బాక్ట్రియా) ప్రాంతాల్లో సాంస్కృతికంగా గ్రీకుల ప్రభావం పెరిగింది.

గ్రీకులు భారతదేశంలో భారతీయులుగానే జీవించటానికి ఇష్టపడ్డట్టు కనిపిస్తుంది. గ్రీకులు కొందరు బౌద్ధమతాన్ని స్వీకరించారు. మౌర్యులపై దండయాత్రల్లో ముఖ్యుడైన మెనాండ్రోస్ (Menandros) తరువాత మిళిందుడయ్యాడు. గ్రీకు రాయబారి హీలియోడరస్ (Heliodoros) లాంటివాళ్ళు వైష్ణవమతాన్ని స్వీకరించారు.

మిలిటరీ పదాలైన, ఖలీన (గుర్రపు కళ్ళెము, Khalinos), కేణిక (గుడారము, Skene), పరిస్తోమ (ఏనుగుమీద పరిచే ఎర్ర కంబళి, peristroma) సురుంగ (సొరంగము, Surinx); అలాగే రాతకు సంబంధించిన మేల(సిరా), కలమ (కలము, గ్రీకు Kalamos నుండి, రెల్లు కాడలనుండి చేసినది) లాంటి పదాలు సంస్కృతంలోకి చేరాయి. ఇవి పాణినికి ముందువా, తరువాతవా అనేది తేల్చటం కష్టం.

పాణిని కాలానికి పరివ్యాప్తిలో ఉన్న వివిధ ద్రావిడ భాషల పదాలు, ముండా పదాలు కూడా సంస్కృతంలోకి చేరటానికి పాణిని, ఆయన తరువాత ఆయన మార్గంలో నడిచిన వ్యాకరణవేత్తల పాత్ర ఎంతైనా ఉంది.

ఎఫ్ బి జె క్వీపర్ అనే పండితుడు ఋగ్వేదంలోంచి 350 పదాలను ఏరి ఇవి ఇండో ఆర్యన్ భాషా కూటమికి చెందిన పదాలు కావని, ముండా, లేదా ద్రావిడ పదాలు కావచ్చి వ్రాశాడు. వాటిలో అశ్వత్థ, అగద, అండ, ఓదన, కుమార, కుల, పాణి, పిశాచి, పుణ్య, పుండరీక, బిల, మండూక, మూల, మయూరి, ఫలం(భాగం), శుల్కం ఇలాంటి 383 పదాలు ఋగ్వేదంలోకి చేరిన స్థానికభాషల పదాలని, నదులు, జాతుల పేర్లుగా కనిపించే వాటిలో గంగ, జాహ్నవి, శబరి లాంటి పేర్లన్నీ ఇండో ఆర్యన్ భాషా కూటమికి చెందినవి కావని ఆయన ప్రకటించాడు.

పుత్ర, మీన, తాళలాంటి పదాలు అచ్చమైన తెలుగు మాటలని, అవి తెలుగులోంచే సంస్కృతంలోకి చేరాయని కోరాడ రామకృష్ణయ్య పంతులుగారు 1920లలోనే వ్రాశారు. అప్పటికే వేదభాష మాట్లాడిన ప్రజలతో ఇతర భాషాజాతి ప్రజల సహజీవనం, సమీపవర్తిత్వమూ కారణంగా ఎన్నో భాషాపదాలు వీరి భాషలో కలిసిపోయాయి. సంస్కృతం ఎలా ఉన్నత కావ్యభాషగా ఎదిగిందో, అందుకు పాణిని చేసిన కృషి ఏమిటో దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.

మొత్తంమీద భారతీయత అనేది ఋగ్వేదానికన్నా పూర్వం నాటిదనే అభిప్రాయానికి బలం చేకూరుస్తున్న పరిశోధనలు అనేకం ఉన్నాయి. మైకేల్ విట్జెల్, ఫ్రాంక్లిన్ సి సౌత్ వర్త్, ఎఫ్ బి జె క్వీపర్ లాంటి భాషావేత్తల పరిశోధనలు దీన్ని ధృవీకరిస్తున్నాయి. పాణిని కూడా ఆర్యేతర భాషల పదాలను గౌరవించాడేగానీ ఈసడించలేదు. వాటిని సంస్కృతీకరించటంలో ఆయన పాత్ర ముఖ్యమైంది.

దీన్నిబట్టి, ఆర్యేతర జాతుల విస్తరణ జరుగుతున్నకొద్దీ సమీపవర్తిత్వం, సహజీవనాల కారణంగా ద్రావిడ, ముండా ఇంకా అనేక ఇతర భాషల పదాలు ఋగ్వేదంలో ఋగ్వేదకాలానికే చేరాయని మనం గట్టిగా నమ్మవచ్చు.

బహుశా, భిన్న సంస్కృతులు, భాషలు కలిగిన ప్రజలు సమూహంగా జీవిస్తున్న కాలంలో వైదిక భాష లౌకిక భాషగా మారిపోయే పరిస్థితి ఏర్పడి ఉంటుంది. అందుకనే

పాణిని వైదికభాషను స్థిరీకరించే ప్రయత్నం చేసినట్టు కనిపిస్తుంది. ఒకవిధంగా వేదభాషకు భిన్నమైన శిష్టవ్యవహారభాషగా సంస్కృతానికి ఒక రూపునిచ్చాడని చెప్పవచ్చు.

ఇక్కడ ఒక ఊహాజనిత ప్రశ్న ఒకటి ఉదయిస్తుంది. పాణిని వ్యాకరణ సూత్రాలు లేకపోతే భాష ఏవిధంగా ఉండేది? అని! బహుశా, వైదికమంత్రాలన్నీ లౌకిక వ్యవహారంలో జనం నోటిలో నానీనానీ చిలవలు పలవలుగా మారిపోయి ఒక విచిత్రమైన సంకర సంస్కృతం ఏర్పడి ఉండేది. ఈ ప్రమాదాన్ని నివారించటానికే వైదికభాషను స్థిరీకరించి దాని పవిత్రతను నిలబెట్టాడు. పాణిని కావ్యభాషగా సంస్కృతాన్ని ఈ జగతికి అందించాడు.

ఛందో విషయాలను "ఛందసి" అనీ, భాషామాత్ర విషయాలను "భాషాయా" అనీ వేర్వేరుగా విభజించుకుని, శబ్దాలను ఉభయ విషయకాలుగా పాణిని సూత్రీకరించే ప్రయత్నం చేశాడు. పాణిని తనకాలంనాటి వేదభాషకు, లౌకిక భాషకు కూడా ఉపయోగపడే అనుశాసనాన్ని వ్రాశాడు.

అయితే ప్రాకృతం, పాళీ మొదలైన భాషల్ని సంస్కరించి సంస్కృతం ఏర్పడిందా...? లేక సంస్కృతానికి అపభ్రంశ రూపంగా ప్రాకృతాది రూపాలు ఏర్పడ్డాయా అనే సందేహాలు మాత్రం అలానే ఉన్నాయి.

సంస్కృతం అంటే సంస్కరించబడినది అనే భావార్థాన్ని చెప్తారుగానీ, ఏఏ భాషల కూటమి భాషగా సంస్కృతాన్ని సంస్కరించారు...? ఏ ఏ భాషాపదాలు సంస్కృత పదాలుగా మారిపోయాయి అనే విషయం గురించి పెద్దగా మన పండితులు దృష్టి సారించకపోవటానికి సంస్కృతం దైవభాష అనే ఒక భావన ప్రబలంగా ఉండటమే కారణం.

వైదికభాష కావ్యభాష అయిన సంస్కృతంగా ఎలా మారిందో అర్థంచేసుకోవటం అవసరం. జనవ్యవహారానికి ఆనాటి వ్యాకర్తలు ప్రాధాన్యతనిచ్చారు కాబట్టే, కొన్ని యుగాలైనా స్థిరంగా ఉండే భాషగా సంస్కృతం రూపొందగలిగింది.

జనవ్యవహారంలో ఉన్న పదాలు, సామాజిక అంశాల ఆధారంలేకుండా కేవల శిష్టాచారాల వలన ఏ సిద్ధాంతమూ రూపొందదు. వ్యాకరణానికీ జనవ్యవహారాలే మూలంగా ఉంటాయి.

పాణిని కాలంనాటి సమాజంలో ఆర్యులు ఒక భాగమే తప్ప అది సంపూర్ణమైన ఆర్యసమాజం కాదని, భిన్నజాతుల సమూహం అనీ అంగీకరిస్తే, అందరికీ అవసరమైన ఒక అనుసంధాన భాష ఆవశ్యకతని పాణిని గుర్తించినట్టు అర్థం అవుతుంది.

"యూస్త్రాఖౌనదీ" అనే సూత్రానికి పతంజలి భాష్యం వ్రాస్తూ, "ఒక కవి చేసిన కొత్త ప్రయోగాన్ని ప్రమాణీకరించి శాస్త్రంగా భావించి తదుపరి కవులు దాన్ని అనుసరించాలేగానీ, కవుల ప్రమాణాల్ని శాస్త్రం అనుసరించదు. శాస్త్రాన్ని అనుసరించని కవి ప్రయోగాలన్నీ అసాధుపదాలుగానే భావించాల్సి ఉంటుంది" అన్నాడు.

కవులు శిష్ట సాంప్రదాయాన్ని వ్యాకరణ నియమాలను అనుసరించాలి, అలాగే ఛందస్సు మొదలైన కావ్య నియమాలనీ అనుసరించాలి. అలాగని ప్రజల భాషను ప్రతిఫలింపచేయలేకపోతే ఆ సాహిత్యానికి వ్యాప్తి లేకుండా పోతుంది. కాబట్టి, జనవ్యవహారాల్ని దృష్టిలో పెట్టుకోవాలి. అందువలన పైన చెప్పిన రీతిలో కొన్ని అసాధు శబ్దాలు ప్రయోగించి శిష్టసాంప్రదాయాన్ని ఉల్లంఘించవలసి వస్తుంది. అది ఆ కావ్యానికి శోభను చేకూర్చినప్పుడు ఇతర కవులకు అనుసరణీయం అవుతుంది. భవిష్యత్కాలంలో వ్యాకర్తలు ఈ జన అనుసరణీయ పదాలను తిరిగి భాషలో స్థిరీకరించే ప్రయత్నాలు జరగాలి.

ప్రయోగాలను ప్రమాణీకరించుకునే శాస్త్రవ్యవస్థ తరువాతికాలాలలో ప్రయత్నించక పోవటం వలన అనేక భాషాభేదాలు తలెత్తాయి. సామాజిక, రాజకీయ, ఆర్థిక, భౌగోళిక కారణాలు కూడా ఒక భాషలోంచి మరొక భాష ఏర్పడటానికి, భాషలో చీలికలు రావటానికి కారణాలయ్యాయి.

సోమనాథుడు, పంపకవి మొదలైన కవుల రచనల్లో తెలుగు కన్నడ మిశ్రమ పదాలు మనకు ఎన్నో కనిపిస్తాయి. వాటిని పఠించిన ప్రజలమీద ఆ మిశ్రమ పదాల ప్రభావం ఉంటుంది. వాటిని భాషలో స్థిరికరించే ప్రయత్నాలు జరగాలి. అసాధుపదాలు అంటే స్థిరీకరించబడనివి, స్థిరీకరించవలసినవి అనే అర్థం చెప్పుకోవాలేగానీ, అంటరానివి, దుష్టమైనవీ అని పక్కన పెట్టనవసరం లేదు.

పండితులకోసం వ్యాకరణం, ప్రజలకోసం కావ్యం కాబట్టి, కవులు కొండొకచో ప్రజలూ అనేక నూతన పదాల సృష్టికి పాల్పడుతుంటారు.

“పైవంతెన” “దోమలచక్రం”లాంటి నవీన పదాలు వ్యాకరణ సూత్రాల్లోంచి పుట్టినవి కాదు. ప్రజల అవసరాలు పెరుగుతున్నకొద్దీ, ఆధునిక పదసంపద ఆవశ్యకత పెరుగుతుంది. తగ్గట్టుగా భాషాపదాల నవీకరణ, ప్రమాణీకరణ కూడా జరుగుతూ ఉండాలి.

“పిండి రుబ్బింగు మిషను” అనే మాట బాగా జనవ్యవహారంలో ఉంది. ఏ వ్యాకర్తా దీని వ్యవహారాన్ని ఆపలేదు. మరి ఏంచేయాలి? సూత్రీకరించాలి! ఎవరు సూత్రీకరిస్తారు? ఎవరు ప్రమాణికరిస్తారు? ఇదంతా ఎప్పుడు జరుగుతుంది? అశాస్త్రీయాలు-అసాధుశబ్దాలు అంటూ కూర్చుంటే భాషాభివృద్ధి సాగదు.

శిష్టసాంప్రదాయం అనేది అనూచానంగా ఉన్నదే! జనం అవసరాలను కూడా పరిగణలోకి తీసుకుని, శాస్త్రం చెప్పని పదాలను, అసాధు శబ్దాలను స్థిరీకరించే ప్రయత్నాలు జరగాలి.

తెలుగులో గుత్తేదారు (కాంట్రాక్టర్) అనే పదాన్ని పత్రికలు కొత్తగా తీసుకొచ్చాయి. శుద్ధవ్యాకరణ వాదులు ఈ మార్పును అంగీకరించకపోవచ్చు. అంతమాత్రాన

పరిణామక్రమం ఆగదు. జనం నాలుకలమీదకు పదాలు చేరకుండా వ్యాకరణ సూత్రాలు అడ్డుకోలేవు. నిజానికి ఇది "గుత్తదారు" గుత్తేదారు ఎలా అయ్యిందో తెలీదు.

సూత్రభాష, ఆర్షభాష, శాస్త్రభాష, వాడుకభాష, పత్రికాభాష, నాటకభాష ఇన్ని మార్పులు భాషలో వచ్చాయి. సంస్కృతం మీద పట్టు ఉన్న మహాకవులు సైతం కొత్త ప్రయోగాలు చేయకుండా తమను తాము కట్టేసుకోలేరు. కాబట్టి భాషకు ఎప్పటికప్పుడు ప్రామాణీకరణ అనేది నిరంతరం జరగవలసిన ఒక ప్రక్రియ! ఈ అన్ని భాషా రూపాలకూ ఒక్కో వ్యాకరణం అవస్యం కావల్సిందే!

వ్యవహారంలో ఉన్న భాషల పదాలు స్వస్వరూపంలో శిష్టసాంప్రదాయంలో గ్రాంథికంగా లేదా కావ్యభాషగా నిలబడినా జనం వాడుకలో మాత్రం ఈ స్థిరీకరణ నిలబడక అనేక మలుపులు, మార్పులూ పొందుతూ ఉంటుంది.

జనం వాడుకలో ఉన్న పదాల్ని అపశబ్దాలుగా వ్యాకరణవేత్తలు ముద్రవేస్తుంటారు. వాడుకభాష, గ్రాంథికభాషా ఒకటిగా ఎప్పటికీ ఉండవు. వివిధప్రాంతాలలో సామాజిక రాజకీయ పరిణామాల వలన వాడుకభాష మీద అనేక ప్రభావాలు ప్రసరిస్తుంటాయి. దాంతో ప్రాంతీయభాషా రూపాలు వేర్వేరుగా తలెత్తుతాయి. మాండలిక వ్యత్యాసాలు ఏర్పడతాయి. తెలుగు విషయంలో అదే జరిగింది.

కోస్తా, సర్కారు జిల్లాలమీద ఆంగ్ల ప్రభావం, తెలంగాణా జిల్లాలమీద ఉర్దూ ప్రభావాల వలన అవి స్పష్టమైన అంతరాన్ని పొందాయి. అది చివరికి రెండు రాష్ట్రాలుగా విడిపోయేదాకా వెళ్ళింది. 'మాదే అసలు తెలుగు' అనో, 'మా భాష వేరేభాష' అనో కొత్త వాదాలు పుట్టుకొస్తాయి.

కనీసం శతాబ్దానికొకసారయినా వ్యాకరణ పండితులు కూర్చుని ఏకాభిప్రాయంతో భాష ప్రామాణికరణ కోసం ప్రయత్నిస్తే ఇలాంటి భాషాపరమైన విబేధాలు తలెత్తకుండా ఉంటాయి. మాండలిక వ్యత్యాసాలను నిఘంటువులకు ఎక్కించకపోవటం వలన కూడా ప్రాంతీయతా విబేధాలు తలెత్తుతున్నాయి. పండితులు సామాజిక దృష్టితో ఈ విషయాన్ని పరిశీలించవలసిన అవసరం ఉంది. పాణిని చేసిన కృషిని ఈ కోణంలోంచి కూడా చూడాలి. దేశంలో ఏ భాష మాట్లాడేవాడికైనా సంస్కృతం చాలావరకూ అర్థం అవుతుంది. కారణం అన్ని దేశీయ భాషల్లోనూ సంస్కృతపదాలు కలగలసిపోగలిగాయి కాబట్టి.

పాణిని మార్గంలో మాతృభాషలను కూడా స్థిరీకరించుకునే ప్రయత్నం అవసరం.



# "తెలుగు" తెలుగు మాటే!

తెలుగు 'అనే పదం సంస్కృత' త్రిలింగ' లోంచి వచ్చిందని కొందరు, 'త్రికళింగ' (త్రినాగ) లోంచి వచ్చిందని ఇంకొందరు. ఇలా తెలుగు భాషకి పేరును కూడా సంస్కృతంలోనే వెదకి, అందులోంచే వ్యుత్పత్తిని తీసి చెప్పుకోవడం తెలుగువారి దురదృష్టం.

సంస్కృత భాష ఇండో యూరోపియన్ (లేదా) ఇండో ఆర్యన్ భాషాకుటుంబానికి చెందినది. కానీ, తెలుగు ద్రావిడ భాషా కుటుంబానికి చెందినది కదా...? దీనిపేరు ద్రావిడ భాష మూలాల్లో దొరుకుతుంది గానీ, సంస్కృత భాషలో ఎందుకు వెదుకుతున్నారు?

జి. స్ట్రోనికోన్ రూపొందించిన – ద్రవిడియన్ ఎటిమాలజీలో తెల్ అనే రూపానికి స్వచ్ఛమైన, నిర్మలమైన, శుభ్రమైన అని అర్థాలు కనిపిస్తాయి. ఇంకా అనేక రూపాలున్నాయి.

ఇవి గమనించండి.

## 1. ప్రోటో ద్రవిడియన్ తెల్

| | |
|---|---|
| యూరేసియాటిక్ | tVIV (to say, tell) |
| ఇండో యూరోపియన్ | Tell, talk, tale |
| అల్బాయిక్ | (telunu) narrating, tale |
| కర్తివేలియన్ | tul-call, say, shout, |
| నాస్ట్రేటిక్ డిక్షనరీ (2353) | TelV= shout, call |

## 2. ప్రోటో తెలుగు తెల్

**తెలుగురూపం :** తెలుచు (మొక్కు, తీర్చు, ప్రార్థించు) ఈ తెలుగు రూపానికి సంబంధించి ద్రవిడియన్ ఎటిమాలాజికల్ డిక్షనరీ (3427)లో ఇచ్చిన వివరాలు చూడండి.

3427 : Te(k) : Telucu (page 300) - telugu; telunge; telugu man; te, telungu; tenungu, telugu language - kol, telgi Telugu man (CF Mara Telaga) - Telugu man.adj.talagi (DED2820- (k)- telugu.

342 Te. (k)telucu : to praise, worship, request, pray.

Go (Tr.) talehkana (w) talahkana; to beg, ask for anything esp. abide.

తెలుచు(ల్చు) పదానికి సూర్యరాయాంధ్ర నిఘంటువు అందించిన వివరాలు పరిశీలించండి.

1. తేర్చు - తేటగా, జేయు, ప్రసన్నత నొందించు. శాంతి పరచు, సంతుష్టిపరచు 2. స్తుతించు, పొగడు 3 ప్రార్థించు, వేడు 4 భుజించు, సేవించు 5 ఎఱుగు, తెలిసికొను, 6 తేలుచు, వోలలాడ్చు 7 మ్రొక్కు, నమస్కరించు 8 బయలుపడు, కనబడు.

## 3. ప్రోటో తెలుగు : తెల్

తెలుగు : తెలుపు, స్వచ్ఛము, తెలియు To be known, understood, perceived, intelligible, clear, plan, be seen, discovered, intelligible, clear, plain, be seen, discovered, regain consciousness, wakeup from sleep.

తెలివి : understanding, intelligence, wisdom, consciousness, liveliness, cheerfulness.

తెలివిడి : understanding, information

తెలిసికొను : to understand, know, learn

తెలుపు : to comunicate, make known, inform

తెలుపు : white, whiteness

తెలుపుడు : knowledge, information

తెల్ల : white, plain, pale, clear

# 4. ప్రోటో తెలుగు

తెలుఙ్ అనే రూపానికి telugu language తెలుగు - తెలుంగు అర్థాలున్నాయి. తెలుఙ్ ప్రోటో తెలుగు రూపానికి సంబంధించి DEDR 3426లో ఇచ్చిన వివరాలు చూడండి.

1. 3426 Ta (తమిళం) Telugu, telunku, telunkam, telinkam (Page 300) treppa (trept) to cause to lie down, lay out, stretch out full length.

KUWI (1sr) trip (-h-) to lay down make one sleep

3426 Ta (తమిళం) telugu, talunku, telunkan, telinkam, telugu country, telugu language, telunkan, teluguman.

Ma (మళయాళం) telunku, telugu country, language and people.

Ka (కన్నడం) telugu, telagu, telungu, telugu language; teluga, telaga, telunga.

ఈ నిరూపణలు తెలుగు అనే పేరు తెలుగులోంచే పుట్టింది కానీ, సంస్కృతం లోంచో, మరో భాషలోంచో పుట్టలేదని గట్టిగా నొక్కి చెప్తున్నాయి. స్వచ్ఛంగా, తేటతెల్లంగా, సుమధురంగా, నిర్మలంగా ఈ భాష ఉంటుందనీ, దీనికి వివిధ భాషలలో ఉన్న అర్థాలను బట్టి గ్రహించవచ్చు.

ఈ పదాలకు సమానమైన భావం, సమానమైన రూపం అనేక ఇతర భాషల్లో కన్పిస్తుంటే త్రిలింగం, త్రికళింగంలోంచి తెలుగు ఏర్పడిందనడం అన్యాయం.

తెలుగు అంటే "చక్కగా వివరించి చెప్పడం" అని భావార్థం. బ్రాహుయి లేదా బ్రూహుయి పదానికి కూడా చెప్పడం అనే అర్థం. ఈ సామ్యాన్ని గమనించాలి. ఈ బ్రూహుయీలు, తెలుగువారూ ఆ రోజుల్లో చెప్పేవారి పాత్ర నిర్వహించి వుండాలి. ఇది సింధు నాగరికత కాలంలోనే జరిగి ఉండాలి. మరిన్ని వివరాల్లోకి వెడదాం!

## బ్రాహూయీలెవరు?

క్రీ.పూ. 4,000 నాటికే బ్రాహుయీ భాష ద్రావిడ భాషా మాతృకలోంచి మొదటగా విడివడి వుండవచ్చని ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి ప్రభృతులు చెప్తున్నారు.

ఆఫ్ఘనిస్తాన్ వైపు సింధు నాగరికత రూపుదిద్దుకోవడం క్రీ.పూ. 8,000 ఏళ్లకే మొదలయ్యిందని బి.డి. కార్టి, జె.యమ్. కజాల్ పేర్కొన్నారు. క్రీ.పూ. 4,000 ఏళ్ళనాటికి దక్షిణ భారతదేశం నుంచి సింధు నగరాల వైపు జాతులు విస్తరించి, ఆ నాగరికత రూపుదిద్దుకోవడంలో తమ వంతు పాత్ర పోషించారు. క్రీ.పూ. 4,000 నాటికి బ్రాహుయియా భాషతో పాటు సమకాలీనంగా సింధు నగరాలు కూడా రూపుదిద్దుకొంటున్న సమయం ఇది. వాటి నిర్మాణంలో బ్రాయియా / తెలుగు / ద్రావిడ ప్రజలు పాలుపంచుకున్నారు.

సుమేరియా, ప్రాచీన ఇరాన్‌లలోని ప్రజలు ఆఫ్ఘనిస్థాన్ మీదుగా సింధు నగరాలను చేరితే, దక్షిణాది నుంచి ప్రోటో ద్రావిడ ప్రజలు కూడా అక్కడకు చేరుకున్నారు. తూర్పు నుంచి ప్రోటో ముండాజాతి ప్రజలు కూడా చేరి వుండవచ్చు.

సింధు నగరాలలో ఇలా బయట నుంచి వచ్చిన వారిని అలా ఉంచితే, స్థానికులన దగినవారు బ్రాహుయియా భాష మాట్లాడిన ప్రజలు. కాబట్టి, బ్రాహుయియాలు ఆ రోజుల్లో వలస వస్తున్న ప్రజలకు సంధానకర్తలుగా వ్యవహరించి వుంటారు.

బ్రాహుయియాలు ఈనాటికీ ఆఫ్ఘనిస్తాన్, బెలూచిస్తాన్, ఇరాన్, పాకిస్తాన్‌లలోనూ ఉన్నారుగానీ, ఇస్లామీకరణం చెందడం వలన అలనాటి భాషా సంస్కృతుల్ని ఎంతమేర వాళ్లు నిలబెట్టుకోగలుగుతున్నారనేది సందేహమే. అయితే తమ మాతృభాష బ్రాహుయియా అనే చెప్పుకోవడం విశేషం.

అయితే బ్రాహుయియాలు తమదైన స్వంత భాషతో పాటు ప్రోటోద్రవిడియన్ దేవతలైన బ్రహ్మ, మహేశ్వరుడు, కాళి (అమ్మతల్లి) వీళ్లని ఒకప్పుడు ఆరాధించేవారా అనేది నిరూపణ కాని విషయం.

ఋగ్వేదంలో బ్రూ శబ్దానికి మాట్లాడటం (to speak, say, tell) అని అర్థం. బ్రూమి, బ్రవీమి, బ్రూహి, బ్రువధ్వం, బ్రూతత్, అబ్రువం, బ్రువమాణ, బ్రువాణ, ఇలా మాటలాడటం లేదా చెప్పడం గురించి వైదిక ఛందంలోనే అనేక ప్రయోగాలు కన్పిస్తాయి. మొత్తం మీద బ్రాహుయియా లేదా బ్రూహియియా భాషకు “చెప్పడం” అనే అర్థం స్థిరపడినట్లు కన్పిస్తోంది.

ఈ చెప్పేవారు భౌగోళిక విషయాలు చెప్పి ఉండవచ్చు. భాషాపరమైన లేదా దేవుడికి సంబంధించిన విషయాలు కూడా చెప్పి ఉండవచ్చు. మొత్తం మీద అలా చెప్పగలిగిన

వారిని బ్రాహ్మణులుగా వ్యవహరించి ఉండవచ్చు. బ్రహ్మ, బ్రాహ్మణ శబ్దాలకూ, బ్రాహుయీ అనే పేరుకి ఏమైనా సంబంధం ఉందేమో పరిశోధన కొనసాగవలసి ఉంది.

ఆ మూలపురుషుడి ముఖం (నోరు) లోంచి వచ్చారని బ్రాహ్మణుల గురించి చెప్పబడడానికి ఇక్కడ అన్వయం కుదురుతోంది.

సింధు నగరాలలోకి తొలిగా ప్రవేశించిన ప్రోటో ఆర్యన్‌లకు అక్కడి విషయాలన్నీ చెప్పి, మార్గదర్శకులుగా వ్యవహరించి ఉంటారు కాబట్టి, వీళ్ళకి చెప్పేవారు బ్రూహియీలనే పేరు సార్థకం అయ్యింది.

తెలుగు అనే పేరు కూడా తెలుపు (to speak, say, tell) తెలియు (understanding) అనే అర్థంలోకి పూర్వద్రావిడ తెల్ రూపంలోంచి ఏర్పడిన సంగతి గమనార్హం. సింధునగరాల కాలంలోనే ప్రోటో తెలుగు ప్రజలు కూడా ఉన్నారనడానికి ఇది అవకాశం కల్పిస్తోంది.

'తెలుగు' అనే పదం "చక్కగా, వినసొంపుగా అర్థం అయ్యేలా చెప్పటానికి, సంభాషించటానికి అనువైన భాష" అనే అర్థాన్ని ఇస్తోన్న వాస్తవాన్ని గుర్తించాలి.



## ఆఫ్రో ఏషియాటిక్ పరిశోధనలలో కొత్త అంశాలు

# ద్రావిడ కుటుంబంలో తెలుగే తొలి భాష

ఆఫ్రో ఏషియాటిక్, ద్రవిడియన్ భాషల మధ్య తులనాత్మక అధ్యయనానికి 21వ శతాబ్దం పెద్దపీట వేస్తోంది. ఈ భాషా కూటముల మూలాలు, వాటి విభాగాలు, స్వరూప స్వభావాల మీద అంతర్జాతీయ పరిశోధనలు విస్తృతంగా సాగుతున్నాయి.

తులనాత్మక అధ్యయన భాషాశాస్త్రం ప్రాధాన్యతని ఇప్పుడు బాగా గుర్తిస్తున్నారు. ద్రావిడ భాషలకు తల్లిభాషను పునర్నిర్మించడం లక్ష్యంగా పరిశోధనలు సాగుతున్నాయి.

భారతదేశంలోనూ, శ్రీలంక, పాకిస్తాన్, నేపాల్, బంగ్లాదేశ్, ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, అమెరికా, బ్రిటన్, కెనడా, మలేషియా, సింగపూర్, మొదలైన దేశాలలో రమారమి 85 ద్రావిడ భాషల్ని 200 మిలియన్ల ప్రజలు మాట్లాడుతున్నారని అంచనా[1].

"ఈడోనైలాండ్" అనే పురావస్తు శాస్త్రవేత్త కొత్తరాతియుగం నాటి సహారా ప్రాంతంలో పుట్టిన భాషలోంచి ఈ ప్రపంచంలోని అనేక భాషలు పుట్టాయనే వాదాన్ని లేవదీశాడు.

* ఆనాటి సహారా భాషనే ద్రావిడ భాషగా భారతదేశంలో 170 మిలియన్ల ప్రజలు మాట్లాడుతున్నారంటారాయన.
* హొక్కోయిడో దీవిలో ఐనూ అనే భాషని 18000 మంది, అలాగే, స్పెయిన్‌లో యూస్కాడి దగ్గర బాస్క్ అనే భాషని 8 లక్షల మంది మాట్లాడుతున్నారంటాడు.

* ఇవన్నీ ఆనాటి సహారాభాష నుండి పుట్టినవేననీ, ఇవి ద్రావిడ భాషకు దగ్గరగా వున్నాయనీ ఈడోనైలాండ్ పేర్కొన్నాడు[2].

"లింగ్విస్టిక్ ఆర్కియాలజీ" అనే భాషా శాస్త్ర విభాగంలో ఈడో నైలాండ్ పరిశోధనలు చాలా ముఖ్యమైనవి. పురావస్తు ఆధారాలు ఆధునిక యుగంలో కరిగిపోయినప్పుడు, భాష ఆధారంగా జాతుల ప్రాచీనతని, ఆ ప్రాచీనతలోని చరిత్రనీ వెలికితీయడం లింగ్విస్టిక్ ఆర్కియాలజీ లక్ష్యం.

## తొలినాటి వలసలు - రూపుదిద్దుకున్న భాషా కూటములు :

క్రీ.పూ. 10 వేల ఏళ్లనాటి వరకూ సహారా జనావాసంగా వర్ధిల్లిన ప్రాంతమే! కరువు లేదా ప్రళయ పరిస్థితులు ఏవో ఏర్పడిన కారణంగా వలస బాట పట్టిన సహారా ప్రజలు అట్లాంటిక్, మెడిటరేనియన్, ఇండియన్ సముద్రతీర ప్రాంతాలకు చేరుకున్నారు. వీళ్లే పడవల నిర్మాణం, చుక్కల ఆధారంగా, సముద్రయానం లాంటి పరిజ్ఞానాలు పెంపొందించుకొని తమ తరువాతి తరాల కోసం వాటిని పదిలం చేసుకున్నారు.

కొత్త రాతియుగంలో తెలుగునేల మీద అలాంటి పరిజ్ఞానం కలిగిన ప్రజల ఉనికి ఉందని పురావస్తు శాస్త్రవేత్తలు అంగీకరిస్తున్నారు. ఇక్కడ కన్పించిన చుట్టుగుడిసెల వంటి నిర్మాణాలు క్రీ.పూ. 3 వేల ఏళ్లనాడు ఈనాటి పాకిస్తాన్ భూభాగంలో కూడా కన్పించాయి. అవి సింధూ నాగరికత కన్నా ముందు నాటివన్నమాట! సింధు నాగరికత ప్రారంభకాలానికి ఆనాటి భారతదేశం అంతా ద్రావిడ నాగరికత నిండి వుందని, ద్రావిడులే సింధు నగరాల నిర్మాతలు కావచ్చని ఈడోనైలాండ్ అభిప్రాయపడ్డారు.

"ద్రావిడులు సహారాలో నివసించిన కాలంలో మాతృస్వామ్య వ్యవస్థే ఉండేది. వ్యవసాయం, కమ్మరం, ఖగోళపరిజ్ఞానం సముద్రయానం ఇవి అభివృద్ధి చెందుతున్న కొద్దీ మాతృస్వామ్య వ్యవస్థ బలహీనమైపోతూ, పితృస్వామ్య వ్యవస్థ వ్రేళ్లూనుకుంటూ వచ్చింది. క్రీ.పూ. 3వేల నాటికి ఈజిప్టు, మెసపొటేమియా అనతొలియాలలోనూ, క్రీ.పూ. 1500 నాటికి భారతదేశంలోనూ పితృస్వామ్య వ్యవస్థ స్థిరపడింది" అంటాడు ఈడోనైలాండ్.

కొత్త తరహా జీవన విధానం, కొత్త ఆహార పదార్థాలు కొత్తగా కనుగొన్న అంశాలు, కొత్త తరహా మనుషులతో సన్నిహిత సంబంధాలు, వాళ్లతో కలిసి ప్రవేశించిన లేదా

అభివృద్ధి చెందిన పురోహిత వర్గం– వీళ్లంతా పాత సామాజిక వ్యవస్థ స్థానే కొత్త వ్యవస్థని ప్రవేశపెట్టారు.

వేల సంవత్సరాలపాటు ఈ విధంగా చాపకింద నీరులా భాషా రూపాల సృష్టి ఆగిపోయింది. చివరికి ఇవి తల్లి భాషల్ని అణగదొక్కి, కొత్తభాషలుగా రూపొందాయి. మెసపొటేమియాలో సుమేరియన్, అక్కడియన్ భాషలు, భారతదేశంలో సంస్కృతం, పాలస్తీనాలో హిబ్రూ, హిట్టయిట్ భాషలు, అనతొలియాలో లూసియన్ భాష... ఇవన్నీ ఆ యా ప్రాంతాలలో సహారా భాషా రూపాలుగా ఉన్న స్థానిక మాతృభాషలకు భ్రష్టరూపాలే!

ముఖ్యంగా భారతదేశంలో, ద్రావిడ భాషా పదాలను కూడా కలుపుకొని సంస్కృతాన్ని రూపొందించి, చివరికి, సంస్కృతంలోనే ఆ పదాలు ద్రావిడ భాషలోకి వెళ్లాయని సూత్రీకరించారు. ప్రాచీన కాలంలో ప్రపంచమంతటా ఇలానే జరిగిందంటారు ఈడోనైలాండ్.

## తొలి ద్రవిడియన్లకు తెలుగునేల పుట్టిల్లు

"ద్రావిడ భాషలన్నీ భారతదేశంలోనే పుట్టాయి. అయితే, తల్లి ద్రావిడ భాషని మాట్లాడిన ప్రజలు ఆఫ్రికా, యూరప్, ఆసియా దేశాల నుంచి వలస వచ్చి ఉన్నట్లయితే, ఆర్య వైదిక భాష (Proto Indo Aryan Language) మాట్లాడిన ప్రజల రాకకన్నా ముందే, ప్రోటో ద్రావిడుల రాక జరిగి వుండాలని అంతర్జాతీయ భాషావేత్త ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి పేర్కొన్నారు.

ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా కూడా, "ద్రావిడ భాషలు" - అనే వ్యాసంలో "వైదిక ఆర్యుల కన్నా పూర్వమే భారతదేశం అంతా ద్రావిడ ప్రజలు విస్తరించి వున్నారన్నది నిర్వివాదం" అని స్పష్టం చేసింది.

వంద ఏళ్లక్రితమే, సర్ ఆర్థర్ కాటన్ ఇవాన్ (1851-1941) అనే ఇంగ్లీషు ఆర్కియాలజిష్టు "దక్షిణ భారతదేశం బహుశా మానవజాతికి బాల్యదశ (Southern India probably the cradle of the Human race) అన్నాడు.

ఉత్తర మెడిటరేనియన్ జాతులు దక్షిణ భారతదేశం గుండానే ప్రపంచం అంతా విస్తరించారనీ, వీళ్లు మానసిక సంపన్నతను, మేధాసంపత్తినీ, సాంస్కృతిక వారసత్వాన్నీ,

శారీరక దృఢత్వాన్ని కూడా కలిగినవారనీ, ద్రవిడియన్ ఇండియా అనే గ్రంథంలో టి.ఆర్. శేషయ్యంగార్ పేర్కొన్నారు.

డా॥ ఆస్కో పర్పోలా (హెల్సింకీ విశ్వవిద్యాలయం) ఫాదర్ హీరాస్ (1930), సింధూలిపి నిపుణుడు ఇరావతం మహదేవన్, పరిశోధకుడు వాల్టర్ ఎ. ఫైర్ సర్వీస్ (జూ) వీళ్లంతా సింధు నాగరికత ద్రావిడుల నాగరికతేననీ, దక్షిణాది నుంచే ఉత్తరాదికి విస్తరించి అక్కడ పరిణితి గల్గిన పట్టణ నాగరికతగా ఆవిర్భవించిందనీ భావిస్తున్నారు.

రష్యన్ భాషావేత్త ఎం.ఎస్. ఆంద్రోనోవ్, సింధు నాగరికత చివరిదశలోగానీ, వెనువెంటనేగానీ, జరిగిన పరిణామాల వలన, మధ్య భారత ద్రావిడ భాష (తెలుగు), దక్షిణ ద్రావిడ భాషా (తమిళ, కన్నడ) కూటములు క్రీ.పూ. 1500 -1000 మధ్య కాలంలో ఏర్పడి వుంటాయని భావించాడు.

ఈ సందర్భంలో ఆచార్య "ఫ్రాంక్లిన్ సి. సౌత్‌వర్త్" అనే ప్రముఖుడి ప్రతిపాదనల్ని మనం తప్పనిసరిగా అధ్యయనం చెయ్యాలి[6].

1. దక్షిణ మధ్యభారతదేశంలోని దిగువ గోదావరి ప్రాంతం (ఉభయగోదావరి జిల్లాలు)లో దక్షిణ భారతదేశపు కొత్తరాతియుగ సంస్కృతి ప్రారంభం అయ్యింది.
2. వ్యవసాయానికి సంబంధించిన పదజాలాన్ని విశ్లేషించడం ద్వారా ద్రావిడ భాషలకు తల్లిభాష (Proto Dravidian Language) ప్రారంభం అయి వుంటుంది.
3. క్రీ.పూ. 2500 ప్రాంతాలలో "తల్లిద్రావిడ భాష" ప్రాచుర్యంలో ఉండి ఉంటుంది.
4. గుల్బర్గా, రాయచూరు, బళ్లారి, కర్నూలుజిల్లాల్లో దొరికిన కుండపెంకులు, ఇళ్ల నిర్మాణాలు, ఆనాటి మొక్కల శిలాజాలు మొదలైన పురావస్తు సంపదని పరిశీలించినప్పుడు, కృష్ణా తుంగభద్ర పరీవాహక ప్రాంతం నుంచి, గోదావరి పరీవాహక ప్రాంతం వరకూ, తూర్పున కృష్ణా-గోదావరి ముఖ ద్వారాల నుండి పడమట ధార్వార్ వరకూ, ఈ తొలి ద్రావిడ సంస్కృతి నడిచింది.
5. కృష్ణానది ఉత్తరభాగం వరకూ ప్రోటో ద్రవిడియన్ సంస్కృతి కన్పిస్తుంది.
6. ఈ తెలుగు నేల మీద ఇంకొక భాషా కూటమికి చెందిన ప్రజలెవరూ నివసించ లేదని రూఢి కాబట్టి, ఇక్కడి కొత్త రాతియుగపు సంస్కృతి (లోహయుగం)ని తొలి ద్రావిడ సంస్కృతిగా భావించడంలో సందేహించవలసినదేమీ లేదు.

7. ఈ తొలి ద్రావిడ భాష మాట్లాడినవారి పూర్వీకులు సెంట్రల్ ఆసియా లేదా పశ్చిమ దేశాల నుండి తూర్పున బంగాళాఖాతం ద్వారానే తెలుగు నేల మీద కాలుమోపి వుండాలి.

వేదవాఙ్మయంలో ద్రావిడ భాషా పదాలు అనేక వందలున్నాయని ఎఫ్.బి.జె. క్వీపర్, మైకెల్ విజ్జెల్ ప్రభృతులు చేస్తున్న నిరూపణలను పరిశీలించినప్పుడు, తెలుగు నేల మీద నుంచి ఉత్తరాదికి వ్యాప్తి చెందిన ద్రావిడులతో ఆర్యులకు పంచాపదేశం (పంజాబ్) వద్ద సంఘర్షణ, సంలీనాలు సంభవించి ఉంటాయని పరిశీలకులు భావిస్తున్నారు.

సంస్కృత భాషలో ద్రావిడ పదాలుగా భావిస్తున్న అనేక పదాలు కఫిర్, మరిస్తానీ భాషల్లో కూడా కన్పిస్తున్నాయనీ, ఈ భాషల్ని ఉత్తర పాకిస్తాన్ ప్రాంతంలో మాట్లాడుతున్నారనీ, పరిశోధకులు వీటిని ఇండో ఇరానియన్ భాషా కూటమిలో 3వ భాగంగా పరిగణిస్తున్నారనీ సౌత్‌వర్త్ పేర్కొంటూ, ద్రావిడులకు, ఇండో ఆర్యన్లకూ వైదిక యుగానికన్నా ముందే సంబంధాలు ఉన్నాయనడానికి ఇది సాక్ష్యం" అన్నాడు. సింధు నాగరికత నిర్మితమైన ద్రావిడ ప్రజలు తెలుగు నేల మీద నుంచి వ్యాపించిన తెలుగు ప్రజలేనని ఈ నిరూపణలు స్పష్టం చేస్తున్నాయి.

ఫ్రాంక్లిన్ సౌత్‌వర్త్ తెలుగు నేల ద్రావిడ భాషావతరణం జరిగిందని ఇంత స్పష్టంగా పేర్కొన్న తొలి చారిత్రకవేత్త, ఆయన చేస్తున్న ఇంత కృషి గురించి మన తెలుగు పరిశోధకులకు ఎంత తెలుసో అనుమానమే! ప్రోటోద్రవిడియన్ అగ్రికల్చర్ పేరుతో 2005లో Kyoto లో జరిగిన రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్‌లో ఆయన సమర్పించిన పరిశోధనా వ్యాసంలోంచి పైన పేర్కొన్న అంశాలను నేను ఉటంకిస్తున్నాను. SARVA (South Asian Residual Vocabulary Assemblage) పేరుతో ఒక పెద్ద భాషా శాస్త్ర ప్రాజెక్టును ఆయన చేపట్టారు. ఆన్‌లైన్‌లో ఒక తెలుగు ఎటిమాలిజికల్ డిక్షనరీని అందుబాటులోకి తెచ్చారు. భారత ఉపఖండంలోని ఆర్యేతర భాషల తులనాత్మక అధ్యయనం ద్వారా ఆ యా భాషల ప్రాచీనతని నిరూపించడం సౌత్‌వర్త్‌గారి ప్రాజెక్టు లక్ష్యం. పూనే కేంద్రంగా ఆయన పనిచేస్తున్నారు.

## ద్రావిడులు - నల్ల ఆఫ్రికన్ల సాన్నిహిత్యం :

బెర్నార్డ్ సార్జెంట్ అనే ఫ్రెంచి భాషావేత్త "భాష దానికదే పుట్టి వ్యాపించదనీ, అది ప్రజలతో పాటుగా వ్యాపనం చెందుతుందనీ అంటాడు. "జెనిస్ డి.యల్. ఇండీ" అనే ఇతని ఫ్రెంచి గ్రంథం ప్రస్తుతం భాషా చారిత్రక పరిశోధకులలో ఒక సంచలనం కల్గిస్తోంది.

'ఆర్యులకన్నా ముందే భారతదేశంలో నిండివున్న ద్రవిడియన్ల భాషామూలాలు ఆఫ్రికన్ భాషల్లో ఉన్నాయనేది ఈయన సిద్ధాంతం.

"సాహెల్ తీరం నుంచి, సూడాన్ సెనుగాల్ దాకా ప్రజలు ఇప్పుడు మాట్లాడుతున్న భాషల్లో అనేక ద్రావిడ భాషా పదాలు మనకు కన్పిస్తాయి. ఫిన్నిష్, హంగేరియన్, సమొయేదిక్‌లాంటి ఉరలిక్ భాషల్లో ద్రావిడ ఉచ్ఛారణ కూడా కన్పిస్తుంది. కొత్తరాతియుగం ఆరంభ వికాసం కాలంలో ద్రావిడులు సూడాన్ నుంచి ఒక వలస కూటమి ఇరాన్‌కు చేరారు. ఇరాన్‌లో రెండుగా చీలి, ఒక కూటమి ఉరల్స్ ఉత్తరభాగానికి, ఇంకొక కూటమి దక్షిణ భారతానికీ చేరారు" అంటాడు బెర్నార్డ్ సార్జెంట్.

ఇదంతా క్రీ.పూ. 8వేల ఏళ్లనాటికే జరిగి వుంటుందనేది సార్జెంట్‌గారి అంచనా. జీన్ - ఫ్రాంకోయిస్ జిర్రిగే అనే పురావస్తు శాస్త్రవేత్త జరిపిన త్రవ్వకాల ఆధారంగా, ఆగ్నేయ భారతదేశంలో అంటే నాటి సింధ్ - పాకిస్తాన్ భూభాగంలో, ఈజిప్టు వ్యవసాయ విధానాలతో పోల్చదగని వ్యవసాయ ప్రక్రియ నడిచిందని. ఇది ద్రావిడ నాగరికతేనని, దీని కొనసాగింపే సింధు నాగరికత అనీ సార్జెంట్ వాదించాడు.

ఇక్కడ సి.ఎ. దయోప్ అనే పరిశోధకుడి వాదాన్ని తప్పనిసరిగా మనం పరిశీలించాలి. యూరప్ నుంచే మానవజాతి వ్యాపనం మొదలయ్యిందనే పాతకాలపు యూరోసెంట్రిక్ వాదానికి చెల్లుచీటీ ఇస్తూ, ఆఫ్రికా సెంట్రిక్ వాదాన్ని ఆయన భుజాల కెత్తుకున్నాడు. పశ్చిమ దేశాలలో గ్రీకు, లాటిన్ భాషలు నిర్వహించిన పాత్రని తూర్పు దేశాలలో ఈజిప్టు భాష నిర్వహించిందంటాడీ "దయోప్" (Dyop) అనే పరిశోధకుడు. 8

'mt DNA' పరీక్షలను దక్షిణ భారతదేశంలోని 12 కులాలు, 14 ఆదివాసీ తెగల మీద నిర్వహించి, దాని నివేదికని 1999 అమెరికన్ జర్నల్ ఆఫ్ ఫిజికల్ ఆంత్రపాలజీలో ప్రచురించారు. ఆన్‌లైన్‌లో ఈ నివేదికను చూడవచ్చు కూడా!9 ఫైలోజెనెటిక్ విశ్లేషణ ద్వారా చేసిన గుర్తింపులో ఈ దక్షిణ భారతీయ కులాలు, జాతులలో ఆఫ్రికన్, ఆసియన్ మూలాలు ఉన్నట్లు తేలింది. ఆఫ్రికన్ మూలాలున్న జాతులుగా 'mt DNA' పరీక్షలో నిర్ధారణ అయిన జాతులవారు ప్రస్తుతం తెలుగు నేల మీద నివసిస్తున్నారు. ఆఫ్రికా సెంట్రిక్ వాదానికి ఈ నిరూపణ బలమైన సాక్ష్యం.

## నైలు నుంచి కృష్ణానది వరకూ...

"కా" అనే రాజు ఈజిప్టులో రాజవంశాల చరిత్ర మొదలుకావటానికన్నా ముందునాటి ఒక ఫారో. ఈయన్ని 'సెహెమ్ కా' - అనీ, 'కా- సెఖెమ్ అనీ పిలిచేవాళ్లు. క్రీ.పూ.

32వ శతాబ్ది చివరి భాగంలోగానీ, 31వ శతాబ్ది మొదటి భాగంలో గానీ ఈ "కా" చక్రవర్తి పాలించి వుంటాడు. ఇతని సమాధి ఆబిదాస్‌లో ఉమ్మ్ ఎల్ – క్వాబ్ త్రవ్వకాలలో 1902లో బైటపడింది. ఈ సమాధిలో రాజుగారి శవంతో పాటు ఉంచిన వస్తువుల మీద ఆయన పేర్లు చెక్కి వున్నాయట!

తెలుగు నేల మీద కూడా ఈ "కా" రాజవంశం ప్రభావం చాలా వుంది.

ఏడు దశాబ్దాల క్రితం టేకుమళ్ల రామచంద్రరావు గారు "అఖిలాంధ్రావనికి రాజధాని శ్రీకాకుళం" అనే వ్యాసంలో మొదటిసారిగా "కా" అనే ఆఫ్రికన్ ప్రజలు కృష్ణాజిల్లాలో 'కాకుళం' నిర్మించుకున్న విషయాన్ని ప్రస్తావించారు. సహజంగానే, మన తెలుగు పరిశోధకులు ఈ విషయాన్ని కూడా, పక్కన పెట్టి మరచిపోయారు.

'కా' ప్రజలు ఎవరై ఉంటారని వెదకడం మొదలుపెట్టినప్పుడు ఈ "కా" రాజవంశం వివరాలు కన్పించాయి. అంతేకాదు, "కా' ప్రజలకు తెలుగు నేలతో గల సంబంధాలైన అనేక విశేషాలు కళ్ళకు కట్టాయి.

1. 'కా' ప్రజలు సుడాన్ ప్రాంతం నుంచి కృష్ణాతీరాన్ని చేరి, 'కా' రాజ్యాన్ని నెలకొల్పుకున్నారు. కాకుళం వారి రాజధాని.

2. తల్లిద్రావిడ (ప్రోటోద్రావిడ) భాషనిగానీ, తల్లి తెలుగు (ప్రోటో తెలుగు) భాషనిగానీ వీళ్లు మాట్లాడి వుంటారు.

3. ఆ తర్వాత చాలాకాలానికి కౌండిన్య సుచంద్రుడి కుమారుడు ఆంధ్ర విష్ణువు 'కా' రాజ్యాన్ని జయించి తన పాలనని ప్రతిష్ఠించి ఉంటాడు. ఆంధ్ర– తెలుగు భాషల్నీ, ప్రజల్నీ ఈయన ఏకం చేసి ఉంటాడు. ఈనాటి తెలుగు భాషకు ఒక రూపం ఆ విధంగా వచ్చి వుంటుంది.

4. శతపథ బ్రహ్మణంలో పేర్కొన్న విశ్వామిత్రుడి శాపవృత్తాంతం ఉత్తరాది నుంచి ఆంధ్రులనేవారు తెలుగు నేల మీదకు తరలి వచ్చారనడానికి సాక్ష్యం ఇస్తోంది. క్రీ.పూ. 1200 నాటి సంగతి ఇది కావచ్చు.

5. శ్రీ ఏటుకూరి బలరామమూర్తిగారు ఆంధ్రుల చరిత్ర అనే వ్యాసంలో ఆపస్తంబ ఋషిని ఇక్కడ ప్రస్తావించారు. ఆపస్తంబ గుహ్యా సూత్రాలకు తెలుగు స్మార్తులు మనుధర్మశాస్త్రానికన్నా ఎక్కువ ప్రాముఖ్యతనిస్తారన్న సంగతి గుర్తు చేశారు. యమునా నదీ తీరంలో సాల్వదేశం నుంచి క్రీ.పూ. 700 సంవత్సరంలో ఆంధ్రులు ఇక్కడకు తరలి వచ్చి వుంటారని ఆయన అభిప్రాయపడ్డారు. నాగులు, యక్షులు, తదితర ద్రావిడ జాతులతో ఈ ఆంధ్రులు, సంబంధాలు కలుపుకున్నారు.

6. వికీపీడియాలో తెలుగు బ్రాహ్మిణ్స్ అనే ఆంగ్లవ్యాసంలో ఆపస్తంబ ఋషి తెలుగునేలపైన గోదావరీ తీరంలో వుండేవాడని పేర్కొన్నారు. 11

7. అంధకవెణ్ణు బౌద్ధజాతకకథ "ఆంధ్రవిష్ణువు" అయిన కృష్ణుడి భాగవత కథని చెప్తుంది. ఇందులో అంధకవెణ్ణు అనే వసుదేవుడు ద్వారకానగరాన్ని కావలి కాసే గాడిద కాళ్లు పట్టుకొని, అది ఓండ్రపెట్టకుండా ఆపి, ద్వారకని జయించిన వృత్తాంతం వుంది. వసుదేవుడంతటివాడు గాడిద కాళ్లు పట్టుకున్నాడన్న సామెత తెలుగు వారిలో ఎక్కువ ప్రాచుర్యంలో వుండటం ఇక్కడ గమనార్హం.

మొత్తం మీద ఈ పరిశీలనాంశాలు పుక్కిటి పురాణాలుగా కాక, జాతి మూలాలకు సాక్ష్యాలుగా వెదికితే అనేక కొత్త ఆలోచనలు కలుగుతాయి.

## "కా" అనగా...

ఈజిప్ట్ సంస్కృతిలో 'క' అంటే ఆత్మ. 'కా' అనే చక్రవర్తి (ఫారో) పేరుతోనే ఈజిప్షియన్లు, మనిషి శరీరంలోని ఈ ఆత్మని "కా" అని పిలిచారు. మనిషి చనిపోయిన తరువాత 'కా' అతని శరీరాన్నే అంటిపెట్టుకుని ఉంటుందనీ, ఆ శరీరాన్ని కాపాడకపోతే, "ఫారో" మరణాంతరం తన విధులు నెరవేర్చలేడనీ, పిరమిడ్లు కట్టి తమ ఫారోల శవాలను మమ్మీలుగా మార్చి ఈజిప్షియన్లు సంరక్షించారన్నమాట![12]

## 'కాకుళ' అంటే...

'కా' అనే పదానికి ద్రవిడ, ఆఫ్రికన్ భాషల్లో నలుపు, చీకటి అనే అర్థాలే కన్పిస్తాయి! "ఓసిరిస్ కా (700 BC) అంటే "The Great Black" అని అర్థం.

కా+కుళం "నల్లని నది" దీని సంస్కృత రూపం కృష్ణానది లేక కృష్ణవేణి.

కుళం అనే పదానికి ద్రవిడియన్ ఎటిమాలజీ డిక్షనరీ (DEDR 1828) లో ఈ వివరాలు కన్పిస్తున్నాయి.

| | | |
|---|---|---|
| తమిళం | : | కుళమ్, (tank, reservoir) |
| మళయాళం | : | కుళమ్ (tank) |
| కన్నడ | : | కోళ, కోళహె, కొణ (Pond) |
| తుళు | : | కుళ (tank, pond) |

తెలుగు : కొలను, కొలకు, కొలకువు, కొల్లు (deep pond dug or built near the outlet of tank, in which water is collected before supplying it to fields, కొల్లుగుంట (pond into which water from irrigation wells is baled out)

సంస్కృతం : కుళ pond, pool.

ద్రవిడియన్ ఎటిమాలజీ డిక్షనరీ ప్రకారం ముఖ్య ద్రవిడ భాషలలో 'కుళం' అనే పేరు పెద్దనీటి సరస్సుకు చెందినదిగా కనిపిస్తుంది. అయితే, ప్రోటో ఆఫ్రో ఏషియాటిక్ ఎటిమాలజీ (అలెగ్జాండర్ మిలిటరేవ్, ఓల్గా, స్టాల్ బోవా రూపొందించారు)లో ఈ దిగువ వివరాలు కన్పిస్తాయి.

| | |
|---|---|
| ప్రోటో ఆఫ్రో ఏషియాటిక్ | : Kur (River, Lake) |
| వెస్టర్న్ చాదిక్ | : Kur (pond) |
| ఈస్ట్ చాదిక్ | : Kur, (pond, River) |
| సెంట్రల్ కువైటిక్ | : Kur (River) |

ఆఫ్రో ఏషియన్ భాషల మూల భాష ప్రోటో ఆఫ్రోఏషియన్ భాషలో 'కుర్' అనే రూపమే ద్రావిడ భాషలలో 'కుళ్' అనే పదాన్ని 'నది' అనే అర్థంలో ప్రయోగించడానికి కారణం అయి వుంటుంది.

1. నైజీరియా ఉత్తరభాగంలో 250 కి.మీ. పొడవైన "కా" నది వుంది. ఇది NIGER నదిలో కలుస్తుంది.

2. పసిఫిక్ సముద్రంలో "కాకుళ" అనే దీవి వుంది. ప్రస్తుతం ఇది నిర్మానుష్యం. టూరిస్ట్ కేంద్రంగా వుంది.

3. ఉత్తర జావా ప్రాంతంలో "కాకుళ" అనే ఓడరేవు ఉందని క్రీ.పూ. 1347 నాటి మహమ్మదీయ యాత్రికుడు Ibn Batuta పేర్కొన్నాడు (13)

## ఆఫ్రి'కా'లో 'కా'

1881లో గెరాల్డ్ మెస్సే అనే పండితుడు af - rui - ka అని ఆఫ్రికా పదాన్ని విడదీసి, "కా" = ముఖద్వారం" అనే అర్థాన్ని సాధించాడు. ముఖద్వారం అంటే జన్మస్థలం అని! ఈజిప్షియన్లు అది తమ జన్మస్థలం అని చెప్పుకోవడానికి "ఆఫ్రికా" అనే పదాన్ని వాడారంటాడు. "కా" అంటే తల్లిగర్భం అని!"

**'కాకి' కథ :**

పితృదేవతలకు తర్పణాలిచ్చే ఆచారం, అటు - ఈజిప్షియన్లకూ ఇటు భారతీయులకూ సమానంగానే ఉంది. 'కాకి' అనే పదానికి దగ్గరగా వుండే పదరూపాలు ఆఫ్రికన్ భాషల్లోనూ కన్పిస్తాయి. 15

| | | |
|---|---|---|
| ప్రోటో ఆఫ్రో ఏషియాటిక్ | : | Kwar |
| సెమెటిక్ | : | Karii (partridge) |
| బర్బర్ | : | Krvurt (Raven) |
| ఒమొటిక్ | : | Kur (Crow) |

## ఈజిప్ట్‌లో ఎలకుర్రు

ఆఫ్రికాలోని El Kuru అనే ప్రాంతాన్ని క్రీ.పూ. 900-650లలో నప్తా రాజవంశం పరిపాలించింది. ఎలకుర్రు అనే కుగ్రామం కృష్ణాజిల్లా శ్రీకాకుళానికి కొద్ది మైళ్ల దూరంలో వుంది. ఆంధ్రపత్రిక వ్యవస్థాపకులు కాశీనాథుని నాగేశ్వరరావుగారి జన్మస్థలం నెల్లూరి దగ్గర 'ఎలకరు' అనే ఊరుంది. పురావస్తుశాస్త్రవేత్తలు ఇక్కడ మధ్యరాతియుగం, తొలిరాతియుగం నాటి సంస్కృతిని వెలికితీశారు. 'An encyclopaedia of Indian Archeology (ఎ.ఘోష్) పేజీ 81లో దీని వివరాలు పేర్కొన్నారు. ఇలాంటి సారూప్యతలు ఒకటీ అరా అయితే యాదృచ్ఛికం కావచ్చు. కానీ, అనేకం కన్పిస్తున్నప్పుడు, తులనాత్మక అధ్యయనభాషా శాస్త్రం (Comparative Linguistics) సూత్రాల ఆధారంగా వీటిని తప్పనిసరిగా పరిశీలించవలసి వుంటుంది.

ఈజిప్టులోని నుబియాలో ప్రాజెక్టు నిర్మాణం సమయంలో మునిగిపోతున్న పురావస్తు సంపదని సంరక్షించడానికి కొందరు భారతీయ శాస్త్రవేత్తల సహకారం తీసుకొన్నారు. An encyclopedia of Indian Archeology (A.Ghosh) గ్రంథంలో (pp 115-116) అక్కడ దొరికిన సమాధులు (CAIRN Burials), వాటిలో వుంచిన వస్తువుల వివరాలున్నాయి.

డెక్కన్ భూభాగంలో దొరికిన "ఎరుపు-నలుపు కుండలు" ఈ ఈజిప్షియన్ సమాధుల్లో కూడా దొరికాయని ఇవి లోహయుగానికన్నా ముందుకాలం (క్రీ.పూ. 1000 కన్నా ముందు) నాటివి కావచ్చని భావించారు. ఈ కైరన్ల తరహా సమాధులు తెలుగు నేల మీద కూడా చాలా చోట్ల కన్పించాయి. సుడాన్‌లో బైటపడిన ఆనాటి కొన్ని సమాధి స్థలాలను (సిమెటరీ) ఈ ఫొటోలో చూడవచ్చు. రాక్షసగూళ్లు అంటారు మనవాళ్ళు.

సుడాన్‌లో ఈ రాక్షసగూళ్లు (కైరన్‌లు) అచ్చంగా గుడిసె ఆకారంలో (Conical shape) వున్నవి కన్పించాయి. వాటిని కుబ్బ (Qubba) అంటారట! కుబ్బ అనేది శంకు (లేదా) దీర్ఘవృత్తాకారాన్ని సూచించే పదం. ఈ 'కుబ్బ'కు దగ్గరగా తెలుగులో కుప్ప, గుబ్బ అనే పదాలు కన్పిస్తున్నాయి.

DEDR 1731 లో 'కుప్ప' అనే తెలుగు పదానికి heap, Pile, collection, assemblage అర్థాలున్నాయి. కొప్పరము–అంటే, increase, rise, swell, (కొప్పరింత, కొప్పరము) అర్థాలు కన్పిస్తాయి.

DEDR 1174 లో గుబ్బ తెలుగు పదానికి Knob, boss, stud, protuberance, woman's Breast అర్థాలు కన్పిస్తాయి.

DEDR 1665 లో తెలుగు పదాలు కొటిక hamlet, గుడి = Temple, గుడిసె hut, cottage, hord, గుడ్డి= Temple, Tomb, (Voc 1113) అర్థాలు కన్పిస్తాయి.

కుప్ప, గుబ్బ, గుడి,గుడిసె - ఇవన్నీ బోర్లించిన గరాటు ఆకారం (conical) లేదా బోర్లించిన దీర్ఘవృత్తాకారం (elliptical) నిర్మాణాలను సూచిస్తున్న పదాలు. వీటి మాతృక "Qubba" అనే ఈజిప్షియన్ పదంలో కన్పిస్తోంది.

1969లో డా॥ వి.వి. కృష్ణశాస్త్రి కరీంనగర్ జిల్లా 'పెద్దబంకూరు'లో జరిపిన త్రవ్వకాలలో లోహయుగంనాటి దీర్ఘవృత్తాకార నిర్మాణాలు కనుగొన్నారు. ఎరుపు నలుపు కుండ పెంకులు కూడా కన్పించాయి.

ఈజిప్షియన్‌లకు తొలి ద్రవిడియన్లకు మధ్య సాన్నిహిత్యాన్ని నిరూపించడానికి ఈ నిరూపణలు ఉపయోగపడ్తున్నాయి.

అంతర్జాతీయ శాస్త్రవేత్తలు తెలుగు నేల మీద దొరుకుతున్న సాక్ష్యాల గురించి ఒక్కొక్కరు దృష్టి సారిస్తున్నారు. తులనాత్మక అధ్యయన భాషాశాస్త్రానికి భాషకు సంబంధించిన "లెక్సికాన్" చాలా అవసరం. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన 50 ఏళ్ల తర్వాత కూడా ఈ తెలుగు బృహన్నిఘంటువుని మనం నిర్మించుకోలేకపోయాం. పరిశోధకులకు సమాచారం అందించే సాధనాలు లేనప్పుడు, ద్రావిడ భాష అంటే తమిళం మాత్రమే అని ఎవరైనా భ్రమపడే ప్రమాదం వుంది. ఎందుకంటే తమిళ లెక్సికాన్ పరిశోధకులకు

చేతినిండా సమాచారం అందిస్తోంది కాబట్టి! ఈ అవసరాన్ని తీర్చేందుకు ఏ విశ్వవిద్యాలయం (లేక) ఏ ప్రభుత్వ యంత్రాంగం ముందుగా పూనుకొంటుందో చూడాలి!

(అక్టోబర్ 27,28,29 తేదీలలో కుప్పం ద్రవిడ విశ్వవిద్యాలయంలో "భాషా శాస్త్ర పరిశోధనల చరిత్ర" పైన జరిగిన జాతీయ సదస్సులో ఆంగ్లంలో ఈ రచయిత సమర్పించిన పరిశోధనా పత్రం ఇది)

ఈ వ్యాస రచనకు ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ, డా॥ వి.వి. కృష్ణశాస్త్రిగారలతో జరిపిన సంప్రదింపులు ఎంతగానో తోడ్పడ్డాయి. వారికి కృతజ్ఞతలు.

## ఆధార రచనలు :

1. Dravidian languages - Wikipedia Article, The free encyclopediaen. wikipedia. org/wiki/Dravidian-languages)
2. The origin of Sumerian - Edo Nyland-Athenaeum Library of Philosophy evans - experientialism. free webspace.com/ling-sumerian.htm
3. The Dravidian Languages : Prof. Bhadriraju Krishnamurti; Cambridge University Press,Cambridge (South Asian edition, 2003
4. "Dravidian Languages." Encyclopedia Britannica-Online. 5 June 2008)
5. Dravidian Indai - T.R.Sesha Iyengar - Asian Educational Services 2001-page 60
6. F.C. Southworth, "Proto-Dravidian Agriculture" 2006

   http://ccat.sas.upenn.edu/-fsouth/Proto-Dravidian Agriculture.pdf

   F.C. Southworth - Professor Emeritus of South Asian Linguistics, University of Pennsylvania. Proto-Dravidian Agriculture, is the paper from the 7th ESCA Round Table Conference held at Kyoto in June 2005.
7. Bernard Sergent : African origin of the Dravidians Excerpts on the origins of the Dravidians from Bernard Sergent's Genese de I'Inde translated by Sunthar Visuvalingam.

   www.svabhinava.org/.../Sergent-AfroDravidian-frame.php.B

8. Prof. Cheikh Anta Diop; Civilization or Barbarism. Brooklyn, N.Y.)

9. American Journal of Physical Anthropology 109:147-158 (1999) 'Multiple Origins of the mtDna 9-bp Deletion' in Populations of South India- W.S. WATKINS and others

10. Ancient History of Andhras-By Sri Yetukuri Balaraama Moorti - Andhrula Samkshipta Charitra - English translation : PALANA (nparinand@cas.org)(13)

11. Telugu Brahmins- en.wikipedia.org/wiki/Telugu_Brahmins, Wikipedia encyclopedia.

12. Egyptian Pharaohs: Predynastic Egyptian Journeys 2003

www.phouka.com/pharaoh/pharaoh/dynasties/dyn00/03ka.html.

13. Urduja-Wikipedia, the free encyclopedia - Ibn Battuta - Research - Urduja in Popular culture - en.wikipedia.org/wiki.IUrduja

14. Nile Genesis : the opus of Gerald Massey". Gerald massey.org.ukgerald-massey.org.uk/masseycmc_nile_genesis.htm. Retrieved 2010-05-18

15. Crow Systematics - Crows and humans - Evolution - Behavior, Wikipedia, the free encyclopedia.en. wikipedia.org/wiki/Crow.



# వరి - గోదుమ - తెలుగు

"ప్రాచీన భారతదేశ చరిత్ర" అంటే ఆర్యుల రాక. ఋగ్వేదం, సింధు నాగరికత... వీటి గురించి మాత్రమే చర్చించే రోజులు మారాయి.

జె.బ్లాచ్. యస్. లేవీ, జె. ప్రిలుడ్ స్కీ... ఇలాంటి పాశ్చాత్య పండితులు ప్రాచీన "ముండా" భాష మూలాల్ని వెలికితీసి, భారతదేశంలో వైదికయుగం కన్నా పూర్వం 'పూర్వ ముండా" (PROTO MUNDA) భాష మాట్లాడిన నాగరిక ప్రజలు వుండేవారని సశాస్త్రీయంగా నిరూపించడంతో భారతదేశ ప్రాచీన చరిత్ర కొత్త పుంతలు తొక్కింది.

టి.బర్రో, ఎం.బి. ఎమోనూ 1960లో ద్రవిడియన్ ఎటిమొలాజికల్ డిక్షనరీ (DED) DEDR (1984) రూపొందించిన తర్వాత పరిశోధనల స్వరూపం మారిపోయింది. క్వీపర్, హాక్, సౌత్‌వర్త్... లాంటి, పరిశోధకులు ద్రవిడ భాషల మూలాలను వెదకడానికి నిరంతరం కృషి చేశారు. పూర్వద్రావిడ, పూర్వ ముండా పదాలు ఋగ్వేద భాషలో అనేకసందర్భాల్లో "అరువు" పదాలుగా కన్పించడాన్ని ఈ భాషావేత్తలు ఎత్తిచూపించడంతో 'ఆర్యుల రాక' అనే అంశంపై ఇప్పటిదాకా వ్యాప్తిలో వున్న అనేక నమ్మకాలు కాలం చెల్లినవే అయ్యాయి.

అంతేకాదు, ఇండో యూరోపియన్ భాషా కుటుంబానికి చెందిన వైదికభాష, ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన వివిధ ద్రావిడ భాషలు, ఆస్ట్రో ఆసియాటిక్ భాషా కుటుంబానికి చెందిన ముండా భాష... ఇలాంటి భాషా కుటుంబాల వర్గీకరణ విషయంలో కూడా పాత ఆలోచనలకు కొత్త పరిశోధనలు చెల్లు చీటీలిస్తున్నాయి. ప్రాచీన కాలంలో దక్షిణాసియాలోని దేశాల మధ్య పరస్పర సంబంధాల వలన వాటి భాషలు, సంస్కృతులు, ఆచార వ్యవహారాల మధ్య సారూప్యత ఎక్కువగా ఏర్పడిందనీ, వీటన్నింటినీ ఒకే భాషా కుటుంబానికి చెందినవిగా పరిగణించాలనీ ఇప్పుడు చాలామంది ఆధునిక పరిశోధకులు

భావిస్తున్నారు.

వేదభాషని ఇండో యూరోపియన్ భాషా కుటుంబంలోకి చేర్చడానికి సెల్టిక్, జెర్మనిక్, ఇటాలిక్, శ్లానిక్, గ్రీక్, హిట్టైట్, బొకారియన్ మొదలైన భాషల మూలపదాలు ఈ వేదభాషలో కన్పించడం ముఖ్యకారణం. అయితే, ఇండో యూరోపియన్ భాషలకు చెందని ద్రవిడ, ముండా భాషా పదాలు కూడా వేదభాషలో కన్పించినప్పుడు "ఇండో యూరోపియన్ భాషా కుటుంబం" అనే విభజన విలువ లేనిదే అవుతుంది.

ఈ దేశంలో చాలా నదులపేర్లు, కొండల పేర్లు. మొక్కలపేర్లు, ధాన్యాల పేర్లు వేదభాషలోంచో, సంస్కృత భాషలోంచో ఉత్పత్తి అయినవి కావు. వాటి మూలాలు మూలద్రావిడ (లేదా) మూలముండా భాషల్లో కన్పిస్తాయని ఎఫ్.బి.జె. క్వీపర్ పండితుడి నిరూపణ. 'ముండా'తో పాటు ఇంకా ప్రాచీనతరమైన ఆస్ట్రో ఆసియాటిక్ భాషలు కూడా వుండి వుండవచ్చు. ఆ అవ్యక్త (Unknown) భాషని "పారాముండా" భాషగా ఆయన వ్యవహరించాడు. అంగ, వంగ, గంగ,మగధ, కీకట, ప్రమగండ... ఇలాంటి పేర్లన్నీ ముండా భాష జన్యాలేననేది వీరి నిరూపణ. ఋగ్వేదం తొలి దశలో 'పూర్వముండా' 'పూర్వ అవ్యక్తముండా' (PROTO PARA MUNDA) భాషా పదాలు ఎక్కువగా కన్పిస్తాయి. ఋగ్వేదం మధ్యదశలోనూ చివరిదశలోనూ పూర్వద్రావిడ భాషాపదాలు చోటు చేసుకున్నాయని చెప్తున్నారు.

'సప్తసింధు' ప్రాంతంలో అంటే – పంజాబ్ నుంచి గంగా తీరానికి వైదికయుగం విస్తరిస్తున్న దశలో సింధునది నుంచి దక్షిణానికి పూర్వ ద్రావిడ భాషలు మాట్లాడిన వాణిజ్యవర్గాలు సింధు నగరాలను నిర్మించుకుని వుంటారని భాషాశాస్త్రపరంగా చరిత్ర అధ్యయనం చేస్తున్న కొందరు పరిశోధకుల అభిప్రాయం. తెలుగు, తమిళ, కన్నడభాషల పూర్వరూపాలను పరిశీలిస్తే ఈ విషయంలో వాస్తవాలు వెలికితీయగలుగుతారు.

నిజానికి తమిళభాషలో 'సంగమ్' కాలానికి చెందిన సాహిత్యం, ఇంగ్లీషులో అందుబాటులో వుంది. తెలుగు భాషా స్వరూపానికి సంబంధించిన అంశాలు ఏవీ ఇంగ్లీషులో అందుబాటులోకి తెచ్చే ప్రయత్నాన్ని తెలుగు పండితులు పెద్దగా చెయ్యలేదు. అందువలన ద్రావిడ భాష గురించి చెప్పే ప్రతిసారీ పరిశోధకులు తమిళ భాషాపదాల్ని మాత్రమే ఉదహరించడం వలన ద్రావిడ భాష అంటే తమిళమేననే అభిప్రాయం బలపడిపోయింది. ఇందుకు తప్పుపట్టవలసింది సరిగా ప్రతిస్పందించని తెలుగు పండితులనే! అయినా, క్వీపర్, ఎమోనూ, బుర్రో లాంటి పండితులు వెలికితీసిన మూలద్రావిడ రూపాలు కన్నడ తమిళాలకన్నా తెలుగుభాషకే దగ్గరగా వున్న సంగతి

మనం స్పష్టంగా గమనించవచ్చు.

## 'వరి' అనే పదం సుమేరియా దాకా విస్తరించింది !

'వరి' స్పష్టమైన తెలుగు పదం. తెలుగు ప్రాంతాల నుంచి పర్షియాకు, పర్షియా నుంచి ఈజిప్టుకు, ఈజిప్ట్ నుంచి గ్రీక్ ప్రజలకు 'వరి' బియ్యం అందాయి. 'వర్ -ఇ' అనే పూర్వ తెలుగుపదమే గ్రీకుల నోట 'ఒరిజ'గా మారిందనీ, లాటిన్ భాషలో 'ఒరైజా సెటైనా' అనే వృక్షనామం వరిమొక్కకు ఏర్పడడానికి 'వరి' అనే తెలుగు పదమే కారణం అనీ "సబ్‌స్ట్రేట్ లాంగ్వేజస్ ఇన్ ఓల్డ్ ఇండో ఆర్యన్ (ఋగ్వేదిక్, మిడిల్, లేట్ వేదిక్)" అనే వ్యాసంలో మైకేల్ విజ్జెల్ సశాస్త్రీయంగా నిరూపించాడు.

దీనికి సంబంధించి, ఒరిజాన్, రిస్, రిజ్, అర్రోజ్, బరుజ, అర్రజి... ఇలా అనేక రూపాలు ఏర్పడ్డాయి. 'రైస్' అనే ఇంగ్లీషు మాట ఇక్కడి నుంచే ఏర్పడింది. 'వరి' దీనికి మూలపదం. తెలుగువారే బియ్యాన్ని ఆ రోజుల్లో ఎగుమతి చేసేవారనీ, వారు నాగరికులని, వర్తకవాణిజ్యాలు విస్తారంగా చేయడంలో నేర్పరులనీ, వారికి సహజమైన భాషా సంపద వుందనీ... ఈ నిరూపణలు మనకు చెప్తున్నాయి. భాషాశాస్త్రపరంగా కూడా ఈ చారిత్రక అంశాల్ని మనం నిరూపించవలసి వుంది.

పూర్వ ముండా పదం 'ఎరిగ్' అంటే ధాన్యం. ఇది 'వెరిజి'గాను, 'వెరింకి'గాను, 'వరీంకి'గాను, 'వరి-కి' గాను, 'వర్-ఇ'గాను పరిణామాలు చెంది వుండవచ్చని 'క్వీపర్' పండితుడి విశ్లేషణ.

పూర్వ ఉత్తర ద్రావిడ భాషలో ఎరిజ్. మూల దక్షిణ ద్రావిడ భాషలో 'వర్-ఇ' పదాలు కన్పిస్తాయి.

పూర్వ దక్షిణ ద్రావిడ : వర్ -ఇ

పూర్వ కోలమి గదబ : వర్-స్

పూర్వ తమిళం : అర్-కి

పూర్వ తెలుగు : వర్-ఇ (వరిగింజ)

'వర్-ఇ' పదం పొందిన వివిధ పరిణామాలలో పాళీభాషలో 'బీ-రం' ఒక రూపంగా కన్పిస్తుంది. 'బీరం' అంటే వరిగింజలని! అదే తెలుగు ప్రాకృతంలో 'బీ-అం'గా మారింది. 'బియ్యం' అనే తెలుగు మాట మూల ద్రావిడ 'వర్ ఇ' లోంచి, దానికి మూలమైన మూల ముండా 'ఎరిజ్'లోంచీ పరిణమించిందని భాషావేత్తల నిరూపణ! బియ్యం నిత్య బహువచనం, సంస్కృతంలో 'బీజం' కూడ దీనినించి పరిణమించిన పదమే!

తెలుగు ప్రాకృతంలో 'బీరిజం' అంటే వృషణం. 'వారి' అంటే నీరు కాబట్టి వరిబీజం (Hydrocole) అనే పదం 'నీరు పట్టి వాచిన బీరిజం' అనే అర్థంలో ఏర్పడిన తెలుగు ప్రాకృత పదమే గాని! సంస్కృత 'బీజం'కు వరిబీజానికి ఎలాంటి సంబంధం లేదు.

మూల ద్రావిడ భాషాపదాలలో 'కూర్' అంటే అన్నం. తెలుగులో 'కూడు' అనే మాట దీనిలోంచే ఏర్పడింది. ఆస్ట్రో థాయ్ భాషలలో 'క్రుమాయ్' అంటే వరిధాన్యం అని!

జపాన్‌భాషలో 'కోమ్, 'క్రామ్', టిబెట్ భాషలో 'మాయ్' ఇవి రెండూ కలిసి 'కృమాయ్' (Krumaay) 'వరిగింజలతో వండిన అన్నం' అనే పదం ఏర్పడి వుండవచ్చుని, మూల ద్రావిడ 'కూర్' ఈ పదబంధం ఏర్పడటానికి కారణం కావచ్చని మైఖేల్ విజ్జెల్ 'సబ్‌స్ట్రేట్ లాంగ్వేజెస్ ఇన్ ఓల్డ్ ఇండో ఆర్యన్'లో పేర్కొన్నాడు.

పాత ఇండోనేషియా పదం: ఇమాయ్ (బియ్యం)

పాత జపాన్ పదం : 'గినాయ్' (వరిమొక్క)

పాత చైనా పదం : మీయి, మీయర్ (ధాన్యం)

ఈ పదాల వెనుక ద్రావిడ మూలాలు తొంగి చూస్తూ కన్పిస్తాయంటాడు విజ్జెల్ పండితుడు.

## ఆర్యులు, ద్రావిడులు 'వరి'నే తిన్నారు

ఎఫ్.బి.జె. క్వీపర్ పరిశోధకుడు మూల 'ముండా' భాషాపదం 'ఎరిజ్' లేదా 'వెరిజ్' అనేది వ్రీహి' అనే సంస్కృత రూపాన్ని ఎలా పొందిందో విశ్లేషించాడు. ఋగ్వేద ఆర్యులు సప్తసింధులోకి అడుగుపెట్టడానికి పూర్వమే 'ఎరిజ్' పదం ఇరాన్‌కు చేరి 'బ్రిఝి'గా మారింది. తూర్పు ఉత్తర ఇరాన్‌లో ఈ ముండా భాషారూపం విస్తృతంగా కన్పిస్తుందని ఆయన పేర్కొన్నారు.

అవెస్తా భాషలో బ్రింజి, బిరింజి పదాలు కన్పిస్తాయి. ఇరాన్‌తో సంపర్కం పొంది పంజాబ్‌లోకి అడుగుపెట్టిన ఆర్యులు (బ్రింజి ('విజ్-ఇ') రూపాన్ని తీసుకువచ్చి వుంటారని, ఇదే "వ్రీహి"గా పరిణామం పొంది వుంటుందనీ పేర్కొన్నాడు.

ఇరాన్‌తో సంపర్కం లేకుండా నేరుగా సింధునదీ తీరంలోకి ప్రవేశించిన వ్యక్తులు మూల ద్రావిడ భాషని వ్యాప్తిచేసి వుంటారనేది ఆయన అభిప్రాయం. బహుశా వీరే సింధు నగరాల నిర్మాతలు కావచ్చు కూడా!

ఋగ్వేదంలో సింధూ ప్రాంత ప్రస్తావనలు స్పష్టంగా కన్పించకపోవడానికి పంజాబ్ నుంచి ఆర్యులు తూర్పుకు విస్తరిస్తూ వెళ్ళడమే కారణం. సుదాసు, దివోదాసులు నిర్వహించిన దాశరాజ్ఞ యుద్ధంలో భలానులు భరతుల పక్షాన నిలిచారు. బోలాన్‌పాస్ (బెలూచిస్తాన్) నుంచి వచ్చినవారే ఈ భలానులు.

ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన ప్రజలు ఋగ్వేదం మధ్యదశలోనో, చివరిదశలోనో సింధు నగరాలు రూపొందించుకుని గంగా తీరంవైపు విస్తరిస్తున్న వైదిక ఆర్యగణాలతో సంబంధాలు నెలకొల్పుకొని వుంటారని దీన్ని బట్టి మనం ఊహించవచ్చు. అందుకే, పరిశోధకులు ఇప్పుడు ద్రావిడభాషని Pre-Iranian భాషగా భావిస్తున్నారు.

సింధు నగరాల ప్రజలు మౌలికంగా వ్యాపారులు, వీళ్ళు బియ్యం తిన్నారా... గోధుమలు తిన్నారా... అనేది ప్రశ్న.

జ్వలెబిల్ (1970, 1990) అనే పరిశోధకుడు "ద్రావిడులు దక్షిణ ఆసియాలోకి ఇరాన్ ఎగువ ప్రాంతాల్లోకి వచ్చారు. వాళ్ళకు గోధుమలు తెలియవు. అందుకని వాళ్ళ భాషలో గోధుమలకు వేరే పేరు లేదు" అని పేర్కొన్నాడు.

ప్రాచీన 'ఆకిమెనిడి - ఈలమ్' భాషాపదం 'ఉ-మి' అంటే, ధాన్యం. 'ఉమ్' చేయడం అంటే, 'ఉమి'ని దంచి ఊకని వేరు చెయ్యడం అని!

'ఉమ్', 'ఉమ' పదాలు నేటికీ 'ధాన్యం' అనే అర్థంలో వాడుకలో వున్నాయి. 'ఉమ్యం' అంటే, 'ఉమలు పండే నేల?

కన్నడ, తుళు భాషల్లో 'గోది' అంటే లేత ఎరుపు రంగులో వుండే ధాన్యం అవి! గోది+ఉమ = గోది ధాన్యం 'గోదుమ' పదం ఇలా దక్షిణాది భాషల్లోనే ఏర్పడి వుండవచ్చు కూడా! సంస్కృత పండితులు 'గోధూమం' అని, 'దు'కి వత్తు చేర్చి వాటిని గోధుమలు చేశారు. 'గోది' అనే మాట మూలద్రావిడ పదాలలోంచే ఏర్పడింది.

పాత తమిళభాషలో కోట్ లేదా కోటి అంటే, గోధుమ, తొలి సంగమ సాహిత్యంలో 'కో' తుంపాయ్' అనే ప్రయోగం వుందనీ, అదే కోటిగా మారిందని మైకేల్ విజ్జెల్ పేర్కొన్నారు. 'గో-ద్' 'కో-ట్'రూపాలు మూలద్రావిడ 'కోడ్' మూల దక్షిణ ద్రావిడ 'కోడ్-ఇ'లోంచే ఏర్పడి వుంటాయని ఆయన అంటారు. మూలద్రావిడ కోడ్‌లోంచే తెలుగు 'కూదు' ఏర్పడింది.

కోడ్+ఉమ = కూటి గింజలు. గోధుమ శబ్దానికి ఇది పూర్వరూపం. ఇక్కడ మైకేల్ విజ్జెల్ వివరణ ఇది.

ప్రాచీన ఈజిప్ట్ : క్సండ్
ప్రాచీన హిట్టయిట్ : కంట్
ప్రాచీన సెమైట్ : హ-అంట్
ప్రాచీన ఉత్తర ఇరాన్ : గంట్-ఉమ్

ఇలా ఇరాన్ వరకూ వచ్చిన ఈ పదరూపం "జెండ్ అవెస్తా"లో 'గంటుమ్'గా మారి, టర్క్‌మెనిస్తాన్ మీదుగా మార్జియానా బాక్ట్రియాలను చేరింది.

ఇరాన్ : గంట్-ఉమ్
పర్షియన్ : గండ్ - ఉమ్
బెలూచిస్తాన్ : గండి - ఉమ్

ఇలా చివరికి ఈ పదం సింధు నగరవాసులను చేరింది. వాళ్ళు మాట్లాడిన భాష ఉత్తర ద్రావిడ భాష 'గండి-ఉమ్' 'గోద్-ఉమ్'గా పరిణమించింది. అప్పటికి ఆర్యులు పంజాబ్‌కి తిరిగి చేరిపోయి ఉంటారు.

'గోదుమ' పదం రూపొందించడానికి వెనక ఇంత చారిత్రక నేపథ్యాన్ని భాషావేత్తలు వెలికితీశారు. ఉత్తరద్రావిడ 'గోద్-ఉమ్', దక్షిణ ద్రావిడ 'కోడ్-ఉమ్'లు రెండూ గోధుమలకు మూలపదాలుగానే కన్పిస్తాయి. మొత్తం ఈ నిరూపణలు కొన్ని సత్యాల్ని మన అవగాహనకు తెస్తున్నాయి. భాష ఆధారంగా చరిత్ర నిర్మాణానికి సహకరించే గొప్ప పరిశోధన ఇది.

1. తెలుగు భాషకు దగ్గరగా వున్న మూలద్రావిడ భాష మాట్లాడిన ప్రజలు సింధు నాగరికతకు సమకాలికంగా జీవించారు. ఈజిప్ట్, గ్రీస్, ఇరాన్‌లతో వాళ్ళకు వాణిజ్య సంబంధాలున్నాయి. ఇక్కడి భాషా సంపద కూడా అక్కడకు చేరిందనేది ముఖ్య విషయం!
2. అనేక పూర్వ 'ముండా' పదాలు, పూర్వ ద్రావిడ పదాలు (Proto Munda & Proto Dravidian) ప్రాచీన ఇరాన్‌లోని జొరాస్ట్రియన్ మత గ్రంథం అవెస్తాలో కూడా కన్పించాయి.
3. పూర్వ ముండా, ద్రావిడ భాషా పదాలు ఋగ్వేదంలో అరువు పదాలుగా చేరినట్లు భాషావేత్తలు నిరూపించారు.
4. సుమేరియా నుంచి చైనా వరకు విస్తరించిన భూభాగంలోకి జాతులు ఒక చోటు నుంచి ఒక చోటుకు సంచరిస్తూ తమ భాషని, తమ సంస్కృతుల్ని, తమ ఆచార వ్యవహారాల్ని వివిధ ప్రాంతాల్లో వ్యాపింపచేశారు. ఈనాటి ప్రాదేశిక విభజనలేవీ ఆనాటికి వర్తించవు. 'ఆర్యులు భారత దేశంలోకి రాక' అనే మాటలకు అర్థం

లేదు. జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే- మేరో దక్షిణ దిగ్భాగే అని భౌగోళికంగా మన ఉనికిని మనం ఈనాటికీ చెప్పుకొంటున్నాం. భరతఖండం అంటే, 'దక్షిణ ఆసియా ప్రాంతం' అంతా విస్తరించిన భూమి! అందులో మేరువుకు దక్షిణంగా మనం వున్నాం. ఈ మేరువు ఏదీ అనేది తేలనిప్రశ్న!

5. దక్షిణ ఆసియా ఖండంలోని ప్రాచీన జాతులన్నీ పరస్పరం సంబంధ బాంధవ్యాల వల్లనే అభివృద్ధి చెందాయి. భాషారూపాలు కూడా అలానే ఒక భాషలోంచి ఇంకొకటిగా పెనవేసుకొని పెరిగాయి.
6. వీటిలో పూర్వద్రావిడ భాషకు దగ్గరగా కన్పించే దక్షిణాది భాష తెలుగు. సింధు నాగరికతకు సమకాలీన ప్రజలు తెలుగులాగానే ఉచ్చరించే భాషని మాట్లాడారనేది ఆధునిక పరిశోధనలు చాటి చెప్తోన్న సత్యం!
7. పూర్వద్రావిడ భాషలోంచి స్పష్టమైన మూల తెలుగు ఋగ్వేదకాలానికే రూపుదిద్దు కొందని భాషా చారిత్రకపరంగా 'వరి' అనే పదం సశాస్త్రీయంగా నిరూపిస్తోంది!
8. ఇంగ్లీషులో అందుబాటున వుండటం కారణంగా మాత్రమే తమిళ భాషా పదాలను ఉదహరించగలుగుతున్నామని, తెలుగు భాష మూలాల్లోకి వెళ్ళలేకపోతున్నామని చాలామంది విదేశీ భాషా పరిశోధకులు అనేక సందర్భాల్లో పేర్కొన్న సంగతిని గుర్తు చేస్తున్నాను.

పరిశీలనకు ఉపకరించిన పరిశోధనలు


1. Substrate Languages old Indo Aryan Michael witzel, (electronic Journal of verfic studies (EIVS) 5-1 1999 PPI-67
2. A Dravadian Etymological Dictionary Oxford clarendon press 1984 (Th. Burrow&M.B. Emeneau)
3. The Harappan civilization and the Rigveda M.witzal (ed)
4. Proto Munda words in Sanskrit; FBJKUIPER (Amsterdam)
5. Dravidian linguistics:
6. Agesthialingam, P.S. Subrahmanyam. Annamalai University
7. Historical grammar of Telugu : Korada Mahadeva Sastry : S.V. University P.G. Centre, Anantapur 1969
7. The Vedic Age : R.C. Majumdar Bharatiya Vidya Bhavan 1996

# తెలుగు భాషకు తిరుక్షౌరం

**"తిరుకట్టె సేవ జేసెద తి**
**రుమాళిహ నలికి పూసి తీ**
**ర్చెద ముగ్గుల్ తిరుపంజనంబు దీర్చెద**
**తిరుపుట్టము లుతికి వేగ దెచ్చెద దినమున్"**

తెలుగు వైష్ణవులకు తమిళం దైవభాష. వీళ్ళలో చాలామంది తెలుగువారే. ఇప్పటి తమిళప్రాంతాల్లో నివసించి, తాతల కాలంలోనే తెలుగునేలకు వలసవచ్చిన తెలుగువాళ్ళు కూడా ఉన్నారు. వాళ్ళు ఇళ్ళలో తమిళం మాట్లాడటం, తమిళుల్లాగే ప్రవర్తించటం, తెలుగు విషయాలను తమిళీకరించటానికి ఎక్కువ మొగ్గుచూపటం ఈ పద్యభాగంలో కనిపిస్తుంది.

ఇలాగే, వీరశైవులున్నూ కన్నడం తమకు దైవభాషగా భావించిన సందర్భాలు కూడా కనిపిస్తాయి. శివుడు కన్నడంవాడూ కాదు, విష్ణువు తమిళుడూ కాదు. కన్నడ బసవడూ, తమిళ రామానుజుడూ కలిగించిన ప్రభావాల పుణ్యం అది. తమిళ వైష్ణవుల పలుకుబడి తెలుగుమీద ఎక్కువ. వీళ్ళు తెలుగుపదాలకు ముందు 'తిరు' చేర్చి విష్ణుత్వం ఆపాదించటం గొప్ప విషయమే కానీ, తమిళీకరించే పనిగా అది పరిణమించటమే బాధాకరం.

**తిరుకట్టె సేవ జేసెద :** కట్ట అంటే చీపురుకట్ట. దాన్ని తిరుకట్ట - గుడి ఊడ్చే చీపురుకట్ట అనడం వలన దానికి పవిత్రత వచ్చింది. కానీ అందులోంచి తెలుగుదనం ఊడ్చుకుపోయి, అది తమిళపదంగా మారిపోయింది.

**తిరుమాళిహ నలికి పూసి తీర్చెద ముగ్గులు :** మాళిగ అంటే ఇంటిలో ఒక భాగం. ఇది ఒక తెలుగు మాటే! ఈ 'మాళిగ'కు తిరును చేర్చి తిరుమాళిగ/తిరుమాళ్ళ/తిరుమాళిహ/తిరుమాళిఘ అంటే గుడిపూజారి లేదా మతగురువు నివాసం. అంటే వైష్ణవ గురువు ఇంటిని అలికి ముగ్గులు పెట్టే సేవ ఇది. దాన్ని తెలుగు వైష్ణవులు తమిళంలోనే చెప్పాలా?

**తిరుపంజనంబు దీర్చెద :** మజ్జనం అంటే నీళ్ళలో మునిగి చేసే స్నానం. తిరుమంజనం

అంటే పవిత్రమైన కోనేరులో స్నానం. కోనేటిని 'తీర్థకూలం' అన్నారు. సంస్కృతంలో తీర్థం అంటే దేవుడి నీళ్ళు అని. కూలం అన్నా దేవుడి నీళ్ళే! తీర్థకూలం అనటం ద్వారా తమిళీకరించే ప్రయత్నం స్పష్టమౌతోంది. కూలం/కొలం/కూలం/కొలను ఈ పదాలన్నీ నీటికి సంబంధించినవే! ఆంధ్రమహావిష్ణువు స్థావరమైన 'శ్రీకాకుళం'లో కాకుళం అంటే 'కా'=నల్లని, 'కుళం'=నది... కృష్ణానది అని అర్థం...

**తిరుపుట్టములుతికి వేగ దెచ్చుద :** పుట్టము=బట్ట. తిరుపుట్టము=దేవుడికి కట్టిన వస్త్రం. తిరుపావడ. అంటారు.

ఇలా తెలుగులో వ్యవహారంలో ఉన్న మాటల్ని తిరుచేర్చి తమిళపదాలుగా మార్చినవి ఇంకా చాలా ఉన్నాయి. మచ్చుకు కొన్ని :

**తిరువళ్ళిక :** 'తిల్లిక' అంటే దీపం. తిరుతిల్లిక అంటే దేవుడి ముందు వెలిగించిన దీపం. తిరుపాట (భక్తిగీతం), తిరుబాస (దేవుడిమీద ఒట్టు), తిరుకాపు (గుడి తలుపులు) తిరుగిన్నె (దేవుడి గిన్నె),

**తిరుతోమాలి :** తోమాలియ అంటే తోట+మాలి అని! తోమాలె అంటే ఆకులూ పూలూ కూర్చి కట్టిన మాల. తోమాలి అనికూడా అంటారు, తిరుతోమాలి అనేసరికి తమిళపదంగా మారిపోయింది.

**తిరుపడితాము :** పడిదెం అంటే జుర్రుకుంటూ తాగేదని! దీనికి తిరు చేర్చి తిరుపడిదెం – 'తిరుపడితాము' అన్నారు.

తిరుచుట్టు (గుడి ప్రహారీ), తిరుబోనం (నైవేద్యం), తిరునగరు (ధనికుల నగరం, దేవుడి ఊరు, తిరునాడు (వైకుంఠం), ఇలా చాలా మారుడు పదాలు కనిపిస్తాయి.

సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘికచరిత్రలో దీన్ని ప్రస్తావిస్తూ, "భోజనము చేసినప్పుడు 'అన్నము' అనక 'సాదము' అని, 'పరమాన్న మనక 'తిరుకణామధు' అని, 'భక్ష్యాలు' అనక 'తిరుపణ్యారము' అని, ఈవిధముగా అన్నియు అరవముతోనే అడుగవలెను. లేకున్న వైష్ణవుడు మైల పడిపోవును. ఇది వైష్ణవము తెచ్చి పెట్టిన అరవ దాస్యము" అన్నారు.

ఇందులో దేవుడిపాత్ర, భక్తులపాత్రా ఏమీలేవు. ఎవ్వరినీ ఇప్పుడు తప్పుపట్టి ప్రయోజనమూ లేదు. కాకపోతే, తెలుగు భాష కొచ్చేసరికి కొప్పుకు ముందు తిరుచేరిస్తే, 'తిరుకొప్పు' అంటే బోడితల అనీ, క్షవరానికి ముందు తిరు చేరిస్తే, 'తిరుక్షౌరం' (ఉన్నది కాస్తా ఊడటం) అవుతున్నాయి. భక్తికీ భాషకూ ముడిపెట్టి ప్రయోగాలు చేస్తే, భాషాభక్తులు ప్రశ్నించటం సహజమే!



# పాళీభాషలో తెలుగు వ్యవసాయ పదాలు

క్రీస్తుపూర్వం 4వ శతాబ్దినుంచీ క్రీ.శ. 4వ శతాబ్ది వరకూ తెలుగు నేలమీద నడచిన వ్యవసాయానికి పాళీ, ప్రాకృత, సంస్కృత భాషలలో వెలువడిన బౌద్ధ సాహిత్యమే ముఖ్య ఆధారం. తెలుగు నేలమీద తెలుగు బౌద్ధసిద్ధాంతకర్తలు పాళీభాషలో రచించిన గ్రంథాలలో తెలుగు నేల ప్రసక్తి, ప్రస్తావన, ప్రశంసలు కనిపిస్తాయి. అవర శైలీయ, పూర్వశైలీయ రాజగిరిక, సిద్ధార్థక అనే నాలుగు బౌద్ధ సాంప్రదాయాలను అంధక బౌద్ధసాంప్రదాయాలని పిలుస్తారు. హ్యూన్‌త్సాంగ్ బెజవాడలోని ఒక బౌద్ధస్తూపం దగ్గర వర శైలీయ సిద్ధాంతాలను అధ్యయనం చేశాడని, ఇక్కడ కొన్నాళ్ళపాటు ఉన్నాడని చెప్తారు. ఈ నాలుగు అంధక సాంప్రదాయాలతోపాటు ఆచార్య నాగార్జునుడు ప్రతిపాదించిన వైపుల్యవాదం కూడా ఇక్కడ బహుళవ్యాప్తిలో ఉండేది.

పాళీ శబ్దానికి ఆ భాషలో ధర్మం అని అర్థం. తెలుగులో అధర్మానికి ఎవరైనా తలబడితే, “ఇది నీకు పాడియేనా...?” అని వారిస్తాం మనం. అంటే, ధర్మం కాదని చెప్పటం ! పాళీ శబ్దానికి పడి వికృతి. పాళీభాష తెలుగు సామాన్యులను ఎంతగా చేరిందో దీన్నిబట్టి అర్థం అవుతుంది. ఇప్పుడు ఇంగ్లీషు చెలామణిలో ఉన్నట్టే, అప్పుడు పాళీ చెలామణి అయ్యింది.

మనం నాగలి అని తెలుగులో పిలుస్తున్నాం. దాన్ని వైదికభాషలో లాంగల అంటారు. నాగలి అనేది ద్రావిడ మూలాలు కలిగిన పదమే గానీ, వైదిక లాంగలిని తెలుగులో నాగలి అంటున్నారని వ్యాఖ్యానించటం సరికాదని ఎబిజె క్వీపర్, మైకేల్ విజ్జెల్ ప్రభృతులు పేర్కొన్నారు. ఆస్కోపర్పోలా అనే భాషా చారిత్రకవేత్త ఋగ్వేదంలో కనిపించే లాంగల

శబ్దం ద్రావిడ భాషలోంచి స్వీకరించిందేనని పేర్కొన్నాడు. DEDR 2907లో వివిధ ద్రావిడ భాషలలో నాగలిని ఎలా పిలుస్తారో విపులంగా ఉంది.

Ta. నాఞ్చిల్ : plough

Ma. నేఞ్ఞల్, నెఞ్ఞి : plough-shaft.

Ko. నె.ల్గ్ plough

Ka. నేగల్, నేగిల్ plough.

Kod. నేజ్గి

Te. నాగలి, nagelu, nagelu id.

Kol. నాఙ్గలి (Kin.) naneli id.

Nk. నాఙ్గర్ id. Nk. (Ch.) nangar id.

Pa.నాఙ్గిల్ id. Ga. (Oll.) nangal,

(S.) నాఙ్గల్ id. Go. (W.) nangel, (A. SR.) nangyal, (G. Mu. M. Ko.) nangel, (Y.) nangal,

(Ma.) నాఙ్గిలి (pl. nangisku) id. (Voc. 1956); (ASu.) naynal, (Koya Su.) nanel, naynel id. Konda nangel id.

Pe. నాఙ్గేల్ id. Mand. nengel id.

Kui నాఙ్గేలి id. Kuwi (F.) nangelli ploughshare' (Isr.) nangeli plough. / Cf.

Skt. లాఙ్గల plough

Pali నాఙ్గ - plough;

Mar.నాగర్

H. నాఙ్గల్,

Beng. నాఙ్గల్ id., etc.; Turner, CDIAL, no. 11006. DED (S, N) 2368.

ద్రావిడ భాషలన్నింటిలోనూ కనిపించే నాగల్ శబ్దాన్ని ఋగ్వేదంలోకి చేరిన ద్రావిడపదంగా గుర్తించటమే సబబుగా చరిత్రవేత్తలు భావించారు. మరొక ఇండో ఆర్యన్ భాషా కూటమిలో ఈ పదం కనిపించకపోవటం కూడా ఈ నిర్ణయానికి ఒక కారణం. ఒకరినుంచి మరొకరు వ్యవసాయం నేర్చుకొన్నారు. విస్తృతస్థాయిలో వ్యవసాయం చేయటానికి ఇనుపకర్రు కలిగిన నాగలి అవసరం ఎంతయినా ఉంది. అది దక్షిణాదిలో

ముఖ్యంగా తెలుగునేలమీద లభ్యం అయ్యేది. ఇక్కడ ఆ రోజుల్లో నిస్సందేహంగా లోహ పరిశ్రమలు ఉండి ఉండాలి. ఇనుమును కరిగించగల పరిజ్ఞానం ఆనాడే తెలుగు ప్రజలకున్నదని చరిత్రవేత్తలు అంగీకరిస్తున్నారు. రామాయణంలో విశ్వామిత్రుడు రామలక్ష్మణులను దండకారణ్యానికి తెచ్చి ఆయుధాలు ఇప్పించిన కథలో ఆయుధ తయారీ కేంద్రాలు ఇక్కడ ఉండేవనే అంశాన్ని గుర్తించాలి. ఇక్కడ అమ్మే వస్తువుకు ఇక్కడిపేరు పెట్టటమే సహజం నాంగలి ఆనాటి పేరు లాంగలగా అది ఉత్తరాదికి చేరింది. సున్నా అరసున్నాగా మారి, నాఁగలి మిగిలింది.

'నామ్' అంటే ఎద్దు. "కోల" అంటే ఎద్దు మెడమీద ఉంచే కాడి. ఈ రెండు పదాలను కలిపి నామ్+కోల అనేది నాగలి పదానికి మూలం అయ్యిందనే వాదన కూడా ఉంది.

అరక అనే శబ్దానికి A plough with bullocks complete. సర్వావయవములుగల నాగటికి ఎడ్లను పూనినది–అని!

అరకట్టరక a plough with a pair of bullocks. అరకలు కట్టటం అంటే, పనికి సిద్ధంచేయటం అని!

విడిచికట్టరక a plough with a change of bullocks. అరకలు విప్పటం అంటే, పని ముగిసిన తరువాత ఎడ్లకు విశ్రాంతినివ్వటం

అరకాడు ara-kadu. (from అరక+కాడు) n. వ్యవసాయదారుడు, రైతు.

అరక సాగటం లేదంటే, వాతావరణం అనుకూలంగా లేకపోవటం, ఎడ్లు సహకరించకపోవటంలాంటి సమస్యలు ఉన్నాయని చెప్పుకోవటం.

చీమకుర్తి శేషగిరిరావుగారు 'పాళీ భాషలో తెలుగుపదాలు' అనే చిన్న గ్రంథాన్ని ప్రచురించారు. అమూల్యమైన సమాచారం ఉన్న గ్రంథం ఇది. ఈ గ్రంథం ఆధారంగా కొన్ని వ్యావసాయిక పదాలు తెలుగు పాళీ భాషలలో సమానార్థాలలో ఉన్నవాటిని పొందుపరిచారు. ద్రవిడియన్ ఎటిమలాజికల్ నిఘంటువు ఆధారంగా ఈ పదాలకు ద్రావిడ మూలాలు స్పష్టంగా కనిపిస్తున్నప్పుడు అవి తెలుగులోంచే పాళిలోకి వెళ్ళి వుండాలని భావించాలి. అందుకు అవకాశం ఉన్నవాటిని మాత్రమే ఇక్కడ అందిస్తున్నాను.

**1. అంకె :** పాళీ భాషలో అజ్క తొడగటం అంటే, కాడిని పైకి లేపి పట్టి, దాని కిందకు ఎద్దును తెచ్చి నిలిపి, ఆ కాదిని ఎద్దు మెడచుట్టూ ఒక తాడుతో సందిస్తారు. దాన్ని అంకెతాడు అంటారు. కొక్కెం లేదా కొంకి లాంటిది ఇది. వ్యవసాయానికి

సంబంధించినంతవరకూ అజ్క లేదా అజ్కె పదాన్ని మనం పాళీభాషలో చూడవచ్చు. అంకె వేసుకొన్నది అంటే దున్నటానికి సిద్ధంగా ఉన్నదని! అంకెకు వచ్చిందంటే వశ్యమయ్యింది. అదుపాజ్ఞలలోకి వచ్చిందని!

DEDR 340లో appu అనే తమిళ పదానికి అర్థాలను వివరించే సందర్భంలో ఈ పదం కనిపిస్తుంది. ఆపు, అదుపు అనే అర్థాలలో ఏర్పడిన పదం ఇది.

Ta. అప్పు : wedge used in splitting wood, peg, stake.

Ma. అప్పు : wedge, plug, what stops a crevice; appu, appam wad of gum.

Ko. అ.ప్ : wedge, peg, stake

Ka. ఆపు : restraint, stoppage; anke an order, command, control, restraint; (PBH.) anke opposition; (Hav.) apu a peg.

Tu. అన్కె : force, compulsion, power, control, support.

Te. ఆక : order, command, prevention, custody ;

ఆకట్టు : to check, prevent

ఆగు : to stop, stay, be suppressed or stopped, refrain ; prevent, stop, prohibit.

ఆగించు : to check, hinder

ఆచు : to check, hinder, prevent, subdue, keep under control.

ఆపు : to hold back, restrain, stop, prevent; n. stoppage, cessation; ankili obstacle, impediment. Ga. (S.3) అగుల్ప్ - to obstruct.

Go. (Koya T., p. 79) ఆన్గ్ :- to stop (intr.); ap- to make stop; (Koya Su.) an- to stop (intr.); ap- id. (tr.); (ASu.) ag- to stop, stand.

Mand. ఏన్గ్ : to intercept, hold back, hold up.

Kui అన్గా (ఆన్గి) : to intercept, hinder, prevent, ward off, defend, herd; n. interception, prevention, defence, herding; angeni, angeri a fence.

Kuwi (F.) ఆంగలి to check ;

(S.) ఆన్గినాయ్, ఆన్గా తుహ్నాయ్ : to prevent, defend; (Isr.) ang- (-it-) to stop one from going; (S.) ashinai to impede;

(Mah అన్గేని : lane, alley. DED(S, N) 286.

అదుపు చేయటం అనే అర్థంలో అంకపదాన్ని దానితో అనుబంధంగా ఏర్పడిన ఇతర తెలుగుపదాలను ఈ నిఘంటువు సహాయంతో మనం చక్కగా గమనించవచ్చు.

**2. కసవు :** పనికి మాలినవి, తోసేయదగినవీ అయిన పెంట, పేడ, గడ్డి, వీటినన్నింటినీ కసవు అంటారు. కాశీలో కసవుగా పుట్టినా పుణ్యమేనని శ్రీనాథ మహాకవి కాశీఖండంలో అంటాడు. పశువుల కొట్టంలో కసవు ఏర్పడుతుంది. ఇది అనేక ద్రావిడ రూపాలలోనూ పాళీభాషలోను, సంస్కృతంలోనూ యధాతథంగా అదే అర్థంలో కనిపించటాన్ని ద్రవిడియన్ ఎటిమలాజికల్ నిఘంటువు 1088లో మనం గమనించవచ్చు. పాళీ సంస్కృతాలను పరిపుష్టి చేయటానికి తెలుగు లేదా ఇతర ద్రావిడ భాషలు కూడా సహకరించాయనటానికి ఈ కసవు ఒక సాక్ష్యం.

Ta. కచటు : uncleanness, dirtiness, dregs, blemish, fault, imperfection;

కచంటు : dregs; kancal sweepings, rubbish heap, refuse.

Ma. కచ్చి : straw, stubble, rubbish; kancal sweepings, refuse, dirt.

To. కొస్ఫ్ : rubbish. Ka, kasa, kasavu rubbish, sweepings, weed, useless plant, afterbirth, placenta;

కసరు dust and other impurities;

కసకీలు : a broom;

కసబరలు : a kind of broom ;

కసబరిగె, కసబొరిగె, కసపొరిగె : id. (for parige, etc);

కసమర, కసవరిగె : broom;

గసి, గస్తు : gasi, gastu sediment or dregs of oil or melted butter, or of pickles.

Tu. కజవు, కజావు : rubbish, sweepings, afterbirth;

కజనె : rubbish floating on stagnant water ;

కజె : an acid substance accumulated on the teeth by chewing betel leaves

కస : sweepings, rubbish;

Te. కసటు : impurity, dirt, foulness, sin;

కసవు : sweepings;

గసి : gasi sediment of ghee or oil.

Pe. కన్జ్ to be dirty, become dirty.

Kur. కస్సా : layer of dirt on the body.

Malt కసె : dirt on the body. / Cf. Turner, CDIAL, no. 2615,

Skt. కచ్చర – dirty, foul; wicked, etc.; no. 2980,

Pali కసట : nasty.

**3. గరిసె :** పాళీ భాషలో కరీస అంటే కొలపాత్ర. ఈ కరీస నిండా తీసుకొన్న ధాన్యపు గింజల్ని ఎంత విస్తీర్ణంలో ఉన్న భూమిలో చల్లుతామో అంత భూమిని "కరీస భూమి" అంటారు. మధ్యయుగాలనాటి తెలుగుకవి అడిదము సూరకవి "గరిసెల వ్రాతెగానీ, యొక గంటెడెఱుంగము" అని ఒక ప్రయోగం చేశాడు. పేరుకుమాత్రం గరిసెడు భూమి ఉన్నది గానీ పండుతోంది గరిటెడేనన్న బాధ ఈ ప్రయోగంలో వ్యక్తమౌతోంది. ఇది గ్రామీణ ప్రాంతాలలో ఈనాటికీ వ్యాప్తిలో ఉన్న వ్యావసాయిక పదం. తెలుగు, తమిళ, కన్నడ భాషల్లో ఇది వ్యాప్తిలో ఉన్నట్టు ద్రవిడియన్ ఎటిమలాజికల్ నిఘంటువు 1261 పేర్కొంది. పాళీ తెలుగుభాషా బంధానికి ఈ పదం మరొక ఉదాహరణ.

Ta. కరచయ్, కరిచయ్ : a measure of capacity - 400

మరక్కాల్ : ఒక కొలత. తెలుగులో మరకం అంటారు.

Ka. గరస, గరిసె : ఒక కొలత

Te. గరిసె : ఒక కొలత Cf. 1966

Ko. కెర్చ్

Pali : కరీస : a square measure of land, being that space on which a karisa of seed can be sown.

**4. కంచె :** కంచె చేను మేస్తే కలదె దిక్కు? అని తెలుగు సామెత. ద్రవిడియన్ ఎటిమలాజికల్ నిఘంటువులో కంప, గరడి, తెట్టు, అనే పదాలు ఉన్నాయి గానీ కంచె పదం కనిపించలేదు.

కంచె : A hedge, pasture land బడుగునేల.

కంచెకోట : The outer hedge or fence round a fort.

కంచెనాటుట. To plant a hedge అని అర్థాలు నిఘంటువులలో కనిపిస్తాయి.

తమిళంలో కంచి అంటే కాంజికం లేదా గంజి. తమిళనాడులో ఉన్న కంచి పుణ్యక్షేత్రానికి ఈ తమిళ అర్థం వర్తించదు. కంచి అంటే తెలుగులో హద్దుని నిర్దేశించటం. తెలుగునేల మీద కంచి అనే పదం ఉన్న గ్రామనామాలు చాలా ఉన్నాయి. కొనకంచి, కంచికచెర్ల, పెనుకంచిప్రోలులాంటి పేర్లుగల ఊళ్ళు కృష్ణాజిల్లాలో ఉన్నాయి. ఈ కంచె పాళీభాషలో హద్దు అనే అర్థంలో కనిపిస్తుంది.

**5. గొడ్డలి :** ఋగ్వేదంలో గొడ్డలిని కుద్దల అన్నారు. విస్తృతమైన వ్యవసాయానికి ఇనుప కర్రు వున్న నాగలిని ఉపయోగించినా ఆహారయోగ్యమైన దుంపలను, మూలికలను, పవిత్రమైన మొక్కలనూ త్రవ్వేందుకు చెక్క గునపాన్నే వాడేవారు. ఇనుము వారిది కాకపోవటం వలన అది పవిత్రత లేనిదిగా మారింది.

Ta. kutari, kotari, kotali

Ta. కుటారి, కోటారి, కోటాలి axe.

Ma. కోటాలి, కోటాలి, కోటాళి axe.

Ka. కొడాలి : axe.

Tu. కొడారి, కుడారి : axe.

Te. .గొడ్డలి, గొడ్డెలి, గొడ్డేలి, గొడ్డేలు, గొడలి : axe.

Kol. గొల్లి, గోలి : axe.

Konda గోరెల్ (ఇ) axe.

Pe కూరెల్ axe (large variety).

Kui క్రాడి axe.

Kuwi (Su.) క్రాలి axe.

చెట్లను, కట్టెలను నరికేందుకూ, కోసేందుకూ ఈ సాధనం బాగా ఉపయోగపడింది. గండ్రగొడ్డలి (పరశువు) అనేది ఆయుధ విశేషం. గొడ్డలి వ్యావసాయిక పదం.

**6. కొట్టము :** కొట్టు : ధాన్యాదులను దాచుకొనే గది. 'కొట్ఠ' అనేది పాళీభాషా పదం. ఈ కొట్టు అనే పదం చిల్లరకొట్టు, బట్టలకొట్టు, ఎరువులకొట్టు ఇలా వాణిజ్యపరమైన అంశాలకు సంబంధించిన పదంగా కూడా కనిపిస్తుంది.

**7. కళ్ళము :** పంట పండిన తరువాత వరి మొక్కలను మొదలంటా కోసి, ఒకచోట కుప్పగా పోస్తారు. ఈ కుప్పగా పోసిన నేలను కళ్ళము అంటారు. 'ఖల' అని పాళీ,

వైదిక, సంస్కృత భాషలలో వ్యవహరిస్తారు. కళ్ళము పాళీలోంచి తెలుగులోకి వచ్చిన పదం కాకపోవచ్చు. ఎందుకంటే, ద్రవిడియన్ ఎటిమలాజికల్ నిఘంటువు ప్రకారం వివిధ ద్రావిడ భాషలలో కల్మ్, కలమార్, కలరి, కక్మ లాంటి పదాలు ఉన్నాయి. అయితే, రాజస్థాన్ రాజవంశాలలో కలమార్ రాజవంశం ఒకటి. భోజమహారాజు తమ వంశంలోనే జన్మించాడని ఈ వంశీకులు చెప్పుకొంటారు. ఖల లేదా కళ్ళం దేశవ్యాప్తంగా ఉన్న మూల ద్రావిడ పదమే అయి ఉంటుంది. కళ్ళములో మొక్కలను కుప్పగా పోసిన తరువాత నూరి, మొక్కనుంచి గింజను రాలుస్తారు. దీనిని నూర్పిడి అంటారు.

**8. చెత్త :** పాళీ భాషలో కూడా చెత్త అనే ఈ పదం – తోసి వేయబడినది అనే అర్థంలో కనిపిస్తుంది.

**9. పలుగు :** పాళీ భాషలో పలిఘ అంటారు. త్రవ్వటానికి ఉపయోగించే ఒక లోహ సాధనం.

**10. మానిక :** ధాన్య కొలిచే పాత్ర. పాళీభాషలో కూడా 'మానిక' అనే అంటారు.

**11. కూర :** వండిన కూర అనీ, కూరగాయల్లో కూర అనీ ఈ కూఅ పదం రెండర్థాలలో కనిపిస్తుంది. పాళీభాషలో కూడా ఇలానే రెండర్థాలలోనూ కనిపిస్తుంది. సంస్కృత భాషలో కూరం అంటే అన్నం.

**12. అచ్చుకట్టు :** పాళీభాషలో అచ్చిబంధ అంటారు. నాలుగు పలకలుగా వరిమళ్ళను కట్టటాన్ని అచ్చుకట్టటం అంటారు. పంట చేనును వైదికభాషలో క్షేత్రం అంటారు. ఒక నిర్ణీతకొలతలో ఎత్తుగా గట్లు పోసి మడి కడతారు. ఇది తెలుగువారి వ్యవసాయ విధానంలో ప్రత్యేకంగా కనిపించే అంశం. అచ్చు కట్టటంలోంచే అచ్చి రావటం (కలిసి రావటం) అనే పదం కూడా ఏర్పడి ఉండవచ్చు.

పాళీభాషలో కనిపించే ఈ పదాలు తెలుగు నేలమీద చారిత్రకంగా పాళీభాష రాజ్యం ఏలిన కాలంనాటి పదాలుగా మనం గుర్తించవచ్చు. తెలుగుభాష ప్రాచీనతకు వారి వ్యావసాయిక పదాలే సాక్ష్యం ఇస్తాయని కూడా అర్థంచేసుకోవచ్చు.

మహాకవి కాళిదాసు బౌద్ధ యుగానికి చెందినవాడు. ఆయన రఘువంశం కావ్యంలో ఆనాటి తెలుగు ప్రజల వ్యావసాయిక జీవనాన్నీ ప్రస్తావించిన శ్లోకం మన ప్రాచీనతకు ఒక ప్రత్యక్ష సాక్షి.

రఘు మహారాజు కళింగను జయించాడు. ఈనాటి శ్రీకాకుళం జిల్లాలో మహేంద్రగిరి ఉంది. అది ప్రాచీనాంధ్ర భూగోళానికి ఉత్తరహద్దు. ఈ ఉత్తరాంధ్రను రఘు మహారాజు జయించటాన్ని ఆనాటి తెలుగు ప్రజలు స్వాగతించారట, మహేంద్రగిరిని తమలపాకు తోరణాలతో అలంకరించి, దానినొక పానశాలగా మార్చి, కళింగరాజు కీర్తిని తాగినట్టు కొబ్బరికల్లు తాగారని రఘువంశం నాల్గవ సర్గ ఒక వర్ణన కనిపిస్తుంది. అక్కడినుంచి రఘు మహారాజు కోస్తా తీరం వెంబడి దిగువకు బయల్దేరితే, అడుగడుగునా ప్రజల నీరాజనాలు దొరికాయట.

చెరుకుతోటల నీడలో కూర్చుని రైతు మహిళలు వరిచేలను కాపలా కాస్తూ, రఘు మహారాజు జీవితగాథని పాటలుగా పాడుకొన్నారంటూ, "ఇక్షుచ్ఛాయా నిషాదిన్యస్తస్య గోప్తుర్గుణోదయమ్" (రఘువంశం, 4వ సర్గ, 20 శ్లో) అనే శ్లోకంలో వర్ణిస్తాడు.

ఇది నేటికి రెండువేల ఏళ్ళనాటి తెలుగు ప్రజల వ్యవసాయగాథ!



## తెలుగు భాషకు ప్రాచీనతా ప్రతిపత్తి సాధకుడు -

# ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి

ఒక సిద్ధుడు. ఒక ప్రసిద్ధుడు. ఒక జగత్ప్రసిద్ధుడు అయిన మహోన్నత భాషా శాస్త్రవేత్త మరణించినప్పుడు భాష మరణించినంత పెనువిపత్తు కలుగుతుంది. అందవలసినంత ప్రాణవాయువు అందకపోతే ఊపిరాడనట్టే అవుతుంది. తెలుగుభాష మూలాలను వెదికే విషయంలో ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి మరణంతో ఏర్పడిన లోటును మరొకరితో పూరించగలిగే పరిస్థితి లేదు. ఆరాధనీయమైన అంతటి అంతర్జాతీయఖ్యాతిని పొంది తెలుగువారికి గర్వకారణమైన అపురూప వ్యక్తిత్వం మరొకరిలో కానరాదు.

2005లో విజయవాడ మెరీస్‌స్టెల్లా కళాశాలలో తెలుగుభాషమీద ఒక అధ్యయన సదస్సును ప్రారంభించి తాను తెలుగుమీడియంలో చదివాను కాబట్టే ఈరోజు ఇలా అంతర్జాతీయ భాషావేత్తను కాగలిగాననీ, ఇప్పటివాళ్ళలాగా ఇంగ్లీషుమీడియంలో చదువుకొని ఉంటే రెంటికీ చెడేవాణ్ణనీ చెప్పుకొన్నారు. మానసిక శాస్త్రపరమైన అనేక అంశాలు మాతృభాషని ప్రభావితం చేస్తాయని ఆ సదస్సులో ఆయన వివరించారు.

### ప్రలోభాలకు లొంగని విశిష్ట వ్యక్తిత్వం :

"సుసుమూ ఓనూ" అనే ఒక జపానీ ఔత్సాహిక భాషాశాస్త్ర పరిశోధకుడు "ది జెనియాలజీ ఆఫ్ జపనీస్ లాంగ్వేజ్" వ్యాసంలో జపానీ భాషలో కొన్ని పదాలు తమిళ పదాలుగా చిత్రించే ప్రయత్నం చేశాడు. మద్రాసు విశ్వవిద్యాలయంలో తమిళ ఆచార్యుల ప్రేరణతో ఆ విధంగా ఆ పరిశోధన సాగింది. "తొకునాగ" అనే జపానీ భాషావేత్త ఈ అధ్యయనాన్ని ఖండిస్తూ, అది misuse of DEDR అన్నాడు. "భాషాశాస్త్ర రహస్యాలను

తెలుసుకోవాలంటే, హైదరాబాదులో భద్రిరాజు కృష్ణమూర్తి అనే ప్రొఫెసర్ ఉన్నారు. ఆయన్ను ఆశ్రయించు" అంటూ తొకునాగ ఆ వ్యాసకర్తను మందలించారుకూడా! అని ద్రావిడ పదాలనీ, తెలుగులో కూడా అవి సజీవంగా ఉన్నాయనీ "బౌద్ధయుగంలో తెలుగువారికి జపానీయులతో ఏర్పడ్డ సాంస్కృతికపరమైన, వాణిజ్యపరమైన సంబంధాలు ఇందుకు కారణం కావచ్చని నేను "సుసుమూఓజినూ"కు సమాధానంగా ఒక వ్యాసం ప్రచురించాను. దానికి భద్రిరాజువారు అంగీకరించక నాలుగు అక్షింతలు నాకూ వేశారు. "నిజంగా జపనీసుకు ఏదయినా ఉంటే ప్రాచీన ద్రావిడంతో ఉండాలి తమిళంతో ఎలా ఉంటుంది...? అని 1982లో జపాన్‌లో జరిగిన అంతర్జాతీయ భాషాశాస్త్ర సదస్సులో తాను ప్రశ్నించినట్టు ఆయన స్వయంగా పేర్కొన్నారు. ఎక్కడయినా తమిళులు గానీ, తెలుగువారుగానీ, జపానీయులతో సహజీవనం చేసిన దాఖలాలు ఉంటేనే పదాల ఆదాన ప్రదానాలు జరిగే అవకాశం ఉందని, అలాంటిదేమీ జపనీయులతో లేనప్పుడు తమిళ పదాలుగానీ, తెలుగుపదాలుగానీ జపానులోకి వెళ్ళే అవకాశంలేనేలేదని ఆయన కరాఖండిగా చెప్పారు. ఈ "సుసుమూ ఓనూ" ఒకసారి భద్రిరాజువారిని కలిసి, Prof. Krishnamurthy, if you can accept my theory, I will take you to Japan" అని ఆశ పెట్టబోయాడట. ఎవరైనా ట్యూటర్ పని చేసుకొనే వాడి దగ్గరకు పోయి చెప్పమని ఆయన తిప్పికొట్టినట్టు స్వయంగా భద్రిరాజువారే వెల్లడించారు. ఇది ఒక అంతర్జాతీయస్థాయి భాషావేత్త అంకితభావానికి ఒక తార్కాణం.

## ప్రాచీనతా హోదా విషయంలో భద్రిరాజు వారి పాత్ర :

తమిళ రాజకీయపార్టీలతో ఎన్నికల అవగాహన ఫలితంగా తమిళభాషకు ఉదారంగా క్లాసికల్ భాషా ప్రతిపత్తిని కల్పించేందుకు పూనుకొని, కేంద్రప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని నియమించింది. కేంద్రసాహిత్య అకాడెమీ న్యూఢిల్లీ, భారతీయ భాషా కేంద్రం మైసూరు ఈ రెండు సంస్థల అధ్యక్షులతోపాటు ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి, కేంద్రసాంస్కృతిక వ్యవహారాల శాఖ ముఖ్య కార్యదర్శి కేంద్ర గృహ వ్యవహారాల శాఖ కార్యదర్శి, సాహిత్య అకాడమీ కార్యదర్శి కూడా అందులో సభ్యులుగా ఉన్నారు. ఈ కమిటీ బాధ్యత క్లాసికల్ ప్రతిపత్తిని తమిళభాషకు కేటాయించే విషయమై సరళమైన మార్గదర్శకాలు రూపొందించటమే అనేది వేరే చెప్పనవసరం లేదు. అందుకు ప్రమాణార్హతలను నిర్ణయించే బాధ్యతను భాషావేత్త ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారికే

అప్పగించారు. కానీ, భద్రిరాజువారు ఎక్కడా లొంగకుండా తమిళంతోపాటు అన్ని భారతీయ భాషలకూ సమాన న్యాయం జరగాలని భావించారు. 2004, సెప్టెంబరు, 2వతేదీన ఈ కమిటీ సమావేశమైనప్పుడు భద్రిరాజువారు నాలుగు ప్రమాణార్హతలను కమిటీ పరిశీలన కోసం ప్రతిపాదించారు.

1. High antiquity of the early text/recorded history may be 1500-2000 Years: 1500 నుంచీ 2000 సంవత్సరాల కనీస ప్రాచీన చరిత్ర కలిగిన భాష అయిఉండాలి. ఈ సూత్రంలో భద్రిరాజు వారు early texts అనే పదాన్ని may be అనే పదాన్ని చాలా ముందుచూపుతో ప్రయోగించారు. 1500 నుంచి 2000 సంవత్సరాలనాటి ఒక్క అక్షరం దొరికినా ఆ భాషను ప్రాచీనమైనదిగా గుర్తించవచ్చనేది ఆయన భావన. ఇప్పటికి తమిళానికి ఇచ్చినా, భవిష్యత్తులో తెలుగు కన్నడ, ఇతర దేశీయ భాషలకు కూడా దీన్ని వర్తింపచేయవచ్చనే ఊహ ఆయన మనసులో ఉండటమే ఇందుకు కారణం.

2. A body of ancient Literature / Texts which is considered as valuable heritage by generation of speakers. ఆ భాషకు ప్రాచీన పరంపర ఈనాటిదాకా కొనసాగుతూ ఉండాలనేది రెండవ నియమం. ఇది తెలుగు, కన్నడభాషలను ప్రత్యేకంగా దృష్టిలో పెట్టుకొని వాటికి అనుకూలంగా ఏర్పరచిన నియమం.

3. Time literary tradition be original and not borrowed from another speech community. ఆ భాష స్వతంత్రజన్యమైనదిగా ఉండాలి. ఇంకొక భాషా జాతీయులనుంచి ఎరువు తెచ్చుకొన్నది కాకూడదు అనేది మూడవ నియమం.

4. The classical Language and Literature being distinct from modern there may also be a discontinuity between the classical language and its inner forms or its varieties. ఆధునికంగా వ్యవహారంలో ఉన్న రూపానికి ఆ ప్రాచీనభాష భిన్నమైన రూపం కలిగి ఉన్నప్పుడు ఆ రెండు రూపాలమధ్య కాలవ్యవధి ఉండవచ్చుననేది ఈ నాలుగో సూత్రంలో ఒక వెసులుబాటు. పాళీ, ప్రాకృతాలనూ, మళయాళాన్నీ దృష్టిలో పెట్టుకొని ఒక సమదృష్టితో భద్రిరాజువారు ఈ నాలుగో ప్రమాణార్హత ప్రతిపాదించారని మనకు తేలికగానే బోధపడుతుంది.

ఆ సమావేశం మినిట్సులో ఈ నాలుగు సూత్రాలనూ భద్రిరాజువారే సూచించినట్లు రికార్డయి ఉంది. ఈ ప్రాచీనతా గుర్తింపు అనేది భాషకేగానీ ఆ భాషలో వచ్చిన సాహిత్యానికి

కాదు అనే విషయంలో భద్రిరాజు వారికి స్పష్టత ఉంది. కనీసం 1500 నుంచీ 2000 సంవత్సరాల ప్రాచీనత ఒక భాషకు ఉన్నప్పుడే అది విశిష్ట సంపన్న ప్రాచీనభాష అవుతుందనేది ఆయన గట్టి నమ్మకం. అత్యంత ప్రాచీనమైన లిఖిత చరిత్ర కలిగిన ఒక ఉదాత్తమైన భాషని, తరువాతి తరాలకు అనుసరణీయమైన, భాషని క్లాసికల్ భాషగా ఆయన నిర్వచించారు. ప్రమాణార్హతలను కూడా ఈ నిర్వచనాన్ని దృష్టిలో పెట్టుకొనే ఆయన రూపొందించారు.

2008 ఫిబ్రవరి 17, 18 తేదీలలో ద్రవిడ విశ్వవిద్యాలయం, మైసూరు భారతీయ భాషా కేంద్రం, కృష్ణాజిల్లా రచయితల సంఘం సంయుక్తంగా విజయవాడలో తెలుగుభాష -ప్రాచీనత పైన నిర్వహించిన జాతీయ సదస్సుని ఆచార్య భద్రిరాజు వారు ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ, అంతర్గతంగా నిపుణుల కమిటీ సమావేశంలో జరిగిన ఎన్నో విషయాలను సభాముఖంగానే వెల్లడించారు. “ఇవన్నీ అప్లై చేస్తే, ఫలాన భాష క్లాసికల్ లాంగ్వేజి అవుతుందని” వాళ్ళు చెప్పొద్దన్నారు. మీరు నిర్వచనాలు చెప్పండి. ప్రమాణాలు చెప్పండి. ఫలానా భాషకు మాత్రమే ఈ గుర్తింపునివ్వమని మాత్రం చెప్పకండి అన్నారు. ఎందుకంటే, వాళ్ళు చేయదలచుకొన్నది చేస్తే గదా, రాజకీయం?” అన్నారాయన. ఈ విషయాలను ఆయన స్వయంగా వెల్లడించకపోతే బయట ప్రపంచానికి తెలిసే అవకాశం ఉండదు. ఈ నాలుగు సూత్రాలను అనేక దేశీయ భాషలను దృష్టిలో పెట్టుకొని ఎంతో ముందుచూపుతో ఆయన ప్రతిపాదించిన సంగతి అప్పట్లో “వాళ్ళకు” గమనింపు ఉండి ఉండదు.

2004 సెప్టెంబరు 17న కేంద్ర క్యాబినెట్ ఈ తీర్మానాన్ని ఆమోదించి తమిళాన్ని మాత్రం క్లాసికల్ భాషగా ప్రకటించింది. 2004 అక్టోబరు 12న గెజిట్ నోటిఫికేషన్ అయ్యింది. అందులో అత్యంత ఆశ్చర్యకరంగా భద్రిరాజువారి ప్రతిపాదనలను తుంగలో తొక్కి మొదటి ప్రమాణార్హతలో ఉన్న 1500-2000 సంవత్సరాల ప్రాచీనతను 1000 సంవత్సరాలకు కుదించి తమిళభాషకు క్లాసికల్ హోదాని కట్టబెట్టినట్టు ఉంది. నిపుణుల కమిటీ మినిట్సులో ఈ వెయ్యేళ్ళ ప్రస్తావనే లేదు. భద్రిరాజువారి కళ్ళుకప్పి కేంద్రప్రభుత్వ పెద్దలు స్వతంత్ర నిర్ణయం తీసుకొన్నారన్నమాట. ఈ చర్య భద్రిరాజువారిని ఎంతో బాధించింది.

"తమిళాన్ని ఇలా గుర్తించారు. అప్పుడింకా సంస్కృతాన్ని గుర్తించలేదు. తర్వాత ఎవరో చెప్పారు. అయ్యా సంస్కృతాన్ని మీరు ఇప్పటివరకూ చెయ్యలేదుకదా.... మరి, తమిళాన్ని చేస్తే సంస్కృతం సంగతి ఏమవుతుందీ అని! అప్పుడు వీళ్ళు సంస్కృతాన్ని కూడా క్లాసికల్ భాష అన్నారు. ఇంత అయోమయంగా జరిగిందిది. అక్కడ దయానిధి మారన్‌గారు ఉండి, ప్రధానమంత్రిగారికి ఉత్తరాలు రాస్తుండేవారు. ఇది కేవలం రాజకీయమైంది" అన్నారాయన. దయానిధి మారన్ 2005లో జనవరి 27న మార్చి 22న ప్రధానికి ఉత్తరాలు రాసినట్టు విశ్వసనీయంగా తెలుస్తోంది. Revise the antiquity criteria from over 1000 years early texts/recorded history- to over 2000 years" అనీ, అలాగే declare Sanskrit also as a classical language along with Tamil. దేశంలోని ఇతర భాషలకు క్లాసికల్ హోదా ఇవ్వాలంటే ఈ వెయ్యేళ్ళ కాలపరిమితిని 2000 సంవత్సరాలకు పెంచాలనీ, తమిళంతోపాటు సంస్కృతానికి కూడా ప్రాచీనతా హోదా ఇవ్వాలనీ కరుణానిధిగారు కోర్తున్నారనేది ఈ ఉత్తరాలలో సారాంశం.

ప్రపంచం గుర్తించిన సంస్కృత భాషకు తమిళం తరువాత అదికూడా కరుణానిధిగారు దయతలచి ఇవ్వమన్న తరువాతనే భారతప్రభుత్వం ఇవ్వగలగటం ఒక విచిత్రం. భాషల మధ్య చిచ్చురగిల్చే ఈ ధోరణిని భద్రిరాజువారు నిర్ద్వంద్వంగా ఖండించారు. సంస్కృతాన్ని క్లాసికల్ భాషగా గుర్తించవలసిందిగా ఎవరూ అడగలేదు. ఈ గుర్తింపు ప్రభుత్వాలు చేసే పనికాదు. స్కాలర్స్ చేయవలసినది. సంస్కృతం క్లాసికల్ భాష ఎందుకయ్యింది...? క్లాసికల్ లక్షణాలు అందులో ఉన్నాయి కాబట్టి అయ్యింది" అన్నారాయన.

ప్రాచీనతే కొలబద్ద అనుకొంటే, తెలుగుభాష నిస్సందేహంగా 3000 ఏళ్ళక్రితం నాటిదని భద్రిరాజువారు ఈ సందర్భంగా నొక్కి చెప్పారు. "శాతవాహనుల కాలంనుంచే శాసనాలలో తెలుగు మాటలున్నాయి. టెక్స్ట్ అంటే, సాహిత్యమనేకాదు, రికార్డెడ్ హిస్టరీ... వేల సంవత్సరాల చరిత్ర ఉంది. తెలుగు, గోండి కొండ, కూయి, కువి, పెంగో, మంద... ఇవి ఒక శాఖ. తమిళం కన్నడం, మళయాళం ఇదొక శాఖ. ఈ రెండు శాఖలు క్రీ.పూ. పదో శతాబ్దిలో విడివడ్డాయి..." "ఇప్పుడు మనం ఆధునిక తెలుగుభాషకు ఏ లక్షణాలు ఉన్నాయని అనుకొంటున్నామో ఆ లక్షణాలన్నీ నన్నయకు ముందే తెలుగుభాషకు ఏర్పడ్డాయి. ఏడో శతాబ్దిలోనే బండీ "ఱ" మామూలు "ర"తో కలిసిపోయింది. ఏఱు ఏటి అవుతుంది. ఊరు ఊరి అవుతుంది కానీ ఊటి కాదు. క్రావడి ఉన్న అంశాలు

కొన్ని అప్పటికే తెలుగులో వచ్చేశాయి. తమిళం కన్నడాలలో "మరన్" అని ఉంది. తెలుగులో మ్రాను అయ్యింది. గోది, కుయి, మాంద వీటన్నింటిలో కూడా అట్లా మారిపోయింది. అంటే మొదటి రెండక్షరాలూ టెలిస్కోపయినాయి. మ్రాను, క్రొత్త, ప్రాత ఇలాంటి శబ్దాలు క్రీస్తుపూర్వంనుంచే ఏర్పడ్డాయి. నన్నయ కాలానికే చాలావరకూ మార్పు వచ్చేసింది" అని వివరించారు.

ఏది ఏమయినా ఎంత రాజకీయ చాతుర్యం ప్రదర్శించినా, కరుణానిధి పుణ్యమా అని, తమిళం వెయ్యేళ్ళ ప్రాచీన భాషగానూ, తెలుగు కన్నడాలు 2000 ఏళ్ళ ప్రాచీనభాషలుగానూ గుర్తింపుపొందాయి. నైతికంగా తమిళులు ఈ విధంగా గొప్ప చారిత్రాత్మక తప్పిదాన్ని చేసుకున్నారు. భాషాభివృద్ధి చేయటానికి క్లాసికల్ భాష అయి ఉండాలనే నియమం పెట్టడాన్ని అందుకోసం భాషా రాజకీయాలు నడపటాన్ని భద్రిరాజువారు ఇష్టపడటంలేదు. ప్రమాణార్హతల రూపకల్పన విషయంలో భద్రిరాజువారు ఇలా చెప్పారు. "నేను దీంట్లో చిన్న కిటుకు పెట్టాను. High antiquity of the early texts అనేచోట, "Texts" అని ఇలా ఎందుకు పెట్టానంటే తెలుగు, కన్నడం కూడా దీనికిందకు వస్తాయని! దీనికోసమే పెట్టి తరువాత వాళ్ళకి నేనొక నోట్ రాశాను. భాషాశాస్త్రప్రమాణాలను బట్టి తెలుగులో మొట్టమొదటి సాహిత్యగ్రంథం ఐదు లేక ఆరు శతాబ్దాలలోనే వెలువడి ఉండాలని చెప్పాను. ఈ ప్రమాణాలలో శాస్త్రీయత ఉంది. తెలుగుసాహిత్యం ఎంతో ముందు ఉండి ఉంటుందని నేను ఈ కమిటీవాళ్ళకు చెప్పాను. తర్వాత ఇంకొకాయన వచ్చారు. ఒక పెద్దమనిషి-నేను పేరు చెప్పను-ఆయనొచ్చి అది అట్లా కాదండీ, తీసెయ్యాలి. మీరు రాసింది తీసేసి 2000 సంవత్సరాల సాహిత్యం అని అనాలి-అన్నారు. నేను అందుకు అంగీకరించలేదు. ప్రభుత్వం కూడా ఈ పదాన్ని మార్చలేదు. నేను రాసింది అలానే ఉంది. ఈ నాటికీ కూడా" అని తదనంతర పరిణామాలను ఆయన వివరించారు. ఇక్కడ ముఖ్య విషయం ఒకటుంది. భద్రిరాజువారు పంపిన నోట్ చాలా శక్తిమంతంగా పనిచేసింది. ఆ నోట్‌లో ఆయన ముఖ్యమైన 3 అంశాలను ప్రస్తావించారు.

1. తెలుగు కన్నడం, మళయాళం మూడు భాషలూ క్లాసికల్ ప్రతిపత్తిని పొందటానికి అర్హమైనవే!

2. సంస్కృత ప్రభావం ఉన్నది కాబట్టి తెలుగు కన్నడ మళయాళ భాషలకూ ఈ హోదాని ఇవ్వరాదనటం తప్పు. సంస్కృత ప్రభావం తమిళభాషమీద కూడా గణనీయంగా ఉంది. తొల్కాప్యం అంటే తొలికావ్యం. ఇది సంస్కృత పదమే!

3. I recommend that besides Sanskrit, Pali, Prakrit and Tamil, the Government of India should recognize the above three languages- Telugu, Kannada and Malayalam as classical languages. Otherwise they will be hurting the feeling of 3/4th of the speakers of the Dravidian languages.

భద్రిరాజువారి నోట్ అందిన అనతికాలంలోనే కేంద్రప్రభుత్వం వేగంగా స్పందించి తెలుగు కన్నడ భాషలకు క్లాసికల్ హోదాని ప్రసాదించింది. దీనివెనక జరిగిన ప్రజాపోరాటాలు, భాషోద్యమ కార్యక్రమాలు, రాజకీయ వత్తిళ్ళు ఎన్ని ఉన్నప్పటికీ, ఒక అంతర్జాతీయ భాషావేత్త గట్టి ప్రతిపాదనతోనే ఈ విజయం సాధ్యమయ్యిందనేది వాస్తవం. తెలుగుజాతి భద్రిరాజు వారిని ఉదయాన్నే తలచుకొని దణ్ణమెట్టుకోవాలి. మనకోసం భాషకోసం ఆయన చేసిన కృషి అంతటిది.

ప్రాచీన గురుకులపద్ధతిలో కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో సంస్కృత శాఖాధిపతి ముర్రే బార్ సన్ ఎమెనూ దగ్గర భద్రిరాజువారు భాషాశాస్త్రంలో "Telugu verbal bases, a comparative and descriptive study" అనే అంశంపైన పి. హెచ్. డి పూర్తిచేశారు. 1962లో మాండలిక వృత్తిపదకోశం, వ్యావసాయిక పదాల నిఘంటువులకు సంపాదకత్వం వహించారు. 1967లో "Dravidian Nasals in Brahui" అనే అంశంమీద Comparative Linguistics భాషా శాస్త్ర విభాగంలో ఆయన వెలువరించిన వ్యాసం సంచలనం అయ్యింది. 1972లో తిక్కన పదప్రయోగకోశం మాండలిక వృత్తిపదకోశం రెండవభాగం చేనేత పదప్రయోగాలు వెలువరించారు. 1975-76 సంవత్సరంలో Centre for Advanced study in Behavior science-Stanford University భద్రిరాజువారిని Resident fellow గా నియమించింది. అబ్బూరివారి సలహా మేరకు భాషాశాస్త్ర పరిశోధన వైపు ఆయన దృష్టి మళ్ళింది.

1949-61 ఆంధ్రవిశ్వవిద్యాలయం అసిస్టెంట్ ప్రొఫెసరుగా 1960-61 కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం రీడరుగా, 1961-62 వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో రీడరుగా ఆయన్ కెరీర్ ప్రారంభం అయ్యింది. 1962లో ఉస్మానియా విశ్వ విద్యాలయంలో

భాషాశాస్త్ర విభాగం ఆయనతోనే ప్రారంభమయ్యింది. దాని తొలి అధ్యక్షుడిగా ఎందరో తెలుగు భాషావేత్తలు రూపొందటానికి ఆయన కారకులయ్యారు. 1986లో హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం ఉపకులపతిగా రెండుమారులు పనిచేశారు. 1993-99 హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం, 2003లో ఆంధ్రవిశ్వవిద్యాలయం గౌరవ ఆచార్య పదవులను నిర్వహించారు. 1967 మిచిగాన్ విశ్వవిద్యాలయం, 1967, 1970 కార్నెల్ విశ్వవిద్యాలయం, 1974లో ఆస్ట్రేలియన్ నేషనల్ విశ్వవిద్యాలయం, 1982 టోకియో విశ్వవిద్యాలయం, 1983లో పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయం, 1995లో టెక్సాస్ విశ్వవిద్యాలయాలలో ఆయన విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఉన్నారు. జర్మనీలోని లీప్జిగ్ ఇవల్యూషనరీ యాంధ్రపాలజీ సంస్థలో కూడా ఆచార్యులుగా వ్యవహరించారు. 1970లో "లింగ్విష్టిక్ సొసైటీ ఆఫ్ ఇండియా" కూ, 1980లో ద్రవిడియన్ లింగ్విష్టిక్స్ అసోసియేషన్‌కూ ఆయన అధ్యక్షుడిగా వ్యవహరించారు. 1975లో హవాయి విశ్వవిద్యాలయం విశిష్ట భారతీయ పరిశోధకుడి పురస్కారం అందించింది. 2004లో సాహిత్య అకాడమీ ఫెలోగా ఆయన గౌరవం పొందారు. 1990-2002 వరకూ కేంద్రసాహిత్యఅకాడమీ కార్యవర్గసభ్యులుగా పనిచేశారు. 1998లో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, 2007లో ద్రావిడ విశ్వవిద్యాలయం ఆయనను గౌరవ డాక్టరేట్లతో సత్కరించాయి. 2008లో సిపి బ్రౌన్ అకాడెమీ తెలుగుభారతి తొలి పురస్కారాన్ని అందించింది. ఆటా, తానాలాంటి సంస్థలు వీరిని పురస్కారాలతో గౌరవించాయి.



# ఆగమేఘాలు

మనం చాలా మాటల్ని వాటి అర్థాలు తెలియక పోయినా ఏదో ఒక రీతిగా ప్రయోగిస్తుంటాం, వీలైతే కొత్త అర్థాల్ని కూడా సృష్టించే ప్రయత్నాలు చేస్తూంటాం. భాష పెరగాలంటే ఈ మాత్రం ప్రయత్నాలు జరగాలి. కానీ, పండితులు సృష్టించే పదాల కన్నా పామరులు సృష్టించే పదాలకే వాడకం ఎక్కువగా ఉంటుంది.

ఒక పదాన్ని ఒక అర్థంలో సృష్టించినప్పుడు అది ఆ భాషలో ఇమిడిపోయి ఒదిగిపోవాలి. ఉదాహరణకి నేపాలీ నిఘంటువులో 'మసాలా' గురించి వెదుకుతుంటే కొన్ని కొత్త అర్థాలు కనిపించాయి. ఈ పరీక్షల్లో పాసవటానికి ఏదైనా మసాలా (దగ్గర దారి) ఉందా?" అనే ప్రయోగం వాటిల్లో ఒకటి! "reriyomaa masalaa siddiy – ఈ రేడియోలో మసాలా చచ్చిపోయింది" అంటే, రేడియోలో బ్యాటరీ అయిపోయిందని! కూరకు మసాలా లాగా, రేడియోకి బ్యాటరీ ప్రాణప్రద మైందని అనటం వలన ఒక కొత్త పదం కొత్త అర్థంలో నేపాలీ 'దేశ్య' పదంగా మారిపోయింది. ఆగమేగాలు కూడా ఇలా ఏర్పడిన తెలుగు దేశ్యపదమే!

కొంతమంది కవులు 'ఆఘమేగాలు' అని ఒత్తు 'ఘ' తో పలుకుతుంటారు. ఆఘమేఘాల మీద రావటం అంటే, చాలా వేగంగా రావటమేనని భావార్థం.

ఇంకొందరు ఆగమేఘాలు అని పలుకుతుంటారు. పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్ "రఘువంశ సుధాంబుధి చంద్రశ్రీ / రామరామ రాజేశ్వర" అనే కీర్తన అనుపల్లవిలో "ఆగమేఘ మారుత శ్రీకర/ఆసురేశ మృగేంద్ర వినుత శ్రీ" అంటాడు. సంస్కృతార్థంలో దీనికి ఇలా విశ్లేషణ చేయవచ్చు: 'ఆగంతుకం' అంటే చెప్పాపెట్టకుండా రావటం. అలా

వచ్చేది ఆగంతువు. వచ్చేవాడు ఆగంతుకుడు. వచ్చింది ఆగతం. ఆ రాక మంచికే అయినప్పుడు పాజిటివ్ అర్థంలో వేగంగా వచ్చే వానాకాలపు మేఘాల్ని ఆగమేఘా లంటారు. అలా వచ్చే వాళ్లని ఆగమేఘాలమీద వచ్చినట్టు భావిస్తారు. వేగంగా, శీఘ్రంగా, వెనువెంటనే రావటాన్ని ఆగమేఘాలమీద రావటం అంటారు.

అంతకు మునుపు లేనిదీ, ఇప్పుడు కొత్తగా వచ్చింది 'ఆగం'! అందుకే శాస్త్రాన్ని innovative అనే అర్థంలో 'ఆగమం' అని పిలుస్తారు. పాతది పోయి కొత్తది రావటాన్ని 'ఆపాయం' అంటారు. ఆగమ ఆపాయాలు శాస్త్రాభివృద్ధికీ, శాస్త్ర ప్రమాణాలకూ కారణా లౌతాయి. ఆ వచ్చిన మేఘాలు చాలా ప్రామాణికమైనవనేది అంతరార్థం.

ఇది ఆగ శబ్దానికి గల సంస్కృతార్థాన్ని బట్టి ఏర్పడిన పదం. కానీ, ఒక తెలుగు జాతీయానికి సంస్కృతార్థం ఎందుకు చెప్పుకోవాలి...? దేశీయపదాలతో ఏర్పడినవే ఆ భాషలో జాతీయాలౌతాయి. ఇతర భాషల్లో ఏర్పడేవి తెలుగు జాతీయాలు కాలేవు కదా!

అందుకని తెలుగు పామరులు తమ జాతీయాల రూపకల్పనకు తెలుగు పదాలనే ఎంచుకుంటారని గుర్తించి తెలుగులో వాటి వ్యుత్పత్తి అర్థాలను సాధించే ప్రయత్నం చేయాలి.

పోతనగారు "....ఆగడపలం గడప వైచి వీచీ రేఖలం బోద్రోచి కుసుమనారాచు కేళాకూళిం గలజాళు వాసోపనంబులఁ బ్రతిఘటించు..." అంటూ 'ఆగడప'లను ప్రస్తావించాడు. 'ఆగడప'లంటే మేఘాల దొంతరలు. ఆకాశంలో ఆగడపలు వచ్చాయంటే ఇవ్వాళో రేపో వానలు కురుస్తాయని రైతులు భావిస్తారు. ఆగడప ఒక చక్కని తెలుగు మాట. బహుశా ఆగ అడపఆగడప అయి ఉండొచ్చు. అడప అంటే దొంతరగా పేర్చినది. కిళ్ళీలు కట్టటానికి, తాంబూలం వేసుకోవటానికి ఆకుల్ని మధ్య ఈనెలు తీసి, దొంతరగా పేరుస్తారు కాబట్టి, అడప శబ్దం తాంబూలానికి స్థిరపడి ఉండవచ్చు.

మేఘాలన్నీ అడపలు (దొంతరలు) తీరి ఉన్నప్పుడు వాటిని 'ఆగడపలు' అన్నారు. ఇక్కడ 'ఆగ' శబ్దం మేఘం అనే అర్థంలో కనిపిస్తుంది. నిఘంటువుల్లో ఎక్కడా ఈ అర్థం లేనప్పటికీ ఆగడపలు మాత్రం ఈ అర్థాన్నే ఇస్తున్నాయి. ఆగమేఘాలు అన్నప్పుడు ఆగ, మేఘ రెండూ ఒకే అర్థంలో జంట పదాలుగా కనిపిస్తాయి. తట్టాబుట్టా, నగానట్రా లాంటి జంటపదాలు ఆగమేఘాలు కావచ్చు. ఇది ఒక విశ్లేషణ. దీని ప్రకారం ఆగమేఘాలు అనే పలకాల్సి వుంటుంది. మేఘాల దొంతర అని దీని భావం. దీనికి ఇంకో అర్థాన్ని కూడా సాధించవచ్చు :

'మేగు' లేదా మ్రేగు శబ్దానికి to smear, be smear. పూయు, దళముగా పూయు, దట్టముగా చరుము, దళసరిగా మెత్తు అనే అర్థాలు కనిపిస్తాయి. "పెన్నలుపు మించి కందెన మేగినట్టున్ననూనె మెగమున చీకట్లు ముడివడ' అనే ప్రయోగంలో మేగ శబ్దానికి to surround, ఆవరించు అనే అర్థాలు కనిపిస్తున్నాయి. తెలుగులో 'ఆగం' అంటే మేఘం. దట్టంగా ఆవరించటాన్ని మేగటం అంటారు. ఆగమేగాలంటే అప్పటికప్పుడు పెన్నల్లగా కమ్ముకున్న కారు మబ్బులు. వీటిని 'క్యుములోనింబస్' మేఘాలు అంటారు. మండు వేసవిలో శక్తివంతమైన వేగవంతమైన ఇలాంటి కారుమబ్బులు కనిపిస్తుంటాయి. తొలకరికి ఉరుములు మెరుపులతో హడావిడి చేస్తూ, ఆగడపలు వేసుకుంటూ వస్తాయి. సమృద్ధిగా వానలిచ్చి పోషిస్తాయి. ఆ సమయానికి 'ఆగమేగం'లా వచ్చి ఆదుకున్నాడనేది ఈ జాతీయానికి భావార్థం. ఇది స్వచ్ఛమైన తెలుగు అర్థంలో కుదిరిన స్వచ్ఛమైనతెలుగు మాట. వీరోచితమైన రీతిలో గంభీరంగా వచ్చి సాయపడటం అనే అర్థంలో "ఆగమేగాలు" అనే మాట కన్పిస్తుంది.

ఇక్కడే మరో ముఖ్యమైన విషయం చెప్పాలి. 1930లో నైజీరియలో జరిగిన తిరుగుబాటులో అహేబీ అనే ఒక స్త్రీ, వలస వాదులపై చేసిన పోరాటానికి గుర్తుగా ఆ భాషలో ఆమెని "ఆగమేగ" అని పిలిచారట. ఆడపులి అని దీని అర్థం.

నైలూ నుండి కృష్ణదాకా తెలుగు భాషామూలాలు వ్యాపించాయనే సిద్ధాంతానికి ఈ 'ఆగమేగ జాతీయం' ఒక సాక్ష్యం. ఆఫ్రికా భాషల్లో ఈ జాతీయాన్ని వేగంగా దూసుకొచ్చి గెలుపు సాధించటం అనే అర్థంలో ఉపయోగిస్తున్నారు. తెలుగులో కూడా ఆగమేగాలు ఇలానే ఉపయోగిస్తున్నాయి.



# ఝషభష - శషభిష

"ఝషభషలైన కొన్ని యపశబ్దములన్ కృతిఁజెప్పి కావ్య పౌ
రుషములకొళ్ళుగట్టుకొని రూఢికి నెక్కదలంచి శేముషీ
ధిషణులమంచు వాదులకు దియ్యముగగాఁ గవులాడు వాక్యముల్
విషకబళంబుఁగా దలఁచి వీనులఁబెట్టరు సత్కవీశ్వరుల్"

దక్షిణాంధ్ర యుగంలో అంటే 16-17 శతాబ్దాలలో తంజావూరులో పుట్టిన తెలుగు సాహిత్యం మొదటి దశ తెలుగువారైన నాయకరాజుల కారణంగా వర్థిల్లితే, రెండవదశ మరాఠారాజుల కారణంగా వర్థిల్లింది.

అది మౌలికంగా తమిళరాజ్యం అయినప్పటికీ ఈ మరాఠారాజులు తెలుగు నేర్చుకుని అచ్చతెలుగులో చక్కని తెలుగు సాహిత్యాన్ని సృష్టించారు. శాహాజీ, వెంకోజీ, శరభోజి, తులజాజి... ఇలా చాలామంది మరాఠారాజులు తెలుగులో కావ్యాలు, యక్షగానాలు, వీథినాటకాలతోపాటు అనేక అనేక రామాయణాలు కూడా ఆ కాలంలో వెలిశాయి.

తొలి మరాఠా తెలుగుకవి శాహాజీ (శాహ్ ప్రభువు) చాలా రచనలు చేశాడు. 'భక్తవత్సలవిలాసం' అనే నాటకం వాటిలో ఒకటి. తంజావూరులోని సరస్వతీ గ్రంథాలయంలో ఈ నాటక ప్రతి ఉంది. దీని ప్రారంభంలో సూత్రధారి మహిషాసురమర్దినికి కేలుమోడ్చిన తరువాత కుకవుల్ని తిడుతూ ఈ పద్యం వ్రాశాడు.

"ఝషభషలైన కొన్ని అపశబ్దాల్ని యథేచ్ఛగా ప్రయోగిస్తూ అది తమ కావ్యపౌరుషం అంటూ, వాటిని రూఢికి తెచ్చి కీర్తిని కొట్టేయాలని చూసేవాళ్ళ రచనల్ని విషపు ముద్దలుగా భావిస్తారు సత్కవీశ్వరులు" అని ఈ పద్యభావం.

"ఝషభషలైన అపశబ్దాలు" అంటే ఏమిటి? ఝష అనే సంస్కృత పదానికి బీర, చేప, అడవి, మొసలి అనే అర్థాలున్నాయి. 'ఝష నయని' అంటే చేపవంటి కన్నులు గల స్త్రీ అని! సంస్కృతంలో భష, భషకం అంటే కుక్క 'ఝష' అని వ్రాయాల్సిన చోట 'భష' అని వ్రాసి, ఇదికూడా ఆ అర్థమే అని దబాయించేవాళ్లని ఈ పద్యంలో నిందించాడు శాహప్రభువు. వ్రాయడం అన్నా – రాయడం అన్నా ఒకే అర్థం అని దబాయించటం ఝషని – భష అనటంలాంటిదే అని దీని భావార్థం.

అలా వ్రాసినందువలన భాషకు ఒరిగేది గానీ, భాష పెరిగేది గానీ ఏమీ ఉండదు. కేవల నాజూకుతనం నాణ్యతకు ప్రమాణం కాబోదు. మాట్లాడే లేదా వ్రాసే ప్రతి అక్షరం ఎందుకోసం ఉద్దేశించామో ఆ ప్రయోజనాన్ని అది నెరవేర్చాలి. అమృతాంజనాన్ని రాస్తారు. అక్షరాన్ని వ్రాస్తారు. రెండింటికీ వేర్వేరు వర్ణాలు ఉండగా వాటిని వాడుకోవటానికి నామోషి దేనికీ?

కన్యాశుల్కం నాటకంలో 'శషభిష' కూడా ఇలాంటి ప్రయోగమే! గిరీశం తన శిష్యుడికి చదువుచెప్పే నెపం మీద అగ్రహారంలో తిష్టవేయాలని ఎత్తువేస్తాడు. అతన్ని చూడగానే శిష్యుడి తండ్రి అగ్నిహోత్రావధాన్లు ఆ విషయం పసిగట్టేస్తాడు. 'ముక్కోపికి ఉండనే ఉంది మందు ముఖస్తుతి' అనే ఆర్యోక్తి ప్రకారం... పొగడ్తల దండకం ఎత్తుకుంటాడు గిరీశం. "మీలాంటి చప్పన్న భాషలూ వచ్చిన మనిషి యక్కడా లేడనీ, సంస్కృతం మంచినీళ్ల ప్రవాహంలా తమరు మాట్లాడతారనీ, తమలాంటి విదూషకుణ్ణి యక్కడా చూళ్లేదనీ డిప్యూటీ కలక్టరుగారు శలవిస్తూండేవారు. కవితారసం ఆయన్లా గ్రహించేవారేరీ? నా కవిత్వమంటే ఆయన చెవికోసుకుంటారు. మహారాజావారి దర్శనం కూడా నాకు చేయించారండి..." ఇలా మాట్లాడతాడు గిరీశం.

గిరీశం పొగడ్తలకు అగ్నిహోత్రావధాన్లు ధుమధుమలాడతాడు "ఈ శషభిషలు నాకేం పనికిరావు. యితడి వైఖరి చూస్తే యిక్కడే బసవేసేటట్టు కనపడుతూంది. మాయింట్లో భోజనం యంతమాత్రం వీలుపడదు..." అనేస్తాడు.

ఇక్కడ శషభిషల్ని శుష్కపొగడ్తలనే అర్థంలో గురజాడవారు ప్రయోగించాడు. అవి పొగడ్తలైనా, వాగ్దానాలైనా, ప్రసంగాలైనా సారం లేదా రసం లేకపోతే శుష్కంగా ఉంటాయి. పరమ భయానక రాక్షసుడిలా కనిపించే వ్యక్తిని చంద్రబింబంలాంటి మోము, మల్లెపువ్వులాంటి మనసు అని పొగిడ్తే అవి శషభిషలన్నమాట.

'ఝషభష' అనే సంస్కృతపదమే తెలుగులో శషభిషగా మారి ఉంటుందా? శషభిషల్లేకుండా చెప్పడం అంటే సందేహాతీతంగా చెప్పడం అనే అర్థంలో ఈ పదాన్ని ప్రస్తుతం ఎక్కువగా వాడుతున్నాం. ప్రధాన నిఘంటువుల్లో శషభిష, ఝషభషలకు అర్థాలు లేవు. దివాకర్ల రామభాస్కరంగారు సంకలనం చేసిన తెలుగు ప్రాసపద నిఘంటువులో మాత్రం 'శషభిష' అంటే ఘూంథాం అనుట అని, 'ఝషభష' అంటే పలుకలేని మాట అనీ అర్థాలు వ్రాశారు. ఒక నిర్దిష్టమైన అర్థం లేనప్పుడు ఎవరికి తోచిన అర్థాన్ని వాళ్ళు చెప్పుకోవటం సహజం.

తెలుగులో 'బిస' అంటే గడియారంలో ఉండే (స్ప్రింగు)కీలు, యంత్రం అనే అర్థాలతోపాటు సులువైన ఉపాయం అనికూడా ఉంది. "అచ్చటం గ్రుచ్చికానరాకుండ మునుమున్న మృగయుండు బిసయొడ్డి సంఘటించిన కాలి బోనులంబడి" లాంటి కవిప్రయోగాలు ఉపాయం పన్నటం అనే అర్థంలో ఉన్నాయి. 'బిసి' అంటే, గట్టిగా బిగించి కట్టటం. బిసిబిసి మాటలు అంటే పిల్లలు మాట్లాడే తొకతొక పలుకులు.

క్రీ.పూ. 5-4 శతాబ్దాలనుండీ క్రీ.శ 5-6 శతాబ్దాల వరకూ తెలుగు నేలమీద ఆంధ్రం, ప్రాకృతం, పాళీ భాషలమధ్య పదాల రాకపోకలు బాగా విస్తృతంగా జరిగాయి. ప్రాకృతం, పాళీ, సంస్కృతం భాషలు మాట్లాడేవారితో తెలుగు ప్రజలకు సాన్నిహిత్యం పెరిగినకొద్దీ ఆయా భాషల్లోని శ, ష వర్ణాలతో కూడుకున్న పదాలు తెలుగులోకి రావటం ఎక్కువైంది.

సంస్కృతంలో శ, ష, స, హ వీటిని ఊష్మాలంటారు. శ, ష రెండు అక్షరాల్నీ తెలుగులో 'స'గానే మన పూర్వులు పలికారు. దోషం - దోసం గానూ, దోశ - దోసె, దోసియగానూ ఇప్పటికీ పలికే అలవాటుంది. క్రమేణా శ, షలను తెలుగీకరించుకున్నాం. 'చేసినాడు, వ్రాసినాడు, పోసినాడు, తీసినాడు ఇలాంటి మాటలకు 'యా' చేర్చి, 'చేశాడు', 'రాశాడు', 'పోశాడు', 'తీశాడు' అని పలికేందుకు, వ్రాసేందుకూ దీనివలన సానుకూలత ఏర్పడింది. తెలుగుభాషలో 'శ-ష బిస' (పట్టు) పెరిగింది. కానీ, 'అన్నప్రాశన' ని 'అన్నప్రాసనం' అన్నట్టుగా, సకారాన్ని శ-షలతో 'యా' అని పలకటం ఇష్టంలేని పండితులు రాశాడు, చేశాడు లాంటి ప్రయోగాలను అపభ్రంశాలుగానూ, అప్రాచ్యపు మాటలుగానూ భావించబట్టే, "ఇలాంటి శషభిషలు నాకు గిట్టవు" లాంటి ప్రయోగాలు ఏర్పడ్డాయి.

మనం అనుకుంటాం గానీ, రైలు రోడ్డు లాంటి ఆంగ్ల పదాల్లాగానే చాలా సంస్కృతపదాలు తెలుగులో తెచ్చి అంటించినట్టే ఉంటాయి. అతుకు అతుకే! శ-షలను

తెలుగు వర్ణమాలలో కలుపుకున్నాం కాబట్టి, ద్రావిడ సూత్రాలకు అనుగుణంగా వాటిని తెలుగులో మాట్లాడినట్టు వ్రాయటం సాధ్యం అయ్యింది.

bank, mat, rat లాంటి మాటల్ని 'యా' అని వ్రాయటానికి సంస్కృతంలోనూ, తెలుగులోనూ వేరే వర్ణం లేదు. ఇంగ్లీషువాళ్లకీ లేదు. ఇంగ్లీషులో 'A' ని 'అ' గానూ, 'ఎ'గానూ, 'య' గానూ మూడువిధాలా పలుకుతారు. మన వర్ణాలను అలా వేర్వేరు రీతుల్లో పలికే సాంప్రదాయం మనకు లేదు. అందువలన బాంకు, బ్యాంకు, బ్యాంకీ, బేంకు ఇలా వ్రాయాల్సి వస్తుంది.

మనవి కాని పదాలను వ్రాయటానికి మన భాషలో తగిన వర్ణాలు ఉండి తీరాలని ఎక్కడుందీ?

సంస్కృతం విషయంలో వర్ణమాలను మనం సంస్కృతానికి సంబంధించినవే వాడుతున్నాం కాబట్టి, సంస్కృత పదాలు వ్రాయాల్సి వచ్చినప్పుడు ఱ, ఋ, ౠ ఇలాంటి వర్ణాలున్న సంస్కృతపదాలను వ్రాయటానికి మన వర్ణమాలలో అక్షరాలను కూర్చుకోగలిగాం. ఇంగ్లీషు, ఫ్రెంచి, జెర్మనీ లాంటి విదేశీ భాషాపదాలను ఉచ్చారణకు తగ్గట్టుగా తెలుగులో వ్రాయాల్సి వచ్చినప్పుడు అదనపు అక్షరాలను వర్ణమాలలో చేర్చవలసివస్తుంది. అది భాషను పెంచుకోవటానికే! దాన్ని భాషను అమ్ముకోవటంగా ఎవరైనా భావిస్తే పొరబాటే.

క్రీ.శ. 7-10 శతాబ్దాల మధ్యకాలంలో ఆంధ్రభాషా స్వరూపంలో పెనుమార్పులు వచ్చాయి. ణ, ళలు న, లగా మార్పుచెందాయి. ఱ, ర రెండూ సంకరం కావటం ప్రారంభమయ్యింది. సంస్కృతపదాలలో ఋకారాన్ని రికారంతో పలకటం మొదలయ్యింది. ఇదే అలవాటు ఋగ్వేదాన్ని రిగ్వేద - Rigveda అనటానికి కారణం.

ఱ, ఋ, ౠ వర్ణాలతో అచ్చతెలుగు మాటలుండవు. అవి సంస్కృతపదాలే! వాటిని తెలుగులో వ్రాయటానికి మాత్రమే ఆ వర్ణాలు ఉపయోగపడతాయి. సంస్కృతపదాన్ని తెలుగులో వ్రాస్తున్నప్పుడు ఱ కు బదులుగా ర వ్రాస్తే అది నాజూకుదనం కావచ్చునేమోగానీ, తెలుగుభాషకు ప్రయోజనకరం కాబోదు.

ఇతర భాషాపదాలను వ్రాయటానికి కొత్తకొత్త వర్ణాన్ని సృష్టించగలగాలి. కంప్యూటరు లిపిని తయారుచేసే వారందరూ కలిసివస్తే అది సాధ్యమే!

# అగచాట్లు

నానా అగచాట్లూ పడితేగానీ జీవనం గడవని స్థితి గురించి మనం మాట్లాడుకుంటూనే ఉంటాం. అగచాట్లు అనేది అచ్చతెలుగు మాట. ప్రాచీన పదం కూడా. ఈ అగచాట్లు పుట్టుపూర్వోత్తరాల గురించి కొంత చర్చ చేద్దాం.

కన్నడభాషలో అగచు, అగుచు, అగుసు అంటే గట్టిగా అదిమిపట్టి లేదా నొక్కిపెట్టి ఉంచటం, గట్టిగా పట్టుకోవటం అనే అర్థాలున్నాయి.

“అగచు+అటు = అగచాటు = కష్టాలు, ఆపదలు. ఈ నిరూపణలో ‘అటు’ అనే నుడి గురించి కొంత చర్చ చేయబోయేముందు తెలుగువారి ప్రాచీనతను దాటే ప్రాకృత భాషలోని ఈ ఉదాహరణను పరిశీలించండి.

**పియమహిళా సంగామే సుందరగత్తేయ భోయణీ రొద్దే**
**అటుపుటురటుం భణంతే ఆంధ్రేకుమారో సలోయేతి.**

తెలుగువారి సాంఘిక చరిత్రలో తెలుగువారి వ్యక్తిత్వాన్నీ, తెలుగుమాటల్నీ వర్ణించిన అత్యంత ప్రాచీనమైన ఆధారం బహుశా ఇదే కావచ్చు. ఇది క్రీ.శ. తొలి శతాబ్దాలకు చెందిన ఉద్యోతనుడు అనే కవి ప్రాకృతభాషలో వ్రాసిన ‘కువలయమాల’ కావ్యంలోది.

ఈ ప్రాకృతానికి పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ఇలా తెలుగు చేశారు. “అందగత్తెలన్నా యుద్ధరంగమన్నా సమానంగా ప్రేమించేవాళ్ళు, అందమైన శరీరాలు గలవాళ్ళు, తిండిలో దిట్టలు అయిన ఆంధ్రులు ‘అటు’, ‘రటు’ అనుకొంటూ వస్తుండగా చూచాడు” అని ! డా. జి.వి. సుబ్రహ్మణ్యంగారు “తెలుగుతల్లి” కవితా సంకలనంలో దీన్ని చేర్చారు.

తెలుగువాళ్ళు ఎంత సరసులో అంత యుద్ధజీవులనీ, చూడచక్కగా ఉంటారని, దేహపుష్టితోపాటు తిండిపుష్టి కూడా కలిగిన వాళ్లని, వాళ్లెప్పుడూ ‘అటు’, ‘పుటు’, ‘రటు’ అంటూ తిరుగుతుంటారని దీని భావం. అటు, పుటు, రటు అనేవి మనకు దొరుకుతున్న 2,000 యేళ్లనాటి మూడు తెలుగుమాటలు. ఇవి శౌర్యానికి సంబంధించిన మిలిటరీ

పదాలు. వీటిలో "అటు" అనే మాట గురించి పరిశీలిస్తే, అగచాట్లు పదానికి మూలాలు తెలుస్తాయి.

DEDR 73/8 ప్రకారం తమిళంలో అటు/అటువ్/అట్ట్ పదాలకు వండటం, వేయించటం, మాద్చటం, ఉడికించటం, కరిగించటం, జయించటం అనే అర్థాలున్నాయి.

**తమిళం :** చంపటం, నాశనం చేయటం, జయించటం : అట్ట్/అప్ప్/అటి : కొట్టడం, ఢీకొనటం, ఓడించటం, అధిగమించటం, శిక్షించటం : అటర్ప్పు : సమరానికి పూనుకోవటం.

**మళయాళం :** అటిక్క : కొట్టడం : అటాలార్ : శత్రువు : అటార్ : యుద్ధం.

**కన్నడ :** అడచు : అణచివేయు : అదడరు : పోరాడటం : అడి : కొట్టడం.

**తుళు :** అడికాయ్ : ఓడిపోవు.

**తెలుగు :** అడుచు : అణచు, కొట్టు, విరగకొట్టు,

అడుపు : గట్టి దెబ్బకొట్టడం.

అదరు : పుట్టు, కలుగు, జనించు, వచ్చు ; భయపడు, ఒప్పు, వివారించు, అతిశయించు, వర్ధిల్లు, ప్రకాశించు, వ్యాపించు. "అదరునవీన భానుకిరణానలమంటి." "ఇంపదర బ్రోచుగదమ్మ" లాంటి కవి ప్రయోగాలు తెలుగులో ఉన్నాయి.

"అట్ట్" ధాతువు ననుసరించి వివిధ ద్రావిడ భాషల్లో కొత్త అర్థాలతో కొత్త రూపాలతో అనేక పదాలు ఏర్పడ్డాయి.

ఈక్రింది ఉదాహరణలను పరిశీలించండి :

**అదరించు :** చేయు, వేయు. ఆయుధాన్ని ప్రయోగించటం (భూప్రదక్షిణ మదరింపగబోయి యమ్మహామహుడుపదంపడి)

**అదరొందు :** భయపడు

**అదగించు :** అణుచు, పోగొట్టు, రూపడగించు = చంపు. అరవిందముల జొక్కులడగించు జిగిహెచ్చునాయతంబగు కన్ను దోయితోడ)

**అడగు/అడంగు :** అణగు, నశించు, మట్టుపడు, దాగు. (పొరువు దరువుల నీడల నడంగి)

**అడగొను :** ముద్దకట్టుకొను తల అడలు కట్టినది.

అడగోలుకొను : అడ+కోలు+కొను : సర్వం కోల్పోవటం (ఇల్లడసొమ్ము నడగోలుకొని త్రోచునతగనిగతికి).

**అడచిపడు :** త్వరపడు. మిడిసిపడు. ఆత్తపడు, మిట్టిపడు (దైవోపహతంబులగు కార్యంబులు సిద్ధింబొందునె యడిచిపడవలదు. తడవోర్వక వ్యయమోర్వక కదువేగిర మడచిపడిన కార్యంబగునే)

**అడజడి :** అలజడి, దుఃఖము (నన్నడజడిపెట్టుమాట యిటులాడగ గూడునె యీయకార్యముల్ విడుపులతాంగి)

**అడదడి :** ఏలడము, ప్రభుత్వము. ఆయన ఆ దేశమును అడదడిచేయుచుండెను.

ఈ 'అట్ట్ అనే మూలధాతువుని బట్టి తెలుగులో ఏర్పడిన 'అట్టు(రొట్టె, దోసె)' పదం సజీవంగా ఉంది. ఇంకా కొన్ని 'అట్ట్' దాతువులోంచి ఏర్పడిన మాటలున్నాయి.

**అటుకులు :** బియ్యాన్ని నానబెట్టి పల్చని రేకులా దంచినవి. అటుకుగింజ : గడుసరి

**అటిక :** వెడల్పయిన చిన్నకుండ. బహుశా మట్టితో చేసి కాల్చినది అనే అర్థం కావచ్చు.

**అటికలి :** కుంకుడు రసం, తలంటి పోసుకోవటానికి ఉపయోగించేది "గందపు టటికిలిపెట్టరో" అని అన్నమయ్య ప్రయోగం

**అట్ట :** చర్మము, మొండమె, భాగము, ఒంటట్ట చెప్పులు.

**అట్ట :** తల తెగకొట్టు, మొండెం, కబంధం, "రావణు తలలట్టలు బొందించి" అని అన్నమయ్య ప్రయోగం.

**అట్ట :** ప్రవాహం, రణగృహం, కోటవాకిటిమీది ఇల్లు, మేడగతి.

**అట్టం :** అన్నం.

**అట్టకట్టు :** చిక్కగా యేర్పడు.

**అట్టశాల :** పూటకూటి ఇల్లు, హోటల్ : తమిళంలో అటుక్కులై = వంటగది ; అటిచిల్/అటుచిల్ : ఉడికించిన బియ్యం

**అట్టు :** పెనము మీద కాల్చినది.

అట్టుడికినట్టు ఉడుకు : తీవ్రమైన ఉద్రిక్తత ఏర్పడిందనటానికి సూచనగా వాడే జాతీయం

**అట్టుపుట్టు ఆనవాళ్లు :** పుట్టుపూర్వోత్తరాలు చావు-పుట్టుకల వివరాలు.

ఇన్నిరకాల పదాలు భాషా పరిణామక్రమంలో ఏర్పడటానికి మూల ద్రావిడ ధాతువు 'అట్ట్ కారణం అవుతోంది. ద్రావిడ భాషా మూల రూపాలలోంచి నేరుగా ఏర్పడిన అచ్చతెలుగు మాటలు మన భాషా ప్రాచీనతను చాటిచెప్తాయి.



# భాషా ఘోష

**హరులు నుండుగాక కరులు నుండునుగాక**
**ఉంగ్రు గాక వేయి యోధ వరులు**
**మానవాధిపులకు మఱియు విశేషించి**
**కవియె లే డో యశము కలుగబోదు**

యేలూరిపాటి అనంతరామయ్యగారు గతతరం కవిపండితుడు. ఆయన నీలకంఠ దీక్షితులు సంస్కృతంలో వ్రాసిన మూడు శతకాలను నీలకంఠ త్రిశతి పేరుతో పద్యాల్లో అనువాదం చేశారు. ఈ పద్యం సభారంజనం అనే శతకంలోది. రాజుల దగ్గర వేలకొద్దీ గుర్రాలుంటాయి. ఏనుగులుంటాయి. సైనికులుంటారు, ఎందరున్నా కవి లేకపోతే కీర్తిరాదు - అనేది దీని భావం.

రాజాదరణ విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. రాజు ఎంత ఛండాలుడైనా ఆయన్ని ఇంద్రుడంతటివాడిగా పొగిడి అగ్రహారాలో మణిమాన్యాలో పుచ్చుకోవటాన్ని రాజాదరణగా భావిస్తుంటారు కొందరు. గుడ్డివాడు ధనవంతుడైతే, కమలపత్రాక్షుడనీ, గడ్డులోభిని కల్పవృక్షం అనీ, పిరికివాణ్ణి విక్రమాదిత్యుడనీ ఈ ప్రపంచంలో కవులు మాత్రమే కీర్తించగలరంటాడు నీలకంఠదీక్షితులు. “పాండవులు జూదంలో ఓడి, పరదేశాలపాలైనా, వెట్టిచాకిరీ చేసినా ఐదుగురికి ఒకే పెండ్లాం ఉన్నా వ్యాసుడి వాక్కులవల్ల అవి కీర్తిమంతాలే అయ్యాయి... అని!

తిమ్మిని బమ్మిగా చూపించగలిగిన చాకచక్యం కవులకుంటుంది. వాళ్లకే సహజంగా రాజాదరణ ఉంటుంది. అవార్డులు కావాలన్నా, పదవులు కావాలన్నా వందిమాగధం లేనిదే ఏదీ దక్కదు. పొగిడే కవులు పురస్కారాలంకృతులు కాగలరేమో కానీ, వాళ్లకి లోకంలో విలువుంటుందనేది నమ్మలేని విషయం. ఇంతకీ రాజాదరణ అంటే కవులకు అవార్డులు ఇవ్వటమేనా? ప్రభువులు ఈ మాత్రం చేస్తే చాలా?

తెలుగుభాషకు, తెలుగు సాహిత్యానికీ, తెలుగు సంస్కృతికీ ప్రభుత్వపరంగా చేయవలసిన ఉపకారాలు కొన్ని ఉండగా, చేస్తున్న అపకారాలను సరిచేసుకోవలసినవి మరికొన్ని ఉన్నాయి. వాటిని నెరవేర్చుకోగలగటమే రాజాదరణ అంటే!

భారతరాజ్యాంగం దేశీయభాషల్లో విద్యను నేర్పటానికి దేశప్రజలకు భరోసా ఇచ్చింది. కానీ, తెలుగు నేలమీద ఆ భరోసా అమలుకావటంలేదు. మాతృభాషకు రాజాదరణ లేకపోగా రాజ్యాంగ అతిక్రమణ జరుగుతోంది. దీన్ని సరిచేసుకోవాలి. తెలుగునేలమీద తెలుగు దిక్కులేని అక్కుపక్షిలా అఘోరిస్తుందనగా తమిళనేలమీద తమిళ భాషానురక్తి శ్రుతిమించి రాగాన పడింది. ఆ రాష్ట్రంలో తమిళం తప్ప ఇంకో భాష చదవటానికి వీల్లేదని తెలుగుస్కూళ్ళని మూయించేశారు. తెలుగు జనాభా సగానికి పైగా ఉన్న తమిళనాడులో తెలుగు అలా అఘోరిస్తోంది. ఇంకోభాష నేర్పరాదనటం రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధం. ఆ విషయం కేంద్రానికి తెలీదా? కోర్టులకు తెలీవా? ఎవరూ మాట్లాడరు. దేశంలో భాషా రాజాదరణ అలా అఘోరిస్తోంది.

కేంద్రానికి భాషావిధానం ఉంటే ఇలా జరిగేది కాదు. కానీ రాజకీయ ప్రయోజనాలు అన్నింటికన్నా ముఖ్యమైనవి. ఆనాడు మన్మోహన్‌గారు కరుణానిధిగారికి తమిళం క్లాసికల్ హోదాని రాజభరణంగా ఇచ్చేశాడు. ఈనాడు మోదీగారు తెలుగు హననాన్ని రాణిగారికి భరణంగా ప్రసాదించాడు.

తెలుగుభాషకు విశ్వవిద్యాలయాలు చేయవలసిన కార్యాన్ని చేయటంకూడా రాజాదరణే! తెలుగు కన్నడ భాషాయోధులు పోరాడి ఆ రెండు భాషలకూ క్లాసికల్ హోదా సాధించినప్పుడు, మన విశ్వవిద్యాలయాలలో తెలుగుశాఖల వాళ్ళు కొందరు హేళన చేయటం నేను ఎరుగుదును. భాషోద్యమంలో భాగం పంచుకోని విశ్వవిద్యాలయాల తెలుగుశాఖలు క్లాసికల్ హోదా వస్తే, సాలుకు 100 కోట్ల రూపాయలు పరిశోధనా ప్రాజెక్టులకోసం వస్తాయనే విషయాన్ని కూడా మరిచారు. ఈ ఐదేళ్ళ కాలంలో సాలుకు 100 కోట్ల చొప్పున వచ్చి, నిరుపయోగంగా వెనక్కి తిరిగిపోతున్నాయి.

2016 జనవరి 3 వరకూ 21 రోజులపాటు కుప్పం ద్రవిడ విశ్వవిద్యాలయంలో పరిశోధక విద్యార్థులకోసం ప్రత్యేక ప్రసంగాలు ఏర్పరచి, ఈ నిధుల వినియోగానికి ఒక ప్రారంభం పలికారు. ఇతర విశ్వవిద్యాలయాలు ఇప్పటికైనా కళ్ళు తెరవటం మంచిది. NAAC సెమినార్లను ప్రమోషన్లకోసం మార్కుల సెమినార్లుగా మార్చేశారు, రాజాదరణ కోసం పాకులాడటం అంటే ఇదే! భాష, సాహిత్యం, పరిశోధన ఇవేవీ లేకుండానే కాలం చెల్లిపోతోంది కాలానికి!

భాషాభిమానుల ఘోష ఎవరికీ పట్టదు. అందుకని, ఎవరినీ ఏమీ అనలేక ఇంగ్లీషుని తెలుగులో తిట్టుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు జనం.



# పత్తిత్తులు

**లోకంబులు లోకేశులు**
**లోకస్థులు దెగిన తుది నలోకంబగు పెం**
**జీకటి కవ్వల నెవ్వం**
**డేకాకృతి వెలుగు నతని నే సేవింతున్ (పోతనగారి ఆంధ్ర మహాభాగవతము నుండి)**

"లోకాలు, లోకాధిపతులు, లోకులు నశించిపోయాక, లోకమనేదే లేనప్పుడు ఏర్పడే దట్టమైన చీకటికి అవతల ఏ పరమపురుషుడు ఒకే ఆకారంతో ప్రకాశిస్తున్నాడో అతన్ని మాత్రమే నేను సేవిస్తున్నాను" అంటాడు పోతన.

తెలుగు సాహిత్యంలో ఈ పద్యానికి పెద్దపీట వేశారు. ఇంతకు మించిన పద్యం మరొకటి లేదనేంత పేరున్న పద్యం ఇది. దేవుడెక్కడ ఉంటాడనే తర్కానికి ఆయన ఇచ్చిన సమాధానం ఇది. పెంజీకటికి ఆవల ఉంటాడు... అని. ఆ పెంజీకటి ఏది...? మాధ్యమిక బౌద్ధులు దాన్ని శూన్యం అన్నారు. ఆ శూన్యానికి అవతల పెంజీకటిలో ఏదో ఉందనే ఆశ పోతనగారి మాటల్లో కనిపిస్తుంది. శూన్యానికి అవతలా శూన్యమే ననేది మాధ్యమిక బౌద్ధుల భావన.

జగత్ అంటే గతి కలది అని! అది నిత్య చలనశీలి. జడత్వంలోంచి చలనత్వం ఏర్పడుతుందనే విషయం మీద మేథోపరమైన చర్చలు ఆ రోజుల్లో వివిధ మతాల పుట్టుకకు కారణాలయ్యాయి.

బుద్ధుడు దీనికి ఒక సమాధానం చెప్పాడు : "కార్యం ఏర్పడ్డాక అది ఒక కారణం అవుతుంది. ఆ కారణం తిరిగి ఒక కార్యానికి కారణం అవుతుంది ఇలా తుది-మొదలు లేని అనంత క్రమం ఇది..." అని!

వేదప్రామాణాన్ని అంగీకరించకపోవటం చేత నాస్తికులనే దూషణకు గురైనవారు ప్రముఖంగా బౌద్ధులు. నాగార్జునుడు దీన్ని తిప్పి కొట్టాడు. కర్మకు ఫలితం ఉంటుందనే వాడు అస్తికుడనీ, లేదనేవాడు నాస్తికుడనీ ఆయన నిర్వచించాడు. ఉరిశిక్ష రద్దు చేయాలన్నాడు. వైదిక విద్యాలయాల్లో నీ జాతి ఏమిటీ అనే వివక్షపూరిత ప్రశ్నని రద్దు చేసి, తాను వ్యవస్థాపించిన విశ్వవిద్యాలయాలలో అందరికీ ప్రవేశం కల్పించాడు.

నిరంకుశ రాజనీతిని కౌటిల్యుడు ప్రబోధించాడు. నాగార్జునుడు అందుకు భిన్నమైన వ్యక్తి. యజ్ఞశ్రీ శాతకర్ణికి ప్రజాస్వామిక రాజనీతిని ప్రబోధించే ఒక శాసనం అనదగిన ఉత్తరం వ్రాశాడు నాగార్జునుడు. సుహృల్లేఖ పేరుతో అది చరిత్ర ప్రసిద్ధి చెందింది. శాతవాహనులు ఉదార పాలకులుగా పేరొందటానికి ఇదొక కారణం కూడా!

ఒకే వస్తువు నుండి, దాని నిర్గుణాత్మక స్థితి నుండి ఈ సృష్టి ఏర్పడిందనటం హేతు విరుద్ధం అనీ, అనేక కారణాల సమాహారంగానే కార్యం ఉద్భవిస్తుందనీ, కారణాల సముదాయ ఫలితంగా ఉత్పత్తి జరుగుతుందనీ బౌద్ధ నికాయ గ్రంథాలు చెప్తాయి. దీన్నే "ప్రతీత సముత్పాద వాదం" అంటారు. సాక్షాత్తూ బుద్ధుడే ఈ సూత్రాన్ని చెప్పాడంటారు. అప్పటికి చార్వాకులు గానీ, జిన మహావీరులుగానీ ఈ విషయాన్ని చెప్పలేదు. పదార్థ మౌలికత మీద తొలిగా విశ్లేషణ చేసినవాడు బుద్ధుడే!

క్రీ.శ. 100లో జరిగిన 4వ సంగీతి (బౌద్ధుల జనరల్ బోడీ)లో బుద్ధుని బోధనలను యథాతథంగా అనుసరించాలన్న థేరవాదుల్ని బౌద్ధంలోంచి బహిష్కరించారు. వాళ్ళది హీనయానం అన్నారు. నిజానికి హీనయానంలో గతివాదం, వాస్తవికత, భౌతిక నాస్తికవాదాలు ఎక్కువగా ఉంటాయి. అవన్నీ నేడు అంతరించాయి.

ఆ తరువాతి కాలంలో అశ్వఘోషుడు మాధ్యమిక వాదం గురించి ప్రస్తావించాడు. ఆచార్య నాగార్జునుడు దాన్ని పెంచి ప్రచారం చేశాడు. అదే శూన్యవాదంగా ప్రసిద్ధి పొందింది., బహుశా బుద్ధుడి తరువాత 700 సంవత్సరాల తర్వాతి వాడాయన. అప్పటికే వైదికమతంలోని సమస్త మూఢాచారాలు బౌద్ధంలోకి వచ్చి చేరిపోయాయి. వైదిక మతస్థులు అధిక సంఖ్యలో బౌద్ధాన్ని ఆశ్రయించినప్పుడు వారు వెంట తెచ్చిన భావజాలాలు ఈ మార్పుకు ముఖ్యకారణం కావచ్చు.

బౌద్ధంలోని తాత్త్విక ప్రత్యేకతని మార్చి, వైదిక తాత్త్వికతకు దగ్గరగా ఉండే ఆలోచనలు చేసినవాడు నాగార్జునుడు. "ఆదిబౌద్ధం" ప్రకారం ఇది పతనానికి పరాకాష్ఠ కాగా,

మాధ్యమికవాదులు దీన్ని తాత్విక పరాకాష్ఠగా భావించారు. ప్రతిదీ కార్యకారాణాల వలనే పుడుతోంది. కారణం లేకుండా కార్యం లేదు. పుట్టుక, పెరుగుదల, నశింపులనేవి లేనిదంటూ ఏదీ ఉండదు. ఏది ఆది? ఏది తుది? అనే ప్రశ్నలకు తావే లేదు. సృష్టి ఆద్యంత రహితమైనది... ఇలా బుద్ధుడి ప్రతీత సముత్పాద వాదానికి నాగార్జునుడు ఆధునికతను సమకూర్చాడు. ఏ విషయానికీ, వస్తువులకూ, సంఘటనలకూ మౌలికంగా మరొక దానిమీద ఆధారపడకుండా వాటి ఉనికే ఉండదు. అది నిస్వభావం అనీ, దాన్నే శూన్యం అంటున్నట్టు వివరించాడు నాగార్జునుడు. ఇక్కడ శూన్యానికి 'మౌలిక లేదా ప్రాథమిక స్థితి' అని అర్థం చెప్పుకోవాలి.

9-10 శతాబ్దాల నాటి శైవులలో తీవ్రవాదులుగా పేరొందిన కాలాముఖ శైవుల్లో "శ్రీ ఉత్పత్తి పిడుగు" అనే సంస్థ ఒకటి ఉండేది. అదొక ఆధ్యాత్మిక ఉగ్రవాద సంస్థ. బెజవాడ కనకదుర్గమ్మ గుడిలోనూ, అక్కన్న మాదన్న గుహల్లోనూ, మొగల్రాజపురం గుహల్లో కూడా ఈ 'శ్రీ ఉత్పత్తి పిడుగు' శాసనాలున్నాయి. దానిమీద బలమైన గద ముద్ర ఉంటుంది. రాష్ట్రం మొత్తం మీద ఇలాంటివి 36 శాసనాలు దొరికాయని చెప్తారు. శైవులకు, బౌద్ధానికి, జైనానికీ మధ్య తీవ్రమైన సాయుధ పోరాటాలు జరిగిన కాలం అది! శ్రీ ఉత్పత్తి పిడుగు సంస్థ వారు మారణాయుధలు పట్టుకుని అడవుల్లో ఏకాంతవాసం గడుపుతూ, ఎక్కడ జైన, బౌద్ధ ఆరామాలు కనిపించినా వెళ్లి కూలగొట్టటం విధిగా పెట్టుకున్నారు. శ్రీ ఉత్పత్తి పిడుగు శాసనాలను చూస్తే భారీ విధ్వంసాలే చేసినట్టు అనిపిస్తుంది. ముక్కలై, కుప్పకూలిన బౌద్ధారామాల ధ్వంసం వెనుక ఈ ఉగ్రవాద సంస్థ ప్రమేయం ఉండి ఉండాలి.

ఈ శాసనంలో 'ఉత్పత్తి' అనే మాటని సంస్కృతార్థంలో కాకుండా ఉత్త+పత్తి అని రెండు తెలుగు మాటలుగా విడదీస్తే, ఉత్త అంటే ఏమీ లేనిది=శూన్యం అనీ, పత్తి అంటే పథం = శూన్యవాదం అనీ అర్థాలొస్తాయి. ఈ శూన్యవాదాన్ని ప్రబోధించే వారి పాలిట తాము పిడుగులం అని "శ్రీ ఉత్పత్తి పిడుగు"కు భావార్థం.

'ఉత్తపత్తి' అంటే ఏమీ లేదు, అంతా శూన్యం, తాను నిమిత్తమాత్రుణ్ణి అన్నట్టుగా వ్యవహరించటం. ఈ ఉత్తపత్తి జనవ్యవహారంలో పత్తిత్తు అయ్యింది. ఏమీ ఎరగనట్టు నటించేవాణ్ణి పత్తిత్తు అనటం నేటికీ ఉన్న ప్రయోగమే!

శ్రీ పత్తిత్తులు (శ్రీ 420లు) నేటి సమాజంలో ఉన్నత స్థానంలోనే ఎక్కువమంది ఉన్నారు. వాళ్ళ పైన పడాల్సిన పిడుగులన్నీ ఉత్తినే పత్తా లేకుండా పోతున్నాయి.,



# అమ్మకడుపులో నేర్చిందే అమ్మభాష

పుట్టిన కొన్ని గంటల లోపే చంటి బిడ్డ తన అమ్మభాషకూ, పరభాషకూ ధ్వనిలో తేడా గుర్తించగలడని శాస్త్రవేత్తలు ప్రకటిస్తున్నారు. ఈ ధ్వనుల పరిజ్ఞానం గంటల బిడ్డకు ఎక్కడిది? అమ్మకడుపులో ఉన్నప్పుడే 'అమ్మధ్వని'ని గ్రహించగలగటమే ఇందుకు కారణం అని తాజా పరిశోధనలు చెప్తున్నాయి.

పుట్టటానికి ఇంకా నాలుగైదు నెలల ముందునుండే, అమ్మ కడుపులోనే బిడ్డలు తొలుతగా నేర్చుకునేది అమ్మభాషనే! పుట్టగానే బిడ్డ గుర్తించ గలిగేది కూడా అమ్మగొంతునీ, అమ్మమాటనే! పదాలు తెలియక పోవచ్చు. కానీ, ఆ బిడ్డ ఏడుపులో అనేక భావాలూ, అర్థాలూ ఉంటాయి. అవన్నీ మాతృభాషలోనే ఉంటాయి.

అమ్మ కడుపులో ఉన్న కాలంలోనే శబ్దాలతో పాటు, రుచులూ, వాసనల్ని కూడా బిడ్డ ఆస్వాదించ గలుగుతాడు. పుట్టిన తరువాత ఆ ఆస్వాదన కొనసాగుతుందని పరిశోధకులు చెప్తున్నారు. ఏడవనెలలోనే బిడ్డ నాలుకమీద రుచిని తెలియచేసే కేంద్రాలు (Taste buds) ఏర్పడతాయి. గర్భవతిగా ఉన్నప్పుడు తల్లి తిన్న భోజన పదార్థాల సుగంధాన్ని కూడా బిడ్డ గ్రహిస్తాడని, దాన్ని బాగా జ్ఞాపకం పెట్టుకుంటాడని కూడా పరిశోధనలు పేర్కొంటున్నాయి. పుట్టిన తరువాత ఆ బిడ్డకు ఏవేవి తినిపిస్తామో వాటిని రుచికరంగానూ, ఇష్టంగానూ గర్భవతిగా ఉన్న సమయంలో తల్లి తినడం వలన బిడ్డకు వాటిపైన ఇష్టత పెరుగుతుందని కూడా గుర్తించారు.

అమ్మకడుపులో 30 వారాల శిశువుగా ఉన్నప్పుడే నాడీవ్యవస్థ, జ్ఞానేంద్రియ వ్యవస్థ యంత్రాంగం ప్రారంభం అవుతుంది. చివరి 10 వారాల కాలంలో శరీర వ్యవస్థలన్నీ పరిణతి పొందుతున్న కొద్దీ గర్భస్థ శిశువు అమ్మ మాట్లాడే ధ్వనిని బాగా ఆకళింపు చేసుకోవటం ప్రారంభిస్తాడు. అది ధ్వని ఆకళింపు మాత్రమే! కడుపులో ఉండగానే అఆఇఈ

లు వచ్చేస్తాయని దీని అర్థం కాదు. అభిమన్యుడు పద్మవ్యూహాన్ని ఛేదించటం అమ్మకడుపులోనే నేర్చుకోవటం లాంటి పురాణ కథలకు దీన్ని ముడి పెట్టనవసరం లేదు. ఇది మాతృభాష ఆకళింపుకు సంబంధించిన విషయం.

వాషింగ్టన్ విశ్వవిద్యాలయం ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లెర్నింగ్ & బ్రెయిన్ సైన్సెస్ కు చెందిన Patricia Kuhl అనే పరిశోధకుడు చెప్పిన విషయాలు ఆశ్చర్యకరంగా ఉన్నాయి. చివరి 10 వారాల కాలంలో గర్భస్థ శిశువు అమ్మభాష లోని అచ్చుల్ని ఎక్కువగా గ్రహించ గల్గుతాడనేది ఆయన పరిశోధనలోని సారాంశం.

భాషకు అచ్చులు మూలం. పసిపిల్లల భాషంతా అచ్చులు ప్రధానంగా నడుస్తాయి. పుట్టి, ఎదిగే కొద్దీ అచ్చులతో హల్లుల్ని ముడిపెట్టడం ఎలాగో నెమ్మదిగా గ్రహిస్తాడు. 30 గంటల వయసున్న పసిబిడ్డలు వాళ్ల అమ్మ భాషలోని అచ్చుల్ని ఎలా ఆకళింపు చేసుకుంటున్నారో కంప్యూటర్ల సాయంతో విశ్లేషించి ఈ నిర్ధారణకొచ్చారు శాస్త్రవేత్తలు.

ఇది భాషను నేర్చేసుకోవటం కాదు. గర్భస్థ శిశువులకు మాటలు అర్థం అవుతాయని కూడా కాదు. భాషా పదాల ధ్వని స్వరూపాన్ని (speech sounds) అమ్మకడుపులోనే ఆకళింపు చేసుకునే ఒక ప్రయత్నం. చక్కగా తెలుగులో మాట్లాడే గర్భవతి గర్భాన పెరిగే బిడ్డకు తెలుగు మాటల ధ్వని బాగా అవగతం అవుతుంది.

గర్భంలో ఉన్న కాలంలోనూ, జన్మించాక ఎదుగుతున్న కాలంలోనూ మాతృభాష ప్రముఖ పాత్ర పోషిస్తుంది. 'సైకో లింగ్విస్టిక్స్' అనే శాస్త్ర విభాగానికి చెందిన పరిశోధనాంశం ఇది. పదాలను పలకటం లోని ఉచ్చ, మధ్య, మంద్ర స్థాయిల ఆకళింపు భాషను గ్రహించటంలో మొదటి అంకంగా ఈ శాస్త్రం చెప్తుంది. 2009 నవంబర్ 5న "కరెంట్ బయాలజీ" అనే వైద్యపత్రికలో ఈ "సైకో లింగ్విస్టిక్స్" అంశంమీద తొలి పరిశోధన వెలువడింది.

జెర్మనీలోని ఉర్జ్‘బర్గ్ విశ్వవిద్యాలయానికి చెందిన శ్రీమతి Kathleen Wermke అనే శాస్త్రవేత్త Human fetuses are able to memorize sounds from the external world by the last trimester of pregnancy, with a particular sensitivity to melody contour in both music and language అని పేర్కొన్నారు. బిడ్డ పుట్టడానికి చివరి మూడు లేక నాలుగు నెలలు భాషకు సంబంధించి కీలకమైన కాలం. ఆ సమయంలో బయటి ధ్వనుల్ని బిడ్డ గ్రహించే ప్రయత్నం చేస్తాడు. ఈ ధ్వనుల్లో అమ్మ మనోభావాలతో కూడిన భాష బిడ్డకు ఎక్కువ ఆకళింపు అవుతుంది. తల్లిభాషా పదాలలోని లయ కొంత

ఆకళింపు కొస్తుంది. ప్రసవించాక వీలైనంత త్వరగా తల్లులు బిడ్డతో మాట్లాడటం మొదలు పెడితే, బిడ్డకు సౌకర్య వంతంగా ఉంటుంది. perceptual preference అంటారు దీన్ని.

తల్లి గర్భంలో ఉండగా తాను నేర్చిన ఆ స్వల్ప మాత్రపు భాషలోనే కొత్త పాపాయి మాట్లాడుతుంది. ఎలా మాట్లాడు తుంది? తన ధ్వనులతో మాట్లాడుతుంది. బిడ్డ పుట్టి, ఎదుగుతున్న క్రమంలో మనం ధ్వనుల్ని నేర్పిస్తాం. భాషించటం నేర్పిస్తాం. కానీ, ఇంకా పుట్టకుండానే, అమ్మ కడుపులోనే ఈ నేర్చుకోవటాలన్నీ స్వయంగా మొదలు పెడుతున్నాడు బిడ్డ. దీన్ని "pre-adaptation for learning language (పుట్టకమునుపే భాష నేర్చుకునే యత్నం)" అంటారు.

మాతృభాష ప్రభావంతో బిడ్డ మనసు రూపొంది, మాతృభాషలోనే అది పరిణతి పొందుతుంది. మాతృభాషకు అతీతంగా బిడ్డను పెంచాలని చూస్తే అది ఆ బిడ్డలో మానసిక దౌర్బల్యాన్ని కలిగిస్తుందని కూడా శాస్త్రవేత్తలు నిర్ధారించారు.

అమ్మ కడుపులో నేర్చిన భాషలోనే బడిలోకి వచ్చాక నేర్చుకొంటున్న భాషని అనువదించి అర్థం చేసుకొనే ప్రయత్నం చేస్తారు పిల్లలు. ప్రాథమిక విద్యలో అమ్మభాషని నిషేధిస్తే, భాషాపరమైన అవ్యవస్థ (language disorder) ఏర్పడుతుందని ఈ పరిశోధనకు నాయకత్వం వహించిన శాస్త్రవేత్త శ్రీమతి కథ్లీన్ వెర్క్ చాలా స్పష్టంగా పేర్కొన్నారు.

ఈ పరిశోధనలకోసం అప్పుడే పుట్టిన 60 మంది శిశువుల తొలిరోదనని రికార్డ్ చేశారు. సద్యోజాత శిశువుల తొలి రోదనం (first cry) మీద జరిగిన తొలిపరిశోధన ఇది. ఈ అరవై మంది పిల్లల్లో 30 మంది ఫ్రెంచి తల్లులకు, 300 మంది జెర్మన్ తల్లులకూ పుట్టినవాళ్ళు. మొదటి ఐదు రోజులపాటు ఆ బిడ్డల రోదన ధ్వనుల్ని విశ్లేషించి, ఫ్రెంచి తల్లులకు పుట్టిన బిడ్డల ఏడుపు తక్కువ స్థాయి నుండి ఎక్కువ స్థాయిలోకి ఆరోహణ క్రమంలోనూ, జెర్మనీ తల్లులకు పుట్టిన బిడ్డల ఏడుపు హెచ్చు స్థాయి నుండీ కిందకు అవరోహణ క్రమంలోనూ ఉన్నట్టుగా గమనించారు.

సాధారణంగా ఎక్కువ జెర్మన్ పదాలు పై స్థాయి నుంచి కింది స్థాయికి వస్తాయని, ఎక్కువ ఫ్రెంచి పదాలు కిందిస్థాయి నుంచి పై స్థాయికి వెడతాయనీ విశ్లేషకుల భావన. ఉదాహరణకు, ఫ్రెంచి భాషలో తండ్రిని "papaa" అని ఆరోహణంలో పలికితే, జెర్మన్

భాషలో "paapa" అని అవరోహణంలో పలుకుతారట. పాప ఏడ్చినప్పుడు మధ్యలో గాలి పీల్చుకోవటానికి ఇచ్చే కొన్ని క్షణాల విరామానికి ముందు ఏడుపు హెచ్చు స్థాయిలో ఉన్నదా లేక తక్కువ స్థాయిలో ఉన్నదా అని పరిశీలించారు. ఆకలి, అసౌకర్యం, నొప్పి, వంటరి తనం ఇలాంటి కారణాలతో పసికూనలు చేసే రోదనలను వర్గీకరించుకుని విశ్లేషించారు. జెర్మన్ బిడ్డల ఏడుపు హెచ్చుస్థాయి నుంచి తగ్గుస్థాయికి అవరోహణ క్రమంలో ఉండగా, ఫ్రెంచి బిడ్డల రోదనం దిగువస్థాయి నుంచి పై స్థాయికి ఆరోహణ క్రమంలో ఉన్నట్టు తేలింది. "వా...వ్" అని ఏడ్చే బిడ్డకీ "హ్వా...వా..." అని ఏడ్చే బిడ్డకీ మాతృభాషలు వేర్వేరుగా ఉండటాన్ని ఈ విధంగా గమనించారు.

ఫ్రెంచి తల్లికి పుట్టిన బిడ్డ ఫ్రెంచి భాషలోనూ, జెర్మనీ తల్లికి పుట్టిన బిడ్డ జెర్మన్ భాషలోనే ఏడుస్తారనేది ఈ తాజా పరిశోధనా సారాంశం. దీన్నిబట్టి, మాతృభాషలోనే మనో భావాలను వెల్లడించే ప్రయత్నం (ability to actively produce language) అనేది పుట్టిన క్షణంనుంచే బిడ్డ మొదలు పెడతాడని అర్థం అవుతోంది. తల్లిభాషలో ఉండే యాసను, ధ్వని విధానాన్నీ(rhythm and intonation) గర్భంలోనే బిడ్డలు పసిగడతారనీ, పుడుతూనే వాటిని అనుకరిస్తూ తమ ధ్వనులలో మనోభావాలు వ్యక్త పరుస్తారనీ శాస్త్రవేత్తలు చెప్తున్నారు. ఇక్కడ "యాస" అనే మాటని "భాషలోని లయ(rhythm)" అనే అర్థంలో వాడటం జరిగింది. తమిళం, తెలుగు, సంస్కృతం మొదలైన భాషలలో లయపరంగా తేడాలు ఉన్నట్టే, జెర్మనీ, ఫ్రెంచి భాషల లయలలోనూ తేడాలున్నాయి.

ఫ్రెంచి భాషా పదాల్లో అధిక భాగం ఇలా అరోహణక్రమంలోనూ, జెర్మన్ భాషాపదాల్లో అధికభాగం అవరోహణ క్రమం లోనూ ఉంటాయని, వారి బిడ్డల మొదటి ఏడుపు కూడా అందుకు అనుగుణంగానే ఉందని ఈ పరిశోధనలో తేలింది. వివిధ ధ్వనులే భాషలో వర్ణాలుగా ఏర్పడుతున్నాయి. వివిధ వర్ణాలు కలిసి భాషాపదాలు అవుతున్నాయి. తల్లిగర్భంలో ఉన్నప్పుడు ధ్వనుల్ని ఆకళింపు చేసుకుంటే, పుట్టాక ఆ ధ్వనుల్ని కూడబలుక్కుంటూ ఆరంభం అవుతుందన్నమాట.

"నిఃశ్వాసోచ్ఛ్వాస సంక్షోభస్వప్నాశాన్ గర్భోంధిగచ్ఛతి/మాతుర్నిశ్వసితోచ్ఛ్వాస సంక్షోభ స్వప్న సంభవాన్" అనే సుశ్రుతాచార్యుల సిద్ధాంతం ఇదే చెప్తోంది. తల్లి గర్భంలో పెరుగుతున్న శిశువు పైన తల్లి ఉచ్ఛ్వాస, నిఃశ్వాసాలు, తల్లి మనో భావాలు ప్రభావం చూపుతాయి. అలాగే, బిడ్డ మనో భావాలు కూడా తల్లి పైన ప్రసరించటం వలనే గర్భవతులకు వేవిళ్ళు కలుగు తాయని ఈ సిద్ధాంతం చెప్తోంది. నాలుగవ నెల వచ్చేసరికే గర్భస్థ

శిశువులో హృదయమూ, మనో వృత్తులు ఏర్పడటం మొదలౌ తాయి. కాబట్టి, 4వ నెల గర్భవతిని "దౌహృదిని" అంటారు. తనదొకటీ-తన కడుపులో బిడ్డదొకటీ రెండు హృదయాలు కలిగినది దౌహృదిని! హృదయమూ, మనో వృత్తులూ, సుఖదుఃఖ భావనలన్నీ బిడ్డకు కలగటంలో మాతృభాష ముఖ్య పాత్ర నిర్వహిస్తోంది.

మన శబ్దాలు, మావిపొరలమధ్య ఉమ్మనీటిలో పెరుగుతున్నశిశువులకు యథాతథంగా వినిపించవు. నీటిలో చేపలు వాటి శరీరాంగాలనుంచి, ఎముకలనుంచీ మెదడుకు చేరిన ధ్వని తరంగాలను గ్రహించినట్టు, బిడ్డ ఉమ్మనీటిలోంచి తల్లి భాషను స్వీకరించటం ప్రారంభిస్తాడని లీప్ జీగ్ కు చెందిన Max Planck Institute for Human Cognitive and Brain Sciences ప్రొఫెసర్ Angela D. Friederici వెల్లడించారు. గర్భస్థ శిశువులు గాఢ నిద్రావస్థలో ఉన్నప్పుడు కూడా వాళ్ళ మెదళ్ళు ధ్వని తరంగాలను స్వీకరించ గలుగుతాయని కూడా ఈ ప్రొఫెసర్ గారి పరిశోధనలు వెల్లడిస్తున్నాయి.

నోరు లేని జంతువులు కూడా తమ మనోభావాలను ధ్వనుల ద్వారానూ, సైగల ద్వారానూ వ్యక్తపరుస్తాయి. భాష రాకుండా భావ వ్యక్తీకరణ ఏర్పడదనే వాదన సరికాదు. భావ వ్యక్తీకరణను బిడ్డ, అమ్మ కడుపులోనే సాధన చేస్తున్నాడు. అందుకు అమ్మభాష దోహదపడుతోంది. పుట్టాక కూడా అమ్మభాషలోనే బిడ్డ పెరగాలి. ప్రాథమిక విద్యలో నేర్చే అంశాలను అమ్మభాషలో ఆకళింపు చేసుకోవటానికి, తద్వారా ఎక్కువ సమాచారాన్ని గ్రహించటానికి ఆ బిడ్డకు వీలు కుదురుతుంది.

చదువులో చేరిన పిల్లలకు శిక్షణ మనసుంటుందనీ, ఆ మనసు మాతృభాషలో వుంటుందనీ గుర్తించలేని, విద్యాశాఖ పుట్టిన బిడ్డకు మాతృభాష తెలీకుండా ఇంగ్లీషుతో బుర్ర నింపేయాలని తపన పడ్తోంది.

ఆంగ్ల మానసపుత్రుల్లా తయారైన ఈ విద్యారంగ నిపుణులు మొత్తం జాతి మేదా సంపన్నతని దెబ్బ తీసి స్వంతంగా ఆలోచించే శక్తి లేని రేపటి తరాన్ని సృష్టించాలని చూస్తున్నారు. మేధావులు మాట్లాడటం అవసరమైన అంశం ఇది.



# భాషా సాంకేతికత

ఒకప్పుడు, క్రీస్తుశకం తొలిరోజులవరకూ కూడా సాంఖ్య, న్యాయ, వైశేషికాది షడ్దర్శనాలను ఉపయోగించుకోవటాన్ని సాంకేతికత అన్నారు. ఆత్మ, మనసు, ఇంద్రియాలు, ఇంద్రియార్థాలు వీటి సన్నికర్షణం కారణంగా ప్రత్యక్షప్రమాణం ఏర్పడుతోందని తర్కశాస్త్రం చెప్పింది. వైద్యం, జ్యోతిషంలాంటి శాస్త్రాలు ఈ సాంకేతికతనే అనుసరించాయి. ఆధునికశాస్త్రాల అవతరణ తరువాత పంచజ్ఞానేంద్రియాల అభిగ్రహణం ద్వారా అనుభవంలోకి (perspeptive consciousness) తెచ్చే సూక్ష్మదర్శిని (మైక్రోస్కోప్), దూరదర్శిని (టెలిస్కోప్)లాంటి ఉపకరణాల వాడకాన్ని సాంకేతికత అన్నారు. 'ఇప్పుడు కంప్యూటర్ వాటన్నింటి స్థానాన్నీ ఆక్రమించింది. సాఫ్టవేర్‌ని 'సాంకేతికత'గానూ, సాఫ్టవేర్ రంగనిపుణులను 'సాంకేతిక నిపుణులు'గానూ పిలుస్తున్నారు.

## భాషా సాంకేతికత - తొలి అడుగులు

తెలుగుభాషకు 'సాంకేతికత'ను ఆపాదించటం గురించి ఇప్పుడు మంచి కృషి జరుగుతోంది. సమాచార ప్రసారానికి, విద్యా వికాసాలకూ ఉపయోగించే ఆధునిక సాంకేతిక ఉపకరణా (సాఫ్టవేర్)లను తెలుగుభాషలో పనిచేయించగలగటంద్వారా తెలుగును సాంకేతికంగా అభివృద్ధి చేయవచ్చునేది నేటి ప్రయత్నం.

ఆంగ్లంతో సమానంగా తెలుగుభాష కూడా సాంకేతిక - ఉపకరణాలను వాడు కోవటానికి పూర్తిగా ఉపయోగపడిన రోజున, తెలుగుభాష 'ప్రపంచ తెలుగు'గా రూపుకట్టుకొంటుంది.

2006లో కృష్ణాజిల్లా రచయితల సంఘం జాతీయ తెలుగు రచయితల మహాసభలలో తొలిసారిగా కంప్యూటర్లలో తెలుగు వాడకంపైన ఒక చర్చావేదికను నిర్వహించింది. 2007లో ఇంటర్నెట్ ఉపయోగం పైన అవగాహన, శిక్షణా శిబిరాలను నిర్వహించి, కంప్యూటర్లను పూర్తిస్థాయిలో తెలుగులో వాడుకోవటాన్ని తెలుగుభాషోద్యమ కార్యాచరణలో భాగంగా ప్రకటించింది. 2007లో తొలి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు, 2011లో రెండవ ప్రపంచ మహాసభలు సాంకేతికంగా తెలుగుభాషను అభివృద్ధిచేసి, 'ప్రపంచ తెలుగు'ను సాధించాలనే భావనను ప్రతిఒక్కరిలోనూ కలిగించగలిగాయి. ప్రభుత్వంలో కదలిక కూడా వచ్చింది. భాషోద్యమపరంగా ఇలాంటి ప్రయత్నాలను ఇతరులు కూడా చేశారు.

2011 ఏప్రియల్ 16న సిలికానాంధ్ర సంస్థ హైదరాబాద్‌లోని డా. మర్రి చెన్నారెడ్డి మానవవనరుల అభివృద్ధి భవనంలో 'అంతర్జాలంలో తెలుగు వినియోగం'పైన నిర్వహించిన సదస్సు భాషా సాంకేతికంగా ఒక మలుపుకు కారణం అయ్యింది.

మంత్రి శ్రీ పొన్నాల లక్ష్మయ్య ఈ సదస్సును ప్రారంభించి, యూనికోడ్ కన్సార్టియంలో సభ్యత్వానికి సిద్ధమేనని ప్రకటించారు. ఉర్దూ, బెంగాల్ భాషలకోసం బంగ్లాదేశ్ కూడా యూనికోడ్ కన్సార్టియంలో సభ్యత్వం తీసుకొన్నదంటే దాని ప్రాముఖ్యత ఏమిటో అర్థం చేసుకోవచ్చు.

తమిళభాషను సాంకేతికంగా అభివృద్ధి చేయటానికి పనులు మొదలుపెట్టిన పది సంవత్సరాల తరువాత ఇప్పుడు మనం సాంకేతికత పైన దృష్టి పెట్టగలుగుతున్నాం. ఇందుకోసం అంతర్జాల సదస్సులూ, ప్రపంచ తెలుగు రచయితల మహాసభలలాంటి భారీ కార్యక్రమాలెన్నింటినో నిర్వహించి ఒక భూమికను కల్పించవలసివచ్చింది.

## యూనీకోడ్ :

కంప్యూటర్‌కు సంబంధించిన 'లిపి ప్రామాణికత'ను 'యూనీకోడ్' అంటారు. కొన్ని నిర్దేశిత సంకేతాల ఆధారంగా ప్రపంచ భాషలన్నింటిలోనూ అక్షరాలు కంప్యూటర్ తెరపైన వస్తాయి. అందుకోసం ఏ భాషలోనైనా వ్రాయటానికి యూనివర్సల్ కేరెక్టర్ సెట్ (UCS) అనే ప్రపంచ ప్రామాణికతని ఉపయోగిస్తారు. కుడి నుంచి ఎడమకు, ఎడమనుంచి కుడికి, పై నుంచి కిందికి రకరకాలుగా ఉండే లిపులన్నింటినీ ఒక ప్రామాణికతలకు తీసుకురావటం యూనికోడ్ ప్రత్యేకత.

2003లో 4.0 వెర్షన్, 2006లో 5.0 వర్షన్లు వచ్చాయి. 2011లో 6.0 వెర్షన్ వచ్చింది. 1,09,000 కేరెక్టర్లతో 93 భాషలలో యూనీకోడ్ లిపులు ఉన్నాయి.

ఒకప్పటి టైప్ రైటర్లు ఉపయోగించిన కీ బోర్డునే కంప్యూటర్లకూ ప్రామాణికంగా గుర్తించారు. కొన్ని సంకేతాలను ఇవ్వడంద్వారా అక్షరాన్ని కీ బోర్డ్ పైన నొక్కగానే అది 'సీపీయూ'ను చేరి కోడింగ్ ద్వారా కంప్యూటర్ తెరమీద కనిపిస్తుంది. దీన్ని అమెరికన్ స్టాండర్డ్‌కోడ్ ఫర్ ఇన్ఫర్మేషన్ ఇంటర్ చేంజ్ (ASCII అస్కీ) అంటారు. ఇంగ్లీష్ లిపి ఈ అస్కీ ప్రామాణికత ద్వారానే అని కంప్యూటర్లలోనూ పనిచేస్తుంది. 1991లో దీన్నే బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్ కూడా ప్రమాణంగా తీసుకొంది.

1990లో 'అస్కీ కోడింగ్' ఆధారంగా ఇంగ్లీషులో టైప్ చేస్తే తెలుగులో అక్షరాలు కనిపించే పద్ధతిని 'ఐ-లీప్' అందుబాటులోకి తెచ్చింది. దీనివలన వర్డ్ డాక్యుమెంట్లో తెలుగుటైపు చేసుకోవడానికి అందరికీ మంచి అవకాశం కలిగింది. అప్పట్లో రాష్ట్ర ప్రభుత్వం 'ఐ-లీప్' సాఫ్ట్‌వేర్‌ని కొని అన్ని ప్రభుత్వ కార్యాలయాలకూ అందించింది కూడా !

2006లో కేంద్రప్రభుత్వం తెలుగు సాఫ్ట్‌వేర్ ఉపకరణాల సీడీని ఉచితంగా ఇచ్చే ఏర్పాట్లు చేశారు. ఇంగ్లీషు కీబోర్డ్ సహకారంతో పనిచేసే తెలుగు ట్రూటైప్ ఫాంట్లుగా వీటిని పిలిచారు. ఆంధ్రప్రదేశ్ అధికారభాషా సంఘం కూడా ఇలాంటి ప్రయత్నమే చేసి మరికొన్ని ఫాంట్లను ఉచితంగా ఇచ్చింది.

డిటిపి చేతకాకపోతే కంప్యూటర్ వృథా... అనే రోజులు పోయాయి. ఇంగ్లీషు 'కీ బోర్డ్' సహాయంతో ఎవరికి వారు తమ పుస్తకాలను తెలుగులో తామే స్వయంగా టైప్ చేసుకొనే సదుపాయాలు ఇప్పటికే అందుబాటులోకి వచ్చాయి.

పైగా చేత్తో రాసినదానికన్నా కంప్యూటర్లో రాసుకొంటే తప్పొప్పులు సరిచేసుకోవటం, ఒకచోట రాసినదాన్ని వేరొకచోటుకు చేర్చటం, ఎడిటింగ్ తేలిక అవుతాయి. చేత్తో రాసిన దానికన్నా రచనలో పదును ఎక్కువగా ఉంటుంది.

కంప్యూటర్లో తెలుగు అక్షరాలు కనిపించటం కోసం ఇటీవలకాలంలో కొత్త ఫాంట్లు అందుబాటులోకి వచ్చాయి. ఉపమా కళ్యాణరామన్, దేశికాచారి ప్రభృతుల కృషి చిరస్మరణీయమైనది. శ్రీలిపి, అనూ ఫాంట్లతోపాటు, అక్షర, వేమన, గౌతమి, రఘు, గోదావరి, కృష్ణ, హేమలత, రమణీయలాంటి ఫాంట్లు ఎన్నో అందుబాటులోకి వచ్చాయి. శ్రీ దేశికాచారి రూపొందించిన పోతన ఎక్కువ ప్రజాదరణ పొందింది. బారహ, రఘు అనే సాఫ్ట్‌వేర్‌లు దేశంలోని అనేక భాషాలిపులను అందుబాటులోకి తెచ్చాయి. ముఖ్యంగా తెలుగులో అనూ ఫాంట్లు వచ్చిన తరువాత పుస్తక ప్రచురణ రంగం స్వరూపమే

మారిపోయింది. ముద్రణారంగంలో అనూ ఫాంట్లు విప్లవాత్మకమైన మార్పులు తెచ్చాయి. చిత్రకారుడు బాపుగారి చేతి వ్రాతని ఒక ఫాంట్‌గా తీసుకువచ్చారు. ఇలాంటి వెసులుబాట్లు అనేకం కలిగాయి.

డిటీపీ ఫాంట్లను ట్రూటైప్ ఫాంట్లు అనీ, యూనీకోడ్ ఫాంట్లను ఓపెన్ టైప్ ఫాంట్లు అనీ అంటారు. డీటీపీ ఫాంట్లలో టైపు చేసినదాన్ని అదే వెర్షన్ ఉంటేనే వేరొక కంప్యూటర్లో చదవగలుగుతాము. ఆ విధంగా పరిమితమైన ప్రయోజనమే కలుగుతోంది. దినపత్రికలు తమకోసం స్వంతంగా ఫాంట్లను డిజైన్ చేయించుకుంటాయి. అందువలన కొన్ని పత్రికల 'ఇ-ఎడిషన్ల'ను చదవాలంటే, వారి ఫాంట్లను కంప్యూటర్లోకి దిగుమతి (డౌన్‌లోడ్) చేసుకొని చదవాల్సి వస్తుంది. యూనీకోడ్‌లో ఉంటే తెలుగు అక్షరాలను ఏ కంప్యూటర్లోనయినా చదవచ్చు. భద్రపరచుకోవచ్చు. ఆ యూనీకోడ్ ఫాంట్లు అందంగానూ, డీటీపీ చేసుకోవటానికి వీలుగానూ ఉంటే లిపిపరంగా పూర్తి విజయం సాధించినట్టవుతుంది.

2006 ఆగస్టులో ఇంటర్నేషనల్ ఆర్గనైజేషన్ ఫర్ స్టాండర్డైజేషన్‌వారు విడుదల చేసిన యూనివర్సెల్ కేరెక్టర్ ఆధ్వర్యంలోని 'భారతీయ భాషల సాంకేతికాభివృద్ధి సంస్థ' ఈ విషయంలో చాలా కృషి చేసింది. ఇప్పుడు డీటీపీ ఫాంట్లను యూనీకోడ్‌లోకి మార్చుకొనే ఉపకరణాలు వచ్చాయి.

కంప్యూటర్ తెలుగు అక్షరాలకు సంబంధించినంతవరకూ ఇప్పటిదాకా జరిగిన కృషి అంతా భాషాభిమానం ఉన్న ఔత్సాహికుల వలన జరిగిందే! ఇంటర్నెట్‌తో బాగా పరిచయం ఉన్నవారికి మాత్రమే వీటి వివరాలు తెలుస్తున్నాయి. సామాన్య ప్రజలకు కంప్యూటర్లలో వస్తోన్న ఈ తెలుగు పరిణామాల గురించి అంతగా తెలియదు. కంప్యూటర్ పరిజ్ఞానం గానీ, డీటీపీ పరిజ్ఞానంగానీ లేకుండా, కంప్యూటర్ని వాడుకొంటున్న వాడకందారులే ఎక్కువ. వీళ్ళకు తికమకలేకుండా తెలుగు యూనీకోడ్ ఫాంట్లను అందించగలిగితే, తెలుగులో ఎంతటి పనినయినా చేసుకోగలుగుతారు. ఒక తాపీమేస్త్రీ, ఒక స్కూటర్ మెకానిక్, ఒక బుక్‌బైండర్ కూడా తమ అవసరాలకు కంప్యూటర్‌ని తెలుగులో వినియోగించగలిగినప్పుడే సంపూర్ణ సాంకేతిక విప్లవం వచ్చినట్టు. తెలుగు భాషకు సంబంధించినంతవరకూ సర్వ ప్రామాణికంగా ఉండే వ్యవస్థ ఇప్పటికీ అందుబాటులో లేదు. దానిని సక్రమంగా నిర్వహించగలిగే యంత్రాంగం కావాలి. అందుకోసం అంతర్జాతీయస్థాయిలో ఏర్పడిన సంస్థ 'యూనీకోడ్' కన్సార్టియం'.

## యూనీకోడ్ కన్సార్టియంలో సభ్యత్వం :

కన్సార్టియం అనే పదానికి ఒకే రంగానికి చెందిన వివిధ వాణిజ్యసంస్థలు కలిసి నిర్మించుకున్న ఐక్యవేదిక అని అర్థం. యూనీకోడ్ కన్సార్టియం అనేది లిపికి సంబంధించిన ఒక లాభాపేక్ష లేని వాణిజ్య సేవాసంస్థ. అనేక సంకేతాల లిపులను యూనికోడ్ మార్పిడి విధానం Unicode Transformation format (UTF) ద్వారా ప్రామాణిక లిపి పరిధిలోకి తీసుకువచ్చేందుకు ఈ సంస్థ అవకాశం కల్పిస్తుంది. వివిధ సాంకేతిక సంస్థలు తమ ఉపకరణాలలో తెలుగును వినియోగించటానికి ఇందువలన అవకాశం ఏర్పడుతుంది. భాషా ఉపకరణాల అంతర్జాతీయీకరణం (internationalization), స్థానికీకరణం (Localisation) అనే రెండు కార్యక్రమాలు ఇందువలన ఒకేసారి జరుగుతాయి. ప్రపంచభాషగా తెలుగును తీర్చటానికి ఇది మొదటి అడుగు. విశ్వవ్యాప్తంగా ఉన్న 18 కోట్ల తెలుగు ప్రజలకు తెలుగునేలతో అనుసంధానించటం సాధ్యపడుతుంది.

ప్రపంచంలో ఉన్న అన్ని భాషల అక్షరాలనూ సూచించగలిగే ప్రామాణిక సంకేతాన్ని యూనీకోడ్ అంటారు. కంప్యూటర్ తయారీదార్లు, వివిధ ఉపకరణాల తయారీదార్లు యూనీకోడ్ విధానంలో ప్రపంచ లిపులను కంప్యూటర్‌తో అనుసంధానం చేయటానికి అనుసరించవలసిన ప్రమాణాలను ఈ సంస్థ నిర్దేశిస్తుంది. లిపి ప్రామాణికత, లిపి ఉపకరణాల విస్తరణ, అభివృద్ధి దీని ప్రధాన లక్ష్యాలు. సాఫ్ట్‌వేర్ ఉపకరణాల తయారీదార్లు, అమ్మకందార్లూ, వివిధ భాషలకు చెందిన ప్రభుత్వాలూ, ఇతర సంస్థలూ, వ్యక్తులూ యూనీకోడ్ సమాఖ్యలో సభ్యులుగా ఉంటారు. మనకు కావలసిన సాఫ్ట్‌వేర్‌ల తయారీకి, వాటిని ప్రపంచవ్యాప్తంగా అన్వయించటానికి, అందరికన్నా ముందు నాయకత్వస్థానంలో నడవటానికి యూనీకోడ్‌లో సభ్యత్వం ఉపయోగపడుతుంది. ఇంటర్నేషనల్ ఆర్గనైజేషన్ ఫర్ స్టాండర్డైజేషన్, ఇంటర్నెట్ ఇంజనీరింగ్ కన్సార్టియం. వరల్డ్ వైడ్ వెబ్ కన్సార్టియం మొదలైన అంతర్జాతీయ సాంకేతిక సంస్థలతో ఇది కలిసి పనిచేస్తుంది. ఒకవిధంగా దీన్ని భాషా పరిశ్రమ (language industry) గా చెప్పవచ్చు. సాంకేతికంగా తెలుగుభాషకు మేలు జరగాలంటే మనంకూడా ఈ సంస్థలో భాగస్వాములు కావటం తప్పనిసరి. యూనీకోడ్ సమాఖ్యలో 5 రకాల సభ్యత్వాలున్నాయి. వాటిలో ముఖ్యమైనది పూర్తిస్థాయి సభ్యత్వం. సంవత్సరానికి 15,000 అమెరికన్ డాలర్లు సభ్యత్వ రుసుము చెల్లించి దీనిని పొందవచ్చు. పూర్తిస్థాయి సభ్యత్వం కలిగినవారికి సాంకేతిక ఉపకరణాల తయారీ

సంస్థలతో సాన్నిహిత్యం ఏర్పడుతుంది. సంస్థ నిర్ణయాలను ప్రభావితం చేయగలుగుతాము. కార్యవర్గ ఎన్నికల్లో పాల్గొనగలగటం, ఎన్నికయ్యే అవకాశాలు కూడా ఉంటాయి. యూనీకోడ్ టెక్నికల్ కమిటీ సమావేశాలలో కూడా పాల్గొనగలుగుతాము. మన భాషకోసం ఈ అవకాశాలను చక్కగా ఉపయోగించగలగాలి.

ఐ.టి. రంగ నిపుణులు, భాషావేత్తలతోపాటు మాతృభాషాభిమానం కలిగిన పరిశోధకులను, చరిత్ర, సాహిత్యం, వేదం, వేదాంతం, ఆయుర్వేదం, గణితం, వ్యాకరణాది తెలుగుభాషా సంస్కృతుల అంతర్జాతీయ సాంకేతిక వేదిక International forum for information and Technology in Classical Telugu Language and Culture తక్షణం ఏర్పడవలసిన అవసరం ఉంది.

1. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం సహాయంతో మన ప్రాచీన సాహిత్యం, శాస్త్రాలను క్రోడీకరించటం, శాసనాధారాలను ఒకచోట చేర్చటం, వాటిని పదిలపరచటానికి, చక్కని రూపులో తిరిగి పొందటానికి (archiving) కంప్యూటర్ ఒక తప్పనిసరి, దీనికోసం విషయ సూచికలు, విషయాలవారీ విభజన, వెదకులాట (సెర్చ్)కోసం తగిన ఉపకరణలు కావాలి.

2. 'తెలుగు నడుపు మొగసాల' (తెలుగు ఓపెన్ ఆఫీసు) ఉండాలి. పలికితే అక్షరాలుగా మారటం (voice recognition), పలుకుల విశ్లేషణ (speech synthesis), వెదకులాడే మరలు (search engines) సంగతుల పెళ్లగింపులు (data mining)... అన్నీ తెలుగులో అడిగితే జరగాలి.

3. నిఘంటువులో వెదకులాట, సమానార్థపక పదాల ఎంపిక, సమీక్ష చేయటం, తప్పుల దిద్దుబాటు కొత్తపదాలు చేర్చటం, పదవిజ్ఞానం, వాక్యనిర్మాణ విషయాలు, వ్యాకరణ సహాయం, అర్థజ్ఞానం.. వీటికోసం ఒక తెలుగు సాఫ్ట్‌వేర్ తయారుకావాలి.

4. ఇ-వాణిజ్యం (e`commerce), నానా నడుపులు (multimedia tools) వికీపీడియాలాంటి విజ్ఞాన సర్వస్వాలు, చదువుకు సంబంధించిన గడపలు (educational portals) తెలుగులో జరగాలి.

5. వివిధ సంస్థలు రూపొందించిన తెలుగు డేటాబేస్‌లను అనుసంధానం చేయటంద్వారా సమాచారాన్ని అందరూ స్వేచ్ఛగా పంచుకొనే అవకాశం కలగాలి.

ఇవన్నీ ప్రపంచ తెలుగుకోసమే పెట్టుకొంటున్న ఆశలు. కానీ, స్వాతంత్ర్యం వచ్చిన ఆరున్నర దశాబ్దాలలోనూ ఇంతవరకూ జనసామాన్యం మాట్లాడుకొనే తెలుగు పదాలకు, మాండలికాలకూ, ప్రాంతీయ ప్రయోగాలకూ సమానమైన ఆంగ్ల పదాలతో ఒక సమగ్రమైన

మహా నిఘంటువును (లెక్సికాన్) నిర్మించుకోలేకపోయాం. గూగుల్ సంస్థ తెలుగులోకి అనువాదం చేసే ఒక ఉపకరణాన్ని ప్రవేశపెట్టింది. కానీ దానికి తగ్గ నిఘంటువుని కంప్యూటర్‌కు మనం ఇవ్వలేకపోవటం వలన ఆ అనువాదం చాలా పేలవంగా ఉంది. ఇతర భాషలలో వర్చ్యుయెల్ అకాడమీలు, విశ్వవిద్యాలయాలు పనిచేస్తున్నాయి. వర్చ్యుయెల్ అనే పదానికి కంప్యూటర్ ద్వారా సాధించినది అని అర్థం. మిచిగాన్ వర్చ్యుయెల్ విశ్వవిద్యాలయం పనిచేస్తోంది. తమిళనాడులో తమిళ వర్చ్యుయెల్ విశ్వవిద్యాలయాన్ని తగిన నిధులతో ఏర్పరచి, దరిమిలా అకాడమీగా మార్చారు. పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లలో వర్చ్యుయెల్ అకాడెమీలు దేశస్థాయిలో పనిచేస్తున్నాయి.

## ప్రపంచ తెలుగుకు మొదటి అడుగులు :

2011 ఏప్రియల్ 16న తొలి తెలుగు సదస్సు దరిమిలా భాషా సాంకేతిక విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మునుపెన్నడూ లేనంత వేగంగా ప్రతిస్పందించింది. మంత్రి శ్రీ పొన్నాల లక్ష్మయ్య ఉత్సాహం చూపించటం వలన, అధికారులు సానుకూలంగా స్పందించటం వలన, ముఖ్యమంత్రిగారు ప్రోత్సహించటం వలన కేవలం మూడు నెలల వ్యవధిలోనే, మంచి పరిణామాలు జరిగాయి.

రాష్ట్రప్రభుత్వ సాంకేతిక శాఖ కార్యదర్శి శ్రీ సంజయ్ జాజు అధ్యక్షతన ఒక సలహా సంఘాన్ని నియమించింది. ఈ సలహా సంఘం 2011 ఆగస్టు 1న అధ్యక్షుని కార్యాలయంలో సమావేశమయ్యింది. అధ్యక్షునితోపాటు, శ్రీ మండలి బుద్ధప్రసాద్, శ్రీ కూచిబొట్ల ఆనంద్, ఆచార్య గార్లపాటి ఉమామహేశ్వరరావు, శ్రీ ఆత్మకూరి అమరనాథ్ రెడ్డి, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ ప్రభృతులు హాజరయ్యారు.

యూనీకోడ్ సమాఖ్యలో పూర్తిస్థాయి సభ్యత్వం ఉంటేనే అనుకున్న ప్రయోజనం నెరవేరుతుందని, రాష్ట్ర విజ్ఞాన విషయాల సంస్థ (A.P. Society for knowledge Networks) ను ప్రభుత్వపక్షాన సభ్యునిగా పంపించాలని, 61 లక్షలు విలువైన భాషోపకరణాలను పొందాలని సలహామండలి నిర్ణయించింది.

సలహా సంఘం సూచనమేరకు, విజ్ఞాన విషయాల సంస్థ యూనీకోడ్ కన్సార్టియంలో సభ్యత్వం కోసం సంవత్సరానికి 15,000 అమెరికన్ డాలర్లు (సుమారు 7 లక్షల రూపాయలు) చెల్లించేందుకు సంసిద్ధతను వ్యక్తపరిచింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పక్షాన ఈ సంస్థ యూనీకోడ్ కన్సార్టియంలో సభ్యునిగా ఉంటుంది.

30 లక్షలతో 6 అందమైన యూనీకోడ్ తెలుగు ఫాంట్లు, 8 లక్షలతో ఒక 'సెల్ఫ్ చెకర్' 10 లక్షలతో ఒక ఎడిటర్, ఒక బ్రౌజర్, 5 లక్షలతో ఒక ప్రామాణికమైన 'కీ బోర్డ్', 6 లక్షలతో కొన్ని తెలుగు డాక్యుమెంటేషన్ ఉపకరణాలు రూపొందించటానికి నిర్ణయించినట్లు ప్రభుత్వం ప్రకటించింది.

తమిళులు తొలి అంతర్జాతీయ ఇంటర్‌నెట్ సదస్సును 10 ఏళ్ళ నుంచి ప్రతి సంవత్సరం జరుపుకొంటున్నారు. పది సంవత్సరాల మన ఆలస్యాన్ని ఈ మూడునెలల్లో భర్తీ చేసుకొని, తమిళ సోదరులను అధిగమించగలిగాం. ఏర్పాట్ల దశలో ఉన్న సాంకేతికాభివృద్ధి వాస్తవరూపంలోకి కొద్దిరోజులలోనే వస్తుంది. తెలుగుభాష మరణశయ్య నెక్కిందనే ప్రమాదక భావనలోంచి మనం ఇంక ఇవతలకు రావచ్చు. చదువుకున్న తెలుగువాళ్ళే ఇంతకాలం తెలుగుభాషకు అన్యాయం చేస్తూ వచ్చారు. ఇప్పుడు ఆ చదువుకున్నవారి కంప్యూటర్లలోకి తెలుగు చేరుతోంది. దాన్ని వాళ్ళు ఎంతమేర కాపాడుకోగలుగుతారో చూద్దాం. ఎందుకంటే 'ఇ-బేరసారాల'కూ, ఆడిటింగ్ వ్యవహారాలకూ, 'ఇ-సేవ' వంటి పాలనా వ్యవహారాలకూ అన్నింటికీ ఇప్పుడిక తెలుగు చక్కగా ఉపయోగపడబోతోంది.

రాష్ట్రప్రభుత్వం పూనికతో 18 రకాల తెలుగుఫాంట్లు ఉచితంగా కంప్యూటర్లోకి దిగుమతి చేసుకునేందుకు అందుబాటులో వున్నాయి. వీటిలో కొన్ని హెడ్డింగ్ ఫాంటులు కాగా, టెక్స్ట్ ఫాంట్లుకూడా అనేకం ఉన్నాయి. మండలి, మల్లన్న లాంటి ఫాంట్లు అందంగా ఉన్నాయికూడా.

భుక్తినిచ్చేభాషని ఎవరైనా ప్రేమిస్తారు. తెలుగు తనకు వచ్చునని చెబితే, వచ్చే ఉద్యోగం పోయే దుస్థితి ఉన్నప్పుడు, మొత్తుకొన్నా తెలుగుని ఎవరూ ప్రేమించరు. మొన్న జరిగిన రెండవ ప్రపంచ తెలుగు రచయితల మహాసభల తెలుగు చదువుకున్నవారికి 5% మార్కులు అదనంగా ఇవ్వాలనీ, 5% ఉద్యోగాలలో రిజర్వేషన్ కల్పించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశాయి. ఇది అమలయితే కార్పొరేట్ స్కూళ్ళల్లోగానీ, కళాశాలల్లో గానీ కేవలం తెలుగుమీడియం మాత్రమే ఉంటుందని గట్టిగా చెప్పవచ్చు. ఇప్పుడు ప్రభుత్వం మీద మనం వత్తిడి తేవలసిన అంశాల్లో ఇది ముఖ్యమైనది.

(2011 ప్రపంచ తెలుగు రచయితల రెండవ మహాసభల సందర్భంగా నా కీలక ప్రసంగం.)

# ఏది దేవభాష?

మాతృదేవోభవ అని నమ్మిన జాతి మనది. తల్లిని దైవంగా భావించటం ఆస్తికత్వమూ కాదు, నాస్తికత్వమూ కాదు. అది మానవత్వం. తల్లి ఎంత దైవమో ఆ తల్లి భాష కూడా ఆమె బిడ్డలందరికీ అంతే దైవం!

తల్లి భాషను బట్టే తల్లి సంస్కృతి కూడా రూపు దిద్దుకొంటుంది. మాతృభాష, మాతృ సంస్కృతులలోంచే మానవ జీవితం రూపుదిద్దు కొంటుంది. కన్నతల్లిని పస్తుబెట్టి సవతి తల్లికి పట్టుచీరలు కొనిపెట్టే పుత్రుల వలన అమ్మకూ, అమ్మభాషకూ, అమ్మ సంస్కృతికీ ద్రోహం జరుగుతుంది. మానవ భాషలు, దేవ భాషలు అని ప్రపంచంలో రెండురకాల భాషలు ఉండవు. ఉన్నవన్నీ మాతృ భాషలే!

మాతృభాషలన్నీ దేవభాషలే! సంస్కృతం లాంటి సంస్కరించ బడిన భాషలు, ఎస్పిరాంటో లాంటి కృత్రిమంగా తయారయిన భాషలు ఎవరికీ మాతృ భాషలు కానివి కొన్నిఉండగా, జనం నాలుకల మీంచి తప్పుకొని అంతరించిపోయిన మాతృభాషలు ఇంకా అనేకం ఉన్నాయి. దేని ప్రాధాన్యత దానిది. దేని ప్రభావం దానిది. దేని ప్రయోజనం దానిది. ఒక ప్రయోజనం కోసం, ఒక ప్రాధాన్యత కోసం అమ్మభాషను బలిపెట్టుకో నవసరం లేదు. బలి పెట్టాలని ప్రయత్నించే వారిని క్షమించనవసరమూ లేదు.

దేవుడున్నాడా అనే ప్రశ్నలాంటిదే ఆ దేవుడి భాష ఏదనే ప్రశ్న కూడా! దేవభాషని అధ్యయనం చేసే ఒక నూతన శాస్త్ర విభాగానికి ఇటీవల అంకురార్పణ జరిగింది. ఈ శాస్త్రానికి "బయోలోగోస్" అని నామకరణం చేశారు. దేవుని భాష ఈ ప్రాపంచిక భాషల్లో ఏదీకాదనీ, దేవుడి భాష వేరనీ, ఆ భాషని డీకోడ్ చేయాలనీ వాదిస్తున్నారు. ఫ్రాన్సిస్ కోలిన్స్ అనే అమెరికన్ జన్యు శాస్త్ర నిపుణుడు ఈ శాస్త్ర ప్రవర్తకులలో ఒకడు.

"మన నమ్మకాలలో శాస్త్రీయత" అనే గ్రంథంలో ఈ శాస్త్ర విశేషాలను ఆయన ఉటంకించాడు. ఈ గ్రంథం చాలా ప్రసిద్ధి పొందింది.

ఇంతకీ ఏది దేవ భాష? ఎవరు మాట్లాడే భాషని మాత్రమే దేవుడు మాట్లాడతాడు...? ఇంకొకరి భాష దేవుడికి తెలియదా...? మనం పూజించుకొనే దేవుడికి మన భాష రాదా...?రాకనే దుబాషీని పెట్టుకొని, మనం "మమ" అంటున్నామా...? ఇలాంటి ప్రశ్నలు తలఎత్తినప్పుడు వితండవాదం, నాస్తికత్వం ముద్ర వేయటాలకన్నా, నిదానించి మాతృభాషని కించపరిచే అంశాలను పరిష్కరించుకోవటం విజ్ఞత అనిపించుకొంటుంది.

జోరాష్టరును, బుద్ధుణ్ణీ, క్రీస్తునూ, అల్లానీ ఇంకా అనేక హిందూదేవతలను, ఆఫ్రికన్, గ్రీకు దేవతా మూర్తులను ప్రపంచంలో ఎందరో పూజిస్తున్నారు. ఆరాధిస్తున్నారు. భక్తితో కొలుచుకొంటున్నారు. వారివలనే తమకు జన్మరాహిత్యం కలుగుతోందని, పుణ్యలోకాలు సంప్రాప్తిస్తున్నాయని, నమ్ముతున్నారు.

ఇక్కడి వాడు ఎక్కడి దేవుణ్ణో కొలుచుకోవటానికి భాష అడ్డం కాదు, కాకూడదు కూడా! ఎక్కడి వాడయినా తన దేవుణ్ణి "ఓ దేవుడా... కాపాడు" అని తన మాతృభాషలోనే వేడుకొంటాడు. కాబట్టి, దేవుడితో మాట్లాడుకోవటానికి, దేవుడికి సంబంధించిన పూజాది క్రతువులు నడుపుకోవటానికి, దేవుడి ప్రవచనాలను చదువుకోవటానికి మాతృభాష ఉపయోగపడ్తుందని అర్థం అవుతోంది.

ఒక భాషాజాతీయుల సంస్కృతి ఆ జాతీయుల భాషని బట్టి, వారి కట్టూ, బొట్టూ, ఆహార విహారాలను బట్టి, ఆ జాతీయులు నివసించే ప్రాంతాన్ని బట్టి, అక్కడి వాతావరణాన్ని బట్టి, అక్కడి పాలనా విధానాలను బట్టి, అక్కడి జీవన స్థితి గతులను బట్టి ఏర్పడుతుంది. ఒక అలవాటునో ఒక ఆచారాన్నో దిగుమతి చేసుకోగలమేమో గానీ, ఒక వాతావరణాన్ని తెచ్చుకోలేం కదా! భాష, ఆ భాషలోని పదాలు రూపొందటానికి ఇవన్నీ కారణాలే! అన్నింటినీ పక్కనబెట్టి ఫలానా భాష దేవభాష, అందులోనే దేవుణ్ణి పూజించాలి అనటం అన్యాయం.

తాను నమ్మిన దేవుడికి దణ్ణం పెట్టుకోవటానికి భక్తుడికి ఒక పురోహితుడి సిఫారసు మంత్రాన్ని ఉపయోగించ వలసి రావటం మాతృభాష పరంగా ఇబ్బంది కలిగించే అంశమే!

పురోహిత వర్గ ఆధిపత్యానికి మాతృభాష అడ్డం అవుతుంది. కాబట్టి, మాతృభాషలలో దైవపూజలు నిరాకరించ బడ్డాయి.

తన దేవుడికి తాను తినేదే తెచ్చి పెట్టిన భక్తకన్నప్ప ప్రదర్శించిన ముగ్ధభక్తి అస్సలైన తెలుగు సంస్కృతికి అక్షర సాక్ష్యం.

వడపప్పుని సంస్కృతంలో ఏమనాలో తెలియక 'వడపప్పు, పానకం సమర్పయామీ' అంటారు గానీ, 'దేవుడా,ఇది తిను' అంటే, తీసుకోడేమోననే అనుమానం మనకు ఎందుకు కలిగింది? ఈ అనుమానమే అన్ని రంగాలలోనూ తెలుగుభాషని వాడకంలోంచి తప్పించింది.

అయినదానికీ, కానిదానికి సంస్కృత పదాలను వాడటం, ఆచార వ్యవహారాలన్నీ సంస్కృతం లోనే జరిపించటం, మాతృభాషను పక్కన పెట్టి, సంస్కృతానికి పెద్దపీట వేయటం...క్రీస్తు శకం తొలి శతాబ్దాలలోనే ఘనత వహించిన విషయాలు(status symbols)గా చెలామణి అయ్యాయి. మాతృభాషను తక్కువపరిచే ఆలోచనకు ఇలా రెండు వేల ఏళ్ళ చరిత్ర ఉన్నదన్నమాట!

సంస్కృత పదాలతో ద్రావిడభాషలు పరిపుష్టినొందిన మాట నిజం. కానీ,ఇది అటునించి ఇటే జరిగిందనటానికి వీల్లేదు. ఆదాన ప్రదానాలు రెండూ ఉంటాయి. అనేక ద్రావిడ పదాలు సంస్కృత భాషలో చేరిన సంగతిని మన పండితులు మరుగు పరిచారు. మహత్తరమైన భారతీయ సంస్కృతిని, సంస్కృత భాషను పటిష్ట పరచటంలోతెలుగు పాత్రనీ, తెలుగు వారి పాత్రనీ తొక్కిపెట్టారు.

ఎఫ్ బి జె క్వీపర్ అనే పరిశోధకుడు, షుమారు 350 పదాలు ఇండో యూరోపియన్ భాషాకూటమికి చెందనివి అరువుపదాలుగా ఋగ్వేదంలో ప్రయోగించ బడ్డాయని పేర్కొన్నాడు. మయూర, గజ, కార్పాస లాంటివి సంస్కృత పదాలు కావనీ, అవి ముండా లేదా ద్రావిడ పదాలు కావచ్చని అభిప్రాయ పడ్డాడు.

ఋగ్వేద కాలంలోనే ద్రావిడభాషల ఉనికి భారత దేశంలో ఉంది. సింధూ నాగరికతలోనే తెలుగు వాడకంలో ఉండేందుకు అవకాశం ఉందని సౌతవర్ లాంటి పాశ్చాత్య పరిశోధనలే కాకుండా ఐరావతం మహదేవన్‌లాంటి తమిళ పరిశోధకులు కూడా భావిస్తున్నారు. అయినా మనం తెలుగంటే పెదవి విరవటం మానుకోలేకపోతున్నాం!

జీవనదికి ఆవలి గట్టు సంస్కృతం అయితే ఈవలి గట్టు తెలుగు. ఈ దేశపు మహోన్నత సంస్కృతే ఆ జీవనది. ఏటి గట్టులాగానే భాష స్థిరంగా ఉంటుంది. ఎడతెగక పారే నది దాన్ని తడుపుతూ ఉంటుంది. పొల్లుపోకుండా నదిని కాపాడటం గట్టు చేయాల్సిన పని. అటు సంస్కృతమూ, ఇటు తెలుగూ చేస్తున్నది, చేయవలసింది అదే...!

భాష మరణించటం అంటే, గట్టు తెగటమే! మన తెలుగు గట్టు తెగింది. గండి పడి, పరభాషా పదాల వెల్లువ బైటనుంచి ముంచెత్తి జీవనది కలుషితమౌతోంది.

పరస్పర ప్రభావాలు, సంఘర్షణలూ, సంలీనాల ఫలితంగా ఏర్పడిన ఈ దేశ సంస్కృతిలో మనం ఒక భాగం. మన మాతృభాష కూడా ఒక భాగం. మన మాతృభాషను కించపరుస్తూ మన సంస్కృతికి సంబంధించిన అంశాలలో దానికి ప్రాధాన్యత లేకుండా చేయాలని ఏకపక్షంగా చూడటాన్ని మనం ఎందుకు ఆమోదించాలనేదే ప్రశ్న.

వెయ్యేళ్ళ క్రితం శివకవులు ఇదే ప్రశ్నను లేవనెత్తారు. జానుతెనుగులో సాహిత్య సృష్టి చేశారు కూడా.

క్రీస్తుతర్వాత 12వ శతాబ్ది వాడయిన పాల్కురికి సోమనాథుడు, ప్రజలు పాటించే ధర్మాలలో ప్రజలభాష లేకపోవటాన్ని తప్పు బట్టాడు. ఆయన లేవనెత్తిన అంశాలకు వెయ్యేళ్ళయినా సమాధానం చెప్పకుండా ఆయన ఆక్షేపించినదాన్నే ఆచరిస్తూ వస్తున్నాం మనం!

మనలో మాతృభాష పట్ల చిన్నచూపు గలవారు అధికులు కావటాన పాల్కురికి సోమనార్యుల ఉద్యమం అరణ్య రోదనం అయ్యింది. తిక్కనాదులు వారి వారసులుగా ఎందరొచ్చినా, కృష్ణదేవరాయలు దేశభాషలందు తెలుగులెస్స అని ఎలుగెత్తి చాటినా, అది మనలో మాతృభాషా చైతన్యాన్ని తట్టి లేపలేక పోయిందంటే మనం మొద్దు నిద్ర నటిస్తున్నామనటం చిన్నమాటే!

మాతృభాషోద్యమం సంస్కృత భాషకు వ్యతిరేకంగా ప్రారంభమైందనటం అన్యాయం. మాతృభాషోద్యమం అనేది ఏ ప్రాపంచిక భాషకూ వ్యతిరేకం కాదు. సంస్కృతం, తెలుగూ రెండూ కలిసే భారతీయ సంస్కృతిని సంరక్షిస్తున్నాయి. ఆ రెండవ పార్శ్వాన్ని ఎవరు కించ పరిచినా మాతృభాషా ద్రోహమే అవుతుంది. ఏదయినా అమ్మభాష తరువాతే అనుకో లేకపోయినప్పుడు మనం ఎంత మేథావులమైతే మాత్రం జాతికి ఒరిగేదేమిటీ?

మన ఆచార వ్యవహారాలలో ప్రతి చిన్న విషయాన్నీ మతంతోనూ, కులంతోనూ, దేవుడితోనూ ముడి పెట్టకుండా, “సామాజిక ప్రయోజనం” అనే కోణంలోంచి చూస్తే జాతికి మేలు కలుగుతుంది. అమ్మభాషకు వాడకం పెరుగుతుంది. మన సంస్కృతిని ఉగాది పండగలాగా అచ్చంగా తెలుగులో నడుపుకో గలిగితే తెలుగే దేవ భాష అవుతుంది. ఏది దేవ భాష అనే ప్రశ్నకు ఒక్కటే సమాధానం...కష్టం కలిగినప్పుడు మనసు ఏ

భాషలో రోదించి సహాయం అర్థిస్తుందో, సంతోషం కలిగినప్పుడు మనసు ఏ భాషలో సంతృప్తిని వెళ్లబుచ్చుకుంటుందో, భావోద్వేగం కలిగినప్పుడు మనసు ఏ భాషలో ఆరాట పడుతుందో, అది దేవ భాష! అది నా భాష!! అది మన భాష!!!

ఇది నాస్తికత్వం ఆస్తికత్వం చర్చకు ఇది కేవలం మాతృభాష పట్ల జరుగుతున్న చిన్నచూపు ధోరణికి మాతృభాషోద్యమం ప్రదర్శించే ఆవేదన మాత్రమే! ఈ చిన్న చూపు మతపరంగా జరుగుతున్నా, చదువు పరంగా జరుగుతున్నా, పాలనా పరంగా జరుగుతున్నా గొంతెత్తవలసిన బాధ్యత భాషోద్యమానికుంది. "తెలుగే దేవభాష" పుస్తకం ఈ ఉద్యమ మహా వృక్షానికి చిటారు కొమ్మ!! తక్కిన మేవంతా తెలుగును ప్రపంచభాషగా చూడాలని కలలుకంటున్నాం. రహంతుల్లా గారు ఒకడుగు ముందుకేసి తెలుగును దేవభాషగా చూడాలనుకొంటున్నారు.

*** *** ***

దేవ భాషల విషయంలో క్రీస్తుపూర్వ కాలంలోనే వివిధ మతాల స్థాయిలో జరిగిన అనేక పరిణామాలను ఒక పరిశోధకుడిగా శ్రీ రహంతుల్లా విశ్లేషించిన తీరు గొప్పది. మాతృ స్వామ్య వ్యవస్థనించి పితృస్వామ్య వ్యవస్థలోకి మానవ సమాజం పరిణమించిన క్రమంలో మాతృభాషా హననం, పితృభాషా భావనలు ఏ విధంగా రూపుదిద్దుకొన్నాయో బహుశా భాషోద్యమ పరంగా తొలిసారిగా విశ్లేషించిన ఘనత రహంతుల్లాగారికే దక్కుతుంది.

చిన్న చేపల్ని పెద్ద చేపలు మింగేసినట్టు చిన్నభాషలను  పెద్దభాషలు మింగేస్తున్న తీరును ఈ పుస్తకంలో శ్రీ రహంతుల్లా చక్కగా విశ్లేషించారు. ప్రమాదం అంచుకు చేరిన మాతృభాషల చిట్టాని యునెస్కో ప్రకటించిన తరువాతే ప్రపంచ వ్యాప్తంగా మాతృ భాషోద్యమాలు బయలుదేరాయి. తెలుగుభాషోద్యమం అనేక ఫలితాలను సాధించింది కూడా! ఇంగ్లీషు లింక్ తెగితే, ఆక్సిజన్ ట్యూబు కనెక్షను తెగినట్టయి జాతీయ సమగ్రతే దెబ్బతినే పరిస్థితి ఏర్పడటం పట్ల శ్రీ రహంతుల్లా ఆవేదన చేరవలసిన వారికి చేరాలి.

సాంకేతికంగా తెలుగును అభివృద్ధి చేసుకోవటంలో దేశంలోని చాలా భాషలకన్నా మనం ముందున్నాం. ఇది భాషోద్యమ కృషి ఫలితమే! సాంకేతికతని తెలుగు భాషద్వారా మనం సద్వినియోగ పరచుకోవాలంటే, ప్రజలు వాడుకొనే అన్ని పదాలతోనూ, మాండలికాలతోనూ, వృత్తి పరమైన, సాంకేతిక పరమైన పదజాలంతో పరిపూర్ణమైన లెక్సికాన్ లేదా మహా నిఘంటువు తయారు కావలసిన ఆవశ్యకతని ఆయన చక్కగా గుర్తించారు.

ఆన్ లైన్ డిజిటల్ డిక్షనరీలు అందుబాటులోకి వచ్చినప్పుడు తెలుగు తనను తాను ప్రపంచ భాషగా తీర్చిదిద్దుకో గలుగుతుంది. యూనీకోడ్ ఫాంట్లలో తెలుగు లిపిని ఆవిష్కరించేందుకు జరిగిన చర్చలలో రహంతుల్లా గారిది ముఖ్యపాత్ర. రహంతుల్లాఫాంటుగా ప్రసిద్ధి చెందిన ఒక తెలుగు ఫాంటు కూడా ఉంది.

మౌలికంగా శ్రీ రహంతుల్లా సామ్యవాది. ప్రజాస్వామ్యవాది. ఆయనకు అన్ని మతాల పట్ల సమాన గౌరవమే ఉంది. మహమ్మదీయ కుటుంబంలో జన్మించినా, తెలుగే తన మాతృభాషగా ప్రకటించుకొన్నారు. నమాజుతో సహా అన్ని మతాల దేవతా ప్రార్థనలూ తెలుగులోనే జరిగేందుకు అన్ని మతాల పెద్దలు చొరవ తీసుకోవాలనేది ఈ పుస్తకంలో శ్రీ రహంతుల్లా అభ్యర్థన. నిఖానామా పత్రాలు కూడా తెలుగులోనే ఉండాలని ఆయన కోరుతున్నారు.

ఆయనది మత దృష్టి కాదు. భాషా దృష్టి మాత్రమే! తెలుగులో తొలి ఖురాన్ అనువాదం 1934లో చిలుకూరి నారాయణరావు చేశారు. అదే దారిలో అన్ని మతాల మతపరమైన అంశాలు మాతృ భాషలలోనే సాగాలని శ్రీ రహంతుల్లా కోరుకొంటున్నారు.

తెలుగే దేవభాష అని ఎలుగెత్తి చాటుతున్న ఆత్మీయ మిత్రులు, తెలుగుభాష కోసం అనునిత్యం పరితపించే భాషోద్యమ కార్యకర్త, ఒక ఉన్నతాధికారిగా తన పరిధిలో తెలుగులోనే పాలనా వ్యవహారాలు నడుపుతున్న సహృదయులు శ్రీ నూర్ బాషా రహంతుల్లా గారి మనసులోని ఆర్తిని బయటకు తీసుకు రావటానికి ఈ నాలుగు మాటలు "బండి ముందు నడిచే బంటు" లా ఉపయోగ పడితే సంతోషం. రహంతుల్లా గారికి మనః పూర్వక అభివాదాలు.

(శ్రీరహంతుల్లా "ఏది దేవభాష" గ్రంథానికి నా ముందు మాటలు)



# తెలుగు ప్రాధికార సంస్థ : : కొన్ని సూచనలు

ప్రజల గుండె తలుపులు తడుతూ భాషోద్యమం చేసిన కృషి ఆచరణలో శూన్యాన్ని చూపిస్తోంది. విద్యారంగంలో తెలుగు బోధించటానికి అనేకసార్లు విడుదల చేసిన జీవోలు అమలు కాకపోవటం, పాలనలో తెలుగు కానరాక పోవటం అనే రెండు అంశాల్ని సరిచేయటానికి ప్రభుత్వానికి నిబద్ధత లేదు. తెలుగు పండుగ రోజున "తెలుగు అభివృద్ధి" ప్రకటనతో కళ్లనీళ్లు తుడవటం తప్ప జరుగుతున్నది లేదు.

## "పాలనా భాషగా తెలుగు" కథ

20-9-1955 న మొదటి సారిగా ఆంధ్రప్రదేశ్ శాసనసభ తెలుగును పాలనాభాషగా ప్రకటిస్తూ తీర్మానించింది. నాటి స్పీకర్ అయ్యదేవర కాళేశ్వర రావు అధ్యక్షతన ఒక కమిటీకి పాలనా పారిభాషిక పదాలు రూపొందించే బాధ్యత అప్పగించారు. 1959 లో తాలూకా స్థాయి వరకూ తెలుగు అమలు సాధక బాధకాలను పరిశీలించేందుకు ఒక స్పెషల్ ఆఫీసర్ని నియమించారు. 1966లో అధికార భాషాసంఘాన్ని 6వ చట్టంగా తెచ్చారు.

## అధికార భాషా సంఘం

తెలుగు భాషలో పాలనకు సంబంధించిన ఒక సలహా మండలిగా మాత్రమే ఇది పనిచేసింది. ఆదేశించే అధికారాలు గానీ, అమలు చేసే యంత్రాంగం గానీ దానికి లేవు. శ్రీ వావిలాల, డా. సినారే, శ్రీ ఎబికె, శ్రీ బుద్ధప్రసాద్ ప్రభృతులు అధికార భాషాసంఘం అధ్యక్షులుగా వ్యవహరించిన కాలాలలో వ్యక్తిగత పలుకుబడితో భాషాభివృద్ధి కార్యక్రమాలు అనేకం చేపట్టారు. వారి పదవీ కాలం తరువాత మళ్ళీ పాతకథే నడిచింది. రాష్ట్ర విభజనకు ముందు అధికార భాషాసంఘాన్ని భాషా సాంస్కృతిక శాఖ పరిధిలోకి తెచ్చారు. నాటినుండీ నేటివరకూ ఆ సంస్థ సుప్తావస్థలోనే ఉంది.

## తెలుగు అకాడమీ

కేంద్రీయ ఇంగ్లీషు సంస్థ (Central Institute of English) లాంటి తెలుగు సంస్థ ఏర్పరడాలని విశ్రాంత ఐసియస్ అధికారి జె.పి.యల్. గ్విన్న్ కమిటీ ఒక సూచన చేసింది. తెలుగుభాషను ఆధునీకరించటం, తెలుగేతరులకు తెలుగు బోధించటం, విశ్వవిద్యాలయాల స్థాయి వరకూ తెలుగు మాధ్యమంలో చదువు చెప్పటం అనే లక్ష్యాలతో 12 జూన్, 1968న తెలుగు అకాడమీ ఏర్పడింది. అది చివరికి పాఠ్యపుస్తకాల ప్రభుత్వ ప్రచురణ సంస్థగా మారిపోయింది. తెలుగు మీడియంలో సైన్సు పాఠ్య పుస్తకాలు అంతర్జాతీయ ప్రమాణాలతో తూగలేక పోయాయి. తెలుగు మీడియం అంటే వైముఖ్యానికి ఇది ఒక కారణం. ఇందుకు తెలుగు అకాడమీ తొలి కారణం అనేది నిజం.

## తెలుగు విశ్వవిద్యాలయం

1985లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, సంగీత అకాడమీ, నాటక అకాడమీ, లలితకళా అకాడమీలను రద్దుచేసి, వాటి సమాహారంగా తెలుగు విశ్వవిద్యాలయాన్ని ఏర్పరిచారు. అకాడమీలు నిర్వహించే బాధ్యతలతో పాటు మరికొన్ని భాషాభివృద్ధి కార్యక్రమాలను ఈ విశ్వవిద్యాలయానికి అప్పగించారు. ఆచరణలో అది అకాడెమీలకు ప్రత్యామ్నాయ వ్యవస్థని నిర్మించ లేకపోయింది. అకాడమీల రద్దు ఒక చారిత్రక తప్పిదం అనే భావాన్ని తెలుగు విశ్వవిద్యాలయం ఘనంగానే కలిగించింది.

## మండలి వెంకట కృష్ణారావు అంతర్జాతీయ తెలుగు కేంద్రం

1975లో జరిగిన తొలి ప్రపంచ తెలుగు మహాసభలతీర్మానం ద్వారా అంతర్జాతీయ తెలుగు సంస్థను ఏర్పరిచారు. 1983లో శ్రీ ఎన్.టి. రామారావు తాను కొత్తగా ఏర్పరిచిన తెలుగు విశ్వవిద్యా లయంలో ఈ అంతర్జాతీయ తెలుగు కేంద్రాన్ని ఒక విభాగం చేశారు. కాలక్రమంలో మండలి వెంకట కృష్ణారావు అంతర్జాతీయ తెలుగు సంస్థగా దాన్ని మార్చారు. ఇతర రాష్ట్రాలు, దేశాలలోని తెలుగువారి కోసం ఈ కేంద్రం పనిచేస్తుంది. తెలుగులో పాఠ్య పుస్తకాలు, పాఠశాలలకు సహాయం, ఉపాధ్యాయ శిక్షణ, కూచిపూడి నాట్యంలో శిక్షణలాంటి కార్యక్రమాలు ఈ సంస్థ చేపట్టింది.

## కొమర్రాజు వేంకట లక్ష్మణ రావు విజ్ఞాన సర్వస్వ కేంద్రం

అప్పటివరకూ తెలుగు భాషా సమితిగా ఉన్న ఈ సంస్థని 1986 అక్టోబర్ 15న తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనం చేశారు. తర్వాత కొమర్రాజు వేంకట లక్ష్మణరావు

విజ్ఞాన సర్వస్వ కేంద్రంగా పేరు మార్చారు. అనేక విజ్ఞాన సర్వస్వ గ్రంథాల రూపకల్పన, ప్రచురణలు ఈ విభాగం ద్వారా జరుగుతున్నాయి.

## దూర విద్యాకేంద్రం

వివిధ అంశాల్లోతెలుగు, సంస్కృతం, జ్యోతిషం, వార్తలు, సంగీతం, సినిమా సంభాషణ మొదలైన అంశాలలో బిఎ, పిజి డిప్లొమా, ఎమ్ఎ, సర్టిఫికేట్ కోర్సులు నడుపుతున్నారు.

## ముఖ్యమంత్రి గారి భాషాభివృద్ధి ప్రకటన

ముఖ్యమంత్రి 2016 ఆగష్టు 29మాతృభాషా దినోత్సవం రోజున చేసిన ప్రకటనలో 5 ముఖ్యమైన అంశాలున్నాయి:

1. అన్ని అధికారాలతో శక్తివంతమైన తెలుగు భాషాభివృద్ధి ప్రాధికార సంస్థ ఏర్పాటు.
2. అకాడమీల పునరుద్ధరణ
3. తెలుగులో పాలన.
4. నామఫలకాలు తెలుగులో ఉండేలా చర్యలు
5. ఎన్నికల ప్రణాళికలో భాషాపరమైన వాగ్దానాల అమలు

ఈ 5 అంశాలకు మార్గదర్శకాలను సూచించాలని ఆరుగురు సభ్యులతో ఒక కమిటీని నియమించారు. సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ పల్లె రఘునాథరెడ్డి, శాసనసభ ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్, ప్రభుత్వ సమాచార సలహాదారు శ్రీ పరకాల ప్రభాకర్, సాంస్కృతిక శాఖ కార్యదర్శి శ్రీ నాగులపల్లి శ్రీకాంత్, సాంస్కృతిక శాఖ సంచాలకులు డా. దీర్ఘాసి విజయ భాస్కర్, పురావస్తు శాఖ సంచాలకులు శ్రీ జి రామకృష్ణారావు గార్లతో ఈ కమిటీ ఏర్పడింది.

## తెలుగు భాషాభివృద్ధి ప్రాధికార సంస్థ

తెలుగు భాష పరిరక్షణ, అభివృద్ధి, పరిశోధన లక్ష్యాలుగా వివిధ విభాగాల సమన్వయ వ్యవస్థ ఏర్పాటు అవసరం. దానికి పూర్తి బాధ్యతలు, నిర్ణయాధికారాలు, ఆదేశించే అధికారాలు, ఆదేశాలు అమలు చేయని వారిని శిక్షించే అధికారాలూ ఉన్న పదునైన బాధ్యతాయుతమైన వ్యవస్థ కావాలి. ముఖ్యమంత్రిగారు స్వయంగా ప్రకటించినట్టు

ఈ "తెలుగు భాషాభివృద్ధి ప్రాధికార సంస్థ" స్వతంత్ర ప్రతిపత్తితో ప్రజలకు (శాసనసభకు), ప్రభుత్వానికీ జవాబుదారిగా పనిచేయ గలిగి ఉండాలి. మొత్తం తెలుగు భాషాభివృద్ధి కోసం చేపట్టవలసిన వివిధ కార్యక్రమాలను ఎంపిక చేసి, వాటికి వేర్వేరు విభాగాలను ఏర్పాటు చేస్తే, ఒకే గొడుగు క్రింద సమన్వయంతో అనేక భాషాభివృద్ధి కార్యక్రమాలు జరిగే అవకాశం ఉంది.

1. తెలుగు అకాడమీ (తెలుగు బోధనాంశాల రూపకల్పన, పర్యవేక్షక అకాడమీ),
2. సాంకేతిక తెలుగు అకాడమీ (Telugu Virtual akademi),
3. తెలుగు భాషా పరిరక్షణ ప్రాధికార విభాగం (Telugu Language Policing Authority: నుడికావలి),
4. అంతర్జాతీయ తెలుగు భాషా పరిశోధనా ప్రాధికార విభాగం (International Telugu Research Authority),
5. పాలనా భాషా ప్రాధికార విభాగం (Official Language Authority),
6. తెలుగు అనువాద ప్రాధికార విభాగం (Telugu Translation Authority),
7. ఆంధ్రప్రదేశ్ తెలుగు పుస్తక ప్రచురణ ప్రాధికార విభాగం (A.P. Book Publication Authority),
8. గ్రంథాలయ అభివృద్ధి ప్రాధికార విభాగం (Libraries Development Authority).
9. తెలుగు ఇంగ్లీషు మహానిఘంటువు, పారిభాషిక పదకోశాలు రూపొందించేందుకు ప్రత్యేకంగా ఒక తెలుగు నిఘంటు నిర్మాణ వ్యవస్థ (Telugu Dictionaries Authority)
10. భారతి స్థాయిలో సాహిత్య, సాంస్కృతిక, చరిత్ర, పరిశోధనాత్మక రచనలతో ఉన్నత స్థాయి కలిగిన పత్రిక నిర్వహణ,
11. గ్రూప్ ఇన్సూరెన్సు పథకం, ప్రమాదబీమా లాంటి అంశాలను పర్యవేక్షించే విభాగం
12. ఒక అర్ధ శతాబ్ది కాలంగా కోరుతున్న రచయితల సహకార సంఘం ఈ సంస్థకు అనుబంధంగా ఉండాలి.

ఈ విధంగా భాషాపరమైన అన్ని అవసరాలకు ప్రత్యేక విభాగాలతో ఒక సముదాయ వ్యవస్థగా తెలుగు భాషాభివృద్ధి ప్రాధికార సంస్థ ఏర్పడాల్సిన అవసరం ఉంది. దేశమంతా తిరిగి ఎందరో మేధావులను కలుస్తున్న భాషాభివృద్ధి సాధక కమిటీ ఈ సూచనలను పరిగణనలోకి తీసుకోగలరని భావిస్తున్నాను.

## అకాడమీల పునరుద్ధరణ

30 యేళ్ళ క్రితం నాటి ముఖ్యమంత్రి శ్రీ యన్టీ ఆర్ అప్పుడే కొత్తగా ఏర్పడిన తమిళ విశ్వవిద్యాలయం తరహాలో తెలుగు విశ్వవిద్యాలయానికి రూపకల్పన చేసి, అకాడమీలు చేయగలిగిన కార్యక్రమాలకన్నా ఎక్కువ బాధ్యతలు అప్పగిస్తూ అన్ని అకాడమీలను అందులో విలీనం చేశారు. కాలక్రమంలో అది డిగ్రీల ప్రదానం మీద దృష్టి కేంద్రీకరించటంతో అకాడమీలు లేని లోటు పెరుగుతూ రావటంతో అకాడమీల పునరుద్ధరణ అవసరం ఏర్పడింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీలను ఏర్పాటు చేయనున్నట్టు మాన్య ముఖ్యమంత్రి అసెంబ్లీలో ప్రకటించారు. బాలల అకాడమీ, సైన్సు అకాడమీలు అప్పట్లో రద్దు కాక పోయినా సుషుప్తావస్థ లోనే ఉన్నాయి. ఆ రెంటినీ ప్రాధికార సంస్థలో ప్రత్యేక విభాగాలుగా ఏర్పరచాలి. తెలుగు ప్రాధికార సంస్థతో పాటుగా అదనంగా అకాడమీలు కూడా సమర్థంగా పనిచేసినప్పుడు తెలుగు వెలుగుతుంది. మూడు దశాబ్దాలుగా ఆదరణ లేని సాహితీ కళారంగాలకు అకాడమీలు జవజీవాలను కల్పించాలి!

## తెలుగులో పాలన, తెలుగులో నామ ఫలకాలు

తెలుగంటే ప్రభుత్వ ఉదాసీనత, అధికారుల్లో భాషాభిమానం లేకపోవటాన పాలనా పరంగా తెలుగు దూరం అయిపోతోంది. నామఫలకాలు, శిలాఫలకాలు, ట్రాఫిక్ హెచ్చరికలు కూడా తెలుగులో ఇవ్వటానికి అధికారులు సుముఖంగా లేరు. ప్రభుత్వ ఆదేశాల అమలును అజమాయిషీ చేసే అధికారాలున్న వ్యవస్థ లేకపోవటాన ఇలా జరుగుతోంది. విదేశాల్లోనూ ఈ సమస్య ఉంది. భాషాకాలుష్యాలు నివారించే ఒక అజమాయిషీ వ్యవస్థ కావాలని బ్రిటన్, ఫ్రాన్స్, జపాన్, రష్యా మొదలైన దేశాల్లో భాషాభిమానులు కోరుతున్నారు. 'లాంగ్వేజీ పోలీసింగ్' లేదా 'టంగ్ ట్రూపర్స్'(నుడికావలి) వ్యవస్థ అని దీన్ని పిలుస్తున్నారు. తెలుగు ప్రాధికార సంస్థలో ఈ 'నుడికావలి'ని సర్వాధికారాలతో ఒక విభాగంగా ఏర్పరిస్తేనే భాష పట్ల ప్రభుత్వ నిబద్ధత అమలు కాగలుగుతుంది. ప్రపంచంలోనే మొదటిసారిగా భాషకోసం ఒక రక్షణ వ్యవస్థను

నెలకొల్పిన ఘనత ఈ ముఖ్యమంత్రిగారికే దక్కుతుంది. ప్రపంచంలో తెలుగు 'నెంబర్ 1' కావాలంటే ఇలాంటి నిర్ణయాలు అవసరం.

## తెలుగు విశ్వవిద్యాలయం, తెలుగు అకాడమీలు

తెలుగు విశ్వవిద్యాలయం పక్షాన గతంలో జరిగిన కార్యక్రమాలు తెలుగు భాషా సంస్కృతుల అభివృద్ధికి కొంత తోడ్పడు తున్నప్పటికీ గతంలో అకాడమీల సేవతో పోల్చితే తెలుగు విశ్వవిద్యాలయం తక్కువే తూగుతుంది.

తెలుగు విశ్వవిద్యాలయం నవ్యాంధ్ర ప్రదేశ్‌లో ఏర్పడగానే ద్దాని కార్యక్రమాల పునర్నిర్వచనం జరగాలి. రాష్ట్రంలో అకాడమీలు కూడా ఏర్పడుతున్నాయి. తెలుగు విశ్వ విద్యాలయానికి, తెలుగు ప్రాధికారిక సంస్థ మరియు వివిధ అకాడమీ లతో సమన్వయాన్ని ఏర్పరచటం ద్వారా తెలుగు విశ్వవిద్యాలయం ఒక భాషావారధిగా కొత్త రూపాన్ని సంతరించుకోవలసిన అవసరం ఉంది. భాష ఆధునీకరణ, ఇతర రాష్ట్రాలు, దేశాలలో తెలుగు వారికి తెలుగు డిప్లమా కోర్సులు, ఆన్‌లైన్లో విద్య, సాంకేతికంగా తెలుగు భాషా సంస్కృతుల అభివృద్ధి గురించి తెలుగు విశ్వవిద్యాలయం 'కొత్తదృష్టి' పెట్టాలి. పాతపోకడలు మారితేనే భాషకోసం అది ఏమైనా ఉపయోగపడ గలుగుతుంది.

తమిళ విశ్వవిద్యాలయం ఈ దిశలో ఎంతో ముందుకు వెళ్ళింది. తెలుగు విశ్వవిద్యాలయాన్ని కూడా ఆధునీకరించాలి. అలాగే తెలుగు అకాడమీని భాషా ప్రాధికారిక సంస్థలో ఒక భాగం చేసి, విద్యారంగంలో తెలుగుకు అన్యాయం జరక్కుండా అజమాయిషీ సంస్థగా దాన్ని మెరుగుపరచాలి

## ఎన్నికల ప్రణాళికలోని భాషా హామీల అమలు

2014 ఎన్నికల్లో తెలుగు భాషాభివృద్ధి గురించి 19 హామీలతో విడుదల చేసిన తెలుగుదేశం ఎన్నికల మేనిఫెస్టోని మరొకసారి అధ్యయనం చేసి తూ. చ. తప్పకుండా అమలు చేయటానికి తగిన సూచనలు చేసే బాధ్యతను కూడా ఈ కమిటీకి అప్పగించారు.

ఇంటర్మీడియట్ వరకూ తెలుగు తప్పకుండా చదివేలా చర్యలు తీసుకోవటం ఈ ప్రణాళికలో మొదటి అంశం.

మాతృభాషను నేర్చుకునే హక్కు రాజ్యాంగం మనకు ప్రసాదించింది. దాన్ని కాదనే పరిస్థితి ఈ రాష్ట్రంలో ఉండకూడదు.

తెలుగు భాషా సంస్కృతుల పట్ల గౌరవభావం కలిగించి తెలుగు వారిగా పుట్టినందుకు గర్వించేలా పాఠ్యాంశాల ఎంపిక ఉండాలి. రాష్ట్రంలోని అన్ని విశ్వ విద్యాలయాల్లోనూ సాంకేతిక విశ్వవిద్యాలయాల్లో కూడా తెలుగు శాఖ విధిగా ఏర్పడాలి. స్కూళ్ళు, కాలేజీ లతో పాటు ఇంజనీరింగ్ మెడిసిన్ చదివే వాళ్ళకూడా తెలుగుని ఒక పాఠ్యాంశంగా బోధించాలి. ఉన్నత విద్యలో కూడా తెలుగు చదివేలా ఉండాలి.. రాష్ట్రంలో ప్రతి విద్యార్థి తెలుగుని ఒక సబ్జెక్టుగా చదివే నిబంధన ఉంటే, తెలుగు తక్కువతనం తగ్గుతుంది.

కర్ణాటకకు సంబంధించి రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగాలు 100% కన్నడిగులకే ఇవ్వాలనీ, కర్ణాటకలో కేంద్రప్రభుత్వ,ప్రభుత్వరంగ సంస్థల్లో గ్రూపు సి, డి ఉద్యోగాలను కూడా 100%కన్నడం వారికే ఇవ్వాలని, 65-80% గ్రూప్ బి ఉద్యోగాలను రాష్ట్ర పరిశ్రమల్లో ఉద్యోగాలను కన్నడ భాషీయులకే ఇవ్వాలనీ సరోజినిమహిషి (1984) కమిటీ సూచనలను రామకృష్ణహెగ్డే ప్రభుత్వం ఆమోదించింది. 1999 కన్నడ అభివృద్ధి ప్రాధికార సంస్థ చట్టంలో కూడా సరోజినీ మహిషి నివేదికకు అనుగుణంగా తమ సంస్థ పనిచేస్తుందని పేర్కొన్నారు. ఉద్యోగాలలో స్థానికతకు ప్రాధాన్యత నిచ్చే విధాన నిర్ణయాలు మనకూ అవసరం కావచ్చు.

అర్హులైన కవులు, కళాకారులకు 5,116/- గౌరవ వేతనం, 100 కవితలు వ్రాసిన కవికి పుస్తక ముద్రణకు ఆర్థిక సాయం, కవులు కళాకారులకు కంట్రిబ్యూటరీ పెన్షన్ స్కీము, ప్రమాద బీమా, సంస్కృతం తెలుగు శిక్షణా కళాశాలల పునరుద్ధరణ లాంటి వాగ్దానాలు కూడా ఆ ఎన్నికల ప్రమాణాల్లోఉన్నాయి. తెలుగును రెండవ జాతీయ భాషగా గుర్తించేలా కేంద్రం మీద వత్తిడి తెచ్చే అంశాన్ని ఈ సందర్భంగా ప్రభుత్వానికి గుర్తు చేయటం కూడా అవసరం.

(తెలుగు భాషా పరిరక్షణ కమిటీ 2017లో సమర్పించిన నా సూచనలు)



# భాషాకాలుష్య నివారక వ్యవస్థ
# "నుడికావలి"

ప్రతీ భాషా ఆ భాషాజాతీయులకు ప్రియమైనదీ, ఘనమైనదీ, పవిత్రమైంది కూడా! ముత్తాతల నుండీ మునిమనుమల దాకా భాషా వారసత్వం కొనసాగుతూనే ఉంది. నుడి పరిణామంలో అమ్మభాష అనేది ఒక మజిలీ. అది ఎప్పుడూ కొత్తదనాన్ని తొడుక్కుంటూనే ఉంటుంది. వాడిన కొద్దీ వన్నెకెక్కుతుంది.

ఒక 'భాషాప్రాంతం'లో(లాంగ్వేజీ ఏరియా) చోటుచేసుకున్న భౌగోళిక, సామాజిక, సాంస్కృతిక, మత, రాజకీయ, ఆర్థిక పరిణామాల ఫలితంగా ఒక ప్రత్యేక భాష రూపుకట్టుకుని కాలక్రమంలో ఉన్నతి సంతరించుకుంటుంది.

వివిధ భాషీయుల సమీపవర్తిత్వం, సహజీవనాల కారణంగా ఒక భాషా పదాలు ఇంకో భాషలోకి అవసరం కొద్దీ చేరటం సహజం. వీటిని 'లోన్ వర్డ్స్' – అరువు పదాలని వ్యవహరిస్తారు. అరువు అనటం కన్నా అతిథి పదాలనటం సబబు. అరువుకో అద్దెకో ఒకరు ఇచ్చినవి గాని, తిరిగి ఒకరికి చెల్లించేవి గానీ కాదు కాబట్టి అతిథిపదాలుగా పరభాషా పదాలు వచ్చి చేరతాయి. కొంతకాలానికి అతిథులు కుటుంబంలో సహజంగానే చేరిపోవచ్చు. అతిథుల చేరిక కుటుంబాన్ని బలసంపన్నమే చేస్తుంది.

దైనందిన పరిస్థితుల్లో ఒక్కోసారి పరభాషా పదాల అవసరం కూడా ఏర్పడుతుంది. అందుకు సమానమైన పదం మన భాషలో లేనప్పుడు దాన్ని మన భాషాపదంగా స్వీకరించటం సబబు కూడా! ఎలాంటి అవసరం లేకుండా మోజుకొద్దీ పరభాషా పదాలను ఇష్టారాజ్యంగా వాడటం భాషాకాలుష్యానికి దారి తీస్తుంది. అలాంటి వ్యామోహం ఒకప్పుడు సంస్కృతం విషయంలో ఉండేది. ఫలితంగా తెలుగుకు జరగవలసినంత అపకారం జరిగింది. జానుతెనుగు, అచ్చతెనుగు ఉద్యమాలు ఎన్నివచ్చినా సంస్కృత వ్యామోహం

ముందు దిగదుడుపయ్యాయి. ఇప్పుడు ఇంగ్లీషు వ్యామోహం అదే చేస్తోంది. తెలుగు చదవకూడదు, వ్రాయకూడదని విద్యావేత్తలచేత అనిపిస్తోంది.

అమ్మభాషను అణగ దొక్కడం, అవసరం లేకపోయినా మోజుకొద్దీ పరాయి పదాలను తెచ్చి జనం మీద రుద్దటాలను భాషాకాలుష్యం అంటారు. ఈ 'మోజువరులు' పరభాషను నేర్చుకోవటానికి అమ్మభాషను మరిచిపోవాలనే సిద్ధాంతాన్ని అమలు చేస్తున్నారు. మాతృభాషను కించపరిచే వ్యక్తుల్ని, వ్యవస్థల్ని పట్టి శిక్షించ గలిగే భాషా కాలుష్య నివారక యంత్రాంగం ఉండాలని అంతర్జాతీయ స్థాయిలో అనేకమంది భాషావేత్తలు కోరుతున్నారు . వీళ్ళు భాషా ఛాందస వాదులో, ప్యూరిటనిస్టులో లేక గ్రాంధిక వాదులో ఎంత మాత్రమూ కాదు. ప్రజల వాడుకభాష కలుషితం కాకూడదనే భావన ఉన్నవాళ్ళు.

భాషా కాలుష్య పరిస్థితిని నివారించేందుకు భాషా కావలి (లాంగ్వేజి పోలీసు) వ్యవస్థని వీళ్ళు కోరుతున్నారు. 2013 తరువాత లాంగ్వేజి పోలీసింగ్ గురించి ఇంగ్లీషు, ఫ్రెంచి. రష్యన్ మేధావులు తరచూ చర్చిస్తున్నారు. 'నుడికావలి' విధుల్ని నిర్వర్తించే సుశిక్షితులైన భాషాపోలీసులు లేదా టంగ్ ట్రూపర్ల ఏర్పాటు ప్రభుత్వపరంగానే జరగాలి. అధికారాలు లేని సలహా మండళ్ళు అలంకార ప్రాయంగానే మిగిలిపోతాయి. పటిష్ఠమైన భాషా సంరక్షణ వ్యవస్థ కావాలి.

## వాడుకభాషే మాతృభాష :

మాతృభాష అనేది వాడుకభాషే గానీ పండితభాష కాదు. మనసు ఏనాడూ గ్రాంధికంలో ఆలోచించదు. లాక్షణిక వ్యాకరణ సూత్రాలు గ్రాంధికానికే ఉపయోగపడతాయి. పామరులభాష లేదా వాడుక భాష గాలికి ఆరబెట్టిన పేలాల పిండి లాంటిది. అది ఏ క్షణానైనా కృష్ణార్పణం కావచ్చు.

భాషాజాతీయుల సంస్కృతి మీద ఎక్కువ ఆధారపడి మాతృభాష ఉంటుంది. అది పరిణామశీలి. రాయిలా బిగుసుకు కూర్చోవటం దాని స్వభావం కాదు. ఈ పరిణామశీలతే లేకపోతే భాష త్వరగా వాడకాన్ని కోల్పోతుంది. భాషా పరిణామాలకు సాంస్కృతిక కారణాలే ప్రధానమైనవి.

అమ్మకడుపులో మావి పొరల మధ్య పెరుగుతున్న బిడ్డ మనసు అమ్మభాషలోనే రూపొందుతుందని పరిశోధనలు చెప్తున్నాయి. అమ్మకడుపులో బిడ్డ ఏ భాషలో పెరుగుతాడో ఈ భూమ్మీద పడిన క్షణం నుండీ ఆ భాషలోనే ఎదుగుతాడు. అనుక్షణం మనిషి మనసులో మెదిలే ప్రతి ఆలోచనా అతని మాతృభాషలోనే రూపుకట్టుకుంటుంది. భాషాబలం ఎక్కువగా ఉంటే ఆలోచనలో పరిణతి ఎక్కువగా కనిపిస్తుంది. ఒక శాస్త్రవేత్త నోబుల్ బహుమతి

పొందగలిగే నూతన పరిశోధనలు చేయగలగాలంటే మాతృభాష మీద పట్టు కలిగి ఉండాలనేది ఇక్కడ ముఖ్య సూత్రం

దురదృష్టవశాత్తు, మాతృభాషా ప్రాధాన్యతను తగ్గించే ప్రయత్నాలు వేగంగా జరుగుతున్నాయి. దైనందిన సామాజిక జీవనానికి ఉపయోగించటమే భాష లక్ష్యం అనీ, భాషకు అంతకుమించిన ప్రాధాన్యత అవసరంలేదని ఒక అభిప్రాయం బలంగా ఉంది. కమ్యూనికేషన్ ఒకటే భాష ప్రయోజనం అనేది వ్యక్తిత్వ వికాస నిపుణులు జనం బుర్రల్లో కెక్కిస్తున్న నిర్వచనం. భాషకు అంతకు మించిన మానసిక ప్రయోజనాలు ఉన్నాయనే విషయానికి గుర్తింపు లేకుండా పోతోంది.

ఇంగ్లీషు నేరిస్తే అమెరికాలో ఉద్యోగాలొస్తాయనీ, తెలుగు నేర్చుకుంటే ఏ ఉద్యోగాలు రావనే గట్టినమ్మకం తల్లితండ్రుల్లోనే ఎక్కువగా వుంది. వాణిజ్య సంస్కృతి పెరిగిపోయాక భాషని, సంస్కృతిని కూడా బ్రతుకుతెరువు కోసం వాడుకోవాలనే ఆలోచన ఎక్కువైంది. బ్రతుకు తెరువుకోసం ఎవరు ఏ భాష నేర్చుకున్నా తప్పులేదు. ఏ భాషైనా నేర్చుకునే హక్కు ఉందికూడా! కానీ, మాతృభాషను నేర్వటం అనేది ప్రాథమిక హక్కు. పరభాషను నేర్వటానికి అమ్మభాషను మరిచిపోవాలనటం రాజ్యాంగ విరుద్ధం. అనైతికం కూడా!

సంభాషణా ప్రయోజనాన్ని నెరవేర్చటానికి భాష ఉపయోగపడుతుంది. దాన్ని కమ్యూనికేషన్ (నోటిమాట) నైపుణ్యం అంటారు. ఎదుటివాడికి అర్థం అయ్యేలా చెప్పటమే నోటిమాట నైపుణ్యం. కానీ, అమ్మ భాష ప్రయోజనం అంతకు మించినది. దానిది మనసు మాట. మనసు మాట బలంగా ఉంటే నోటిమాటలు కూడా బలంగా ఉంటాయి. Effective communication (శక్తివంతమైన నోటిమాట) అనేది 'మనసుమాట' యొక్క బలం మీద ఆధారపడి ఉంటుంది. మనం ఏం చెప్పదలచుకున్నామో దాన్ని అమ్మభాషలోనే ఆలోచిస్తుంది మనసు. నేర్చిన పరభాషలో మాట్లాడినా మనిషి అమ్మభాషలోనే ఆలోచిస్తాడు. రెండు భాషల మీదా పట్టు ఉన్నవ్యక్తి భావవ్యక్తీకరణ బలంగా ఉంటుంది.

మాతృభాష లేకుండా కేవలం పరభాషలో మనిషి మనసు చేయగలిగే వ్యాపారం ఏమీ ఉండదు.

పరభాష కొన్ని పరిమిత అవసరాలకు మాత్రమే ఉపయోగపడుతుంది. కానీ, మాతృభాష ప్రాణప్రదమైనది. అది లేకపోతే మనిషి మానసిక బలహీనుడిగా మిగిలిపోతాడు. మాతృభాషాకాలుష్యాన్ని నివారించే యంత్రాంగాన్ని నెలకొల్పవలసిన అవసరం ఉంది.

## వాడుక తెలుగులో సంస్కృత పదాలు

శృతపాండిత్యం కారణంగా గ్రాంధిక తెలుగులోంచి కొన్ని సంస్కృత పదాలు జనసామాన్యాన్ని కూడా చేరతాయి. వాడుక భాషలోకి సంస్కృత పదాలను స్వీకరించే ఆత్రంలో అందరూ కలిసి బువ్వ, కూడు లాంటి స్వచ్ఛమైన తెలుగుపదాల్ని వాడకం లోంచి తప్పించేశారు. ఆంగ్ల వ్యామోహం ప్రబలిన తరువాత అన్నం అనే పదాన్ని రైస్ గానూ, భోజనాన్ని మీల్స్ గానూ పిలుస్తున్నాం. హోటల్లో వడ్డించేవాళ్ళు అన్నం కావాలా? అనడిగితే అది బువ్వ, కూడు అంటూన్నట్టు వినిపిస్తుందని, అది తమ వ్యాపారానికి ఇబ్బంది కలిగిస్తుందనీ ఒక హోటల్ యజమాని అన్నాడు.

అసలీ అన్నం అనే పదం ఎక్కడిదీ? తెలుగులో దేశీ పదాలతో పాటు, సంస్కృత, పాళీ, ప్రాకృత, పర్షియన్, పోర్చుగీసు, ఇంగ్లీషు పదాలు లెక్కలేనన్ని కలిసిపోయి ఉన్నాయి. అన్నం అనేది సంస్కృత పదమే అనుకున్నా, భారత దేశంలో అన్నం అనే మాటని ఒక్క తెలుగువారు మాత్రమే వాడుతున్నారు. ఉత్తరాదివారు రోటీ అనీ, ఇతర దక్షిణాది వారు 'సాపాటు' అనీ అంటున్నారు. ప్రధాన భోజనాన్ని అన్నం అని దేశంలో తెలుగు వారు ఒక్కరే అంటున్నారు.

ఆప్టే సంస్కృత నిఘంటువు(పే.129) లో అన్నం అంటే, ఒక జాతి ప్రజలు, ఆంధ్రులు అనే అర్థాలున్నాయి. స్వయంగా ఆంధ్రుల్నే అన్నం పేరుతో పిలిచినట్టు ఆప్టే నిఘంటువు వలన తెలుస్తోంది. అలాగే, అంధ అనే పదానికి అన్నం, ఆంధ్రులు అనే అర్థాలు కనిపిస్తున్నాయి. మరణం లేని వారనే అర్థంలో అమృతాంధసులనే పదం కనిపిస్తుంది.

అంధకులు లేదా అంధసులంటే ఆంధ్రులే! జైనంలోంచి బౌద్ధంలోకి, బౌద్ధంలోంచి జైనంలోకి మతం మారి రెండు కళ్ళూ పోగొట్టుకున్న అంధకుడనే వాడి సంతతి ఆంధ్రులయ్యారనే ఓ జైనకథని మనమీద రుద్దారు. విశ్వామిత్రుడు శపించిన అతని నూర్గురు కొడుకుల్లో ఆంధ్రుడనే వాడున్నాడని అతని సంతతి ఆంధ్రులయ్యారనీ మరో కథని చెప్పి ఆంధ్రుల్ని శాపగ్రస్థులుగా చిత్రించారు. పురాణేతిహాస బ్రాహ్మణులు భాషాజాతి పరంగా మనకు చేసిన అన్యాయం ఇది.

అంధ శబ్దానికి శాస్త్రీయ విశ్లేషణ జరగలేదు. ప్రోటో ఇండో యూరోపియన్ భాషలో 'అంథ్' శబ్దానికి మనిషి అని అర్థం. anthropology పదంలో anthos అంటే మానవ సంబంధమైన అని అర్థం. అంథ్ అంటే మనిషి. అంథ్ అంటే ఆంధ్రుడు. అంథ్ అంటే అన్నం. అన్నం అంటే ఆంధ్రుడు.

“అహమన్నం అహమన్నం అహమన్నం” అనగలిగే హక్కు, అన్నం బహుకుర్వీత, అన్నం న విద్యతే, అన్నం న పరిచక్షిత అంటూ అన్నకీర్తన చేయగలిగే హక్కు ఆంధ్రులకే ఉంది.

రెండు భాషల మధ్య పదాల ఆదాన ప్రదానాలు రెండూ జరుగుతాయి. ఏకపక్ష వ్యాపనం ఉండదు. తెలుగులో సంస్కృత పదాలుగా భావిస్తున్న అనేక నుడులు అసలు సంస్కృతమే కాదని అవి సంస్కృతంలోకి వెళ్ళిన అరువు పదాలని ఎఫ్ బి జె క్వీపర్ అనే భాషావేత్త ఒక పట్టికని ప్రచురించాడు. క్వీపర్స్ లిస్టుగా ప్రసిద్ధి పొందిన ఈ పట్టికలో 383 పదాలున్నాయి. వాటిలో- అపూప(అప్పాలు), అంబ(అన్నం), ఓదన(అన్నం),కటుక (చేదు) కపి(కోతి), కలశం (కుండ), కుట(కుటీరం), కుంభ,కుక్షి, గణ(ఒక తెగ) జఠర, తస్కర(దొంగ), పింద(అన్నపు ముద్ద), ఫల(పండు), బల(బలం), బిల(గుహ), మండూక(కప్ప), మయూర(నెమలి), మూల(మూలం), మయూర(నెమలి), మేన(పల్లకి), లాంగూల(నాగలి), వణిజ (వ్యాపారి), శుల్క(వెల), సింహ(సింహం)... లాంటి గొప్ప సంస్కృత మాటలుగా ప్రసిద్ధిపొందినవి కూడా ఉన్నాయి. ఈ నుడుల్ని ఋగ్వేదం లోంచి ఏరి, వీటికి ఇండో యూరోపియన్ భాషా కుటుంబాల మూలాలు లేవని, ఇవి ద్రావిడ లేదా ముండా పదాలు కావచ్చునని (F.B.J. Kuiper, Aryans in the Rigveda, Amsterdam 1991) ప్రకటించాడు.

ఈ 383 పదాల్లో కనీసం 200 తెలుగులో విరివిగా వాడకంలో ఉన్నాయి. వాటిని మనం సంస్కృతంలోంచి తెలుగులోకి వచ్చిన అరువు పదాలనుకుంటున్నాం. అవి తెలుగు ఇతర ద్రావిడ భాషల్లోంచి సంస్కృతంలోకి వెళ్ళినవి కావచ్చు. కోరాడ రామకృష్ణయ్యగారు తాళ, మీన, పుత్ర లాంటివి కూడా సంస్కృత పదాలు కావనీ తెలుగులోంచి వెళ్ళినవి కావచ్చునన్నారు.

తెలుగు భాష ఎల్లకాలం పుచ్చుకునే స్థితిలోనే (రిసీవింగ్ ఎండ్)ఉన్నదనేది వాస్తవం కాదు. మనవి ఇచ్చిన చేతులే! అనేక తెలుగు మాటలు సంస్కృతంలోకి వెళ్ళాయన్నది తిరుగులేని నిజం. తెలుగులో సంస్కృత పదాలు వచ్చినవా ఇచ్చినవా తేల్చాల్సిన బాధ్యత భాషావేత్తలదే! ఎల్లకాలం “జనని సంస్కృతంబు ఎల్లభాషలకు” అంటే చెల్లదు. పురాతన భావజాలం లోంచి అపూర్వ భావజాలంలోకి భాషాపరిశోధనలు వేగిరం కావాలి.

## వాడుకభాషా రక్షక వ్యవస్థ

భాషా కాలుష్యానికి ప్రభుత్వ ఉదాసీనత, మాతృభాష వ్యతిరేకంగా మారిన విద్యావ్యవస్థ, మాతృభాష ప్రాధాన్యతను గుర్తించని తలిదండ్రులు, తెలుగులో పాలన

కుదరదనే ఉన్నతాధికారులు ఈ అందరూ సమాన బాధ్యులే! ముఖ్యంగా ఎలక్ట్రానిక్ మీడియా పరోక్షంగా భాష మరణానికి చేయగలిగినంత చేస్తోంది. ఇదంతా వాణిజ్య సంస్కృతిలో ఒక భాగం! ప్రభుత్వం ఇక్కడ సానుకూలంగా స్పందించాల్సిన అవసరం ఉంది.

పెనుప్రమాదంలో ఉన్న మాతృభాషల పట్టికలో తెలుగు భాషను కూడా యునెస్కో చేర్చింది. వ్యాకరణ రక్షణలో ఉన్న గ్రాంథిక తెలుగు భాషకు ఈ దుర్గతి ఎన్నటికీ పట్టదు. సంస్కృతం, హిబ్రూ లాంటి భాషల్లాగే మాట్లాడే వారు లేకపోయినా అవి బ్రతికుంటాయి. తెలుగు గ్రాంథికానికి కూడా అలానే మరణం ఉండదు. కలవరం అంతా వాడుక తెలుగు గురించే! టెంపులుకు వెళ్ళి కోకోనట్ బ్రేక్ చేసిరా!" బస్సు రోడ్డున స్పీడుగా పోతోంది...లాంటి తెలుగు వాక్యాల్లో చేసింది, పోతుంది మాత్రమే తెలుగు మాటలు అవి కూడా ఎప్పుడు పోతాయో చెప్పలేం. మనం తెలుగు వాళ్ళుగానే ఉంటాం. తెలుగే మాట్లాడుతున్నాం అనుకుంటాం. కానీ అందులో తెలుగు ఉండని పరిస్థితి వస్తుంది. ఇదే భాషా కాలుష్యం వలన కలిగే అపకారం!!

భాషాకాలుష్యం అంతా వాడుకభాషలోనే జరుగుతోంది. వ్యాకరణ రక్షణ లేకపోవటాన చొరబాటుదార్లు, అతిక్రమణదార్ల తాకిడి ఎక్కువయ్యింది. ఈ దుండగీలను అరికట్టలేకపోతే తెలుగు భాషాంతాన్ని మనం కళ్ళారా చూసే ప్రమాదం పొంచి ఉంది. యునెస్కో చేసిన హెచ్చరికను ప్రభుత్వం పట్టించుకోవాల్సిన సమయం ఇది. భాషను కాపాడే "నుడికావలి" వ్యవస్థను నిర్మించి, ప్రాధికారికతను కల్పించటం, కాలుష్యకారుల్ని పట్టి శిక్షించే అధికారాలను కల్పించటం, మాతృభాషా కాలుష్యాన్ని నివారించే యంత్రాంగాన్ని నెలకొల్పటం నేటి అవసరాలు.

తెలుగు ప్రాధికార సంస్థని ఏర్పరచటం, దానికి చట్టపరమైన అధికారాలు కల్పించటం, భాషా కీచకులకు భారీ జరిమానాలు విధించటం ఇవన్నీ కల్పిస్తే "నుడి కావలి" వ్యవస్థ ఘనంగా ఏర్పడుతుంది.



# గ్లోబిష్ భాష

గ్లోబిష్ భాషావాదుల మనసులో ఇంగ్లీషు దాస్యంలోంచి బైటపడాలనే గట్టి తపన కన్పిస్తోంది. ఇది ఆహ్వానించదగిన విషయం. ఇంగ్లీషు అనేది ఒక భాష పేరు మాత్రమే కాదు, అది దేశంపేరు కూడా. మన జాతీయతని, మన 'అమ్మభాష'ని తాకట్టు పెట్టి ఊడిగం చెయ్యాల్సిన అగత్యం మనకేమిటి? అని ప్రశ్నిస్తున్నారు వీళ్లు. 'ఫ్రెంచి' ప్రజలు దీనికి బీజాలు నాటితే మధుకర్ గొటాటె లాంటి భారతీయులు దీనికి ఊపిరి ఊదుతున్నారు.

**అన్వేషణ :**

E, bi, si, Di, i, ef, gi, ech, aay, je, ke, el, em, en, O, pi, kyu, aar, es, Ti, yu, Vi, dablyu, eks, waay, zi

ఇంగ్లీషు అక్షరమాలని ఇలా రాస్తే, విచిత్రంగా అనిపిస్తుంది. ఎలా పలుకుతున్నామో అలానే రాస్తే ఇలా వుంటుంది. భవిష్య ప్రపంచం ఇంగ్లీషుని ఇంక ఇలానే రాయబోతోంది.

తమ భాషనీ, తమ సంస్కృతినీ ప్రపంచం అంతా వ్యాపింపచేయాలని కలలు గంటున్న ఇంగ్లీషువారికి, ఇంగ్లీషు పదాల్ని ఇష్టారాజ్యంగా మార్చుకున్న అమెరికా వారికీ, ఆంగ్లభాషా స్వరూపంలో రానున్న పెనుమార్పుల్ని ఆపలేని పరిస్థితి ఎదురుకాబోతోంది కూడా !

ఇంగ్లీషుతో సంబంధంలేని ఇతర జాతులవారు ఈ పెనుమార్పులకు కారణం అవుతున్నారు. అందుకు వారు ఆశిస్తున్న ప్రయోజనాలు రెండు.

1. వివిధ దేశాలకు చెందిన ప్రజలు పరస్పరం సంభాషించుకోవడానికి తేలిక పరచబడిన అనుసంధాన (లింక్) భాషగా ఇంగ్లీషుని ఉపయోగంలోకి తేవడం.

2. ఇంగ్లీషు భాషావ్యామోహం బారినుంచి ఎవరికి వారు తమ తమ మాతృభాషల్ని సంరక్షించుకోవడం.

ఆంగ్లభాషావ్యామోహం అనేది తెలుగువారికొక్కరికే అంటుకున్న వ్యాధికాదు. ఇది భయంకర మహమ్మారిగా మారి ప్రపంచ దేశాలన్నింటినీ చుట్టబెట్టింది. దాంతో ప్రపంచ ప్రజల మాతృభాషలన్నీ ప్రమాదం అంచున కొట్టుమిట్టాడుతున్నాయి.

2016 జులైలో ఇరాన్ అధ్యక్షుడు తనదేశంలో హెలికాప్టర్, చాట్, పిజ్జా ఇలాంటి ఆంగ్లపదాలు వినియోగాన్ని నిషేధించి, వాటిని ఇరానీ పేర్లతోనే పిలవాలనే చట్టంచేసే ఉద్దేశం వున్నట్టు పేర్కొన్నాడు. ఇలా చాలా దేశాలు ఆంగ్ల ప్రాబల్యం పట్ల తమ ఆందోళనని, మాతృభాషని కాపాడుకోవడానికి తమ ఆతృతనీ ప్రదర్శిస్తూనే వున్నాయి.

జపాన్‌లో ఇంగ్లీషు పదాల వ్యాప్తి బాగా పెరిగి, జపనీ భాష సంకరమైపోయింది. ఈ సంకరభాషని "జప్లీస్" అంటున్నారు.

కొరియాలో సంకరభాషని కాంగ్లీష్ అనీ, చైనాలో సంకరాన్ని చింగ్లీష్ అనీ, హిందీనేలమీద హింగ్లీష్, తెలుగునాట తెంగ్లీష్ జాడలు అవతరించాయి. ఇప్పుడు అమెరికాని కూడా స్పాంగ్లీష్ (స్పానిష్ వ్యామోహం) ఆవహించింది. జెంగ్లిష్, ఫింగ్లిష్, గ్రీక్లిష్, ఫ్రాంగ్లయిస్, పోర్టింగ్లిష్. ఇలా ప్రతి దేశంలోనూ ఇదే పరిస్థితి. చుట్టూవున్న ప్రపంచం అంతా ఇంగ్లీషులో స్నానం చేసి పునీతులం కావాలనుకొంటుంటే, మనం మన యువతరాన్ని వారి అభిరుచుల్ని కాదని, సాధించేదేమీ కన్పించడంలేదు. ఆంగ్లభాషావ్యామోహాన్ని వ్యతిరేకించడం అంటే, తమ బంగారు భవిష్యత్తుని వ్యతిరేకించడంగా యువతరం అపార్థం చేసుకొంటున్నారు కూడా!

దీనికి విరుగుడు మంత్రాల కోసం అనేక దేశాలకు చెందిన మేథావులు ఎంతోకాలంగా చాలా ఆలోచనలు చేస్తున్నారు.

1. ఇంగ్లీషు భాష పట్ల ఇంత వ్యామోహం కలగడానికి ముఖ్యకారణం దాన్ని కష్టపడి నేర్చుకోవాల్సి రావడమే. చిన్నప్పటినుంచి ఇంగ్లీషుని నూరిపోయడమే కదా జరుగుతోంది. రోజుకు 20 గంటలు చొప్పున 24 సంవత్సరాలు నేర్చినా ఇంగ్లీషు బాగారాదని ఇంగ్లీషువాళ్ళే అంటారు. అందుకే దైనందిన లౌకిక వ్యవహారాలకు ఇంగ్లీషు ఎంతవరకు అవసరమో అంతవరకూ దాన్ని బాగా తేలికపరచి నేర్పిస్తే, ఆ భాషమీద అంత వ్యామోహం వుండకపోవచ్చునేది ఒక ఆలోచన.

2. మాతృభాషావినియోగం అనేది జాతీయత, సంస్కృతులకు సంబంధించిన గౌరవనీయఅంశం. తేలికపరచిన లౌకిక ఆంగ్లం కేవలం ప్రాపంచిక వ్యాపారాలను నెరవేర్చుకోవడానికి మాత్రమే ఉపయోగపడేదిగా వుంటుంది. ఈ రెంటికీ తేడాని స్పష్టం చేయడం ద్వారా యువతను తల్లిభాషవైపు మళ్ళించుకోవచ్చుననేది రెండో ఆలోచన.

3. "తేలికపరిచిన లౌకిక ఆంగ్లం" అనేది ప్రపంచ ఉద్యమంలాగా రావాలి. ఇంగ్లీషువాడు, అమెరికావాడు కూడా ఈ తేలిక ఇంగ్లీషు నేర్చుకొని మాట్లాడేవిధంగా ఈ ఉద్యమం మహోధృతినొందాలి. ఇదొక్కటే ఆంగ్లభాషావ్యామోహానికి అసలైన విరుగుడు అనేది గట్టిగానే చేస్తున్న ఆలోచన.

సాహిత్యపరమైన (లిటరరీ) ఇంగ్లీషుని సాహిత్యాభిమానులకు వదిలేసి, ప్రాపంచిక వ్యవహారాలకు ఉపయోగపడేందుకు అవసరమైనంత ఇంగ్లీషుని మరింత తేలికపరిచి ఒక ప్రామాణిక భాషని రూపొందించాలనే ప్రయత్నాలు గత నాలుగైదేళ్ళుగా ముమ్మరంగా సాగుతున్నాయి. అందుకు ప్రపంచ ప్రజలందరికి అంతో ఇంతో తెలిసిన ఇంగ్లీషుని ఉపయోగించుకోవడమే మంచిదికూడా! ఒక జపాన్‌వాడూ, ఒక తెలుగువాడూ సంభాషించుకోవడానికి ఫ్లవరీ ఇంగ్లీషు అవసరంలేదు. మనసులో భావాలు వ్యక్తపరచు కోవడానికి వ్యాకరణ నియమాలూ, ఉచ్చారణవిధానాలూ అడ్డురాకుండా ఉండాలి. అలాంటి సర్వజనామోదమైన ఇంగ్లీషుభాషని సృష్టించాలనేది ఈ ఆలోచనలన్నింటి సారాంశం. "యూ గివ్ ఐ టేక్" తరహా ఇంగ్లీషుని ఎవరైనా మాట్లాడితే బట్లర్ ఇంగ్లీషు అనీ, రైల్వే ప్లాట్‌ఫాం ఇంగ్లీష్ అనీ మనం ఎద్దేవా చేస్తుంటాం. కానీ, ఒక బట్లర్‌కి తన కస్టమర్లతో సంభాషించడానికి అవసరమైనంత ఇంగ్లీషు చాలు అనేది వాస్తవం.

ఇలాంటి ఆలోచన కలిగినవారిలో ముఖ్యుడు ఐ.బి.ఎమ్. కంప్యూటర్ కంపెనీకి వైస్ ప్రెసిడెంట్ జ్యా.పా.నెరీరే అనే ఫ్రెంచి ప్రముఖుడు. ఆయన వ్యాపార పనులమీద ఆసియా దేశాల్లో సంచరిస్తున్నప్పుడు తేలికపాటి ఇంగ్లీషుని మాట్లాడితే ఇంగ్లీషు తెలియనివారికి కూడా తేలికగా అర్థం అవుతుందని గమనించారు. 'కిచెన్'ని "కుకింగ్‌రూం" అనడం ఆంగ్లభాషని సులభతరం చేయడంగా ఆయన భావించారు.

ఉద్యోగంలోంచి రిటైరయిన తర్వాత తన అనుభవాలన్నీ ఉటంకిస్తూ ఫ్రెంచిభాషలో పుస్తకాలు రాశాడు. పార్లెజ్ గ్లోబిష్ (గ్లోబిష్‌లో మాట్లాడండి) డికాఫ్ ఇంగ్లీష్ అనువాదం అయ్యాయి. ఇంటర్నెట్ పుణ్యమా అని ఇంగ్లీషులో వీటి వివరాలు ప్రపంచ ప్రజలందరికీ అందుబాటులోకి వచ్చాయి.

నెరీరే ఆలోచనల ప్రేరణతో తేలికపరిచిన ఇంగ్లీషుని గ్లోబిష్ భాష (గ్లోబల్ + ఇంగ్లీష్)గా వ్యవహరించడం ప్రారంభించారు. వికిపీడియా ఈ గ్లోబిష్ భాష మీద ప్రత్యేక వ్యాసాలను వెలువరించింది కూడా.

1887లో పోలిష్ భాషావేత్త 'ఎడ్విగ్ జమెన్‌హాఫ్' రూపొందించిన ఎస్పెరాంటో భాషతో ప్రారంభించి, ఈడో, వొలపూక్, ఇంటర్‌లింగ్వా లాంటి భాషలు కృత్రిమంగా నిర్మించినవి అనేకం వున్నాయి. కానీ, గ్లోబిష్ భాష వీటికి భిన్నమైన ప్రయత్నం. మరింత తేలికైన భాషగా ఇంగ్లీషుని రూపొందించడం దీని లక్ష్యం. అతి సామాన్య మానవుడు కూడా దీన్ని నేర్చుకోగలగాలి. కూలీ, నాలి ప్రజలక్కూడా ఇది అర్థం అయ్యేదిగా వున్నప్పుడే, ఆంగ్లభాష మీద వ్యామోహం చచ్చిపోతుంది. ప్రపంచప్రజలందరికీ గ్లోబిష్ భాష అలవాటయితే ఏ దేశంవాడు ఆ దేశం పనులు సానుకూలం చేసుకోగలుగుతాడనేది ఇందులో అంతస్సూత్రం.

ఇప్పుడీ ఉద్యమం ప్రపంచం అంతా చాలావేగంగా విస్తరిస్తోంది. మధుకర్‌గొగాటే అనే మరాఠి భాషోద్యమ ప్రముఖుడు పూనే కేంద్రంగా ఈ ఉద్యమానికి ఊపిరిపోస్తున్నాడు. ఆయన 1998 నుంచి 'ఇంగ్లీషులో తేలికపాటి స్పెల్లింగ్‌లు, ఉచ్చారణ అనే విషయంమీద చాలా కృషిచేశాడు. గ్లోబిష్ భాషా ప్రచారంలో ఈయన పాత్ర నిరుపమానమయ్యింది.

## గ్లోబిష్ భాషాస్వరూపం ఇలా వుంటుంది :

గ్లోబిష్ మాటతీరు (డయలెక్ట్) కృత్రిమంగా వుటుంది తేలికగా అర్థం అయ్యేందుకోసం కృత్రిమంగా సృష్టించిన భాష ఇది. ఒకప్పుడు సంస్కృతాన్ని కూడా సరళీకరించే ప్రయత్నాలు ఇలానే జరిగాయి. భోజనం చేయడాన్ని 'భుజంతి' అనాలో, లేక ఇంకెలా పలకాలో తెలియకపోతే 'భోజనం కరోతి' అనవచ్చునన్నారు. ఇప్పుడు ఇంగ్లీషు విషయంలోనూ ఇదే జరుగుతోంది. సంస్కృతం ఎన్నడూ ప్రజలభాష కాలేదు. కానీ, ఇవ్వాళ ఇంగ్లీషు ప్రపంచభాష. అది అన్ని స్థాయిలలోని ప్రజలకూ అందుబాటులో వుండాలి.

లౌకికపరమైన అంశాలు, సాంకేతికపరమైన అంశాలు తేలికపరిచిన భాషలోనే వుండాలి. 'ఫ్లవరీ ఇంగ్లీష్' వలన సామాజికంగా ఒరిగేదేమీ వుండదు కదా!

గ్లోబిష్ భాషలో కేవలం 1500 ఇంగ్లీషు పదాలే వున్నాయి. అవికూడా అమెరికన్ ఇంగ్లీష్ పదాలే! ఇది కేవలం వ్యాపార వ్యవహారాలకు సంబంధించిన భాష. ఇందులో జాతిపరమైన, సంస్కృతిపరమైన అంశాలేమీ వుండవు.

"yu no wheir dha laaybrari iz ? అనేది ఓ గ్లోబిష్ వాక్యం. లైబ్రరీ ఎక్కడుందో నీకు తెలుసా? అని! ఇంగ్లీషుని ఎలా పలుకుతామో అలాగే ఆ స్పెల్లింగ్‌ని సరళీకరించడం ఇందులో మనకు కన్పిస్తుంది. 'Library' అనే పదాన్ని 'లాయ్‌బ్రరీ' అని పలకవలసిన విధానాన్ని ఇక్కడ గమనించవచ్చు.

ఈ విధానంలోనే తెలుగుపదాల్ని కూడా రాసుకోవచ్చు. 'i leap' లాంటి కంప్యూటర్ ఫాంట్స్ ఇందుకు అనువుగా వుంటాయి. పండితుడు పదాన్ని panditudu అని రాయవచ్చు. ఇదే ఫొనెటిక్ కన్వర్షన్ విధానాన్ని ఇంగ్లీషుకు కూడా ఆపాదించడం విశేషం. గ్లోబిష్ పద్ధతిలోని ఫొనెమిక్ నొటేషన్‌లు ఇంగ్లీషు బొత్తిగా రానివారికి మరింత ప్రోత్సాహకరంగా వుంటాయి.

ఆపో-స్ట్రఫీలు, కోలాన్‌లు, హైఫన్‌లు, సైలెంట్ అక్షరాలు ఇలాంటి నియమాలేవీ గ్లోబిష్ భాషలో వుండవు.

"U ar rikwesTed Tu TekE sIT" ఇలా రాస్తే అది గ్లోబిష్ పద్ధతి.

A = అ; e = ఎ E = ఏ; T = ట; t = త; l = ; M = సున్న ఇలా రాయడం కొద్దిపాటి సాధన చేస్తే తేలికగానే పట్టుబడ్తుంది.

గ్లోబిష్ భాషలో సరళీకృతం అయింది లిపి మాత్రమే కాదు. మాట్లాడటం కూడా చాలా తేలికపడింది.

1. గ్లోబిష్ భాషలో చిన్న చిన్న వాక్యాలు మాత్రమే వుంటాయి.

2. మేనమామలుండరు. అమ్మతమ్ముళ్ళే ఉంటారు.

3. గ్లోబిష్ వ్యాపార ప్రయోజనాల కోసం ఉద్దేశించింది. అందుకని చాలా వినయసంపన్నంగా ఉంటుంది. 'ఎస్' 'నో' అని ముఖాన కొట్టినట్లు మాట్లాడరు. "ఎస్, ఐయామ్" "నో" ఐకాన్ట్" అని సవినయంగా చెప్తారు. 'సారీ' అని వూరుకోరు. 'ఐయామ్ సారీ' అని ప్రకటిస్తారు.

4. భూత భవిష్యత్ వర్తమానాల భేదాలుండవు. హి/మస్ట్/బి ఎట్ వైజాగ్ అంటే, ఒకప్పుడు వుండేవాడు, ఇప్పుడు ఉంటున్నాడు. ఇప్పుడు ఉన్నాడు, వుంటాడు. ఏదైనా కావచ్చు. ఆ సందర్భాన్ని బట్టి దాన్ని అన్వయించుకోవాల్సి వుంటుంది.

5. Who, whose, which, ఈ పదాలన్నిటికి బదులుగా that వాడుకొంటే సరిపోతుంది.

6. భాష అనేది సమాచారవాహిక మాత్రమే కాదు. మాట్లాడుకొంటున్న ఇద్దరిమధ్య బంధాన్ని ఏర్పరిచేదిగా వుండాలి. గ్లోబిష్ అలాంటి ప్రయోజనాన్ని సాధిస్తోంది.

7. గ్లోబిష్ భాష రెండు వేర్వేరు భాషా సంస్కృతుల్నీ గౌరవిస్తుంది.

8. ఇంగ్లీషు వచ్చినవాళ్ళు 'టమోటా' అంటారు. గ్లోబిష్ వాళ్ళు ఎర్రని గుండ్రని పండు అని పిలుస్తారు.

9. పిజ్జా, టాక్సీ వంటి పదాలు ప్రపంచవ్యాప్తంగా అందరికీ తెల్సినవి కాబట్టి వాటిని మాత్రం గ్లోబిష్‌లో మార్చకుండా అలానే ఉంచేశారు.

10. have, had, has వీటిలో ఏదివాడాలో అనే అనుమానాలతో మాట్లాడటానికి భయపడేవాళ్ళకి గ్లోబిష్ పెద్ద వూరట. మీరు మాట్లాడిన దాని సారాంశం ఎదుటివాడికి అర్థం అవుతోందా లేదా అనేది ముఖ్యం అంటే, ఇష్టారాజ్యంగా మాట్లాడవచ్చా... అని అడగవచ్చు. మాట్లాడింది అర్థం అయితే చాలు. వ్యాకరణ నియమాలతో భాషని క్లిష్టతరం చేయకూడదనే గ్లోబిష్ లక్ష్యం.

భారతదేశంలో లాగానే చైనాలో కూడా అనేక భాషలు మాట్లాడే ప్రజలున్నారు. అక్కడ కూడా ప్రజలు తమ మాతృభాషల్ని సరిగా వినియోగపరచడంలేదని చైనీయుల ఆవేదన "పుటాంఘువ"ని చైనా జాతీయభాషగా ప్రకటించారు. కానీ, 47 శాతం మంది చైనీయులకి పుటాంఘువ భాష తెలియనే తెలియదట. హిందీ విషయంలోనూ ఇదే జరిగింది. జాతీయ ప్రజల అవసరాలకు తగ్గట్టుగా హిందీని రూపొందించడంలో విఫలమైన పెద్దలు హిందీని మాట్లాడటం దేశభక్తి అనే ప్రచారంతో సరిపెట్టుకున్నారు.

దేశంలోనే ఇతర భాషలవారితో మాట్లాడలేని ఈ పరిస్థితిలో ఏ జాతికైనా ఇంగ్లీషుమీద ఆధారపడకతప్పదు. ఆ ఇంగ్లీషుని వీధిలో కూరగాయలు అమ్ముకునేవాళ్ళకి కూడా అర్థం అయ్యే స్థాయికి తీసుకొచ్చే ప్రయత్నమే గ్లోబిష్ భాష. ఇంగ్లీషు క్లిష్టతరమైన భాష కావడానికి జెర్మన్ల, రోమన్ల ప్రభావం కారణం. గ్లోబిష్ భాష ఆ క్లిష్టత్వాన్ని తొలగించి అతి సామాన్య ప్రపంచ మానవుడు తేలికపాటి ఇంగ్లీషును నేర్చుకోగలిగే అవకాశం కల్పిస్తోంది.

గ్లోబలైజేషన్ విధానానికీ గ్లోబిష్ భాషకీ సంబంధం లేదు. ఇది అమెరికా, బ్రిటన్‌లు తమ సంస్కృతినీ, తమ భాషనీ ప్రపంచం మీద రుద్దుతున్న ప్రయత్నాలకు విరుగుడు మందుగానే భావించాలని గ్లోబిష్ భాషావేత్త అంటున్నారు.

గ్లోబిష్ భాషని రూపొందించిన నెరీరే ఇంటర్వ్యూని హెరాల్డ్‌ట్రిబ్యూస్ పత్రిక 2006 జనవరి 10న ప్రచురించింది. "ఫ్రెంచి భాషని ఆవహించిన ఇంగ్లీషు పెనుభూతం ఈ

దెబ్బతో వదిలిపోతుంది. చాలామంది నేను ఫ్రెంచిభాషని చంపుతున్నానన్నారు. కానీ, ఇంగ్లీషువల్ల చచ్చిపోతున్న ఫ్రెంచిభాషని బతికిస్తున్నాను" అని ప్రకటించాడు.

"తల్లిభాషల్ని ప్రపంచ ప్రజలు రక్షించుకోవడానికి గ్లోబిష్ మంచి ప్రయోగమే! ఇది ప్రపంచవ్యాప్త ఉద్యమంగా ఎదిగినప్పుడు ప్రపంచంలో ప్రతిఒక్కరూ తమ తల్లిభాషతోపాటు గ్లోబిష్ భాషని కూడా నేర్చుకుంటారు. ఆంగ్లేతరులేకాదు, ఆంగ్లేయులు కూడా గ్లోబిష్ భాష నేర్చుకొని ఆంగ్లేతరులతో మాట్లాడితీరాల్సి వస్తుంది. దీనివలన మనుషులంతా స్వదేశీయులతో తల్లిభాషలోను, విదేశీయులతో గ్లోబిష్ భాషలోనూ సంభాషించి సమాచారమార్పిడి చేసుకోగలుగుతారు" అని వివరించాడు నెరీరే!

ఈ ఇంటర్వ్యూను ప్రచురిస్తూ "మొత్తం మీద అమెరికన్లకి ఇంకొక భాష నేర్చుకోవాల్సిన శ్రమని గ్లోబిష్ భాష కల్గించబోతోంది," అని వ్యాఖ్యానించింది ఇంటర్నేషనల్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక. ఒక కొరియన్, ఒక కొలంబియన్ గ్లోబిష్‌లో మాట్లాడుతుంటే మధ్యలో కూర్చున్న ఇంగ్లీషువాడు ఒక్క ముక్క అర్థంచేసుకోలేకపోయాడు. ఇంగ్లీషువాళ్ళు కూడా గ్లోబిష్ నేర్చుకోకపోతే, రాబోయే ప్రపంచంలో వాళ్ళే వెనకబడే ప్రమాదం వుంది" అని హెచ్చరించింది కూడా.

యాపిల్‌లో "యా"ని "ae" అని గ్లోబిష్‌లో 'యాపల్' అంటారు. ఇంకనుంచి 'అమెరికన్'ని "Umerikan" అని రీస్పెల్ చేయాల్సివుంటుంది. 'U' అనేది గ్లోబిష్ భాషలో అచ్చు. "FUN" అనే ఇంగ్లీషు పదాన్ని గ్లోబిష్ భాషలో "fan" అనే రాస్తారు. ఈ తేడాని గమనించాలి.

"Now" అనే పదాన్ని అమెరికన్లు "nae" అనిగానీ, "nau" అనిగానీ పలుకుతారు. ఇండియన్లు "naau" అని దీర్ఘం తీసి పలుకుతారు. ఆస్ట్రేలియన్లు "day" ని Die అని పలుకుతారు.

చైనా, కొరియా, జపాన్ భాషల్లో 'ల' 'ర' అక్షరాలు సరిగా పలకవు. లండన్‌ని 'రండన్' అనీ, రోమ్‌నీ 'లోమ్' అనీ పిలిచే అలవాటు ఈ దేశాల్లో ఎక్కువ. 'రూల్' 'లూర్' అంటారు. సమురాయ్ చైనా వీడియో గేమ్ (4)లో 'విక్టలి' అనే ఉచ్చారణ వినిపిస్తుంది.

వీటన్నింటినీ సమన్వయం చేసుకుంటూ గ్లోబిష్ భాష తనదైన మార్గంలో అభివృద్ధి చెందుతోంది.

New Yorkని గ్లోబిష్ భాషలో "nyuyaurk" అని రాయవలసివుంటుంది. అయితే, పూనేకి చెందిన మధుకర్ గొగాటే "nuyork" అని రాయాలని ప్రతిపాదించాడు. ఇక్కడ 'ర' ని హల్లుగా రాయవలసివస్తోంది. ఇలా వాదప్రతివాదాలు అనేకం సాగుతున్నాయి.

పరభాషా వ్యామోహాన్ని ప్రజలు వదులుకోవడం అనేది అమ్మభాషను రక్షించుకోవడమే అవుతుంది. ఆ విధంగా గ్లోబిష్‌భాషని కోకాకోలనీయజానికి గ్లోబలైజేషన్ పరిణామాలకు, విరుగుడు మందుగా భావించవలసివుంటుంది.

**చివరిగా ఒక మాట :**

1977లో రెండు పౌర విమానాలు స్పెయిన్ విమానాశ్రయంలోకి దిగుతూ గాలిలోనే ఢీ కొన్నాయి. 582 మంది చనిపోయారు. డచ్‌పైలట్‌కు స్పానిష్ ఎయిర్ ట్రాఫిక్ కంట్రోలర్ ఇచ్చిన సాంకేతిక ఆదేశాలు సరిగా అర్థంకాకపోవడంవలన ఈ ప్రమాదం జరిగింది.

1996లో భారతదేశంలో ఒక రష్యన్ పైలట్ ఇదేవిధంగా ఇంగ్లీషులో మనవాళ్లు చెప్పిన సిగ్నల్స్‌ని అర్థం చేసుకోలేకపోవడంతో జరిగిన విమాన ప్రమాదంలో 351 మంది పౌరులు మరణించారు.

ప్రపంచం అంతా అర్థం చేసుకోగలిగేంత తేలికైనదీ, వ్యాకరణ నియమాలు లేనిదీ అయిన గ్లోబిష్ భాష వుంటే ఇలాంటి ప్రమాదాలు జరిగివుండేవి కావు.



# తొలిద్రావిడులు తెలుగువారా?

గుణాఢ్యుడి 'బృహత్కథ' అతని కాశ్మీరరాజు ప్రత్యేకంగా తెప్పించుకున్నాడు. కాశ్మీరీ కవయిత్రి లల్లమహాదేవి పాటల్ని ఇప్పుడు మనం గుర్తించలేకపోయినా, "లల్లాయి (లల్ల తల్లి) పదాలు' అనేమాట తెలుగునాట అంతగా ఎలా ప్రసిద్ధి పొందిందో కూడా అధ్యయనం జరిగి వుంటే బావుండేది. కాశ్మీరాంధ్ర సంబంధాలకు కారణాలు వెదకాలి.

బైబిల్ గ్రంథంలో 'ఉర్' నగరం నుంచి వచ్చాడని చెప్తున్న అబ్రహాంతో, ప్రతి గ్రామాన్నీ 'ఊరు' అని పిలుచుకునే తెలుగువారికి ఏ యుగంలోనైనా, ఎక్కడైనా ఈ బైబిల్ ప్రజలతో ఛాయామాత్రపు సంబంధాలేమైనా వున్నాయేమో కనీసం వెదకడానికి ప్రయత్నించి వుంటే మరింత బావుండేది. కాశ్మీర్‌లో ఇటీవల ప్రాచీన కాలం నాటి సమాధి ఒకటి బయట పడింది. ఇది జీవన్ సమాధి అనీ, 'శిలువ ఘటన' తర్వాత ఆయన తన మినిస్టర్స్‌తో కాశ్మీర్‌కు వచ్చి అక్కడ స్థిరపడి, తన దైవ సామ్రాజ్యాన్ని పాలించాడనీ గట్టిగా విశ్వసించే పరిశోధకులు రాస్తున్న అంశాలు ఇక్కడ గమనార్హం.

ఏది ఏమైనా, ఆర్యుల రాకతో, స్థానిక జాతులు ఉత్తరాది నుంచి దక్షిణ భారతదేశానికి తరలి వచ్చి ద్రావిడులుగా పిలువబడ్డారనే వాదనకి కాలం చెల్లింది. ఉత్తరభారతానికి ఆర్యులు వచ్చేనాటికే ద్రావిడులు అక్కడ సింధు నాగరకతను నెలకొల్పారని, దానితో సమాంతరంగా దక్షిణ భారతదేశంలోనూ ద్రావిడ నాగరికత - క్రమ వికాసాలు పొందిందనీ ఇప్పుడు చారిత్రకవేత్తలు నమ్ముతున్నారు.

మూలద్రావిడ భాష అనేది ఊహాత్మకం. దాని స్వరూపాన్ని పూర్తిగా పునర్నిర్మించు లేకపోవడానికి అది ప్రజల భాషేగాని, కావ్యభాష కాకపోవడం ఒక కారణం కావచ్చు. 'బ్రాహుయిలాంటి భాషలు ఉత్తర మూల ద్రావిడంలోంచి ఏర్పడితే, 'తెలుగు' 'గదబ'

'కుయి' తదితరభాషలు మధ్య మూలద్రావిడ లోంచి విడివడ్డాయనీ, దక్షిణ మూల ద్రావిడంలోంచి తమిళం, కన్నడం, మలయాళం వగైరా భాషలు ఏర్పడ్డాయని కొందరు భాషావేత్తలు అంటున్నారు.

మూలద్రావిడ భాషాపదాలు ప్రపంచ నాగరికతల్లో అనేకచోట్ల కన్పిస్తాయి. ఆసియాలోనే ద్రావిడ రాజ్యాలు అనేకం వున్నాయి. పరిశోధకులకు కుప్పలుగా మూల ద్రావిడ పదాలు దొరుకుతున్నాయి. వాటిని పోల్చి చూసుకోవడానికి తమిళానికొక్కదానికే సమగ్రమైన 'లెక్సికాన్' మహానిఘంటువు వుంది.

'సుమేరియన్', 'ఈలమ్', 'ఈజిప్షియన్', 'మధ్య ఆఫ్రికా మండింగ్' భాషలు వీటన్నింటిలోనూ కన్పించే మూలద్రావిడ పదాలను నిరూపించడం కోసం పాశ్చాత్య పరిశోధకులు ఈ తమిళ లెక్సికాన్ పైనే ఆధారపడుతున్నారు. వాళ్ళకి సమగ్రమైన సమాచారం అందించేందుకు తెలుగుభాషావేత్తలు అందుబాటులోకి లేకపోవడం ఇంకో కారణం కూడా! దీన్ని అలుసుగా తీసుకొని తమిళ రచయితలు ప్రపంచం అంతా తమిళులే వున్నట్లు నమ్మించడం మొదలుపెట్టారు.

అయినా, ఒక్క తెలుగుభాషా సాహిత్యవేత్త కూడా దానిని ఖండించేందుకు ముందుకు రావడం లేదు. కనీసం ఆ యా నూతన పరిశోధనల సారాంశాన్ని కూడా తెలుగు పాఠకులకు అందించే ప్రయత్నాలు చెయ్యడం లేదు. భాషాపరంగా ఇది అపచారమే!

సుసుము ఓహ్నో అనే జపాన్‌కు చెందిన భాషావేత్త కష్టపడి చెన్నై వచ్చి అక్కడి ఆచార్యులను ఆశ్రయించి, జపాన్‌భాషలో మూలద్రావిడ పదాలు అనేకం వెలుగులోకి తెచ్చే ప్రయత్నం చేశాడు. గైడ్స్‌గా వ్యవహరించిన తమిళ ప్రొఫెసర్లు ఆయన్ని తమిళులకు జాపానీయులు రక్త సంబంధీకులనే రీతిలో నడిపించారు. ఓహ్నో పరిశోధకుడు అత్యుత్సాహంతో చిలకపలుకులుగా అవే మాటలు వల్లించాడు.

దీన్ని ఖండిస్తూ 'మునివో తొకునాగా' అనే మరో జపాన్ భాషావేత్త ఓహ్నోని మందలించి, "ద్రావిడ భాష మీద అధికారం వున్న పండితులున్నారు, హైదరాబాదులో భద్రిరాజు కృష్ణమూర్తి వున్నారు. రష్యాలో కె.వి. జ్వవేదీ, ఎం. ఆండ్రోనోవ్‌లు వున్నారు. వాళ్ళని సంప్రదిస్తే తమిళంకన్నా తెలుగు ప్రాచీనం అని తెలుస్తుందని రాశాడు. ఓహ్నో పరిశోధకుడు ఎత్తి చూపించిన మూలద్రావిడ పదాలు తమిళంకన్నా తెలుగు భాషకు చాలా దగ్గరకు వున్న వాస్తవాన్ని నిరూపిస్తూ **నడుస్తున్న చరిత్ర**లో గతంలో నేను సవివరంగా ఒక వ్యాసాన్ని ప్రచురించడం జరిగింది.

ఇక్కడ గమనించవలసిన అంశం ఒకటి వుంది. ప్రాచీన నాగరికతలైన హరప్పా, ఈజిప్టు, సుమేరియన్, ఈలమ్ నాగరికతలతో పాటు మెక్సికోలోని ప్రాచీన అమెరికన్ రెడ్డిండియన్ల భాషలోనూ, ఇటలీలో ఎట్రుస్కన్, కేనరీ దీవుల్లో గువాంచీ, బ్రిటన్‌లో సెల్టులు, క్రేట్‌లో మినోవన్లు, లెబనాన్‌లో ఫినీషియన్లు, మారిటేనియాలో బర్బరులు... ఇలా ప్రాచీన జాతుల భాషలన్నింటిలో మూల ద్రావిడ పదాలు అనేకం కన్పించాయి. తులనాత్మకంగా పరిశీలించినప్పుడు అవి తెలుగు భాషకు అతి సమీపంగా కన్పిస్తున్నాయి.

'నత్తరు' అనే పదం ఆఫ్రికన్ మండింగ్ భాషలో నెత్తురు అనే అర్థంలో కన్పించినప్పుడు మనం పట్టించుకోకుండా వదిలేయాల్సిన అవసరం ఏముందీ? కానీ, మన పరిశోధకులు ఈనాటికీ అటు దృష్టిపెట్టకపోవటమే ఇక్కడ విచారించదగిన విషయం.

మధ్య ఆఫ్రికాలో సహారా ప్రాంతం ఒకప్పుడు ఫలవృక్ష సమృద్ధిగా వుండేదని, అక్కడ మూల సహారా నాగరకత విలసిల్లిందనీ, మూలద్రావిడ భాషకు దగ్గరగా వున్న భాషనే ఆనాటి ప్రజలు మాట్లాడేవారనీ, క్రీ.పూ. 8వేల నుంచి 4 వేల దాకా ఈ నాగరికత విలసిల్లిందని, ఇందులోంచే సుమేరియన్, ద్రవిడియన్ భాషలు విడివడ్డాయనీ వాక్లాన్ బేజిక్, డేవిడ్ మెకాల్పిన్, వామోస్ బేటర్‌లాంటి పరిశోధకులు నిర్ధారించి, ఆఫ్రో ఆసియాటిక్ భాషా కుటుంబం పేరుతో ఒక కొత్త భాషా కుటుంబాన్ని సృష్టించి, మూల ద్రావిడ భాషా పదాలు కలిగిన భాషలన్నింటినీ ఈ కుటుంబంలోకి తెచ్చే కృషి చేస్తున్నారు. ఇదంతా అత్యంత తాజా పరిశోధనా సారాంశం.

ఈ క్రమంలో పరిశోధనలు సాగుతున్నప్పుడు మధ్య ఆఫ్రికా నుంచి బయల్దేరిన మూలద్రావిడ భాష మాట్లాడే ప్రజలు ఈజిప్టులోనూ, మధ్యధరా సముద్రం తీరంలోనూ, మధ్య ఆసియాలోనూ చైనా, జపాన్ తదితర దక్షిణ ఆసియా దేశాలలోనూ, భారతదేశంలోనూ ఎలా విస్తరించాలో తేల్చే పరిశోధనలు ఇప్పుడు ముమ్మరంగా సాగు తున్నాయి.

దక్షిణ చైనాలో క్రీ.పూ. 3000 ఏళ్ళకు పూర్వం యెహ్ (Yueh) జాతి ప్రజలు మొట్టమొదటగా నాగరికతని వ్యవస్థాపించారని చరిత్రవేత్తలంటారు. ఈ యెహ్వాలు నల్లవాళ్ళు. తెల్లని మంగోలాయిడ్ ముఖం కల్గిన చైనావాళ్ళు కాదు. శివారాధకులు. నీటిని వ్యవసాయానికి వినియోగించడం నేర్చినవాళ్ళు. అనేక మొక్కల్ని గొర్రెల్ని, మేకల్ని, ఆవుల్ని మచ్చిక చేసుకొని పెంచడం తెలిసినవాళ్ళు. చైనాలో మొదటి రాజరిక వంశం ఝూన్ డైనాస్టీ ఏర్పడటంలో వీరి పాత్ర వుంది. వీళ్ళ ఆకారం పొలినీషియన్లు లేదా మెలనీయన్లలా ఉంటుంది. హరప్పా ప్రజలు ఉపయోగించిన కుండలు వగైరా వస్తు

సామగ్రిని వీళ్లు ఉపయోగించారు. కాలువలు తవ్వి వ్యవసాయం చేశారు. యాంగజ్ (Yangtz), మెకాంగ్ (Mekang) నదీ తీరాలలో విస్తరించారు. వరి, గోధుమలు, జొన్నలు పండించారు.

తర్వాతి కాలంలో చైనీయులు వీళ్లని 'కున్‌లన్'లని పిలిచారు. కులీనులనే (మంచి కులంలో పుట్టినవారు) సంస్కృత పదానికి ఇది అతి దగ్గరగా వుంది. ప్రాచీన చైనా భాషలో కున్‌లన్ బానిసల ప్రస్తావన కన్పిస్తుంది. ఈ కున్లన్ ప్రజలు ఆనాడు మాట్లాడిన భాష మూల ద్రావిడ భాష కావచ్చని, వీళ్ళు ఏసియాటిక్ ఆఫ్రికన్ నల్ల ప్రజలనీ చరిత్రకారులు నిర్ధారించారు.

వీరు వ్యవస్థాపించిన 'యెహ్వా' నాగరికత భవిష్యత్తులో చైనాలో అన్ని నాగరిక జాతులు పరిఢవిల్లడానికి కారణం అయ్యింది. యెహ్వాలు ప్రాకృత భాషలో 'యెక్కులు'గానూ, సంస్కృత సాహిత్యంలో యక్షులుగానూ కన్పిస్తారు.

మెడిటరేనియన్ నుంచి బయల్దేరిన కువైట్‌లు ఆఫ్ఘనిస్తాన్ మీదుగా కాశ్మీరాన్ని చేరి యక్కులుగానూ, చైనా చేరి యహ్వాలుగానూ ప్రసిద్ధి గాంచారన్నది తాజా పరిశోధన. కాశ్మీరీ కుషాణులే ఫిలిప్పైన్స్, జపాన్ సింహళంలో కూడా విస్తరించి సంస్కృతినీ, భాషను కూడా వ్యాప్తి చేశారు.

Cologne Sanskrit Dictionary ని ఆన్‌లైన్‌లో పరిశీలిస్తున్నప్పుడు "కురు" ప్రజల గురించి కొన్ని వివరాలు కన్పించాయి. వీళ్ళు ఇండోటర్కిక్ ప్రజలనీ, ఫినీషియన్లుగా చరిత్రకారులు పేర్కొనే ఈ ప్రజలు ఒక దశలో ఈ భూగోళాల్ని తూర్పు పడమరలు మొత్తం ఏలినవారనీ అందులో పేర్కొన్నారు.

సుమేరియన్ భాషలో మెరకనేలల్ని 'కుర్రు' అనీ, పల్లపునేలల్ని 'తుర్రు' అని పిలిచారు. ఎలకుర్రు, మొగల్తుర్రు అనే పేరు గల ఊళ్ళు మనకూ అనేకం వున్నాయి. కుర్రులు కుర్తులుగానూ తుర్రులు తుర్తులుగానూ మారి, కలువకుర్తి, తుంగతుర్తి లాంటి ఊళ్ళపేర్లు కూడా మనకు ఏర్పడ్డాయి. అలాగే, నైలునదికి ఎగువన కట్టుకున్న సుమేరియన్ రాజధాని నగరాన్ని 'కుర్రు' అన్నారు. కాస్పియన్ సముద్రానికి దగ్గరగా పల్లపు ప్రాంతంలో భూముల్ని తుర్రు భూములు అన్నారు.

సుమేరియన్ అస్సీరియన్ భాషలో 'కీ' అంటేభూమి 'తుర్రు+కీ' = తుర్కి అయ్యింది. టర్కీ దేశం పేరు ఇలా ఏర్పడింది.

ఈ విధంగా నైలునది దగ్గర 'కుర్రు' నించి విస్తరణ ప్రారంభించిన మెడిటర్‌నియన్లు లేదా ఫినీషియన్ల భాషలో కసి, కిస్, కుష్ పదాలు ఎక్కువగా కన్పిస్తాయి.

కాశ్మీర్, హిందూకుష్, కిష్కింధ వీళ్ళ వలన ఏర్పడ్డవే! కుశద్వీపం వీళ్ళ స్థావరం అని మత్స్య పురాణం చెప్తుంది. కుషాణులుగా వీళ్ళు మధ్య ఆసియా అంతా విస్తరించారు. చైనాలో 'K-san' అనే ప్రాచీన నగరం వుంది. టిబెట్‌లో 'కు-షి' నగరం కూడా ప్రాచీనమే!

సంస్కృత 'శిఖ' అంటే 'Chief' అని, తెలుగులో 'తలసరి' అంటారు. 'కృషి+శిఖ' పదాలు కలిసి 'కష్శిఖ' అంటే, కుషాకుల 'నాయకుడు' అని అర్థం. 'కౌశిక' అనే పేరుకి ఇది మూలప్రయోగం కావచ్చు. 'షేక్' అనే పర్షియన్ పదం. ఇలా ఏర్పడిందే! 'కాషిఖ'లోంచే క్షత్రియ పదం రూపొందింది. క్షత్రియులు భారతదేశంలో ఆనాడు పాలకవర్గం (Ruling Clan) 'ఖ' అంటే భూమి. ఖట్టిట్స్, (హిట్టయిట్స్) ఇలా ఏర్పడిన క్షత్రియులే.

ఇలా... 'ఉర్', 'కుర్రు', 'తుర్రు', కిష్ వగైరా సుమేరియన్ పదాలతో తెలుగువారికి తెలుగు నేల మీద గల సంబంధాలు ఋజువైనాక అత్యంత అబ్బురమైన మరో విషయాన్ని ఇక్కడ ప్రస్తావించాలి.

అమెరికాలోని మెక్సికో తదితర ప్రాంతాలలో విస్తరించిన రెడ్ ఇండియన్లు కూడా మూలద్రావిడ భాషా కుటుంబీకులేననేది మరో నిరూపణ. ఇప్పుడు అనేక ద్రావిడ భాషాపదాలు వెలుగులోకి వస్తున్నాయి.

అక్కడ 'ఇంకా' 'మయా' అనే రెండు ప్రధాన తెగల ప్రజలు కన్పిస్తారు. రెండు తెగలవారూ మూలద్రావిడ భాషకు సంబంధీకులే! 'ఇంకా' పదానికి యెక్కు (యక్ష) పదానికి సామీప్యతని పండితులు పరిశీలించవలసి వుంది. కిష్ పదం ఇక్కడ ఎంత వినియోగంలో వుందో గమనించండి:

| | | |
|---|---|---|
| 1.KESHUA | = | 'ఇంకా' జాతీయులలో అగ్రవర్ణ ప్రజలు. |
| 2.KASHITL | = | కషి కవి = అమెరికన్ అజ్టెక్ జాతి ప్రజలు |
| 3.KASHIKEL | = | 'మయా' జాతీయులలో అగ్రవర్ణ ప్రజలు. |
| 4.KASHEKWA | = | కారిబియన్, ఫ్లోరిడా ప్రాంతంలో నివసించే రెడ్డిండియన్‌లు |
| 5.KUMHUU | = | 'మెక్సికో'లో పాలకవర్గం |
| 6.KASHONSEE | = | 'మెక్సికో'లోనే తారస్కాన్ జాతి నాయకులు. |
| 7.KUSS | = | ఇది అరిజోనా పదం. ధనవంతుడు అని దీని అర్థం. |

| | | |
|---|---|---|
| 8.KASSINA | = | రక్షించే దేవత |
| 9.KOSHIKWE | = | 'జాణీ' తెగకు చెందిన పాలకవర్గం. |
| | | "కిష్" అనే పదం ఇంకా ఇతర భాషల్లో అనేకచోట్ల కన్పిస్తుంది. |
| కుష్ | = | ప్రాచీన ఈజిప్ట్ పాలకులు, ఇథియోపియాలో రాజవంశీకులు |
| కైస్ | = | ఆఫ్ఘనిస్తాన్ పాలకులు. |
| కిష్ | = | పర్షియాలో అనువంశిక పాలకులు |
| కస్సి | = | వీళ్ళని 'కస్సైట్స్' అంటారు. |
| | | ప్రాచీన అస్సీరియా పాలకులు |
| కస్త్ర | = | రోమనల్ల అనువంశిక పాలకులు |
| కిష్ | = | కాశ్మీరీ పాలకులు |
| కిష్కింధ | = | తెలుగు ప్రాంతంలో విస్తారమైన భూభాగం |
| క్షత్రియ | = | భారతదేశంలో అనువంశిక పాలకులు |
| కొస్సాయి | = | పర్షియా లేదా ఇరాన్‌లలో అధికారగణం |
| క్షాత్రప్ | = | తొలి గ్రీకు పాలకులు |
| కాస్ట్రో | = | స్పెయిన్‌లో ఒకనాటి పాలకవర్గం. ఫిడెల్‌కాస్ట్రో పేరులో ఈ పదం ఇంకా సజీవంగా ఉంది. |

కేజర్ లేదా కీజర్ = దీన్ని సీజర్ అని భ్రష్టరూపంలో పలుకుతున్నారు. కానీ, 'కిష్' పదంలోంచే పుట్టింది. క్షత్రియ అనే అర్థంలో షామిరోమన్ ప్రభువుల బిరుదనామం అది.

కైజర్ = జర్మన్ ప్రభువుల బిరుదనామం

జార్ KZAR = రష్యాను సుదీర్ఘకాలం పాలించిన ఆఖరి రాజవంశం. వీళ్ళంతా కౌరవసంతతే! అంటే, ప్రాచీన ఇండోటుర్కిక్ (కురు) ఫినీషియన్లకు వారసులు అని తాజా పరిశోధనలు చెప్తున్నాయి.

'Hopin of Mayans Hold the Keys to the origins of American Indians' పేరుతో Gene D. Matlock అనే పరిశోధకుడు అమెజాన్ వెబ్‌సైట్‌లో ఆలోచనా స్ఫోరకమైన ఒక వ్యాసంలో ఈ వివరాలు అందించాడు. మహాకాశ్యపుడు అయిన సూర్యభగవానుడి పేరున 'కాషి' అంటే, భారత వంశీకులేనని ఈ వ్యాసంలో ఆయన సవివరంగా నిరూపించాడు. జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే అని మనం చెప్పుకునే సంకల్పంలో భరతవర్షం అంటే మధ్యధరా సముద్రం (Moditarenian) కాశ్యప సముద్రం (Corpian) తో ప్రారంభించి చైనా సముద్రం వరకూ విస్తరించిన భూభాగమేననేది ఈ నిరూపణల సారాంశం.

ఈ భరతవర్షంలో క్రీ.పూ. 3000 నాటివరకూ ప్రజలు మాట్లాడిన భాష మూలద్రావిడ భాష. అది తెలుగుకు చాలా దగ్గరగా వుండి వుండాలి. ఎన్నో తెలుగు పదాలు వాటిలో మనకు కన్పిస్తున్నాయి. మూలద్రావిడులు తెలుగువారేనన్నంతగా ఈ సామీప్యత కన్పిస్తుంది.

సరే, మనం బయల్దేరినచోటికి వద్దాం.

యక్షులు కాశ్మీర్; చైనా, మలేషియా, జపాన్ తదితర ప్రాంతాలతో పాటుగా సింహళ ద్వీపం (శ్రీలంక)లో కూడా తొలి నాగరికతని వ్యవస్థాపించినవారిగా సింహళ పరిశోధకులు భావిస్తారు. యక్షులు రాజు కుబేరుడు సింహళంలో రాజ్యస్థాపన చేయడం, సవతి సోదరుడు రావణుడితో అతనికి విభేదాలు ఈ వృత్తాంతం రామాయణంలో వుంది మనకు తెలుసు.

విశేషం ఏమంటే, ఉత్తర అమెరికా ఖండాన్ని QUIVIRA అంటారు. ఇది కుబేరపదంలోంచే ఏర్పడిందని పండితుల భావన. 'కుబేర' ఖైబర్ కనుమలకు మూలరూపం. కుబేరపదం తూర్పు పశ్చిమ భూఖండాలు రెండింటా వ్యాపించి వున్నది. యక్షులతో కృష్ణాతీరంలో తెలుగువారికి గల సంబంధాలను అనేకమంది చరిత్ర పరిశోధకులు విశ్లేషించారు కూడా!

పల్లవ బొగ్గం లేదా పల్నాడు నుంచి (కృష్ణకు ఆవలితీరం) మహేంద్రుడు అశోకుడి పక్షాన అనేక వందలమంది తెలుగువారైన యక్షుల్ని, నాగుల్ని వెంటబెట్టుకుని సింహళం వెళ్ళినట్లు మహావంశ తదితర బౌద్ధ గ్రంథాలలో వుంది.

నిర్మాణ కళాకౌశలం కలిగిన యక్షులు, నాగులు సింహళంలో బౌద్ధమత వ్యాప్తికి తోడ్పడ్డారు. దక్షిణాదిన అనేక చైత్యారామాల నిర్మాతలు వీళ్లేనని, మౌర్యసామ్రాజ్య పతనం తర్వాత క్రీస్తుపూర్వం చివరి శతాబ్దాలలో తెలుగువారితో సింహళానికి ఎక్కువ సంబంధాలు

బలపడ్డాయని India ceylunies History, Society and culture గ్రంథంలో M.D. రాఘవన్ పేర్కొన్నాడు. మొట్టమొదటి బౌద్ధస్తూపం, బుద్ధ విగ్రహాలు కృష్ణాతీరం నుంచే సింహళానికి వెళ్ళాయని ఆయన అనేక ఆధారాలను ఈ గ్రంథంలో ఉటంకించారు.

ఈ నిరూపణలన్నీ పరిశీలిస్తే, మూల ద్రావిడ భాష మాట్లాడిన ప్రజలు ప్రపంచ దేశాలన్నిటా విస్తరించి, దక్షిణ భారతదేశంలో తెలుగువారిగా స్థిరపడినట్లు కన్పిస్తుంది.

తెలుగువారిది బహుళజాతి సమాజం (Multiple Society) యక్షులు, నాగులు ఇంకా అనేక జాతీయులు కలగవలసిన తెలుగు భాషనే మాట్లాడుతూ సహజీవనం సాగించారు. బెలూచిస్తాన్‌లో 'బ్రాహుయి', ఆఫ్ఘనిస్తాన్‌లో 'పపాయి' కాశ్మీర్‌లో 'శీనా' ఇవన్నీ ద్రావిడ భాషాజన్యమైనవే! వీటిని దార్డిక్ భాషలంటారు. పైశాచి వీటికి సంబంధించినదే!

ప్రాకృతంలోంచి తెలుగుభాష పుట్టలేదు. ప్రాకృతం సంస్కృత భాషకి పూర్వ రూపం. పైశాచి భాష తెలుగుకు దగ్గరగా వుండి వుంటుంది. అందుకే కాశ్మీరంలోని దేశిప్రాకృతాన్ని, అప్పటికే రాజ్యం ఏలుతున్న సంస్కృతాన్నీ వదిలేసి ప్రజల భాష అయిన పైశాచీలో ప్రజాసాహిత్యాన్ని సృష్టించదలచినట్లు గుణాఢ్యుడు తన 'బృహత్కథ'లో పేర్కొన్నాడు.

కాశ్మీరం నుంచి దక్షిణ భారతదేశానికి యక్షులో, నాగులో లేదా మరెవరో తెలుగువారు తరలివచ్చేప్పుడు ఈ బృహత్కథని వెంట తెచ్చుకొని వుండాలి.

తెలుగు భాషామూలాలను వెదికేందుకు అన్ని కోణాల్నీ పరిశీలించడం అవసరం. లోతుల్లోకి వెళ్లాలి కూడా! ముమ్ముందు అన్వేషణను కొనసాగిద్దాం.



# తొలినాటి తెలుగు ప్రభువులు అశ్మకులు

**ఇప్పటికి 2,700 సంవత్సరాల నాటికే, బుద్ధుడికన్నా పూర్వమే తెలుగు నేల మీద, అంటే Central part of Deccan దెక్కన్ భూభాగం కేంద్ర స్థానంలో అనేక దేశాలుండేవని చరిత్రవేత్తలు చెప్తారు. ఈ దేశాలన్నీ కలిపి బౌద్ధయుగంలో 'అంధకదేశం'గా పిలువబడ్డాయి. ఈ దేశీయులందరూ తెలుగు భాష మాట్లాడిన ఆంధ్రులే! ఈ అంధక దేశం నుంచి జాతీయస్థాయికి ఎదిగిన చక్రవర్తులు ఆంధ్రశాతవాహనులు.**

క్రీ.పూ. 6వ శతాబ్ది నాటికే తెలుగు నేలమీద వెలిగిన రాజవంశాలలో 'అశ్మకులు' ప్రసిద్ధులు. బుద్ధుడి కాలానికి ఎన్నో వందల ఏళ్ళ ముందు నుంచే గోదావరి, కృష్ణా తీరాలలోని ప్రజలు విదేశాలతో సముద్రమార్గాన వర్తక వాణిజ్యాలు నిర్వహించారని చరిత్రవేత్తలు అంగీకరిస్తున్నారు. 'అశ్మకులు' సుస్థిరమైన రాజకీయ, పాలనా వ్యవస్థ కలిగి, సురక్షితమైన జీవన విధానాన్ని సాధించాలనుకొన్న వాళ్ళు కాబట్టే, సముద్రాలు, అడవులు, ఎడారులూ దాటి వర్తకాలు నిర్వహించగలిగేవారనీ, గొప్ప యోధులనీ, సాహసికులనీ అశ్మకుల గురించిన సాహిత్యాధారాలు చెప్తున్నాయి.

అశ్మకుల్లో గణిత, భౌగోళిక శాస్త్రవేత్తలు కూడా ఉన్నారు. రెండువేల ఏళ్ళక్రితం గణిత శాస్త్రంలో "అశ్మక సాంప్రదాయం" వుండేది. లీలావతి గణితం, బీజగణితం, సిద్ధాంత శిరోమణి గ్రంథానికి వ్యాఖ్య. మహాభాస్కరీయం, ఆర్యభట్టీయం భాష్యంలాంటి గ్రంథాలు రూపొందించిన గొప్ప శాస్త్రవేత్త, గణితశాస్త్ర ప్రవర్తకుడు భాస్కరాచార్య తన రచనలలో అశ్మకతంత్ర ఆధారాలను పదే పదే ఉటంకించాడని చెప్తారు. 'అశ్మక' ప్రాంతంలో గణిత శాస్త్రవేత్తల సంఘం లేదా కూటమి ఉండేదని, ఆర్యభట్టు పరిశోధనలను ఈ శాస్త్రవేత్తలు

అశ్మకసాంప్రదాయం పేరుతో కొనసాగించారనీ భావిస్తున్నారు. బహుశా ఆదిలాబాద్, నిజామాబాద్, కరీంనగర్ జిల్లాలు ఆ రోజున 'అశ్మక ప్రాంతం'గా పిలువబడి ఉండవచ్చని కూడా అంటున్నారు.

దేశ విదేశాలకు వర్తక నిమిత్తం తిరిగే ఆనాటి అశ్మకులకు కాలము - దూరము; కాలగమన వర్షాలు - ఎండల వివరాలు, గ్రహగతులు, గ్రహాల గురించి సమాచారం అవసరం. ఇతరులపైన ఆధారపడకుండా అశ్మకులు తమదైన శాస్త్ర విజ్ఞానం పాండిత్యం అభివృద్ధి  చేసుకున్నారన్నమాట!

## ఎవరీ అశ్మకులు ?

క్రీ.పూ. 700–300 మధ్య కాలంలో భారతదేశంలో 16 మహాజనపదాలు ప్రసిద్ధి చెందాయి. వాటిలో అశ్మక 'జనపదం' ఒకటి. సంస్కృత గ్రంథాలు 'అశ్మక', 'అశ్వక' పేర్లతోనూ, బౌద్ధ గ్రంథాలు పాళీ భాషలో 'అస్సక' పేరుతోనూ వాళ్ళని పిలిచారు.

తెలుగు నేల మీద వీళ్ల ఉనికిని గురించి చాలా సాహిత్యాధారాలు దొరుకుతున్నాయి. కొన్నింటిని పరిశీలిద్దాం.

1. 'అంగుత్తర నికాయ' బౌద్ధగ్రంథం - 16 జనపదాలలో "అశ్వమక జనపదం" కృష్ణా గోదావరి మధ్యప్రదేశంగా పేర్కొంది. మ్యాప్‌లో ఈ విషయాన్ని గమనించవచ్చు. వింధ్యకు దక్షిణాన వర్ధిల్లిన ఏకైక రాజ్యం "అశ్మక" లేదా "అస్సక"
2. "మహాగోవింద సుత్తాంత" బౌద్ధగ్రంథంలో కొన్ని జనపదాలనేలిన ఆనాటి రాజుల పేర్లున్నాయి.

| | | |
|---|---|---|
| అస్సక రాజు | : | బ్రహ్మదత్తుడు |
| అవంతిరాజు | : | వెస్సభు |
| కళింగరాజు | : | సత్తభు |
| సావీర రాజు | : | భరత |
| విదిశ రాజు | : | రేణు |
| అంగరాజు | : | దత్తరథ |
| కాశీరాజు | : | దత్తరథ |

3. "Encyclopaedia of Ancient Indian Geography" గ్రంథం (పే. 82-83)లో కౌటిల్యుడిని ఉటంకిస్తూ, అశ్మకులు గోదావరి తీరాన నివసించేవారని పేర్కొన్నారు.

4. గోదావరి ఒడ్డున పోతన (పోతలి) ఈ అశ్మక దేశానికి రాజధాని నగరం. పోతనలు, పోతరాజులు తెలుగువారిలో లెక్కకు మించి ఉండటానికి అశ్మకులు తెలుగువారు కావడమే కారణం!

5. బౌద్ధగ్రంథం 'సుత్తనిపాత'లో బావేరీ అనే బ్రాహ్మణ గురువు కోసల దేశం నుంచి అస్సక దేశం వచ్చి, గోదావరి తీరాన స్థిరపడ్డాడని, బుద్ధుని స్వయంగా కలిశాడనీ, తెలుగు నేల మీద బౌద్ధాన్ని వ్యాప్తి చేశాడనీ వివరాలున్నాయి.

6. భండార్కర్ (1918) కార్మిహెల్ ఉపన్యాసాలను ఉటంకిస్తూ "ఏన్షియంట్ ఇండియన్ ట్రైబ్స్" గ్రంథంలో అస్సకులు సింధూతీరం నుంచి గోదావరి తీరానికి చేరారని పేర్కొన్నారు.

7. పాణిని సూత్రాలలో (IV. 1173) అశ్మకదేశం సింధునదీ తీరాన ఉండేదని వుంది.

8. భవిష్యపురాణంలో అశ్మకుడు సుదాసు పుత్రుడని వుంది. సుదాసు, అతని తండ్రి దివోదాసు ఋగ్వేదంలో ప్రసిద్ధరాజులు, దాశరాజ్ఞయుద్ధంలో విజేతలు.

9. బృహన్నారదీయ పురాణంలో సుదాసు భగీరథుని తర్వాత 7వ తరంవాడని వుంది! వీరిలో అశ్మకుడి కొడుకు మూలకుడు. అతని మునిమనుమడు దిలీపుడు ఇతనే రఘువంశానికి మూలపురుషుడు. అశ్మకులను ఇక్ష్వాకులకు పూర్వీకులుగా బృహన్నారదీయ పురాణం చిత్రిస్తోంది.

10. మహాభారతం (ఆదిపర్వం)లో అశ్మకరాజు సౌధన్యపురం అనే నగరాన్ని నిర్మించి రాజధానిగా పాలించాడని ఉంది. ఇది పైతాన్ - ప్రతిష్ఠానపురం కావచ్చునని కొందరు చరిత్రకారులు భావించగా, 'పోతన' అనే తెలుగుపదాన్నే సంస్కృతీకరించి సౌధన్యపురంగా పేర్కొని వుండవచ్చని మరికొందరి భావన.

11. అశ్మకుడి పుట్టుకకు సంబంధించిన బృహన్నారదీయ పురాణంలో చెప్పిన కథ ఇది :

సుదాసు ఒక పెద్ద పులిని వేటాడి చంపగా అది బ్రహ్మ రాక్షసుడిగా మారి పగతో సుదాసుని ఇంటికి చేరి మాయోపాయంతో అతని చేత కులగురువు వశిష్ఠుడికి నరమాంసం

వడ్డింపచేస్తాడు. ఫలితంగా వశిష్ఠుడు సుదాసుని రాక్షసుడిగా మారి నరమాంసం తిని బతికేలా శపిస్తాడు. బదులుగా సుదాసు కూడా వశిష్ఠుని శపించబోగా, అతని రాణి మదయంతి వారిస్తుంది. ఆ శాపజలాన్ని తన కాళ్లమీదే పోసుకోవటంతో సుదాసు పాదాలు నల్లగా మారాయి. అందువలన కల్మషపాదుడిగా అతను ప్రసిద్ధుడౌతాడు. అతని అభ్యర్ధన మీదే వశిష్ఠుడు 'మదయంతి'కి పుత్రప్రాప్తి కల్గిస్తాడు. అయితే ఏడేళ్ళు గడిచినా ఆమె ప్రసవించకపోవడంతో ఒక గుండ్రాయి తీసుకొని 'గర్భతాడనం' చేసుకుంటుంది. ఆ దెబ్బకు ప్రసవం జరిగి పుత్రుడు పుడతాడు. 'అశ్మకం' (రాయి) వలన పుట్టాడు కాబట్టి అశ్మకుడన్నారు. ఇదీ కథ! అశ్మకుడు కల్మషపాదుడైన సుదాసు భార్య ద్వారా వశిష్ఠుడికి పుట్టినవాడని ఈ కథ వివరిస్తోంది.

"Pouranic encyclopaedia: a comprehensive Dictionary with special refrance to the epic and Puranic Literature" (Vettan Mani) (1975) అనే గ్రంథంలో అశ్మకుడి జన్మ వృత్తాంతం కొంత తేడాతో కన్పిస్తుంది. కల్మషపాదుడు వశిష్ఠుడి కొడుకు శక్తితో ఘర్షణపడి, అతని శాపకారణంగా రాక్షసుడై శక్తినే చంపి తినేస్తాడు. కొన్నేళ్ల తర్వాత వశిష్ఠుడు విషయం తెలుసుకొని, కల్మషపాదుని మన్నించి, అతని పూర్వ రూపం ప్రసాదిస్తాడు. అతని కోరిక మీద మదయంతి వశిష్ఠుని కలిసి పుత్రుణ్ణి పొందుతుంది. మిగతా కథ మామూలే!

12. మహాభారతం కర్ణపర్వంలో గోదావరి – మాహిష్మతీ నదుల మధ్య అశ్మక రాజ్యం ఉందనీ, దీని రాజు అశ్మకుడు కౌరవులకు వ్యతిరేకంగా పాండవ పక్షాన నిలిచాడని ఉంది.

13. మహాభారత శాంతిపర్వంలో కురుక్షేత్ర సంగ్రామానంతరం నిర్వేదంలో వున్న ధర్మరాజుని ఓదార్చి కార్యోన్ముఖుణ్ణి చేయడానికి వ్యాసుడు ప్రయత్నిస్తూ చెప్పిన విషయాల్లో అశ్మకుడనే ఋషి కథ కూడా ఉంది (47 అ 5 శ్లో) ఆ కథ ఇది. పూర్వం విదేహ రాజ్యాన్ని జనకుడనే రాజు పాలించేవాడు. ఆయన కూడా బంధుమిత్రులను కోల్పోయిన దుఃఖంలో మునిగి వున్నప్పుడు అశ్మకుడనే గురువు వచ్చి భవబంధాలున్నంత వరకూ సుఖదుఃఖాలు తప్పవని చెప్పి ఓదారుస్తాడు. ఆ యిద్దరి మధ్య సంభాషణని 'అశ్మకోపాఖ్యానం'గా పిలుస్తారు. అశ్మకుడు చెప్పిన విషయాలు "అశ్మకగీత"గా ప్రసిద్ధం!

14. ద్రోణపర్వం 37వ అధ్యాయం 22,23 శ్లోకాలలో అభిమన్యుడు పద్మవ్యూహంలో చిక్కుకున్నప్పుడు అశ్మకుడి కొడుకుని సంహరించినట్లుంది. ఈ అశ్మకుడి

కుమారుడు అభిమన్యుడు పైన 10 బాణాలు ప్రయోగించాడని, వాటిని ఎదుర్కొని, అభిమన్యుడు అశ్మక కుమారుని గుర్రాన్ని, రథాన్ని కూల్చి, అతని శిరసును ఖండించినట్లు మహాభారతంలో వుంది. ఆ తర్వాత అశ్మకులంతా యుద్ధరంగం నుండి నిష్క్రమించారట.

నిజానికి అశ్మకులు పాండవ పక్షానే నిలిచారు. అశ్మకుడి కొడుకు కౌరవ పక్షాన పోరాడాడు. బహుశా అశ్మకులలో కౌరవ పాండవ పక్షాలు ఇరువైపులా రెండు వర్గాలుగా ఉన్నారని అర్థం చేసుకోవచ్చు. లేదా ఉత్తరాది అశ్మకులు ఒకవైపు, దక్షిణాది అశ్మకులు వేరొక వైపు నిలిచి ఉండవచ్చు కూడా!

15. కర్ణుడు జయించిన రాజన్యులలో అశ్మకుడు కూడా ఉన్నట్లు ధృతరాష్ట్రుడికి నివేదిస్తారు.

16. అంపశయ్యపైన పడివున్న భీష్ముణ్ణి పరామర్శించిన వారిలో అశ్మక సుమంతుడనే 'మహర్షి' కూడా ఉన్నాడు.

17. కుబేరుడి నుంచి పుష్పకవిమానాన్ని బలవంతంగా స్వాధీనం చేసుకున్న రావణుడు, ఆ విమానం మీద తన లంకా నగరానికి తిరిగి వెడుతూ దారిలో అశ్మక నగరం వచ్చి కాసేపు విశ్రాంతి తీసుకున్నాడట!

18. పోతన రాజ్యానికి రాజు అస్సకుడికి ఇద్దరు రాణులు. రాజుగారు తొందరపడి రెండవ రాణికి పుట్టే కొడుక్కి రాజ్యం ఇస్తానని వాగ్దానం చేశాడు. పెద్దభార్య కొడుకు పేరు సుజాత. తండ్రి ఇచ్చిన మాట గురించి తెలుసుకొని, 'సుజాత' తనకు తానే అడవులకు వెళ్ళిపోతాడు. అక్కడ మహాకాత్యాయనుడి శిష్యుడై బౌద్ధభిక్షువుగా మారినట్టు ఓ బౌద్ధ కథ చెప్తోంది.

19. అస్సక జాతక కథలో పోతన నగరరాజు బ్రహ్మదత్తుడు తన నగరం తగినంత అభివృద్ధి సాధించలేకపోవటానికి తనలో లోపాలను తెలుసుకోవాలని దేశాటనం బయల్దేరుతాడు. దారిలో కోసలరాజు ఎదురయ్యాడు. ఇద్దరి బళ్ళూ ఒకేదారిలో ఎదురయ్యాయి. ఎవరు ఎవరికి దారి ఇవ్వాలనే మీమాంస వచ్చింది. ఇద్దరి గుణగుణాలనూ పరీక్షిస్తారు. ఇద్దరూ సమానమేనని తేలింది. అప్పుడు బ్రహ్మదత్తుడి రథచోదకుడు తమ ప్రభువు కోపాన్ని జయించిన వాడని చెప్తాడు. కోసలరాజు తన ఓటమిని అంగీకరించి దారి వదుల్తాడు.

20. ఛుల్ల కళింగ జాతక కథలో దంతపుర రాజ్యానికి కళింగుడనే రాజు, తనను ఓడించగలవాడికి తన నలుగురు కూతుళ్లనీ ఇచ్చి పెళ్ళి చేస్తానని, ప్రకటించి, ఆ నలుగురు కూతుళ్ళనీ పల్లకి ఎక్కించి, తగినంత సైన్యం తోడుగా ఇచ్చి దేశాల మీదకు పంపిస్తాడు. తన దేశానికి వచ్చినప్పుడు అస్సకరాజు "అరుణుడు" కళింగసైన్యాన్ని ఓడించి రాకుమార్తెల్ని గెలుచుకుంటాడు.

ఈ కథ ప్రకారం గోదావరికి దక్షిణాన అస్సక రాజ్యం ఉందని, అది కళింగ రాజ్యానికి సరిహద్దు దేశం అనీ తెలుస్తుంది. అంటే, ఇంచుమించు విశాఖపట్నం జిల్లా దాకా అస్సకరాజ్యం ఒకప్పుడు విస్తరించి వుండేదన్నమాట.

21. బోధిసత్వుడు హిమాలయాల దగ్గర సంచరిస్తున్నప్పుడు అక్కడ ఒక అస్సక రాజు తన రాణి చనిపోయిన నిర్వేదంలో ఉన్నాడని తెలిసి, ఆయనను పిలిపించి, ఆమె ఒక పేడ పురుగై పుట్టిందని చూపిస్తాడు. ఆ పురుగు మానవభాషలో రాజుపైన తనకేమీ ప్రేమలేదని చెప్తుంది. ఆ విధంగా అస్సక రాజుని కార్యోన్ముఖుణ్ణి చేసినట్లు ఒక జాతకకథ వివరిస్తుంది.

22. పాణిని (అష్టాధ్యాయా) "అవంత్యస్మకః అని అవంతితో కలిసి అశ్మక దేశాన్ని పేర్కొన్నాడు. వీళ్లు ఉత్తరాది అశ్మకులా - దక్షిణాది అశ్మకులా... అని తేల్చే విషయంలో పండితుల మధ్య ఏకాభిప్రాయం లేదు.

## ఉత్తరాది అస్సకులు :

ఉత్తర భారతదేశంలో నివసించిన అశ్మక ప్రజల గురించి సంస్కృత, గ్రీకు సాహిత్యాలలో ఎక్కువ ఆధారాలు కన్పిస్తాయి.

డా॥ ఆర్.పి. మజుందార్ (The History Culture of Indian People- 1968- P.49) సంస్కృత అశ్మక లేదా అశ్వక ప్రజలు 'కాంభోజ' తెగలకు చెందిన ఒక శాఖ అనీ, వీళ్లు ఆఫ్ఘనిస్తాన్ ప్రాంతంలో పశ్చిమశాఖగానూ, తక్షశిల ప్రాంతంలో తూర్పు శాఖగానూ రెండురకాలుగా వున్నారని పేర్కొన్నాడు.

సంస్కృత 'అశ్వ', ఇరానియన్ 'అస్స' ప్రాకృత 'అస్స' అంటే గుర్రం. గుర్రాలను పెంచడమూ వాటి వైద్యము తెలిసినవాళ్లు అనే అర్థంలోనే ఈ అశ్వకపదాన్ని ఎక్కువ మంది విశ్లేషించారు. వీళ్లు నిస్సందేహంగా క్షత్రియులే!

గ్రీకు చరిత్రవేత్తలు Aspasio, Aspasii, Hippaii, Assakenoi, Assaceni, assacani పేర్లతో వాళ్లని వ్యవహరించారు.

మెగస్తనీసు–'ఇండికా' (క్రీ.పూ. 350–290) ప్లినీ–హిస్టోరియా నేచురాలిస్' (క్రీ.శ. 23–79) గ్రంథాలు అస్సకుల ఆఫ్ఘనిస్తాన్ నివాసాన్ని పేర్కొన్నాయి.

వరాహమిహిర బృహత్సంహిత (ఎం.ఆర్.భట్ – 1996) వాయువ్య భారతదేశంలో మాందవ్య, తుషార, తాళ, మద్ర, అశ్మక, కుళుత మొదలైన ప్రజలున్నట్లు పేర్కొంది. ఈ అశ్మకులే ఉత్తరాది అశ్మకులు. వీళ్లు తొలుత కాంభోజ (ఆఫ్ఘన్) అశ్మకులని, ఉత్తరాదికి విస్తరించారనీ భావిస్తున్నారు. ఆఫ్ఘనిస్తాన్‌కు ఆ పేరు అశ్మకుల వల్లనే వచ్చిందని J.W. Mc. Crindle, Christian Lawssen ప్రభృతులు పేర్కొన్నారు.

పాణిని ఈ అశ్మక ప్రజల్ని స్వాత్, కునార్ లోయలకు చెందిన వారన్నాడు.

ఈ ఉత్తరాది అశ్మకులు, దక్షిణాది అస్సకులూ ఒక్కరేనా అనే ప్రశ్నకు ప్రొఫెసర్ రైస్ డేవిడ్స్ చెప్పినదే సమాధానం! "బుద్ధిస్ట్ ఇండియా" గ్రంథంలో ఆయన ఇలా అన్నారు. "sanskrit authors speak both of Asmaka and asvaka. each of these would be assaka, both in the local vernacular and in Pali. Either there were two distinct tribes so called, or the sanskrit form asvaka is a wrong reading, or a blunder in the sanskritisation of Assaka" అని

అశ్వకులు, అశ్మకులు ఒకరేననీ, వాళ్లనే పాళీభాషలో అస్సకులనీ పిలిచారనీ, 'అస్సక' అనే స్థానిక భాషాపదాన్ని 'అశ్వక' లేదా 'అశ్మక' అని తప్పుగా సంస్కృతీకరించి వుంటారని డా॥ రైస్ డేవిడ్స్ పేర్కొన్నాడు.

ఆఫ్ఘన్ అశ్వకులు ఉత్తరాదికి, అక్కడి నుంచి దక్షిణాదికీ తరలి వచ్చారా...? ఎప్పుడు వచ్చారు? వస్తూ తెచ్చిన భాషా సంస్కృతులు ఏమిటి? గోదావరి తీరంలోని అస్సకులు మాట్లాడిన భాష ఏమిటీ..? ఈ ప్రశ్నలకు సమాధానాలు కావాలి.

## ఉత్తరాది అశ్మకుల నాణాలు :

తక్షశిల దగ్గర 'కన్నింఘామ్'గారికి ఉత్తరాది అశ్మకుల నాణాలు కొన్ని దొరికాయి. వీటిని వటాశ్వక నాణాలు అంటారు.

"Geography from Ancient Indian Coins and seals" (పరమానంద గుప్త–పేజి 17–19) గ్రంథంలో ఈ వటాశ్వక నాణాల వివరాలున్నాయి. ఒక పర్వతం మీద నుంచి చంద్రోదయం అవుతుండగా ఆజానుబాహుడైన యోధుడు చేతులు కట్టుకొని నిలుచున్న

బొమ్మ ముద్రితమైంది. చంద్రుడిని బట్టి ఇది బహుశా చంద్రగుప్తుడి నాణెం కావచ్చని అనుకున్నారు. కానీ, 'వటాశ్వక' అనే అశోకుడి తరహా బ్రాహ్మీలిపిలో అక్షరాలను బట్టి బుహ్లర్ పండితుడు అశ్మకులలో వటవృక్షాన్ని పూజించే ఒక తెగవారికి సంబంధించిన నాణాలుగా భావించాడు. అయితే, ఈ నాణాల మీద వటవృక్షం లేకపోవడంతో ఈ వివరణని చాలామంది అంగీకరించలేదు. 'Allan' పండితుడు 'వటాశ్వక' అనేది ఒక దేశనామం కావచ్చునన్నాడు. ఆధునికంగా చాలామంది చరిత్రవేత్తలు 'వట' శబ్దాన్ని 'వర్త=వర్తకం అనే అర్థంలో 'వర్తక అశ్వకులు' అని భాష్యం చెబుతున్నారు. ఇవి క్రీ.పూ. 3-2 శతాబ్దాల నాటివి కావచ్చని భావిస్తున్నారు. తక్షశిలలో ఇవి దొరకడంతో అశ్వకులు (లేదా) అశ్మకులు కాలక్రమంలో హిందూ కుష్ పర్వతశ్రేణి దాటి తక్షశిలకు వచ్చి స్థిరపడ్డారని ఊహిస్తున్నారు.

## దక్షిణాది అశ్మకులు తెలుగు ప్రజలేనా?

తెలుగునేల మీద దక్షిణాది అశ్మకుల ఉనికి క్రీ.శ. 6,7 శతాబ్దాల దాకా దొరుకుతోంది. భాస్కరాచార్యుడి రచనలు ఇందుకు సాక్ష్యం.

అజంతా గుహల నిర్మాతలలో క్రీ.శ. 5వ శతాబ్దిలో అశ్మకులు కూడా ఉన్నారు. అశ్మక గుహలు కూడా ఉన్నాయి. వాకాటకులతో ఈ గుహల నిర్మాణంలో అశ్మకులు పోటీపడ్డట్టు కన్పిస్తుంది. వాకాటకుల్ని అంతం చేసింది అశ్మకులే!

చారిత్రక యుగంలో చారిత్రాత్మక పాత్ర పోషించిన అశ్మకులు తెలుగు భాషకన్నా వేరైన భాషా సంస్కృతులు కలిగినవారై వుంటే, వాళ్లు ఆ భాష పేరుతోనో, ఆ సంస్కృతి పేరుతోనో చెలామణి అయి వుండేవారని అనుకోవచ్చు. నిస్సందేహంగా అశ్మకులు తెలుగు ప్రజలే!

ఇప్పటికి 2,700 సంవత్సరాల నాటికే, బుద్ధుడికన్నా పూర్వమే తెలుగు నేల మీద, అంటే Central part of Deccan- దెక్కన్ భూభాగం కేంద్రస్థానంలో అనేక దేశాలుండేవని చరిత్రవేత్తలు చెప్తారు.

'కళింగ దేశ చరిత్ర' (రాళ్లబండి సుబ్బారావు పేజీ 430-36) గ్రంథంలో కళింగ రాజ్యం ఉత్కళింగ, మధుకళింగ, కళింగ అని మూడుభాగాలుగా ఉండేదని ఉంది. ఉత్కళింగ ఒరియా భాషా సంస్కృతుల ప్రాంతం కాగా, కళింగ ఈనాటి విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలతోకూడిన తెలుగు ప్రాంతం కావచ్చు. గుంటుపల్లి

స్తంభ శాసనంలో శ్రీసదుడనే రాజు తాను కలింగ - మహిశక జనపదాధీశుడినని పేర్కొన్నాడు.

2. కృష్ణానది దక్షిణ తీరాన్ని దక్షిణాపథం అనేవారు. ధనకడ (ధాన్యకటకం) - ఈనాటి గుంటూరు జిల్లా అమరావతి) ఈ దక్షిణాపథంలో ముఖ్యమైన వాణిజ్య కేంద్రం.

3. మైదవోలు శివస్కంధవర్మ శాసనంలో 'అంధపథ' అనే దేశనామం కన్పిస్తుంది.

4. గోదావరి నదికి ఎగువ ప్రాంతంలో అశ్మకదేశం ఉంది.తెలంగాణాలోని ఆదిలాబాద్, నిజామాబాద్, కరీంనగర్ జిల్లాల ప్రాంతం ఇది కావచ్చు.

5. అశ్మకదేశానికి ఎగువన ఈనాటి మహారాష్ట్రలోని నాందేడ్, ఔరంగాబాద్ జిల్లాలను - మూలక దేశం అన్నారు.

ఈ దేశాలన్నీ కలిపి బౌద్ధయుగంలో 'అంధకదేశం'గా పిలువబడ్డాయి. ఈ దేశీయులందరూ తెలుగు భాష మాట్లాడిన ఆంధ్రులే! ఈ అంధకదేశం నుంచి జాతీయస్థాయికి ఎదిగిన చక్రవర్తులు ఆంధ్ర శాతవాహనులు.

అంధకులు - అనగా, అశ్మక, మూలక, మహిషిక, కళింగాది దేశ ప్రజలందరూ క్రీ.పూ. 7వ శతాబ్దినాటికే విదేశీ వాణిజ్యరంగాలలో ఆరితేరిన వారే. అశ్మక, మూలకదేశీయులు అటు పశ్చిమ సముద్రతీరం నుంచీ లేదా, ఇటు ధనకటకం నుంచీ రోమ్ తదితర దేశాలకు ఎక్కువ ఎగుమతులు జరిపి ఉండవచ్చు.

An encyclopaedia of Indian Archeology (డా॥ అమలానంద ఘోష్) గ్రంథం మౌర్యుల కాలానికే ధాన్యకటకం గొప్ప వాణిజ్యకేంద్రంగా వుండేదని తెలియజేస్తోంది. ఇక్కడ జరిపిన త్రవ్వకాలలో పైపై పొరలలోనే బృహత్ శిలాయుగం నాటి కొన్ని వస్తువులు, సుమేరియా తదితర మెడిటరేనియన్ దేశాలకు సంబంధించిన వస్తువులు దొరికాయని కూడా ఈ గ్రంథం తెలియజేస్తోంది. "Amaravati illustrated how Buddhism Penetrated into megalithic surroundings-" అంటాడు డా॥ అమలానందఘోష్.

'అంధకదేశం'గా పిలువబడిన ఈ దేశాలలో అమరావతి మాత్రమే కాదు బృహత్ శిలాయుగానికి సంబంధించిన కేంద్రాలు ఎన్నో దొరుకుతాయి.

ఇటీవల జరిగిన ఒక ఉదంతాన్ని ఈ సందర్భంగా చెప్పవలసి ఉంది.

ప్రసిద్ధ పురావస్తు శాస్త్రవేత్త శ్రీ వి.వి.కృష్ణశాస్త్రి, పరిశోధకులు డా॥ దేమె రాజారెడ్డి, శ్రీ కుర్రా జితేంద్ర ప్రభృతులు, ఆదిలాబాద్ జిల్లా బజార్ హత్తునూర్ మండలం 'కనకాయ్' అటవీ గ్రామంలో ఒక పురాతన కోటను కనుగొన్నారు. అటవీశాఖాధికారి శ్రీ మహేంద్రరెడ్డి సమాచారం మేరకు ఈ కోట బయటపడింది. అక్కడ దొరికిన వస్తువులను అమెరికా దేశానికి కార్బన్ డేటింగ్ నిమిత్తం పంపగా, అవి 4,100 ఏళ్ల క్రితం నాటివని తేలిందని శ్రీకుర్రా జితేంద్ర నాకు తెలిపారు.

రోమన్ భవంతుల నమూనాలో విశాలమైన క్షేత్రంలో ఒక పెద్ద వాణిజ్యకేంద్రంగా ఈ కోటని ఆనాడు నిర్మించినట్లు ఈ పరిశోధకులు భావించారు.

అంతేకాదు, కోటిలింగాలలో దొరికిన నాణాలలో శాతవాహన ప్రభువులు కాని వ్యక్తుల పేర్లతో కొన్ని ప్రాచీన నాణాలు దొరికాయి. గోబద, నారన, సమవాయ, సమగోప లాంటి పేర్లతో ఈ నాణాలున్నాయి. ఈ నాణాలు దక్షిణాది అశ్మకుల నాణాలై వుంటాయని ఒక బలమైన నమ్మకం పరిశోధకుల్లో ఉంది. ఇందుకు సంబంధించిన చారిత్రక, సాహిత్యాధారాలు దొరకవలసి వుంది.

రామాయణ, మహాభారతాలు, పురాణాలు సంకలనం అయిన కాలానికే అశ్మకులు సంస్కృతీకరించబడ్డారు. అందువలన వైదిక సాహిత్యాధారాలు అస్సకుల స్వంత భాషా సంస్కృతుల్ని కప్పి పెట్టేశాయి. బౌద్ధసాహిత్యం కూడా ఇదే విధంగా పాళీ భాషలోకి వీళ్లని పాళీకరించింది. ఈ ఆధారాలను బాగా జల్లించగలిగితేనే అశ్మక లేదా అస్సకుల 'తెలుగుదనం' తేలుతుంది!



# రాయలనాటి వజ్రాల పరిశ్రమ

**15** వ శతాబ్దినాటికి ప్రపంచంలోనే అత్యధిక ధనిక సామ్రాజ్యంగా విజయనగర సామ్రాజ్యాన్ని తొలుతగా గుర్తించిన వారు పోర్చుగీస్‌లు. యూరోపియన్ ఆర్థిక వ్యవస్థకన్నా విజయనగర ఆర్థిక వ్యవస్థ గొప్పగా వుందని వాళ్లు భావించారు.

దక్షిణ భారతదేశంలోని సుగంధద్రవ్యాలు విజయనగరాన్ని సంపన్నం చేశాయని వాళ్ళు మొదట అంచనా వేశారు. కానీ, విజయనగరానికి వచ్చి స్వయంగా పరిశీలించిన మీదట సుగంధ ద్రవ్యాల కన్నా మించిన ఆదాయాన్ని సమకూర్చే మరో రెండు అంశాలున్నట్టు గుర్తించారు. ఒకటి, సాంకేతికంగా అభివృద్ధి చెందిన వజ్రాల పరిశ్రమ. రెండవది మంచి గంధపు చెక్క.

విజయనగర సామ్రాజ్యంలో వజ్రాల గనులు ప్రధానంగా ఉన్నది తెలుగు ప్రాంతాలలో, మంచిగంధం మొక్కల అడవులున్నది కన్నడ నేలమీద. సుగంధ ద్రవ్యాలు ప్రధానంగా దొరికేది మలబారు, తమిళ ప్రాంతాలలో. ఈ విధంగా తెలుగు, కన్నడ, తమిళ ప్రాంతాలు మూడు కలిసి, విజయనగరాన్ని సుసంపన్నం చేశాయి.

తెలుగు నేల మీద వర్థిల్లిన వజ్రాల పరిశ్రమ గురించి పరిచయం చేయడమే ఈ వ్యాసం ముఖ్యలక్ష్యం.

## తెలుగు నేల మీద వజ్రాల గనులు

విజయనగరం వజ్రాలను "హంపీ" వజ్రాలనేవాళ్లు. ఆనాటి పోర్చుగీసు, జెర్మన్, స్పెయిన్, ఫ్రెంచి, రోమ్ వర్తకులు, యాత్రికులు రాసిపెట్టిన వ్రాతప్రతులు హంపీ వజ్రాలకు సంబంధించిన అనేక వివరాలను అందిస్తున్నాయి.

ఫ్రెంచి యాత్రికుడు జీన్ బాప్టిస్ట్ టావెర్నియర్ "ట్రావెల్స్ ఇన్ ఇండియా" (ed : william Crooke, Tr.V.Ball, 1925, Vol.II) గ్రంథంలో విజయనగరం వజ్రాల గనులను స్వయంగా చూసి విశేషాలు రికార్డు చేశాడు. సెబాస్టియావో మౌరిక్ 1629-43 కాలంలో విజయనగరంలో పర్యటించిన విశేషాలు పేర్కొన్నాడు. అబ్దుల్ రజాక్, నికోలాకోంటి, డోమింగో పెయిస్, ఫెర్నావో, న్యూనిజ్, అథనేసియస్ నికిటిన్ లాంటి యూరోపియన్ వర్తకులు, యాత్రికులు హంపీ వజ్ర పరిశ్రమ గురించి ప్రముఖంగా ప్రస్తావించారు. 16,17 శతాబ్దాల కాలంలో పోర్చుగీసుకు చెందిన "ఫ్రాన్సిస్కో పెరీరా", ఇటాలియన్ వ్యాపారులు "సీజర్ ఫ్రెడెరిక్" "గాస్పెరోబల్బీ", స్పానిష్ వ్యాపారి జాక్విస్ డి. కౌటే, ఫ్రెంచి యాత్రికుడు బెర్నియర్ వీళ్లంతా హంపీ వజ్రాల గురించి ఆనాటి ప్రపంచానికి చాటి చెప్పినవాళ్లు.

ఆనాటి పోర్చుగీసులు విజయనగర వైభవాన్ని చూడాలని ఎంత ఆత్రపడ్డారో డొమింగో పెయిస్ రాసినదాన్ని బట్టి తెలుస్తుంది. "... క్రిస్టోవావ్ డి ఫిగ్విరిడో తనతో వచ్చిన పోర్చుగీసు వారందరికీ బిస్నగ (విజయనగరం) నగర రాజ భవనం చూపడానికి దయతో తనను అనుమతించవలసినదిగా రాజును అభ్యర్థించాడు. తనతో అనేకమంది పోర్చుగీసువారు మొదటిసారిగా బిస్నగ నగరానికి వచ్చారని, దాన్ని చూసి వారంతా ఆనందిస్తారనీ, భగవంతుడు వారిని తమ తమ ప్రాంతాలకు తీసుకువెళ్లినప్పుడు తాము చూసిన దాన్ని గురించి చెప్పుకునే వీలు కలుగుతుందని ఫిగ్విరిడో రాజుకు విన్నవించాడు" (విస్మృత సామ్రాజ్యం విజయనగరం - రాబర్ట్ స్యూయల్, 2010 ఎమెస్కో పేజీ. 276) ఫెర్నావో న్యూనిజ్ కూడా "గతె (గుత్తి- GOOTY) వజ్రాల గనుల గురించి ప్రస్తావించాడు.

డ్వార్టీ బార్బోజా అనే పోర్చుగీసు రాజప్రతినిధి 16వ శతాబ్ది తొలి నాటివాడు. బిస్నగ సామ్రాజ్యంలో దక్వెమ్ (డెక్కన్ - దక్షిణం) భూభాగంలో ఎన్నో వజ్రాల గనులున్నట్లు తన రాజుకు తెలుపుకున్నాడు.

ఫ్రెన్సిస్కో, పెరీరా, పోర్చుగల్ రాజుకు రాసిన లేఖలో - పడిక్, కొర్టిన్నా, బళారి, కరుల్, కొండెపెల్యం, పెంపాయ్ ప్రాంతాలలో వజ్రాల గనుల గురించిన వివరాలున్నాయి. ఈ పేర్లలో బళ్లారి, వజ్రకరూర్, కొండపల్లి, హంపీ ఇవన్నీ ప్రసిద్ధిగన్న గనులు.

1611-1614లో జాక్విస్ డి క్యూటర్ వ్రాసిన వ్రాతప్రతిలో రామలకోట, నందియాల్, మల్లవెల్లి, మర్మూరు గనుల పేర్లున్నాయి. వీటిలో మల్లవెల్లి వజ్రాలగనిని తాను స్వయంగా చూశానని స్ట్రేన్‌షమ్ మాస్టర్ (1679) పేర్కొన్నట్టు, కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్ (1883)లో గోర్డాన్‌మెకంజీ కొన్ని వివరాలు అందించాడు. కృష్ణాజిల్లా

నూజివీడు దగ్గర మల్లవల్లి, గొల్లపల్లిలలో వజ్రాల గనులున్నట్లు దీన్నిబట్టి తెలుస్తోంది. 1795లో డా॥ హేనీ అనే బ్రిటిష్ అధికారి కూడా ఈ నూజివీడు గనుల్ని చూసినట్టు రికార్డు చేశాడని మెకంజీ వివరించాడు. గోల్కొండ సుల్తానుల పాలనలో నూజివీడు "కొండపల్లి సర్కార్" కింద వుండేది. కోళ్లూరు, పరిటాల, మల్లవల్లి, గొల్లపల్లి ఇవన్నీ కొండపల్లి వజ్రాల గనులున్న ప్రాంతాలు ఆనాడు.

విన్సోటెన్, విలియం మెత్వోలు, కాస్టాన్‌హెడా, గర్షియా డి ఓర్టా, వర్తెమా, బార్బొజా, యాండ్రీసారీస్; లాజరస్ వైగస్, ఆంటోనియో లోపెల్ ఇలా ఎందరో యూరోపియన్లు విజయనగరం, గోల్కొండలలోని వజ్రాల పరిశ్రమ గురించి ఎన్నో విశేషాలు రాసి పెట్టారు.

## హంపీ వజ్ర సంపద :

విజయనగర వజ్రాల పరిశ్రమ వర్ధిల్లిన కాలంలో ప్రపంచంలో ఇంత ఆదాయ వనరులు కలిగిన పరిశ్రమ మరొకటి లేదు. బ్రెజిలియన్‌లు 1725లో దక్షిణ అమెరికాలో వజ్రాల పరిశ్రమను స్థాపించారు. 1866 లో దక్షిణ ఆఫ్రికాలో బంగారు గనుల విశేషాలు వెలుగులోకి వచ్చాయి. అంతవరకూ తెలుగువారి వజ్రపరిశ్రమే ప్రపంచ ప్రసిద్ధిగా వుండేది. అమెరికన్ వజ్రాలు తక్కువ నాణ్యమైనవి. కృత్రిమ వజ్రాల్లాంటివి. "అమెరికన్ డైమండ్స్" పేరుతో ప్రస్తుతం ఇవే ప్రపంచ మార్కెట్‌ను ఏలుతున్నాయి.

కానీ, విజయనగరం వజ్రాలు అలాంటివి కాదు. తిరుగులేనివి. నాణ్యమైనవి. ఇంకెక్కడా దొరకనివి. "We can certainly assume that Deccan was the only place of Diamond production in the world at that time" అంటాడు డా॥ యస్. జయశీల స్టీఫెన్ (1995 ఏప్రియల్ - జూన్, మిథిక్ సొసైటీ జర్నల్ -Diamond Mining Industry - Vijayanagara state policy and the Regional Economy of Late Medieval South India వ్యాసం)

ప్రత్యామ్నాయ ఆర్థిక వనరులైన ఖనిజాలు, లవణాల మీద దృష్టి పెట్టగలగడం వల్లనే విజయనగర రాజులు అంతర్జాతీయ వాణిజ్యాన్ని అంత విజయవంతంగా నిర్వహించగలిగారు.

ఫ్రాన్సిస్కో పెరీరా అనే పోర్చుగల్ రాజప్రతినిధి హంపీ వజ్రాల్ని 3 రకాలుగా వర్గీకరించాడు. వజ్రకరూర్‌లో దొరికే వజ్రం అన్నింటికన్నా శ్రేష్ఠమైనదన్నాడు. కొండపల్లి వజ్రం కొంచెం చిన్నదిగా ఉంటుంది గానీ, వజ్రకరూర్‌కన్నా కాంతివంతంగా వుంటుం దన్నాడు. పెంపాయ్ వజ్రం ముతకగా, పెళుసుగా వుంటుందని విశ్లేషించాడు.

1520 నాటికి, కృష్ణదేవరాయల ఆధీనంలో ఆయన స్వయం పర్యవేక్షణలో 7 వజ్రాల గనులుంటే, 1673 నాటికి సుల్తాన్‌ల ఆధీనంలో, బీజాపూర్ సామ్రాజ్యంలో 15 గనులు, గోల్కొండ సామ్రాజ్యంలో 23 గనులు ఏర్పడ్డాయి. అంటే సుల్తానులు కొత్త గనుల్ని తెరిచారన్నది స్పష్టం. భూగర్భ వనరుల్ని విజయనగర రాజులు సంయమనంతో, సమతుల్యత సాధించే విధంగా వినియోగించారనీ, సుల్తాన్‌లు వాణిజ్య ప్రయోజనాల కోసం తెలుగు నేల లోపలి వనరుల్ని తెగనమ్ముకున్నారనీ అర్థం అవుతోంది.

16వ శతాబ్దిలో తమిళనాడులోని దేవికాపురం, అగరం, తిరువైయూరులలో వజ్రాల మార్కెట్లు ఏర్పడ్డాయి. 17వ శతాబ్దిలో "జింజి"ని శివాజీ ఆక్రమించాక అక్కడ కూడా ఒక వజ్రాల మార్కెట్ ఏర్పడింది.

## రాయలకాలంలో వజ్రగనుల నిర్వహణ

విజయనగర రాజులకు గనుల నిర్వహణ విషయంలో శాస్త్రీయ విధానం ఉంది. కృష్ణదేవరాయలు తర్వాత, సుల్తానులు కొంత మార్పుచేసినప్పటికీ, మొగల్ చక్రవర్తులు, బ్రిటిష్ పాలకులు కూడా విజయనగర విధానంలోనే వజ్రాల గనుల్ని నిర్వహించే ప్రయత్నం చేశారు. కానీ చిత్తశుద్ధి కొరవడటం వలన గొప్ప విజయాలు సాధించలేకపోయారు.

వజ్రాలు దొరికే భూముల్ని సర్వే చేసి, ఎంపిక చేసుకోగలగటం మొదటి అంశం. రాజు స్వయంగా పర్యవేక్షించేవాడు. కంపలు, దుబ్బులు, తుప్పలు ఏరి, వాటిని దగ్ధం చేసేవాళ్లు. గని కోసం కేటాయించిన భూమిచుట్టూ కోట ప్రాకారాలు నిర్మించేవాళ్లు. అది నిషిద్ధ ప్రదేశం. జనసామాన్యానికి ప్రవేశం లేదు. నిరంతర నిఘా, సైనికుల పహారా వుండేవి. గని కార్మికులను సెక్యూరిటీగార్డులు బట్టలు దులిపి మరీ పరీక్షించి బైటకు పంపేవాళ్లు.

బలులిచ్చి, శాస్త్రోక్తంగా పూజలు జరిపి, వజ్రాల వేట ప్రారంభించేవాళ్లు. గని కార్మికులందరినీ అక్కడ సమావేశపరచి, తిలకం దిద్ది, గనిసంపదని కాపాడతానని దేవత పేరుతో 'ఒట్టు' వేయించేవాళ్లట.

ఒక్కో గనిలో 20 వేల నుంచి 60 వేల వరకూ కార్మికులు పనిచేసేవాళ్లు. వీళ్లలో, స్త్రీలు, పురుషులు, పిల్లలు కూడా వుండేవాళ్లు.

వేగులు వెయ్యికళ్లతో గని కార్మికుల్ని కనిపెడుతూ వుంటారు. వజ్రాన్ని దొంగతనం చేసినట్లు బైటపడితే, దాన్ని లాక్కుని దాని విలువకు 8 రెట్లు అపరాధరుసుము విధించేవాళ్లట. మరణశిక్ష కూడా విధించేవాళ్లు. "వాన్‌లింషో టెన్" అనే యాత్రికుడు

ఇలా అంటాడు. "If anie man bee found that hideth anie such he looses both life and goods" అని!

ఇంత కఠినమైన నియమాలను పెట్టి నడపడంతో బైట ప్రజలకు ఈ వజ్రాల గనుల గురించి పెద్దగా తెలిసేదికాదు. అందుకే విజయనగర వజ్ర పరిశ్రమ గురించి మనకు సాహిత్యాధారాలు, శాసనాధారాలు లేకుండా పోయాయి.

ప్రతి 2వేల మంది కార్మికులపైన ఒక పర్యవేక్షకుడుంటాడు. ప్రతి వందమందినీ ఒక యూనిట్‌గా తీసుకుని, ఈ వందమందికీ నిపుణత, అనుభవం, సీనియారిటీ వున్న కార్మికుణ్ణి నాయకుడిగా పెట్టేవాళ్లు. ఈ యూనిట్‌ని "MUZHAM UNIT" అని పోర్చుగీసు భాషలో పిలిచేవాళ్లు.

త్రవ్వకాల్ని మగకార్మికులు జరిపేవాళ్లు. మట్టిమోయడం, ఊడవటం, కడగటం లాంటివి ఆడవాళ్లు, పిల్లలు చేసేవాళ్లు. బండరాళ్లు అడ్డం వస్తే పేలుడు పదార్థాలుపయోగించి పగలగొట్టేవాళ్లు.

గనిని తవ్వుకొంటూ లోపలికి పోయినప్పుడు, తట్టల్లో మట్టిని ఎత్తుకుని వరుసగా నిలబడిన కార్మికులు ఒకరి చేతుల్లోంచి ఒకరు అందుకొంటూ అంచెలంచెలుగా గని బైటకు తెచ్చి కుప్పగా పోసేవాళ్లు.

ఎత్తుగా ప్రత్యేకంగా కట్టిన ఒక అరుగు మీద కొద్ది కొద్దిగా “గనిమట్టి” తెచ్చి, కొండ చీపుళ్లతో జాగ్రత్తగా కడిగేవాళ్లు. వజ్రపురాయికీ, మామూలురాయికీ తేడా తెలిసిన నిపుణుల పర్యవేక్షణలో ఈ “కడుగు” కార్యక్రమం జరిగేది. వజ్రపురవ్వ దొరికినా దాని విలువ దానిదే కదా!

“గనిమట్టి” లోంచి వేరుచేసిన వజ్రపు రాళ్లను రెండు రోజులపాటు నీళ్లతొట్టెలో వేసి నానబెట్టేవాళ్లు. రాయిని అంటుకున్న మట్టిని కడిగి, ఆ వజ్రపు రాయిని ప్రభువుకు అప్పగించడం వీళ్ల బాధ్యత.

అక్కడి నుంచి ప్రభుత్వ ఆధ్వర్యంలోని కార్ఖానాకు ఆ వజ్రపు రాయిని చేరుస్తారు. దాన్ని కోణాలుగా కోసి, సానబెట్టేందుకు తిరుగలిరాయిలాంటి రాతి చక్రాలు ఉండేవి. విజయనగరం పనివాళ్లు అనుసరించే పద్ధతిలో తరుగు ఎక్కువగా పోదని, పోర్చుగీసు పద్ధతిలో ఎక్కువ వజ్రభాగం నష్టపోతున్నాం అనీ పోర్చుగీసులే అంగీకరించారు. రాయి ఎంత వేగంగా తిరిగితే, మెరుగు అంత ఎక్కువ, తరుగు అంత తక్కువ వస్తుందని టావెర్నియర్ రాశాడు.

## గనులకు ప్రైవేటు యాజమాన్యాలు

పెద్ద గనులను రాజే స్వయంగా నిర్వహించినా, తక్కిన చిన్న గనులున్న ప్రాంతాల్ని నమ్మకమైన వ్యక్తులకు కౌలుకు ఇచ్చేవాడు. "గూటి (గుత్తి)" గనిని అడపా నాయకుడు కౌలుకు తీసుకున్నాడు. ఇతనిని గురించి ఫెర్నారోన్యూనిజ్ ఇలా రాశాడు : "అడపా నాయక్ మరొక సామంతుడు. రాజుకు ప్రధాన సలహాదారుడు. "గతె" (గూటి, గుత్తి) ప్రాంతానికి ప్రభువు. ఆదాయం మూడు లక్షల బంగారు పర్దావులు. ఈ ఆదాయంలో గుత్తి వజ్రాలగనిలో దొరికే వజ్రాల మీద వచ్చే ఆదాయం చేరదు. రాజుకు ప్రతి సంవత్సరం నలభైవేల పర్దావులు చెల్లిస్తాడు. అయితే, అక్కడ దొరికే వజ్రాలలో ఇరవై "మంజెలిన్" లకు మించిన బరువు గల వజ్రాలన్నీ రాజుగారి కోశాగారానికి సమర్పించాలి. ఎనిమిదివేల పదాతులు, ఎనిమిది వందల గుర్రాలు, ముప్పయి ఏనుగులను పోషించాలి. రాజుకు ప్రతి సంవత్సరం లక్షపర్దావులు చెల్లించాలి-" (విస్మృత సామ్రాజ్యం - విజయనగరం : రాబర్ట్ స్యూయల్ 2010 ఎమెస్కో)

మాంజెలిన్ అంటే ఒక కేరట్ కన్నా కొంచెం ఎక్కువ. నాలుగు మాంజెలిన్‌లు 5 కేరట్లతో సమానంగా ఉంటాయి. 20 మాంజెలిన్లు అంటే 25 కేరట్లు అవుతాయి.

తిమ్మరాయుడు "పేలి" వజ్రాల గనిని, గోపాలరాయుడు నంద్యాల గనిని, కృష్ణరాయుడనే పాలెగారు మర్మూరు గనిని కౌలుకు తీసుకుని నిర్వహించేవాళ్లని విదేశీయుల వ్రాతప్రతుల్ని బట్టి తెలుస్తోంది.

25 కేరట్లకన్నా చిన్నవైన వజ్రపురాళ్లను తామే ఉంచుకుని, గనుల లీజుదార్లు పెద్ద వజ్రాలన్నింటినీ సగౌరవంగా ప్రభువుకు అర్పించుకునేవాళ్లు. ఏ కారణంచేతనైనా, రాజ్యంలో ఎవరి దగ్గరైనా 25 కేరట్లకన్నా పెద్ద వజ్రం ఉన్నా దాన్ని అమ్మినా, దాన్ని కొన్నా అది మరణశిక్ష పడేటంత నేరం. వజ్రానికి సాన పెట్టేవాళ్లు కూడా మనిషికి మూడు వజ్రాలకన్నా ఎక్కువ వుంచుకోకూడదనే ఆంక్ష ఉండేది. విలియం మెక్వోలిన్ "రిలేషన్స్ ఆఫ్ గోల్కొండ ఇన్ ద ఎర్లీ సెవెన్టీన్త్ సెంచురీ-1931" గ్రంథంలో ఇలాంటి వివరాలు చాలా కన్పిస్తాయి.

1531-32 సంవత్సరాలలో ముత్తిన లక్ష్మీసెట్టి వజ్రకరూర్‌లోని ప్రభుత్వ వజ్ర భాండాగారానికి అధిపతిగా వుండేవాడు. పెద్ద వజ్రాలు మాత్రం రాజధానిలో ప్రభుత్వ కోశానికి పంపించి, చిన్న వజ్రాలను తాను సంరక్షించేవాడు.

## వజ్రాల అంగళ్లు

1520-22 లలో డోమింగో పెయిస్ రాసిన దాన్ని బట్టి చూస్తే, విజయనగరం కాలంలో కూరగాయలు అమ్మినంత స్వేచ్ఛగా వజ్రాల మార్కెటింగ్ జరిగేదని తెలుస్తుంది.

పెయిస్ ఇలా రాశాడు... "ఇంకా ముందుకు వెళితే ఒక విశాలమైన మనోహరమైన వీధి వస్తుంది. నేను ఇంతకు ముందు వర్ణించిన అందమైన ఇళ్లు, వీధుల వంటిది. ఈ ఇళ్లు భరించగలిగిన స్థాయి ధనవంతులవని గుర్తుంచుకోవాలి. ఈ వీధిలో చాలామంది వర్తకులు నివసిస్తారు. ఇక్కడ అన్ని రకాల కెంపులు, వజ్రాలు, పచ్చలు, పగడాలు, సన్నముత్యాలు, వస్త్రాలు, భూమ్మీద లభించే ప్రతి వస్తువూ నీవు కొనదలచుకున్నది ఏదైనా దొరుకుతుంది" (విస్తృత సామ్రాజ్యం విజయనగరం- రాబర్ట్ స్యూయల్, 2010 ఎమెస్కో, పేజీ 256)

నిత్యావసర వస్తువులతో పాటే, ఈ ఖరీదైన రత్నాలూ వజ్రాలు సామాన్య ప్రజల కోసం బహిరంగంగా అమ్మకం జరిగేవి. ఇవేకాదు, గుర్రాలు కూడా ఈ మార్కెట్లోనే అమ్మకానికి వుండేవి.

చిన్నవజ్రాలను మూటగట్టి హంపీ మార్కెట్‌లో ఐదు రూబుళ్లకూ, పదిరూబుళ్లకూ అమ్మేవారని "నికిటిన్" పేర్కొన్నాడు. రెండు వేల పౌండ్ల బరువైన బంగారం ఇచ్చి 25 వజ్రాలు కొనుగోలు చేసేవాళ్లట. "కొనవజ్రం" అయితే పదివేల పౌండ్ల ఎత్తు బంగారం ధర పలికేదట.

వీటితోపాటు కృత్రిమ వజ్రాలు కూడా అమ్మేవారని (ఇమిటేషన్ వజ్రాలు) బార్బోజా పేర్కొన్నాడు. అందుకని, నాణ్యత పసిగట్టగలిగిన స్వర్ణకారుల్ని వెంట తీసుకునివెళ్లి, నమ్మకం కుదిరితేనే కొనవలసిందిగా పోర్చుగల్ రాజు తన ఏజెంట్లను ఆదేశించేవాడు.

బహిరంగ మార్కెట్‌లో దొరికే వజ్రాలు ఎక్కువ భాగం ప్రైవేటు యాజమాన్యం నిర్వహించే గనులలోని చిన్న వజ్రాలే! పెద్ద వజ్రాలు బహిరంగంగా అమ్మడం కొనడం నేరమే కదా... అనాడు.

1517లో "లాజరస్ నూరెన్ బెర్గర్" అనే జర్మనీ నగల వ్యాపారి పోర్చుగీసులతో కలిసి విజయనగరం మార్కెట్‌కు వచ్చాడు. సామ్రాజ్యం నలుమూలలా తిరిగాడు. వజ్రాల గనుల వివరాలు బాగా తెలుసుకున్నాడు. తిరిగివెళ్ళి జర్మనీ అంతా హంపీ వజ్రాల గురించి ప్రచారం చేశాడు. జెర్మనీ ప్రభువు 1520లో "హిష్ఫోజెల్" అనే వ్యాపారికి కొంత పెట్టుబడి పెట్టిన తన పక్షాన వజ్రాలు కొనుగోలు చేసి తెమ్మని నియమించాడు.

చాలా దేశాల వాళ్లు ఇక్కడ కొన్న వజ్రాలతో, ఇక్కడే బంగారు ఆభరణాలు చేయించుకు వెళ్ళేవాళ్లు. 23-10-1549 న పోర్చుగల్ రాజు భారతదేశంలో తన గవర్నర్‌ని "Cosme Anoes" అనే వర్తకుడికి విజయనగరంలో వజ్రాలు కొనడం కోసం 10 పరదావుల బంగారాన్ని ఇవ్వవలసిందిగా ఆదేశించాడు. "ఆంటోనియో లోపెల్" భారతదేశంలో

పోర్చుగీసుల కోశాధికారిగా ఉండేవాడు. 4-4-1557న పోర్చుగల్ రాజు 42 "గ్రావ్" (GRAOS) ల వజ్రపు ఉంగరం కొనుగోలు చేయటానికి 24,582 పోర్చుగల్ కరెన్సీని చెల్లించి హంపీకి పంపవలసిందిగా అతనిని ఆదేశించాడు. వజ్రాల వ్యాపారం ఇంత పగడ్బందీగా జరిగేది ఆ రోజుల్లో.

## కొండపల్లి వజ్రాలు :

నదిలో దొరికే రాళ్లనుంచి పూర్వపు రోజుల్లో వజ్రాలను ఏరి పదును పెట్టేవాళ్లు. River Gravels అంటారు. వీటిని. భూమిపై పొరల్లో కూడా ఇలానే వజ్రపు రాళ్లుండి, వాన కురిసినప్పుడు అవి తేలి బైటకొచ్చేవి. వాటిని Kimberlite stones అంటారు. కృష్ణా, గుంటూరు, మహబూబ్‌నగర్, కర్నూలు, కడప, అనంతపురం జిల్లాల్లో కృష్ణాతీరం వెంబడి వున్న భూముల్లో ఈ కింబర్లయిట్ వజ్రపురాళ్లు దొరుకుతాయి. తుంగభద్ర నుంచి కృష్ణానది దివిసీమ సాగరసంగమం వరకూ 300 కి.మీ. ప్రాంతంలో వజ్రాలు దొరికేవి. కాబట్టి కృష్ణానదిని "వజ్రాల నది"గా పిలిచేవాళ్లు కూడా! ఈ నదీ పరీవాహక భూమిని వజ్రభూమి అనేవాళ్లు. బౌద్ధుల కాలం నాటికే ఇది వజ్రభూమి.

గుంటూరు జిల్లా సత్తెనపల్లి దగ్గర కోళ్లూరు, కృష్ణాజిల్లా జగ్గయ్యపేట దగ్గర పరిటాల గ్రామాలలో గొప్ప వజ్రాల గనులుండేవి. అనంతపురం జిల్లా వజ్రకరూరు, కర్నూలు జిల్లా నంద్యాల, జొన్నగిరి, కర్నాటకలోని రాయచూరు, కడపజిల్లా బనగానపల్లి విజయనగర కాలం తర్వాత బాగాప్రసిద్ధి పొందిన వజ్రపు గనులు, కోస్టాకొండ, కడప, ద్వానెగూటి, నేవా, పేలి... ఇలాంటి గ్రామనామాలు వజ్రపు గనులున్న ప్రాంతాలుగా యూరోపియన్ల రికార్డుల్లో కన్పిస్తాయి. విజయనగర కాలంలో హంపీ వజ్రాలుగా పిలువబడిన ఈ వజ్రాలని సుల్తానుల కాలంలో గోల్కొండ వజ్రాలని పిలిచారు.

విలియం మెత్ వరల్డ్ అనే యూరోపియన్ 17వ శతాబ్దిలో కోళ్లూరు గనిని ప్రశంసించాడు. వజ్రకరూర్ తర్వాత అంతటి ప్రశస్తమైన వజ్రాలు కోళ్లూరులోనే దొరికాయట!

కోళ్లూరు గనిని గోల్కొండ సుల్తానులే కనుగొన్నారని అంటారుగానీ, గోర్డాన్ మెకంజీ 'కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్" (1883)లో ఈ కోళ్లూరు అంతకు మునుపు అనేక వందల సంవత్సరాలుగా వుండేదని భావించాడు. వెనీస్ యాత్రికుడు మార్కోపోలో 13 శతాబ్దిలో కృష్ణాతీరాన్ని సందర్శించాడు. కృష్ణానది మీద ప్రయాణిస్తూ సిందుబాద్ సాహసయాత్రల్ని గుర్తు చేసుకున్నాడు. ఆయన సందర్శించిన వజ్రాల గని ఈ కోళ్లూరే కావచ్చునన్నాడు మెకంజీ.

అశోకుడి తరఫున బౌద్ధ ప్రచారానికి శ్రీలంక వెడుతూ మార్గమధ్యంలో కృష్ణానది దగ్గర ఆగిన తిష్యరక్షిత బృందం కృష్ణానది మీద ప్రయాణిస్తున్నప్పుడు "వజ్రాలదిన్నె" దగ్గర, ఇసుకమేటకు పట్టుకొని పడవ ఆగిందట; వజ్రాలు దొరికే భూమి కాబట్టి దీన్ని వజ్రాల దిన్నె అన్నారనీ, ఇదే ఆ తరువాతి కాలంలో 'కోళ్లూరు'గా ప్రసిద్ధి చెందిందనీ ఒక వాదన ఉంది.

కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్ (1883)లో గోర్డాన్ మెకంజీ ఈ కోళ్లూరు గురించి ఒక ఆసక్తికరమైన కథ చెప్పాడు. Bizengulia (విజయనగరం) నుంచి 15 రోజులు ప్రయాణిస్తే వజ్రాలు దొరికే కొండ వస్తుంది. దాన్ని Albenigaras అంటారు. అల్బెనిగరాస్ కొండ మీద వజ్రాలను కాపాడుతూ భయంకరసర్పాలు తిరుగుతుంటాయి. దాన్ని ఎక్కడం చాలా కష్టం. అందుకని, ఈ కొండకు దగ్గరలో వున్న మరో కొండమీదకు ఎక్కి అక్కడ పూజలు చేసి, బలిసిన ఎద్దుని బలి ఇచ్చి, దాని మాంసాన్ని ముక్కలుగా తరిగి, ప్రత్యేకమైన యంత్రాల సహాయంతో ఈ మాంసం ముక్కల్ని వజ్రాల పర్వతం మీదకు విసిరేవాళ్ళట. మాంసం ముక్కలకు వజ్రాలు అంటుకొంటాయి. రాబందులు ఆ మాంసం ముక్కల్ని గోళ్లతో పట్టి, అక్కడ పాములుంటాయి. కాబట్టి, సురక్షితమైన ఇవతలి కొండకు తెచ్చుకుని తింటాయి. మాంసానికి అంటిన వజ్రపు తునకలు అక్కడ రాలిపడితే వాటిని ఏరుకునేవాళ్లట. ఈ కథ కోళ్లూరుకు సంబంధించినదే అనీ కోళ్లూరు దగ్గర వజ్రసేకరణ ఇలా ప్రారంభమైందనీ ఈ కథనం చెప్తోంది. మార్కోపోలో కూడా కోళ్లూరు గురించి ఇలాంటి కథే చెప్పాడు కాబట్టి, అతను దర్శించింది, కోళ్లూరేనని అర్థం అవుతోందంటాడు గోర్డాన్ మెకంజీ. 15వ శతాబ్దిలో నికోలో కోంటీ, ఫ్రెంచి నగల వర్తకుడు జాన్‌బాప్టిస్ట్ టావెర్నియర్ (1605-89) కూడా ఈ కోళ్లూరు వజ్రాల గనిని సందర్శించారు. టావెర్నియర్ గోల్కొండ నుంచి ఆరు రోజులు ప్రయాణించి కృష్ణదాటి Gani coulour (గని కోళ్లూరు) వెళ్లినట్టు రాసుకున్నాడు. నేటి పులిచింత(ల)కు దక్షిణాన, బెల్లంకొండ పక్కన గనికోళ్లూరుంది.

1679 మార్చి 18న స్ట్రేన్‌షమ్ మాస్టర్ అనే ఈస్టిండియా కంపెనీ ఏజెంటు మద్రాసు - మచిలీపట్నం మధ్య వ్యాపారానుకూల అంశాలను పరిశీలిస్తూ, కోళ్లూరు సహా కృష్ణాతీరంలో వజ్రాలు దొరికే అవకాశాలను సర్వే చేశాడు. 1795 లో డా॥ హేనీ అనే ఇంకో సర్వేయర్ రంగుల బొమ్మలతో వీటి గురించి నివేదిక పంపాడు. 1880 'జియోలాజికల్ మెమోయిర్స్' గ్రంథంలో 'గని పరిటాల' ప్రాశస్త్యాన్ని తెలుపుతున్న వివరాలున్నాయి. అలాగే, 1881 నాటి గ్రంథం "ది డైమండ్స్ కోల్ అండ్ గోల్డ్ ఆఫ్

ఇండియా"లో కూడా చాలా వివరాలున్నాయి. 1850 లో లెఫ్టినెంట్ యాపిల్‌గాత్ అనే అసిస్టెంట్ సివిల్ ఇంజనీర్ పరిటాల, జగ్గయ్యపేట పరిసర ప్రాంతాలలో సింగరేణికి మించిన బొగ్గు నిక్షేపాలు కూడా వున్నట్టు తెలిపాడు.

కమాలియార్ జంగ్ బహదూర్ పరిటాలని ఒక తాలూకాగా ప్రకటించాడు. ఈ తాలూకాలో మొత్తం 7 గ్రామాలలో వజ్రాల గనులుండేవి. గని ఆత్కూరు, వెలునూదూరు, బత్తినపాడు, నందిగామ, కొడవటికల్లు, ఉస్తేపల్లి, మల్లవల్లి- గ్రామాల్ని కలిపి పరిటాల తాలూకాగా ప్రకటించాడు. గనులున్న తాలూకా కాబట్టి దీన్ని కన్నత్ తాలూకా అన్నాడు.

1640 వరకూ వున్న రికార్డుల్లో పరిటాలని "పర్తియాల"గా పిలిచినట్టుంది. 1650 లో గోల్కొండ సుల్తాన్ అబ్దుల్ హుస్సేన్ దగ్గర మంత్రిగా ఉన్న "మీర్ జుమ్లా" తన మంత్రి పదవికి రాజీనామా ఇచ్చి, పరిటాలలో వజ్రాల వ్యాపారిగా మారాడట. పెద్ద వజ్రాలను ప్రభుత్వానికి అప్పగించే నియమానుసారం పరిటాలలో దొరికిన ప్రసిద్ధ వజ్రాలను ఈ "మీర్ జుమ్లా" గోల్కొండకు సమర్పించుకున్నాడు. కోళ్ళూరులో దొరికిన "కోహినూరు వజ్రాన్ని మాత్రం నేరుగా మొగల్ చక్రవర్తి షాజహాన్‌కే సమర్పించాడు.

చరిత్ర ప్రసిద్ధ చెందిన కొండపల్లి వజ్రాలు దాదాపు 16 వరకూ వివిధ డాక్యుమెంట్ల ఆధారంగా కన్పిస్తున్నాయి. వాటి వివరాలు పరిశీలిద్దాం.

**1. కోహినూర్ వజ్రం** : ప్రస్తుతం అది 180 కేరట్లు వుందని అంచనా. ఇది 1656లో కోళ్ళూరులో దొరికిందని చరిత్రవేత్తల అభిప్రాయం. బ్రిటిష్ రాణి కిరీటంలో దీన్ని అమర్చారు. ఇప్పుడది లండన్‌లో వుంది.

రాబర్ట్ స్యూయల్ "విస్మృత సామ్రాజ్యం విజయనగరం" (2010 ఎమెస్కో – పేజీ 374 'వజ్రాలు' అనుబంధం) లో దీని గురించి కొంత వివరణ కన్పిస్తుంది. "... ఆ సమయంలో మీర్ జుమ్లా వజ్రాల తవ్వకం చేయిస్తున్నాడు. ఈ వజ్రాన్ని చెక్కకుండానే షాజహాన్ చక్రవర్తికి బహూకరించాడు. అప్పుడు దాని బరువు 756 ఇంగ్లీషు కేరట్లు. (బాల్) దీన్ని వెన్నిస్ నగరానికి చెందిన "హార్టెన్సియోబోర్జియో" కి సానపట్టడం కోసం అప్పగించాడు. అతని చేతుల్లో చాలా తరుగుపోయింది. 1665 ii 444 లో ఔరంగజేబు కోశాగారంలో టావెర్నియర్ దీన్ని చూసినప్పుడు ఇది 268 1/2 ఇంగ్లీషు కారట్లకు మించిలేదు. 1739 లో నాదిర్షా ఢిల్లీని ధ్వంసం చేసి ఈ వజ్రాన్ని పర్షియాకు తీసుకుని వెళ్లాడు. దీనికి కోళ్ళూరు (కోహినూరు) వజ్రం అని పేరు పెట్టాడు. 1747 లో నాదిర్షా హత్యానంతరం కోహినూర్ అతని మనుమడు షారూఖ్ చేతుల్లోకి పోయింది. నాలుగేళ్ల తరువాత షారూఖ్ దీన్ని కాబూల్‌కు చెందిన అహ్మద్‌షాదురానీకి ఇచ్చాడు. అతని నుండి

అతని కొడుకు తైమూరుకు సంక్రమించింది. 1793 లో వారసత్వంగా అతని కొడుకు "షాజమాన్"కు లభించింది. "షాజమాన్"సోదరుడు మహమ్మద్, ఈ షాజమాన్ కళ్లు పీకించి కారాగారంలో పెట్టాడు. వజ్రం మాత్రం కారాగారంలో అతని వద్దే ఉండింది. 1795 లో ఇది అతని మరొక సోదరుడు సుల్తాన్ షుజా చేతుల్లోకి పోయింది. 'షుజా' కాబూలు రాజయిన తరువాత 1809 లో ఈ వజ్రాన్ని అతని చేతికంకణంలో చూశాడు – ఎల్ఫిన్‌స్టోను. షుజా 'లాహోరు'కు పారిపోయాడు. 1813 లో ఒక ఒప్పందం ప్రకారం షుజా ఈ కోహినూరు వజ్రాన్ని రంజిత్‌సింగ్‌కు అప్పగించాడు. రంజిత్‌సింగ్ తరచుగా ఈ వజ్రాన్నీ ధరించేవాడు. లాహోరులో యూరోపియన్ సందర్శకులు పలుమార్లు చూశారు. 1839లో రంజిత్‌సింగ్ మరణానంతరం బాలుడైన దులీప్ సింగును వారసుడిగా గుర్తించేంత వరకూ కోహినూర్ వజ్రాన్ని ఆభరణాల కోశంలో ఉంచారు. 1849 లో పంజాబును బ్రిటిష్ సామ్రాజ్యంలో కలుపుకోవడంతో దీన్ని సర్‌జాన్ లారెన్స్‌కు అప్పగించారు. అతను దీన్ని ఇంగ్లాండు మహారాణికి పంపాడు. 1851 లో తొలి మహాప్రదర్శనలో దీన్ని ప్రదర్శించారు. 1852లో గరాండ్స్ కంపెనీకి చెందిన వూర్‌శాంజర్ అనే ఆమ్‌స్టర్‌డామ్ వజ్రాల కట్టరు దీన్ని మళ్లీ సానపట్టాడు. ఇప్పుడు దీని బరువు 106 1/16 కారట్లు"

**2. గ్రేట్ మొగల్ వజ్రం :** 787.5 కేరట్లున్న పెద్ద వజ్రం అది. యూరోపియన్‌ల వ్రాతల్ని బట్టి ఈ వజ్రం ఒకటి ఉండేదని తెలుస్తోంది. 1650 లో కోళ్లూరులో ఇది దొరికిందని చెప్తారు. ప్రస్తుతం ఎక్కడుందో తెలియదు.

**3. రీజెంట్ వజ్రం :** 1701లో పరిటాలలో ఇది బయటపడింది. ప్రస్తుతం దాని బరువు 410 కేరట్లు. పారిస్‌లోని అపోలో గేలక్సీ ప్రదర్శనశాలలో ఇది వుంది. 1766 లో ఈస్టిండియా కంపెనీకి గంజాం, విశాఖపట్నం, గోదావరి, కృష్ణాజిల్లాల్ని పరిపాలించుకోవటానికి రాబర్ట్‌క్లైవ్ ఫర్మానా పొందిన తరువాత ఈ వజ్రం మీద అప్పటి మద్రాసు గవర్నర్ పిట్స్ దొరగారి కన్నుపడింది. దాన్ని బలవంతంగా స్వాధీనం చేసుకొని పిట్స్‌దొర రహస్యంగా యూరప్ తీసుకెళ్లి రీజెంట్ ఆర్డియన్స్ కంపెనీకి అమ్ముకున్నాడట! అది ఫ్రెంచి ప్రభుత్వాన్ని చేరింది. రాణిగారి కిరీటంలో అమర్చారు. రీజెంట్ కంపెనీ వాళ్లు ఇచ్చింది కాబట్టి రీజెంట్ వజ్రం అనీ, పిట్స్ దొర దొంగతనంగా తెచ్చి అమ్మాడు కాబట్టి పిట్స్ వజ్రం అని దీన్ని పిలుస్తారు. కోహినూర్ వజ్రం "కోళ్లూరు"కి, రీజెంట్ వజ్రం పరిటాలకూ అంతర్జాతీయ ఖ్యాతిని తెచ్చాయి.

**4. ఓర్లోఫ్ వజ్రం :** ఇది 300 కేరట్లు బరువున్న వజ్రం. 1739 లో కోళ్లూరులో దొరికింది. ప్రస్తుతం రష్యాలోని క్రెమ్లిన్ వజ్రాల కోశంలో ఇది భద్రపరచబడింది. ఇది

రష్యా చేరిన వైనం వేరే పరిశోధనాంశం. బహుశా విక్టోరియా రాణికి, జారు చక్రవర్తికి గల బంధుత్వం కారణంగా కానుకగా చేరి వుండవచ్చు.

**5. నిజాం వజ్రం :** 440 కేరట్లున్న ఈ వజ్రం కూడా కోళ్లూరులోనే 1835 లో దొరికింది. ప్రస్తుతం నిజాం ట్రెజరీలో భద్రపరచబడింది.

**6. హోప్ వజ్రం :** కేవలం 67 కేరట్లున్న ఈ వజ్రం 1642 లో కోళ్లూరులో దొరికింది. ప్రస్తుతం దీన్ని వాషింగ్టన్ "స్మిత్ జోనియన్ ఇన్స్టిట్యూషన్"లో భద్రపరిచారు. అక్కడకు ఎలా చేరిందో పరిశోధించవలసి ఉంది.

**7. గోల్కొండ వజ్రం :** 130 కేరట్లున్న ఈ కొండపల్లి వజ్రం కచ్చితంగా ఏ ఊరిగనిలో ఎప్పుడు దొరికిందో తెలియదు. మెల్‌బోర్న్‌లోని డన్‌క్లింగ్స్ నగల వ్యాపారుల దగ్గర ఉన్నదట.

**8. కోళ్లూరు వజ్రం :** 63 కేరట్లుంటుంది. కోళ్లూరులో దొరికింది. ప్రస్తుతం ఎక్కడుందో, ఏమయ్యిందో తెలియదు.

ఇవికాక - అక్బర్‌షా, దర్యా ఇనూర్, తాజ్-ఇ-మహ్, సోనీ, బాబర్, గ్రేట్ టేబుల్, షా... ఇలా అనేక కొండపల్లి వజ్రాలు ఉండేవని రికార్డుల ఆధారంగా తెలుస్తోంది. బరోడా రాజు గాయిక్వాడ్ దగ్గర వీటిలో ఒక వజ్రం ఉందని భావిస్తున్నారు.

## గోల్కొండ వజ్రాల గనులు :

విజయనగరానికీ, సుల్తానులకూ మధ్య తరచూ యుద్ధాలకు మతపరమైన కారణాలు వెతుకుతారు. కానీ, వజ్రాల గనులున్న భూముల మీద ఆధిపత్యం సంపాదించటానికే ఈ యుద్ధాలు ముఖ్యంగా జరిగాయని ఈ వివరాలు చూస్తే తేలికగా అర్థం అవుతుంది.

సుల్తానులు 5 రాజ్యాలుగా చీలి ఉన్నారు. ఒకరితో ఒకరికి సఖ్యత లేకపోవడం వలన విడివిడిగా ఏ సుల్తానూ విజయనగర మహాసామ్రాజ్యాన్ని ఎదుర్కొనలేకపోయాడు. బలమైన సైనికవ్యవస్థను కలిగి ఉండటం ద్వారా విజయనగర ప్రభువులు తక్కువ యుద్ధాలతో ఎక్కువ విజయాలు పొందే ప్రయత్నం చేశారు.

ఈ వాస్తవాన్ని ఆలస్యంగా గుర్తించారు సుల్తానులు. తమ అందరి సైన్యమూ కలిపితే విజయనగర సేన కన్నా పెద్దదౌతుంది. కాబట్టి, అందరూ ఏకమై 23-01-1565 న మూకుమ్మడిగా విజయనగరాన్ని ముట్టడించారు. గెలిచారు.

గెలిచిన తర్వాత కూడా సుల్తానులు వెనుకటి గుణాన్ని మార్చుకోలేదు. వజ్రాల భూముల పంపకంలో మళ్లీ వాళ్లలో వాళ్లకి కలహాలు రేగాయి. బీజాపూర్, గోల్కొండ

సుల్తానుల మధ్య పెద్ద యుద్ధమే జరిగింది. 1573 లో ఆ ఇద్దరి మధ్య ఒక అంగీకారం కుదిరింది. దాని ప్రకారం మైసూరు రాజ్యంలోని అధికభాగం బీజాపూర్‌కు దక్కింది. దిగువ కర్నాటకలోని నెల్లూరు వరకూ గోల్కొండ ఆధీనంలోకి వెళ్లింది. నెల్లూరు ఆవల తంజావూరు, మధుర వరకూ చంద్రగిరి విజయనగర సామ్రాజ్యం వుంది. వీటిలో బీజాపూర్ ఆదిల్‌షా ఆధ్వర్యంలో రాయచూర్, బళ్లారి, రాయలసీమ గనులు, గోల్కొండ కుతుబ్‌షాహీ, ఆధ్వర్యాన కొండపల్లి గనుల్నీ పంచుకున్నారు.

గనుల నిర్వహణలో విజయనగర రాజులకున్నంత పట్టు గోల్కొండ, బీజాపూర్‌లకు లేదేమోననిపిస్తుంది. వజ్రాల ఉత్పత్తిలోకి విదేశీ శక్తులను రానివ్వకూడదనే దృఢమైన నిర్ణయాన్ని విజయనగర రాజులు తీసుకున్నారు. సుల్తానులే ఈ దేశంలో విదేశీ వర్తకులు కాబట్టి వాళ్ళకు ఆ పట్టింపు ఏమీ ఉండేది కాదు. మైనింగ్ రంగంలో అనుభవం వున్న కంపెనీలకు గనులు తవ్వే బాధ్యతను అప్పగించే విధానాన్ని సుల్తానులు అనుసరించారు. అయితే, పెద్ద వజ్రాలు దొరికితే ప్రభుత్వానికి అప్పగించి తీరాలనే నియమం లాంటివి సుల్తానులూ కొనసాగించారు.

గోల్కొండ సుల్తానుల కాలంలో ఇటలీ వ్యాపారి బెర్నార్డోడి నార్డోనా 1606 లో వజ్రాల అంగడిలో కాకుండా నేరుగా రామలకోట వజ్రాలగని దగ్గరకు వెళ్లి అక్కడే బేరం చేసి వజ్రాలు కొన్నాడు.

వజ్రాలను వాటి ఉత్పత్తి స్థానంలోనే కొనడం వలన గని యజమానికి వజ్రాలను భద్రపరచడం, మార్కెట్టుకు తరలించడం లాంటి ఖర్చులు తప్పేవి. వెంటనే సొమ్ము చేతికి వచ్చేది. మధ్య దళారీల పాత్ర లేకపోవడం వలన అమ్మేవాడికీ, కొనేవాడికీ ఇద్దరికీ లాభదాయకంగా వుండేది. కానీ, ఉత్పత్తి అయిన వజ్రం మీద ప్రభుత్వానికి అదుపు లేకుండా పోయింది.

గనుల దగ్గరే కొనుగోళ్లు మొదలయ్యాక, విదేశీ ఏజెంట్లు తమ నివాసాలను గనులకు దగ్గరగా మార్చుకున్నారు. 1620 లో ఫెలిప్పీ ఎస్కుడో అనే పోర్చుగల్ వజ్రవ్యాపారి గోవా నుంచి తన నివాసాన్ని ఏకంగా దక్షిణాదికి మార్చేశాడు. గనుల దగ్గర అందరికన్నా ముందుంటే, నాణ్యమైన వాటిని దక్కించుకోవచ్చని! ఆనాటి గోల్కొండ వజ్రవ్యాపారుల్లో మాలిక్ తుజార్ ముఖ్యుడు.

17-7-1614న పీటర్ ఫ్లోరిస్ అనే ఏజెంటు గోల్కొండ మార్కెట్లో వజ్రాల ధరలు చాలా ప్రియంగా వుంటున్నాయని, సామాన్యుడు కొనగలిగే స్థితి లేదని రాశాడు. హోల్‌సేల్ వ్యాపారం అంతా గనుల దగ్గరే జరిగిపోవడంతో మార్కెట్‌కు చేరే వజ్రాలు తక్కువ స్థాయిలో

వుండేవి. అవి కూడా చాలా ఖరీదైనవిగా వుండటం, ధరల్లో హెచ్చుతగ్గులుండటం వీటి వలన గోల్కొండ మార్కెట్ నిలకడలేని దయ్యింది. ధరలో వ్యత్యాసం కూడా 5 రూబుళ్ళ నుంచి 10 రూబుళ్ల వరకూ ఒకేసారి పెరగడం, వెయ్యి పౌండ్ల బంగారం నుంచి రెండు వేల పౌండ్ల బంగారానికి రేటు పెరగడం... ఇదీ ఆనాటి పరిస్థితి!

ఇంత వ్యతిరేక పరిస్థితి ఉన్నా ప్రపంచంలో తెలుగు నేల మీద మాత్రమే నాణ్యమైన వజ్రాలు దొరకడం కారణంగా గోల్కొండ వజ్రాలకు డిమాండు తగ్గలేదు.

1620-23 మధ్య కాలంలో డచ్‌వాళ్లు మచిలీపట్నం ఓడరేవు ద్వారా 2293.75 కేరట్ల వజ్రాలను ఎగుమతి చేసినట్లు లెక్కలు చెప్తున్నాయి. 'అరకాన్' నుంచి మచిలీపట్నానికి రత్నాలు తెచ్చి బదులుగా డెక్కన్ వజ్రాలు కొనుగోలు చేసినట్లు ఆధారాలు చెప్తున్నాయి.

1615 వరకూ వజ్రవ్యాపారంలో తనదే ఏకఛత్రాధిపత్యం అన్నట్లు నిలిచింది పోర్చుగల్. వెనీస్, ఆమ్‌స్టర్‌డామ్‌ల నుంచి కూడా బాగా వ్యాపారులు తరలి వస్తుండటంతో క్రమేణా పోర్చుగీసు వజ్రవ్యాపారం సన్నగిల్లడం మొదలయ్యింది. విజయనగర కాలంలో పోర్చుగీసులు పొందిన గౌరవాలు లాభాలు క్రమేణా తగ్గు ముఖం పట్టసాగాయి.

మధుర నాయక రాజుల దగ్గర పోర్చుగీసుల పలుకుబడి కొంత మిగిలి ఉన్నా, తంజావూరు నాయకరాజులు డచ్‌వారిని చేరదీయడంతో ఆ మేరకు పోర్చుగీసుల వ్యాపారం తగ్గింది.

పోర్చుగీసులు ఇండియాని లూటీ చేస్తున్నారని, ఇండియాలో వజ్రాలన్నీ అయిపోయాక వెళ్లి ప్రయోజనం లేదని హాలెండు వ్యాపారులు (వళందులు) గగ్గోలు పెట్టడంతో 1602 లో "డచ్ యునైటెడ్ ఈస్టిండీస్ కంపెనీ"ని ఏర్పరచి ఆమ్‌స్టర్‌డామ్ రాజు కుటుంబీకులు ఐదు లక్షల నలభైవేల పౌండ్లు పెట్టుబడి పెట్టి ఇండియాకు పంపించారు. అందులో అరవై వేల పౌండ్లు ఇంగ్లీషు వ్యాపారులవి. 1604-05 లో చంద్రగిరి రాజుని బ్రతిమాలి పులికాట్ దగ్గర, గోల్కొండ సుల్తాన్‌లను మంచి చేసుకుని మచిలీపట్నంలోనూ ఫ్యాక్టరీలు (వాణిజ్య కేంద్రాలు) ఏర్పాటు చేసుకున్నారు. 1609 లో ఆమ్‌స్టర్‌డామ్ బ్యాంక్‌ని ఏర్పరిచారు. కేవలం వ్యాపారం కోసమే ఇక్కడకు వచ్చి, వెనకొచ్చిన కొమ్ముల్లా వాడిగా పోర్చుగీసుల్ని తెలుగు నేల మీద నుంచి వెళ్లగొట్టి, ఇంగ్లీషు వాళ్లను చిన్న వాటాదారులుగా ఎక్కడ వుంచాలో అక్కడే వుంచి, ఇండియాలో మిగిలిందంతా త్వరత్వరగా దోచుకోవాలనే లక్ష్యంతో పనిచేశారు డచ్ వ్యాపారులు.

# ఇంగ్లీషు పాలనతో వజ్రాల గనుల నిర్వహణ

నిజానికి, పోర్చుగీసులు విజయనగర కాలంలో వజ్రాల వ్యాపారం అభివృద్ధి కావటానికి దోహదపడితే, వారి వెనుక వచ్చి డచ్ వాళ్లు స్థానికంగా తెలుగు చేనేత కార్మికులను ప్రోత్సహించి, ఎదురు పెట్టుబడులు పెట్టి కలంకారీ పరిశ్రమని బాగా ప్రోత్సహించారు. ఫ్రెంచివారిని ఓడించి ఆంధ్రసర్కారు జిల్లాలను కైవసం చేసుకున్న బ్రిటిష్ వాళ్లు మాత్రం శాయశక్తులా ఈ రెండు పరిశ్రమలనూ సర్వనాశనం చేసేశారు.

భారతదేశం అంటే తవ్వి గంపలకెత్తుకు పోవడమేనని భావనతో విదేశీయులంతా ఇక్కడకు వచ్చినవాళ్లే! ఎంత చెంబు తెచ్చుకుంటే అన్ని నీళ్లు అన్నట్లుగా పనిచేసేవాళ్లు. బ్రిటిషర్లు మద్రాసులో ఫోర్ట్ సెయింట్ జార్జి కట్టుకొన్నాక మచిలీపట్నం ఓడరేవులో వాణిజ్య కార్యకలాపాలన్నీ స్తంభించిపోయాయి. ఇక్కడ చేసిన అప్పులన్నీ ఎగ్గొట్టి బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ రెండు మరఫిరంగుల్ని మాత్రం వదలిపెట్టి, పెట్టే, బేడా, సర్దుకుని మొదట విశాఖపట్టణానికి ఆ తర్వాత మద్రాసుకూ బిచాణా ఎత్తేసింది. దాంతో కొండపల్లి వజ్రాల గనులు దిక్కులేనివయ్యాయి.

సర్కారు జిల్లాలను బ్రిటిష్‌వారికి ధారాదత్తం చేసినప్పుడు నిజాం నవాబు పరిటాలను తనకే ఉంచుకున్నాడు. అయినా బందరు రేవు మూతపడడంతో వజ్రాల వ్యాపారం మందగించింది.

బ్రిటిష్ సహకారంతో టిప్పుసుల్తాన్‌ను ఓడించిన సందర్భంలో నిజాం వాటాగా 1792, 1799లలో కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి జిల్లాలు నాలుగూ కైవసం అయ్యాయి. 1800 సంవత్సరంలో ఈ నాలుగు జిల్లాలనూ బ్రిటిష్ వాళ్లకి దత్తత ఇస్తున్నానన్నాడు. "దత్త మండలం" అని దానికి పేరు పెట్టాడు. 1801లో పలనాడును కూడా ఇలానే బ్రిటిష్‌వారికి దత్తత చేశాడు.

కడప మాన్యువల్ (1880)లో బ్రిటిష్ పాలనాకాలంలో రాయలసీమ వజ్రాల గనుల గురించి ఈ క్రింది వివరాలున్నాయి :

1. ఈ దత్త మండలానికి కలెక్టర్ థామస్ మన్రో 1804 జూలై 24 న బ్రిటిష్ బోర్డుకు ఒక లేఖ రాశాడు. వజ్రాల గనులకు విజయనగర కాలంనాటి వైభవాన్ని తెచ్చే అంశాన్ని ఆ లేఖలో ప్రస్తావించాడు. గౌలగుంట (జమలమడుగు) గోరాపూర్ (చెన్నూరు దగ్గర), హుస్సానపూర్ (దూపాడు)లలో కొత్తగా వజ్రాల గనులను ప్రారంభించాలని

బోర్డుకు ప్రతిపాదించాడు. అవకాశం కల్పిస్తే ఒక సంవత్సర కాలంలో కనీసం 30 గనులు తెరిచే అవకాశం వుందని చెప్పాడు.

2. గనులలో ఒక పగోడా బరువుకన్నా పెద్ద వజ్రాలు ప్రభుత్వానికే చెందుతున్నాయని నియమం పెడదామన్నాడు. చిన్న వజ్రం విలువలో 2.25% సొమ్ము ప్రభుత్వానికి కట్టాలని ప్రతిపాదించాడు. ఒక్కో గనికీ నెలకి 1 పగోడా 2 పణాల కనీస అద్దెగా వుండాలన్నాడు.

3. ప్రతి గని కార్మికుడికీ 1/12 పగోడా నెల జీతంగా ఇచ్చేట్లయితే 30 గనులకు 24,030 మాత్రమే ఖర్చు అవుతుందని, రాబడి అంతకు ఎన్నో రెట్లు ఉంటుందని లెక్కలు చెప్పాడు.

4. అటు అద్దె డబ్బులతో పాటు ఇటు పెద్ద వజ్రాలు కూడా దక్కుతాయని బోర్డుకు ఆశ పెట్టాడు. 20 గనుల యజమానులు నైజాం నవాబుకు 50 లక్షల రూపాయలు వరకూ అద్దె చెల్లించేవారని గుర్తు చేశాడు. మనం 30 గనులు ప్రారంభిస్తే ఇంకా ఎక్కువ లాభం వస్తుందని ఊరించాడు.

కానీ, లండన్‌లో బోర్డు అధికారులు మన్రో ఆలోచనలకు కార్యరూపం కల్పించలేదు. కాలక్రమంలో వజ్రాల పరిశ్రమ అడుగంటిపోయింది. స్ట్రేన్‌షమ్ మాస్టర్‌లాంటి సర్వేయర్లు వజ్రాల గురించి ఎంత చెప్పినా లండన్ అధికారులు ఆ పరిశ్రమ జోలికి పోకపోవడమే విచిత్రం!

ఇందులో ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు. హృదయంతో ఆలోచించే ఏ బ్రిటిష్ అధికారినీ లండన్ ప్రభుత్వం ప్రోత్సహించేది కాదు. తక్షణ రాబడి, తక్కువ పెట్టుబడి సిద్ధాంతాన్ని బ్రిటిష్ పాలకులు అనుసరించేవాళ్లు. అందుకని, ప్రైవేటు యజమాన్యానికి గనుల నిర్వహణ వదిలేశారు.

అందువలన గనుల మీద ప్రభుత్వానికి అదుపు తప్పింది. భూస్వాములు, వ్యాపారులూ కలిసి వజ్రాలు, పచ్చలు, రత్నాలు లాంటి విలువైన రాళ్లకోసం ఇష్టారాజ్యంగా తవ్వకాలు జరుపుకోవడం మొదలుపెట్టారు. "గనులకు మీరు హక్కుదార్లయినా, మొత్తం ఆంధ్రదేశానికి మొత్తం హక్కుదార్లం కాబట్టి మా దగ్గర నుంచి లైసెన్సు పొంది, మాకు రాయల్టీ చెల్లించండి" అంటూ లైసెన్సింగ్ విధానాన్ని అమల్లోకి తెచ్చారు బ్రిటిషర్లు.

1805 లో గ్రంథి రాయసెట్టి అనే గని యజమాని లైసెన్సు ఫీజు కట్టి కడపలో 5 ఎకరాల బంజరు భూమిని కొనుక్కొని అందులో మైనింగ్ జరపడం మొదలుపెట్టాడు. ఇలాగే చెన్నూరు, దూపాడు, జమ్మలమడుగు, కోయిలకుంట్ల, కమలాపురం, గుర్రంకొండ,

గుత్తి మొదలైన ప్రాంతాలలో కొత్తగా వజ్రాల గనులు ప్రారంభమయ్యాయి. గనులు తవ్వడంలో నిపుణులైన వారిని గుజరాతు నుంచి తెచ్చుకుని మైనింగ్ లైసెన్సు పొందడం మొదలుపెట్టారు.

1815 లో బళ్లారిలో ఓ ఆరేళ్ల పిల్లవాడికి పొలంలో ఒక వజ్రపురాయి దొరికింది. దాన్ని వాళ్ల నాన్న చూసి బజారుకు తీసుకెళ్లి రహస్యంగా నాలుగు రూపాయలకు అమ్మేశాడు. ఈ రహస్యం తెలిసిన దత్త మండలం కలెక్టర్, దాన్ని కొన్న వ్యాపారిని పిలిచి వెయ్యి రూపాయలు చేతిలో పెట్టి ఎవరికీ చెప్పవద్దని హెచ్చరించి, పంపేశాడట. ఇలాంటి కథలు చాలా జరిగాయి.

ఉత్సాహంగా గనులనైతే ప్రారంభించారు గానీ, వజ్రాలు పెద్దగా దొరికిందేమీ లేకపోవడంతో, అందరూ కూర్చొని ఒక ఆలోచన చేశారు. "వజ్రాలను వెదకండి. ఎవరికైనా వజ్రం దొరికితే దాని విలువలో 10వ వంతు ఇచ్చేస్తాం" అని ప్రకటించారు గనుల యజమానులు.

అప్పటినించీ జనం పిచ్చెత్తినవాళ్లలా భూమిని పొరలు పొరలుగా తవ్వి జల్లించు కొంటూ, నలకంత వజ్రపురాయైనా దొరకకపోతుందా అనే ఆశతో బతకడానికి అలవాటు పడసాగారు. ఇప్పటికీ కృష్ణాజిల్లా పరిటాల పరిసర భూముల్లో ఇలానే ఆశ చావక రవ్వయినా దొరుకుతుందేమోనని వెదుకుతూ అనేకమంది కనిపిస్తారు.

కీ॥శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు **ఆంధ్రుల సాంఘిక చరిత్రలో** కోళ్లూరు పరిటాల వజ్రాల గనుల గురించి ఒక విశేషం రాశారు. ఒకసారి కోళ్లూరులో ఒక దేవుడి విగ్రహం వెలిసింది. బియ్యపు గింజలు తీసుకుని, తమ మూత్రంతో తడిపి ఆ విగ్రహం మీద వేస్తే, ఎన్ని గింజలు వేశారో అన్ని వజ్రాలు దొరుకుతాయని జనంలో ఒక పెద్ద నమ్మకం బాగా ప్రచారం అయ్యిరేది. ఆ ఊళ్లో ఒక బీద బ్రాహ్మణుడు మాత్రం ఆ అపచారం తాను చేయనని మొండికేశాడు. అప్పుడు ఒక సాధువు వచ్చి, ఆ బ్రాహ్మణ్ణి, అతని కుటుంబాన్ని ఊరు బయటకు తీసుకువచ్చి, "కోళ్లూరు ఎలా వెలుగుతోందో చూడు–" అని, తగలబడ్తున్న ఊరుని చూపించి మాయమయ్యాడట!

రాబర్ట్‌క్లైవ్‌ని ఇండియా నుంచి వెనక్కి పిలిపించి అతని ఆర్థిక నేరాల మీద ఇంపీచ్‌మెంట్ చేసినప్పుడు అతను గర్వంగా అన్నమాటలివి... "There was so much to take from India. I regret that I have taken so miniscule" అని! దోచుకోవడానికి ఇండియాలో చాలా ఉందట. తాను దోచింది అందులో స్వల్పమాత్రమేనట!



# 'ఆంధ్రవిశ్వవిద్యాలయ స్థాపన' తొలినాటి పరిణామాలు

ఆంధ్రోద్యమంలో భాగంగా ఆంధ్రవిశ్వవిద్యాలయం ఏర్పడింది. అందుకోసం విస్తృతమైన పోరాటమే చేయాల్సివచ్చింది. ఆంధ్రరాష్ట్రం కోసం, ఆంధ్రభాష పేరుతో ఒక విశ్వవిద్యాలయం కోరుతూ పెద్ద ఉద్యమమే నడిచింది. గాంధీగారు భారత రాజకీయ ముఖచిత్రంపైన ప్రధానవ్యక్తిగా రంగప్రవేశం చేసేనాటికే తెలుగునాట సాగుతోన్న ముఖ్యపోరాటాలలో ఇది అత్యంత ముఖ్యమైంది.

1. ఆంధ్రభాషలో శాసననిర్మాణం

2. ఆంధ్రభాషలో పరిపాలనానిర్వహణ

3. ఆంధ్రభాషలో న్యాయవిచారణ

4. ఆంధ్రభాషలో యావత్తు విద్యాబోధన, హైస్కూళ్ళు కళాశాలలతో సహా ఇవీ ఆనాటి ఆంధ్రోద్యమ, ఆంధ్రవిశ్వవిద్యాలయోద్యమ ముఖ్య లక్ష్యాలు. "ఆంధ్రభాషలో సమస్త ఉత్తమ విద్యనిచ్చుటకుగాను, ప్రత్యేక విశ్వవిద్యాలయమేర్పడవలెనని ఆంధ్రులు వాంఛించుచు తీర్మానములు చేసియున్నారు అని అయ్యదేవర కాళేశ్వరరావుగారు 'నాజీవితము-నవ్యాంధ్రము'లో వ్రాశారు.

1920 మద్రాసు విశ్వవిద్యాలయం సెనేట్ ఇందుకు ఆమోదం తెలిపింది. ఆనాటి మద్రాసు ప్రావిన్స్‌లో తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ భాషాప్రాంతాలు కలిసివున్నాయి.

ప్రతి భాషాప్రాంతానికి (Linguistic area) ఒక విశ్వవిద్యాలయం ఏర్పాటుచేయడానికి మౌలికంగా ఒక నిర్ణయం తీసుకొన్నారు. 1921లో మార్గదర్శకాలు రూపొందించేందుకు ఒక కమిటీని నియమించాలని నిర్ణయించారు. నిర్ణయాలతో పనులు సమకూరవు. అమలుజరగాలంటే రాజకీయుద్దేశాలు (Political will) కూడా సమకూరాలి.

ఆనాటినుంచి మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో దాని విషయమై బిల్లులు చాలాసార్లు ప్రవేశపెట్టారు. ప్రతీసారీ చర్చలు సాగాయి. కానీ, ఎలాంటి ప్రభుత్వ ఉత్తర్వూ వెలువడలేదు.

క్రీ.శ. 1925 మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో విద్యామంత్రి అన్నెం పరశురామపాత్రో ఆంధ్రవిశ్వవిద్యాలయ చట్టం అనే పేరుతో గోవింద రాఘవయ్యర్ కమిటీ నివేదికని అనుసరించి బిల్లు ప్రవేశపెట్టారు.

మద్రాసు ప్రావిన్స్‌కు పానగల్లు రాజా రామాయణంగారు జస్టిస్ పార్టీ ముఖ్యమంత్రిగా ఉన్నారు. ఆయన పదహారణాల తెలుగువారు తెలుగుభాషకోసం ఎంతయినా చెయ్యాలని ఆయన సంకల్పం. ఆయన ఆంధ్రవిశ్వవిద్యాలయం బిల్లు ప్రవేశపెట్టి చట్టం చేయించారు. ఈ చట్టప్రకారం విశాఖపట్టణం, రాజమహేంద్రవరం, అనంతపురాలలో విశ్వవిద్యాలయ కేంద్రాలు నెలకొల్పబడాలి. అదీ ఆనాటి తీర్మానం. 1926 నాటికి అది శాసనరూపంలో వెలువడి, విశ్వవిద్యాలయం నెలకొనేందుకు అవకాశం కల్పించింది.

ఈ ఆంధ్రవిశ్వవిద్యాలయానికి తొలి కులపతిగా కట్టమంచివారిని ఎంపికచేశారు. కట్టమంచి రామలింగారెడ్డిగారు అనతికాలంలోనే జాతీయఖ్యాతి పొందిన విద్యావేత్త. రాజకీయవేత్త కూడా !

1913లో మైసూరు మహారాజా కాలేజీలో ఆచార్యులుగా చేరి, 1916లో ఆ కళాశాలకి ప్రిన్సిపాల్ అయ్యారు. ఆ తర్వాత మైసూరు విద్యాశాఖలో ఇన్‌స్పెక్టర్ జనరల్‌గా పదోన్నతి పొందారు. ఆ పదవీకాలంలో కట్టమంచివారు తన అధికారపరిధిలోని అన్ని విద్యాలయాల్లోనూ పంచములు చేరి చదువుకునే అవకాశం కల్పించారు. ఆనాటి పరిస్థితుల్లో అది సాహసోపేతమైన నిర్ణయం. జాతీయవాదిగా కట్టమంచివారికి జాతీయఖ్యాతిని తెచ్చిపెట్టిన అంశం.

రామలింగారెడ్డిగారి కృషివల్లనే 1915లో మైసూరుకు విశ్వవిద్యాలయం ఏర్పడిందని పెద్దలు చెప్తారు. మైసూరు, విశ్వవిదాలయం ఏర్పడగానే ఆంధ్రవిశ్వవిద్యాలయం కూడా ఏర్పడాలని ఆయన గట్టిగా అడిగారు.

1921లో కట్టమంచివారు రాజకీయరంగప్రవేశం చేశారు. విద్యావేత్తగా ఆయన సాధించిన విజయాలే ఆయన్ని మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎన్నికయ్యేలా చేశాయి. జమీందారుల పార్టీగా ముద్రపడిన జస్టిస్‌పార్టీలో కొంతకాలం ఉన్నారాయన 1925లో మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో ఆంధ్రవిశ్వవిద్యాలయం బిల్లు చర్చకు వచ్చినపుడు, ఆయన చెప్పిన మాటలివి. "We Andhras know how face the facts and how to accept the facts and we shall" certainly strive our utmost, how ever dissatisfied we may be with the provision of the Bill, to shape it so as to bring it near into our Hearts, so to speak and to bring it more into live with the time educational The requirements of our province and with the high Educational ambitions which were the root of years one agitation for a seperate Andhra University" రామలింగారెడ్డిగారి వాక్యాలు కచ్చితంగా ఆయన అసంతృప్తిని తేటతెల్లం చేస్తున్నాయి. ఆంధ్రవిశ్వవిద్యాలయం ఏర్పాటు పకడ్బందీగా జరగలేదని ప్రతిఒక్కరూ భావించారు. కట్టమంచివారు సగటు తెలుగువాడి మనోభావాలను వ్యక్తంచేశారు. ఇటు విద్యావేత్తగా, అటు పాలనాదక్షుడిగా, సాహిత్యపరుడిగా, రాజకీయవేత్తగా బహుముఖీనమైన వ్యక్తిత్వసంపద కలిగిన కట్టమంచివారు తొలి వైస్‌ఛాన్సలర్‌గా బాధ్యతలు స్వీకరించి ఉండకపోతే, ఆనాటి పరిస్థితులలో ఆంధ్ర విశ్వవిద్యాలయం జాతీయఖ్యాతి పొందిన విద్యాసంస్థగా వాసికెక్కే అవకాశమే ఉండేదికాదు. అది అలా ఉంచుదాం...... మొత్తంమీద ఆంధ్రవిశ్వవిద్యాలయం ఏర్పాటు నిర్ణయం తర్వాత లోకల్ పేట్రియాటిజం అనేది ప్రధానపాత్ర వహించింది. కోస్తాజిల్లాలో రకరకాల అసంతృప్తులకు ఇది దారితీసింది.

ఆంధ్రరాష్ట్రోద్యమాన్ని, ఆంధ్రవిశ్వవిద్యాలయోద్యమాన్ని ప్రారంభించి నడిపించిన వారిలో కొందరు ముఖ్యులు - కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల్లో వున్న కొందరు ప్రముఖులు తమ ప్రాంతాలకు ఆంధ్రవిశ్వవిద్యాలయ కేంద్రం ఏదీ రాలేదన్న అసంతృప్తి పొందారు. అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య, దోర్బల శేషాద్రిశాస్త్రి, అయ్యదేవర కాళేశ్వరరావు, గూడూరి లక్ష్మణరావు, గులాం మొహిద్దీను ప్రభృతులు మద్రాసువెళ్ళి ముఖ్యమంత్రి పానగల్లు రాజాని కలిసి, నాలుగో కేంద్రం ఏర్పాటుచేసి, దాన్ని బెజవాడకి ఇప్పించాలని కోరారు.

ఆనాటికి, అంటే 1925-1926 బెజవాడ (ఈనాటి విజయవాడ) వర్థమాననగరం. కృష్ణానదిమీద ఆనకట్ట కట్టిననాటికి బెజవాడ జనాభా కేవలం 900 మాత్రమేనని 1873

నాటి కృష్ణాడిస్ట్రిక్టు మాన్యువల్‌లో ఉంది. అప్పటికిది దుర్గగుడికి వచ్చే యాత్రికులకోసం తీర్థయాత్రాస్థలం మాత్రమే.

ఆనకట్ట తర్వాత నగరం అభివృద్ధి ప్రారంభమైంది. బెజవాడ రైల్వేజంక్షన్ ఏర్పడ్డాక ఆ నగర స్వరూపమే మారిపోయింది. ఆంధ్రదేశములోకెల్ల పెద్ద నగరమైన బెజవాడకు నాల్గవకేంద్రమైనా ఇప్పించాలని విజ్ఞాపనలు వెళ్ళాయి.

''కట్టమంచి రామలింగారెడ్డి, గుత్తి కేశవపిళ్ళె, చింతలపాటి వెంకట నరసింహరాజుగారలు జాతీయపక్షపు నాయకులుగా నుండిరి. నాలుగవ కేంద్రమిచ్చుటకు పరిస్థితులు బాగుగలేవని చెప్పి, అధికారములోనున్న జస్టిస్ పార్టీవారు ఒప్పుకొనలేదు. కానీ, జస్టిస్‌పార్టీ నాయకులైన రాజారామాయణంగారికి ఆంధ్రరాష్ట్రమేర్పడవలెననీ, దానికి మద్రాసులో "కూమ్" నదికి ఉత్తరభాగమున రాజధానియుండవలెనని, అటుల జరగనిచో బెజవాడ పట్టణమే రాజధానిగా చేయబడవలెనని గట్టి యుద్దేశ్యముండెను. గావున వారు స్వయముగ బెజవాడలోనే ఆంధ్రవిశ్వవిద్యాలయ కార్యస్థానమును నెలకొల్పునటుల సవరణ పెట్టి మంజూరుచేయించిరి" అని అయ్యదేవర కాళేశ్వరరావుగారు" నా జీవితము - నవ్యాంధ్రము"లో పేర్కొన్నారు.

ఆంధ్రవిశ్వవిద్యాలయం ముఖ్య కార్యాలయం, వైస్‌ఛాన్సలర్ కార్యాలయం, రిజిస్ట్రారు కార్యాలయం మాత్రం బెజవాడలో వుంటాయి. విద్యాకేంద్రాలు మాత్రం విశాఖపట్నం, రాజమహేంద్రవరం, అనంతపురాలలో వుండేలా ప్రత్యామ్నాయ ఏర్పాటు జరిగింది.

మద్రాసు యాక్ట్ నెం II (1926) ప్రకారం ఆంధ్రవిశ్వవిద్యాలయం రెసిడెన్షియల్ ఇనిస్టిట్యూషన్‌గా మొదలయ్యింది. ఈ మొత్తం విశ్వవిద్యాలయవ్యవస్థ అంతా మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధంగా వుండేట్లు చేశారు. బ్రిటీష్ ఇండియా మొత్తంలో భారతీయ భాషల్ని బోధనామాధ్యమంగా చేస్తూ విశ్వవిద్యాలయాలు నెలకొల్పాలన్న జాతీయవాదుల పోరాటానికి ఆంధ్రవిశ్వవిద్యాలయ ఏర్పాటు తొలి విజయంగా చెప్పుకోవచ్చు.

విద్యాకేంద్రం లేకుండా విశ్వవిద్యాలయకేంద్రం బెజవాడలో ఏర్పాటుకు ఆక్షేపణలు వెల్లువెత్తాయి. ముఖ్యమంత్రి పానగల్లు రాజా తక్షణం స్పందించి, బెజవాడలో ఆంధ్రవిశ్వవిద్యాలయ కేంద్రానికి అనుబంధంగా త్వరలో నాల్గవ విద్యాకేంద్రాన్ని కూడా ఏర్పాటుచేయగలనని వాగ్దానం చేశారు. శాసనసభలో కూడా ఈ విషయాన్ని ప్రకటించారాయన.

అప్పటికే బెజవాడలో విశాలమైన ప్రాంగణంలో పక్కా భవనాలతో మ్యూజియం నెలకొనివుంది. విశ్వవిద్యాలయ సెనేట్ సమావేశాలకు ఈ భవనాలను ఉపయోగించు కొనేందుకు అనుమతించారు. వైస్‌ఛాన్సలర్, రిజిస్ట్రార్ కార్యాలయాలకోసం అద్దెభవనాలు తీసుకొన్నారు.

బెజవాడలో ఆంధ్రవిశ్వవిద్యాలయం పనిచేయడం ప్రారంభించింది.

1928లో విడుదలైన "హ్యాండ్‌బుక్ ఆఫ్ ఇండియన్ యూనివర్సిటీస్" గ్రంథంలో ఆనాటికి దేశంలో వున్న విశ్వవిద్యాలయాల వివరాలున్నాయి. బెజవాడలో నెలకొల్పిన ఆంధ్రవిశ్వవిద్యాలయం గురించి అందులో పేర్కొన్న విశేషాలివి.

హిజ్ ఎక్స్‌లెన్సీ, ది ఆనరబుల్ ఎడ్వర్ట్ కీడెరిక్ లిండ్లేవుడ్ ఛాన్సలర్ మహారాజశ్రీ రామచంద్రదేవ్ (జైపూర్ మహారాజు) వైస్ ఛాన్సలర్ మహారాజశ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు, రిజిస్ట్రార్ మహారాజశ్రీ ఎస్. చెట్టిగారు. వైస్ ఛాన్సలర్ విశ్వవిద్యాలయం పూర్తి సమయం కార్యనిర్వహణాధికారిగా (Whole time Officer) వుంటారు.

**విశ్వవిద్యాలయ పాలకవర్గం :**

1. సెనేట్ 2. సిండికేట్ 3. ఎకడమిక్ కౌన్సిల్

4. ఫ్యాకల్టీస్ 5. బోర్డ్ ఆఫ్ స్టడీస్

సెనేట్‌లో 87 మంది సభ్యులుంటారు. విశ్వవిద్యాలయం అత్యున్నత పాలకవర్గం ఇది. సిండికేట్‌లో 12మంది సభ్యులుంటారు. విశ్వవిద్యాలయం కార్యనిర్వాహకవర్గం ఇది. ఎకడమిక్ కౌన్సిల్‌లో 38మంది సభ్యులుంటారు. విశ్వవిద్యాలయం బోధించే అన్ని కోర్సులను, వాటి బోధనాంశాలను ఇది నిర్ణయిస్తుంది. బోధనాపరమైన నియంత్రణ, ప్రమాణాలను ఇది నియంత్రిస్తుంది.

1928 నాటికి విశ్వవిద్యాలయం పరిధిలో కొద్దిమంది మహిళలతో సహా మొత్తం 500మంది విద్యార్థులు ఉన్నట్లు ఈ నివేదికలో వుంది. 181 మంది మెడికల్ కాలేజీలలో చదువుతున్నారు.

1926–27లో ఇంటర్మీడియెట్ పరీక్షల్ని మార్చి/ఏప్రియల్‌లో 12,71,370మంది సెప్టెంబర్ 1927లో 1,44,250మంది రాశారట. ఆనాటి కళాశాల విద్యాపరిస్థితికి ఈ వివరాలు అద్దం పడ్తున్నాయి.

ఆంధ్ర విశ్వవిద్యాలయం ఏర్పడి విద్యాభివృద్ధి కొనసాగుతుండగా 1926 నవంబరు నెలలో మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికలలో జస్టిస్ పార్టీ పూర్తిగా తుడిచిపెట్టుకుపోయింది. కాంగ్రెస్‌వాళ్ళు 42 మంది ఎన్నికయ్యారు.

కానీ, కాంగ్రెస్‌వాళ్ళు మంత్రి పదవులు తీసుకోవడానికి ఇష్టపడలేదు. దాంతో మూడవపార్టీగా ఎన్నికైన సుబ్బరాయన్‌గారిని ముఖ్యమంత్రిని చేశాడు గవర్నర్. సుబ్బరాయన్‌గారు స్వతంత్రసభ్యుడు. ఒక పార్టీ అండగా వున్నవాడు కాదు. అయినా, ఆయన మనసులో ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని అనంతపురానికి ఇప్పించాలని వుంది.

1927లో అయ్యదేవర కాళేశ్వరరావుగారు బెజవాడలో నాలుగవ విద్యాకేంద్రాన్ని ఏర్పాటుచేసి, అంతకుముందు ముఖ్యమంత్రి పానగల్లు రాజా శాసనసభలో ఇచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చవలసిందిగా సభలో సవరణబిల్లు ప్రవేశపెట్టారు. "డాక్టరు సుబ్బరాయన్‌గారిని నా బిల్లుకు మద్దతునిచ్చి మంజూరు చేయించవలెనని కోరితిని. ఆ బిల్లును నేనే శాసనసభకు పంపకముందే ఉపాధ్యక్షులైన కట్టమంచి రామలింగారెడ్డిగారికి చూపించి వారి అంగీకారమును పొందియే యుంటిని" కాని నాతో సుబ్బరాయనుగారు "ఇప్పుడే ఒక పావుగంటకుముందే రామలింగారెడ్డిగారు నాతో వచ్చి మాట్లాడిపోయినారు. బెజవాడలో నాలుగవకేంద్రమునకు వారు ఇష్టపడుటలేదు. ఒక్కటే కేంద్రముండవలెనని, అది విశాఖపట్టణములోనే యుండవలెనని వారి అభిప్రాయమయి ఉన్నది. కనుక మీ బిల్లుకు నేనేమీ సహాయము చేయజాలనని చెప్పిరి.

అనధికారబిల్లు నెగ్గుటకు సావకాశములేదని తలచి రామాయణంగారితో కూడా సంప్రదించి నేనాబిల్లును ఉపసంహరించుకుంటిని" ఇది కాళేశ్వరరావుగారు తన 'జీవితకథ'లో రాసుకున్న ముఖ్యాంశం.

ఆ వెంటనే కాళేశ్వరరావుగారు రామలింగారెడ్డిగారికి మీరు నన్ను దగాచేశారు అని ఘాటైన ఉత్తరం రాశారట.

1. విశ్వవిద్యాలయానికి అనేక కేంద్రాలు ఉండటంకన్నా ఒకటే కేంద్రం ఉండాలనేది తన అభిప్రాయం. ముఖ్యమంత్రిగారి అభిప్రాయం కూడా.

2. ఆ ఒకే కేంద్రం చల్లగా ఉండే వాల్తేరులో ఉండాలని నా అభిప్రాయం.

3. ఒకవేళ అది సాగకపోతే బెజవాడలో ఉండటానికి నా అంగీకారాన్ని తెలుపుతున్నాను. అందుకోసం కృషి సల్పుదును.

ఈ వివరాలను పేర్కొనడంలో కాళేశ్వరరావుగారు రామలింగారెడ్డిగారి గురించి వీసమెత్తయినా వ్యతిరేకపదాలు ఉపయోగించలేదు. బెజవాడలోనే విద్యాకేంద్రం, విశ్వవిద్యాలయ కార్యాలయము ఉంచటానికి తనకు అంగీకారమేనన్న తర్వాత, "అంతటితో ఆ ప్రయత్నాన్ని మానివేసినాను" అన్నారు.

బెజవాడని 'బ్లేజ్‌వాడ' అనీ, ఈ నగరాన్ని మేథావుల సహారా అనీ ఆయన అన్నారని చాటుపద్యాల్లాగా ఈ వ్యాఖ్యలు కూడా ప్రచారంలో వున్నాయి. అవి అప్పుడప్పుడూ మనసుకు తగుల్తుంటాయి కూడా.

రామలింగారెడ్డిగారి కుటుంబానికి కృష్ణాజిల్లాతో అనుబంధం వుంది. కౌతవరంలో తొలి సహకారసంఘాన్ని ఆంధ్రలక్ష్మీ ఇండస్ట్రియల్ కంపెనీ లిమిటెడ్‌ను వ్యవస్థాపించిన కట్టమంచి కొళందరెడ్డిగారు వీరి సోదరులే. రామలింగారెడ్డిగారు బెజవాడలో వైస్ ఛాన్సలర్‌గా వున్న కాలంలోనే కొళందరెడ్డిగారు బెజవాడ మునిసిపాలిటీకి వైస్ ఛైర్మన్‌గా పనిచేస్తున్నారు. విజయవాడ కేదారేశ్వరిపేటలో సిమెంట్ ఫ్యాక్టరీ నిర్మాతకూడా ఆయనే! దాని కార్మికుల భద్రతకోసం కేదారేశ్వరిపేట రైలుగేటును కూడా ఆయనే నిర్మించాడు. కొళందరెడ్డిగారికి బెజవాడతో చక్కని అనుబంధం ఉంది. అయితే రామలింగారెడ్డిగారికి బెజవాడపైన ప్రత్యేకమైన విద్వేషం ఉందని ఆయన సమకాలిక రాజకీయ నాయకులు ఎవరూ వ్యాఖ్యానించినట్టు కనిపించదు. కానీ, బెజవాడ విషయంలో ఆయన వైఖరిని ఎక్కువమంది నొచ్చుకున్నారు.

రోజులు గడిచినకొద్దీ విశ్వవిద్యాలయ పాలకవర్గంలో అసహనం పెరగసాగింది. విశ్వవిద్యాలయాన్ని ఎక్కడ ఖాయపరుస్తారో తేల్చకుండా సందిగ్ధంలో వుంచటంవలన బెజవాడలో సెనేట్ మందిరానికి వైస్ ఛాన్సలర్, రిజిస్ట్రార్ల కార్యాలయాలకు స్వంతభవనాలు నిర్మించేపని మొదలుకాలేదు. దాంతో రామలింగారెడ్డిగారు సిండికేట్‌ను సమావేశపరచి విశ్వవిద్యాలయానికి ఎన్ని విద్యాకేంద్రాలుండాలో అభిప్రాయం చెప్పవలసిందిగా కోరారు. లక్కరాజు సుబ్బారావుగారు బెజవాడలో నాలుగోకేంద్రం ఉండాలని తీర్మానాన్ని ప్రవేశపెడితే మొత్తం సిండికేట్ ఏకగ్రీవంగా ఆ తీర్మానాన్ని ఆమోదించింది. కానీ, విద్యాశాఖ ముఖ్య కార్యదర్శి, ఇతర విద్యాశాఖాధికారులు ఈ తీర్మానాన్ని వ్యతిరేకించారు. ఖర్చు ఎక్కువైపోతుంది. మూడు చాలు. కావాలంటే, రాజమహేంద్రిలో వున్న కేంద్రాన్ని బెజవాడలో పెట్టుకోమని ఉచితసలహా కూడా ఇచ్చారట! విభజించి పాలించడం అంటే ఇదే!

ఇవతలివాడిని గిల్లితే అవతలివాడు నోరుమూస్తాడని!! అది కుదరకపోతే, ప్రస్తుతం బెజవాడలో వున్న విశ్వవిద్యాలయ కార్యాలయాన్నే రాజమండ్రిలో పెట్టుకోవలసిందిగా కూడా సలహా చెప్పారట!

అగ్గి రాజుకున్నది ఇక్కడే!

న్యాపతి సుబ్బారావు పంతులుగారు, మద్దూరి అన్నపూర్ణయ్యగారు బెజవాడనుంచి ఆంధ్రవిశ్వవిద్యాలయ ముఖ్య కార్యాలయాన్ని రాజమహేంద్రికి తరలించే ప్రయత్నాలు ప్రారంభించారు. కాళేశ్వరరావుగారు ఇలా వ్రాశారు.

"............. రాయలసీమ పోయి రాయలసీమలోనున్న సెనేట్ సభ్యులను కూడగట్టుకొని అనంతపురమునకు విశ్వవిద్యాలయ కార్యస్థానమునిచ్చునట్లు వాగ్దత్తము చేసి, సెనేటు సభలో అధిక సంఖ్యాకులచేత రెండు కేంద్రాలు మాత్రమే ఉండవలెననియు, అందులో ఒకటి ఉత్తర సర్కారులలోని రాజమహేంద్రవరములోను, రెండవ కేంద్రము రాయలసీమలోని అనంతపురంలోను ఉండవలెననియు, విశ్వవిద్యాలయ కార్యస్థానము అనంతపురంలో నెలకొల్పవలెననియూ తీర్మానము చేయించిరి. మేము ఎంత ప్రయత్నము చేసిననూ ఓడిపోతిమి. ఈ తీర్మానము మద్రాసు ప్రభుత్వమునకు పంపబడెను. మద్రాసు విద్యాధికారులు దీనినంగీకరింపక విశాఖపట్టణము, రాజమహేంద్రవరము, అనంతపురము ఈ మూడు కేంద్రములు మాత్రమే ఉండవలెననియు, ఆంధ్రవిశ్వవిద్యాలయ కార్యస్థానమును రాజమహేంద్రవరమునకు మార్చుట తమకిష్టమేగాని, విద్యావిషయములో వెనకబడియున్న అనంతపురమునకు మార్చుటకు తాము సమ్మతించజాలమనియు అభిప్రాయమును తెలియపర్చిరి"

ఇలా ఎత్తులు పై ఎత్తులు అనేకం సాగాయి. వీటన్నింటికి "స్వంత ఊరు అభిమానం" (Local Patriotism) ముఖ్యమైన కారణం. ఈ విషయంలో రామలింగారెడ్డిగారు అశక్తులే అయినట్లు కన్పిస్తుంది. ఆయన మనసు వాల్తేరుమీదే వుంది. కానీ, అందుకోసం ఈ రాజకీయాలలో ఆయన ఏమీ తలదూర్చదల్చుకోలేదు.

ఈ విషయంమీద మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో అనేక సవరణబిల్లులు చర్చలు సాగాయి. విషయం ఎటూ తేలలేదు.

చివరికి ఈ బిల్లులన్నింటినీ పరిశీలించి ఒక నివేదికను ఇవ్వవలసిందిగా ఒక సెలెక్టు కమిటీని లెజిస్లేటివ్ కౌన్సిల్‌వారే నియమించారు. ఈ కమిటీ సుదీర్ఘంగా చర్చించి,

విశ్వవిద్యాలయం ఎక్కడవున్నా సరే విద్యాకేంద్రం కూడా ఒక్కటే వుండాలి. అది విశ్వవిద్యాలయంలోనే ఉండాలి అన్న రామలింగారెడ్డిగారి అభిప్రాయంతో ఏకీభవించారు. ఆ విద్యాకేంద్రసహిత విశ్వవిద్యాలయం అనంతపురంలో వుండాలని ఈ కమిటీ తీర్మానించింది.

కాళేశ్వరరావుగారితో సహా విశ్వవిద్యాలయం తమ ఊరులోనే వుండాలని కోరినవారంతా ఈ కమిటీలో ఉన్నారు. అయినా స్వంత ఊరు అభిమానం పక్కనపెట్టి అందరూ కలిసి అనంతపురానికి ఓటేశారు.

కానీ, మద్రాస్ ప్రభుత్వం ఈ కమిటీ తీర్మానాన్ని మళ్ళీ ఖండించింది. ఈసారి స్వయంగా ప్రభుత్వమే రంగంలోకి దిగి, రాజమహేంద్రవరంలో విద్యాకేంద్రసహిత ఆంధ్రవిశ్వవిద్యాలయం ఉండేలాగా ఒక సవరణబిల్లు ప్రవేశపెట్టింది.

ఈ విషయాల్ని పేర్కొంటూ అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఇలా రాస్తారు. "అది గవర్నమెంట్ సవరణ, గవర్నమెంట్‌వారు పెట్టిన సవరణ గెలుచుట నిశ్చయమని నేను భయపడి పానుగల్లు రాజా రామాయణంగారి వద్దకు పోయి వారి సలహా సహాయములతో వాయిదా ప్రయత్నం చేసితిని; మేము బెజవాడ మునిసిపాలిటీ, గుంటూరు మునిసిపాలిటీ, కృష్ణాజిల్లాబోర్డు, గుంటూరుజిల్లా బోర్డు, పశ్చిమగోదావరిజిల్లా బోర్డు కొంతమంది జమీందార్లు, వ్యక్తులు అందరూ కలిసి, ఇరవై లక్షల రూప్యములను బెజవాడలోనే విశ్వవిద్యాలయ స్థాపన జరిగినయెడల ఇచ్చెదమని దస్కతులు చేయించి ప్రభుత్వమున కిచ్చినాము. బెజవాడలోనే స్థాపించవలెననీ కోరినాము. అవసరమైనచో దానిని విచారించుటకు దానిని వాయిదా వేయవలెనని కోరితిమి. డాక్టరు సుబ్బరాయనుగారు వాయిదా వేయించుటకు ఒప్పుకొనిరి. అందువలన ఈ బిల్లుయొక్క విచారణ వాయిదా పడినది".

అప్పటికి ఆ తంతు పూర్తయ్యింది. విద్యాకేంద్రంలోని విశ్వవిద్యాలయం బెజవాడలోనే కొనసాగుతోంది. రామలింగారెడ్డిగారి అసహనానికి అంతులేకుండా పోయింది ! విషయం తేలలేదు.

అంతలో రాజా రామాయణంగారు మరణించారు. బెజవాడను అభిమానించే పెద్దదిక్కు పోయింది. ముఖ్యమంత్రి రాజమహేంద్రవరాన్ని, వైస్ ఛాన్సలర్ విశాఖపట్టణాన్ని అభిమానిస్తున్నారు. ఈ అభిమానంలో ఏది నెగ్గుతుందోనని జనం ఎదురుచూస్తున్నారు. అంతా బెజవాడమీద ఆశలు వదులుకున్నారు.

సుబ్బరాయన్‌గారి ప్రభుత్వం బ్రిటీష్‌వాడి తరహాలో నిర్ణయాలు చేసింది. ఆమేరకు ఒక జీవో విడుదలచేశారు. "మున్సిపాలిటీలు, జిల్లా బోర్డులు, విశ్వవిద్యాలయస్థాపనకు ద్రవ్యసహాయం చేయకూడదు" అని దాంతో బెజవాడలో విశ్వవిద్యాలయం కోసం చుట్టుప్రక్కల మున్సిపాలిటీలు, జిల్లాబోర్డులు ప్రకటించిన విరాళాలన్నీ విశ్వ విద్యాలయ నిర్మాణం కోసం కాక నిర్వహణకు మళ్లించారు.

1928 నాటికి "హాండ్ బుక్ ఆఫ్ ఇండియన్ యూనివర్శిటీస్"లో ఆంధ్రవిశ్వ విద్యాలయానికి వచ్చిన విరాళాలను ఏవిధంగా ఉపయోగించారో వివరాలున్నాయి.

1. బెజవాడ మున్సిపాలిటీ ఏడాదికి 11,000 రూపాయలు విరాళం సైన్సు డిపార్ట్‌మెంట్‌లో పరిశోధనకు ఉపయోగిస్తారు.

2. కృష్ణాజిల్లా బోర్డు విరాళంగా ప్రకటించిన 50,000 రూపాయలను వడ్డీలోంచి నెలకు 150 రూపాయల చొప్పున సైన్సు పరిశోధనకు వినియోగిస్తారు.

3. గుంటూరుజిల్లా బోర్డు ఇచ్చిన నాలుగువేల రూపాయల వడ్డీలోంచి నెలకు 150 రూపాయల చొప్పున మానవీయ శాస్త్రాల పరిశోధన (Humanition) కు వినియోగిస్తారు.

4. బొబ్బిలి మహారాజు లక్షరూపాయల విరాళాన్ని 2/3 వంతులు తెలుగుభాషాధ్యయనానికి 1/3 వంతు, సంస్కృత భాషాధ్యయనానికి వినియోగిస్తారు.

5. పానగల్లు రాజా రామాయణంగారు సంవత్సరానికి 5000 ఆదాయం వచ్చే తన ఆస్తిని విశ్వవిద్యాలయానికి అందించి ఎక్స్‌పెరిమెంటల్ సైకాలజీ, హిందూ యోగశాస్త్రాల అధ్యయనానికి వినియోగించాలని కోరారు.

ఇంకా కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గోల్డ్‌మెడల్, సర్ ఆర్. వెంకటరత్నం పోస్ట్‌గ్రాడ్యుయేట్ రీసెర్చిమెడల్, జనరల్ మెకానాల్డ్ గోల్డ్‌మెడల్, కామేశ్వరి విశ్వనాథ్ మెడల్ ఇలాంటివి మరికొన్ని ఈ నివేదికలో వున్నాయి. వాటిని ఎలా ప్రదానం చేసేదీ స్పష్టంగా పేర్కొన్నారు.

రామలింగరెడ్డిగారు ముఖ్యమంత్రిగారి మీద తన వత్తిడిని పెంచడంతో ప్రభుత్వం అనవసరకాలయాపన వలన విశ్వవిద్యాలయ అభివృద్ధి కుంటుపడ్తోందన్న వాస్తవాన్ని గమనించి, తన అభిమానాన్ని కూడా పక్కనపెట్టి సవరణబిల్లులో రాజమహేంద్రవరం పదాన్ని తీసేసి వాల్తేరు అనే పదాన్ని చేర్చి బిల్లును సభ ముందుకు తెచ్చింది. ఇప్పుడు ముఖ్యమంత్రి సుబ్బరాయన్ కూడా వాల్తేరునే సమర్థిస్తుండడంతో బిల్లు గెలవడం ఖాయం అయ్యింది.

కానీ, కాళేశ్వరరావుగారు, పిల్లలమర్రి ఆంజనేయులు, గొల్లపల్లి రాజాగారు, రాజమహేంద్రవరం పేరును తీసేసినప్పుడు అక్కడ వాల్తేరు అనకుండా బెజవాడ అనాలని సవరణ ప్రతిపాదించారు. "బొల్లిన మునుస్వామి నాయుడుగారు, ఇంకా కొందరు జస్టిసు పార్టీసభ్యులు మమ్ములను బలపరిచిరి. కాని ప్రభుత్వం వారే విజయము నొందిరి. యావత్తు ఆంధ్రవిశ్వవిద్యాలయం వాల్తేరులోనే స్థాపించబడవలెనని అధిక సంఖ్యాకులచే మంజూరు చేయబడెను"

అలా బెజవాడనుంచి ఆంధ్రవిశ్వవిద్యాలయం వాల్తేరును చేరింది. కానీ కథ అక్కడితో ఆగలేదట. చాలా కీలకమైన అంశం ఇక్కడే జరిగిందని కాళేశ్వరరావుగారు రాశారు.

"బొల్లిన మునుస్వామినాయుడు రంగనాథ మొదల్యారుగారు మొదలైనవారు కలిసి రాయలసీమ జిల్లాలన్నిటిని ఆంధ్ర విశ్వవిద్యాలయమునుంచి వేరుచేయవలెనని, బెజవాడ నుంచి కూడా చాలా ఉత్తరమునకు తీసుకొనిపోవుచున్నారు గనుక వాల్తేరులోని విశ్వవిద్యాలయములో తమ జిల్లాలుండజాలవనియునొక సవరణను ప్రతిపాదించిరి. అప్పటికే రంగనాథమొదల్యారుగారు మంత్రిపదవిని వదలుకొనియుండిరి. ఈ సవరణకు డాక్టరు సుబ్బరాయనుగారు అంగీకరించిరి"

ఇదీ జరిగింది. ఏ స్ఫూర్తితో ఆనాడు ఆంధ్రోద్యమం నడిచిందో, ఏ స్ఫూర్తితో ఆంధ్ర విశ్వవిద్యాలయం కావాలని ఆంధ్రులు గట్టిగా కోరుకున్నారో ఆ స్ఫూర్తి సగానికి తెగిపోయింది. తమ జిల్లాలకు మద్రాసుదగ్గర, వాల్తేరు చాలాదూరం కాబట్టి తాము మద్రాసు విశ్వవిద్యాలయంలోనే వుంటామన్నారు రాయలసీమ జిల్లాలవారు.

ఆంధ్రుల భాషలో బడి, ఆంధ్రులభాషలో ఏలుబడి సాగాలనే లక్ష్యం ఇక్కడ చర్చనీయాంశమే కాకపోవడం ఒక విడ్డూరం. "విశాఖపట్టణం చల్లన" అనే ఒకే ఒక కారణంతో రాయలసీమ లేకుండానే ఆంధ్ర విశ్వవిద్యాలయం వాల్తేరులో స్థిరపడటానికి రాయలసీమ వాడైన రామలింగారెడ్డిగారు పరోక్షకారకుడు కావటమే విచిత్రం.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడి, ప్రకాశం ముఖ్యమంత్రి అయిన తర్వాత తిరుపతిలో వేంకటేశ్వర విశ్వవిద్యాలయాన్ని, రాయలసీమ జిల్లాల్ని, నెల్లూరుజిల్లాని అందులో చేర్చారు. "కానీ ముప్పది సంవత్సరాలపైగా అయినను ఇంతవరకును ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఉత్తమవిద్యను ఆంధ్రభాషలోనే గరుపుటకెట్టి ప్రయత్నము జరుగలేదు. 1937లో రాజగోపాలచారి ప్రభుత్వం స్థాపితమైనప్పుడు ధైర్యముగా ఆరవ ఫారమువరకు హైస్కూళ్లలో

యావత్తు విద్య దేశభాషలలోనే నేర్పుటకేర్పాటుచేసిరి. అప్పటినుంచి ఆంధ్రజిల్లాలో తెలుగులోను, అరవజిల్లాల్లో అరవములోను స్కూల్‌ఫైనల్, మెట్రిక్యులేషన్ వరకు యావత్తు విద్యనేర్పబడుచు, ఇంగ్లీషును, రెండవభాషగా నేర్పుచున్నారు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమేర్పడిన పిమ్మట ఆంధ్రప్రదేశ్‌లో మూడు విశ్వవిద్యాలయములున్నవి. ఆంధ్రవిశ్వ విద్యాలయము, వెంకటేశ్వర విశ్వవిద్యాలయము, హైదరాబాద్‌లోని ఉస్మానియా విశ్వ విద్యాలయము, నైజాముల పాలనలో ఉస్మానియా విశ్వవిద్యాలయములో యావత్తు విద్య ఉరుదు భాషలోనే నేర్పబడుచువచ్చినది. ఇంగ్లీషు రెండవభాషగా మాత్రముండెను. నైజాము రాష్ట్రమంతరించగానే ఉస్మానియా విశ్వవిద్యాలయములో కూడా ఉరుదూకు బదులు ఇంగ్లీషునే పెట్టినారు. ఈ మూడు విశ్వవిద్యాలయాలలోను విద్య యావత్తు ఇంగ్లీషులోనే గరపబడుచున్నది. తెలుగు, ఉరుదూ భాషలు ఐచ్ఛికస్థానము మాత్రము పొందినవి......" అని కాళేశ్వరరావుగారు ఆవేదన చెందారు" కాని, కళాశాలలన్నిటిలోనూ ఆంధ్ర భాషలో ఉత్తమవిద్య గరపవలెనను సమస్య పరిష్కారము కాకుండా నిలిచియున్నది" అన్నారాయన.

కాళేశ్వరరావుగారి జీవితచరిత్ర 1959లో విడుదల అయ్యింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన మూడేళ్ళలోనే తెలుగుభాషలో బోధించటం అనే అంశానికి మన పాలకులు ఏవిధంగా తూట్లు పొడిచారో ఈ వృత్తాంతం సాక్ష్యం చెప్తోంది!



# ఆంధ్ర నాగరికత

ఆంధ్ర దేశస్థ సర్వాపగా భంగాత్ రంగరంగముల శౌర్యముల నేర్చి
ఆత్మప్రలాప శౌర్యములు తాలిచి సుమిత్రా బోర్నియో ద్వీపతతులు గెలిచి
వంగ మహారాష్ట్ర హద్దులు పరిచయ స్థలములై వినయమ్ము సలుప మెలగి
ఈజిప్టు నుండి కృష్ణాజలమ్ములకు బోరంబాటగా పరాక్రమము జూపి
సకల దీవుల విజయధ్వజములు నాటి
తనదు తెరచాప వార్థిరాజునకు కట్టు
కోకగా పూర్వమాంధ్రుల నౌకరాజ్య
మమరజేసిన దేదు సంద్రములమీద

(విశ్వనాథ సత్యనారాయణ - ఆంధ్ర పౌరుషం)

కాశ్మీరు నుండి కావేరి దాకా ఆసేతు హిమాచల ఆదిమ మానవ సమాజాలు విస్తరించి ఉండేవి. కనీసం 12,000 యేళ్ళ క్రితం భారతదేశంలో ఆదిమసమాజాలు కొత్త రాతియుగంలో తమ ఆహారాన్ని ఉత్పత్తి చేసుకోగల స్థితికి చేరాయి. ఈ యుగపు మానవుడు సాంస్కృతికంగా కూడా ఎంతో పరిణతిని సాధించాడు. ఆహారోత్పత్తి, ఆహార సేవనలు కూడా సంస్కృతిలో ఒక భాగం అయ్యాయి. కల్చర్ ఆర్కియాలజీ అనేది నేటి అత్యాధునిక పరిశోధనాంశంగా మారింది.

పరిణత స్థితిలో ఉన్న సింధు నాగరికత అవశేషాలు పాకిస్తాను భూభాగంలో ఉండగా, భారతదేశంలో లోథాల్నుండి మహారాష్ట్ర హద్దులవరకూ సింధూనాగరికత తొలినాటి అవశేషాలు కనిపిస్తాయి. సరస్వతీ తీరంలో తొలి దశకు చెందిన సింధు నాగరికత అవశేషాలు ఎక్కువ కనిపిస్తాయి. అందుకని సింధు సరస్వతీ నాగరికతగా దానికి పేరు పెట్టాలని పరిశోధకుల కోరిక. ప్రొఫెసర్ యు.ఆర్.రావు "it extended into Baluchistan, Afghanistan, Kashmir and Tajakistan in the North and upto

Godavari valley in the South, covering a Geographical area larger than that of Sumerian and Egyptian Civilizations put together" ఉత్తరాన బలూచిస్థాన్, ఆఫ్ఘనిస్థాన్, కాశ్మీర్, తజకిస్థాన్ ప్రాంతాల్లోనూ, దక్షిణాన గోదావరి లోయదాకా తొలినాటి సింధునాగరికత విస్తరించి ఉండేదని అన్నారు. సుమేరియన్ ఈజిప్షియన్ నాగరికతలో కన్నా సుమేరియన్ నాగరికత ప్రాచీనమైనది, పెద్దదని కూడా ఆయన తెలిపారు.

ప్రొఫెసర్ యు.ఆర్.రావుగారు చెప్పిన అంశాల్లో ఆశ్చర్యకరమైన అంశాలు కొన్ని ఉన్నాయి.

హరప్పా మొహంజదారో లోథాల్ మొదలైన పరిణత స్థాయి సింధునగరాల నుండి ప్రజలు కర్ణాటకలోని కోలార్, హట్టి బంగారు గనుల్లోంచి బంగారం తీసుకువెళ్ళేవారు. కర్ణాటక బంగారు గనులవారు, సింధునగరాల వారూ మహారాష్ట్రలోని దయిమాబాద్ 'ట్రేడింగ్ సెంటరులో కలిసేవారు. దయిమాబాద్'లో దొరికిన కొన్ని ప్రాచీన కంచు విగ్రహాలు ఇందుకు సాక్ష్యం. సింధు సరస్వతీ నాగరికత దక్షిణాన ఆంధ్రప్రదేశ్ దాకా విస్తరించి ఉండేది.

బంగారం, రాగి, కంచుతోపాటు ఆంధ్ర ప్రాంతపు కంచరులు ఇనుమును కూడా కరిగించగల నేర్పరులు కావటంతో ఇక్కడ ఉక్కు ఆయుధాలు, ఉక్కు పనిముట్లు విస్తారంగా తయారయ్యాయి. సింధువులతో ఆనాటి తెలుగు ప్రాంత ప్రజలకు నేరుగా సంబంధాలు నడిచేందుకు ఇది ఎంతగానో తోడ్పడింది.

ఈ వివరణ కృష్ణా గోదావరీ పరీవాహక ప్రాంతాల్లో ఆనాటి మానవుల ఉనికి గురించిన అనేక ఆలోచనలు రేకెత్తించింది.

బంగారపు గనులున్నచోట పుట్టలు పెట్టిన చీమలు భూమిపైకి తెచ్చే రజనులో కొంత బంగారం ఉంటుంది. అక్కడ పెరిగే మొక్కల్లో కూడా బంగారపు అవశేషం ఉంటుంది. "చీమా చీమా ఎందుకు కుట్టావు" అని అడిగే అనగనగా ఒకరాజు కథలో చీమ "నా బంగారపు పుట్టలో వేలెడితే కుట్టనా?" అంటుంది. ఆ బంగారపు పుట్టలు కృష్ణా తుంగభద్ర లోయల్లో ఉన్నాయి.

సింధునది ముఖద్వారం నుండి, కృష్ణానది ముఖద్వారం వరకూ అంటే పంజాబ సింధు ప్రాంతాల నుండి, కృష్ణా, గోదావరి ముఖద్వారాల దాకా విస్తరించిన ఈ నాగరికతని సింధు కృష్ణా లోయల నాగరికతగా పిలవాల్సిన అవసరం ఉంది. ఇది సంస్కృతీ నాగరికత. ఫ్రాంక్లిన్ సి సౌత్ వర్త్ అనే పండితుడు నైలు నుండి మొదలైన వ్యాపన క్రమంలో తొలి ద్రావిడ ప్రజలు, సుమేరియా మీదుగా బంగాళాఖాతం గుండా కృష్ణా, గోదావరి ముఖద్వారాల్లోంచి తెలుగు నేలమీద మొదటగా పాదం మోపారని, భారతదేశంలో తొలి ద్రావిడులు తెలుగు ప్రాంతీయులేననీ స్పష్టంగా ప్రకటించాడు.

ఆంధ్రదేశంలోని సమస్త నదీతీర ప్రాంతాలలో వెలుగులీనిన మహానాగరికతకు వారసులుగా తాము నేర్చిన శౌర్యాలను ప్రదర్శిస్తూ, సుమిత్రా బోర్నియో లాంటి ద్వీపాలను గెలుచుకుని ఆంధ్రాజ్యాలు స్థాపించుకున్నారు. వంగ, మహారాష్ట్ర హద్దులవరకూ ఉన్న భూములు మాకు పరిచయాలే అన్నంతగా వినయసంపన్నతతో మెలుగుతూ నైలు నుండి కృష్ణదాకా బోరంబాటగా తమ పరాక్రమం చూపించి సకల దీవుల్లోనూ విజయధ్వజాలు నాటి, తన తెరచాపని వార్ధిరాజైన సముద్రుడికి కట్టుబట్టగా ఇచ్చి పూర్వపు ఆంధ్రరాజులు నౌకారాజ్యాన్ని అమరజేశారని విశ్వనాథ వారు తన ఆంధ్రప్రశస్థిలో వర్ణించారు.

ఇవి కవుల అతిశయోక్తులు కావు. విశ్వనాథ ఈ పద్యం వ్రాసిన 70 యేళ్ల తరువాత ఈజిప్టు, తెలుగు ప్రజల మధ్య రాకపోకలకు సౌత్‌వర్త్ ఇచ్చిన పరిశోధనాత్మక వివరణ ఆసక్తిదాయకం అయ్యింది. 2008లో నేను వ్రాసిన నైలు నుండి కృష్ణదాకా గ్రంథం ద్రావిడ విశ్వవిద్యాలయ ప్రచురణగా వెలువడింది.

2009 జనవరిలో కృష్ణాజిల్లా రచయితల సంఘం, ద్రావిడ విశ్వవిద్యాలయం సంయుక్తంగా విజయవాడలో నిర్వహించిన 'సింధు, కృష్ణ లోయల నాగరికతల అధ్యయన సదస్సు' 'కృష్ణాతీర ప్రాంత నాగరికతకు కృష్ణా నాగరికత లేదా ఆంధ్ర నాగరికత' అని పేరు పెట్టి ప్రత్యేక శ్రద్ధతో అధ్యయనం చేయాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పింది.

భారతదేశంలో మనలాగే చాలా ప్రాచీన నాగరికతలున్నాయి. సింధు నాగరికతతో సమాన కాలంలో, సమాన స్థాయిలో వర్ధిల్లిన నాగరికతలే అవి! కానీ, కేవలం భారతదేశపు ప్రాచీన నాగరికత అంటే ఒక్క సింధు నాగరికత పేరు చెప్పి సాంస్కృతికం గానూ, చారిత్రకంగానూ మన ప్రాచీనతని విస్మరిస్తున్నారు. మనది సహజ మౌనం.

ఈ ఆంధ్ర పౌరుషానికి కనీసం 4,000 యేళ్ళ ప్రాచీనత ఉంది. ఆ పౌరుషాన్ని వెదకి పట్టుకోవటమే మన కర్తవ్యం. మన మౌనానికి 4000 ఏళ్ల ప్రాచీనత వుండకూడదు కదా!



# మూడు ప్రాచీన తెలుగు మాటలు

**పియమహిళా సంగామే సుందరగత్తేయ భోయణీ రొద్దే**
**అటుపుటురటుం భణంతే ఆంధ్రేకుమారో సలోయేతి**

బహుశా తెలుగు వారి సాంఘిక చరిత్రలో తెలుగు వారి వ్యక్తిత్వాన్నీ, తెలుగు మాటల్నీ వర్ణించిన అత్యంత ప్రాచీనమైన ఆధారం బహుశా ఇదే కావచ్చు. ఇది, క్రీ. శ. తొలిశతాబ్దాలకు చెందిన ఉద్యోతనుడు అనే కవి ప్రాకృతభాషలో వ్రాసిన 'కువలయ మాల' కథలోది. ఈ ప్రాకృతానికి పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు దీన్ని ఇలా తెలుగులోకి అనువదించారు:

"అందగత్తెలన్నా యుద్ధరంగమన్నా సమానంగా ప్రేమించే వాళ్ళు, అందమైన శరీరాలు గల వాళ్ళు, తిండిలో దిట్టలు అయిన ఆంధ్రులు అటు, పుటు, రటు అనుకొంటూ వస్తుండగా చూచాడు" ఇదీ దీని భావం. డా. జి.వి. సుబ్రహ్మణ్యం గారు "తెలుగుతల్లి" కవితా సంకలనంలో దీన్ని చేర్చారు. ఆ విధంగా పరిశీలకుల దృష్టిలోకి ఇది వచ్చింది.

తెలుగు వాళ్ళు ఎంత సరసులో అంత యుద్ధ జీవులనీ, చూడ చక్కగా ఉంటారని, దేహపుష్టితోపాటు తిండిపుష్టి కూడా కలిగిన వాళ్లని, అటు, పుటు, రటు అంటూ తిరుగుతుంటారనీ దీని భావం. అత్యంత ప్రాచీన తెలుగు మాటలు ఈ మూడూ! ఇవి శౌర్యానికి సంబంధించిన మిలిటరీ పదాలు కావచ్చు.

అటు: 'అటు' అనే మాట తెలుగులో శుష్కింప చేయటం, నీరసం చేయటం లాంటి అర్థాల్లో ఇప్పటికీ బాగా వాడుకలో ఉన్నపదమే! "అట్టు"(దోసె) అంటే తడి ఆరేలా కాల్చింది అని! 'అడుగంటు' అనే మాట కూడా ఇలాంటిదే!

**పుటు :** 'పుటు' అనేది కొత్తదనం, పాతను రూపుమాపటం లేదా రిపేరు చేయటం లాంటి అర్థాల్లో వాడకంలో ఉన్న పదం. పుట్టరి అంటే కొత్తబియ్యం. పొటమరించటం

అంటే అంతకు ముందులేని నూతనోత్తేజం అని అర్థం. "చిటిపొటిసొమ్ములు పెట్టుక పుటపుటగా వీధి వెంట పొరిగిండ్లబడిన్" అనే ప్రయోగంలో ఇనుమడించిన ఉత్సాహంతో అనే అర్థంలో పుటపుటగా వెళ్ళినట్టు (The act of breaking forth) కనిపిస్తుంది.

**రటు :** 'రటు' అనే మాట పెద్ద శబ్దం, కల్లోల ధ్వని, ఉపద్రవం అనే అర్థాల్లో కనిపిస్తుంది. "నోటి కూటికి రాటు తెచ్చుకొంటి గదాయని" లాంటి ప్రయోగాలున్నాయి. రాటుపడటం అంటే కష్టాల్లో పడటం.

ఈ విధంగా 'అటు, పుటు, రటు' అనేవి శత్రుభీకరతకూ, విజయోత్సాహానికి, నూతనత్వానికీ సంకేతాలుగా కనిపిస్తాయి. ఆనాడు తెలుగు వాడికి మూడే సూత్రాలు... అటు, పుటు, రటు... అంతే! శత్రువుని 'అటు' చేసి(నాశనం), పుటపుటగా (విజయోత్సాహంతో) సంచరిస్తూంటారు. వాళ్ళ జోలికి వెళ్ళడం అటే రాటు(కష్టం) కొనితెచ్చుకోవటమే నన్నమాట!

ప్రాచీనాంధ్రుల చారిత్రక అంశాలను తెలుగేతర చరిత్ర కారులు అయిష్టంగానే వ్రాశారు. తెలుగు చరిత్రకారులు కూడా మరింత లోతుల్లోకి వెళ్ళటానికి గట్టి ప్రయత్నాలు చేసినట్టు కనిపించదు. సహజంగానే చరిత్రవేత్తలు పురావస్తు ఆధారాలను మాత్రమే అంగీకరిస్తారు. లిపి ఉన్నదో లేదో తెలీని కాలానికి సంబంధించి భాషకు ఆధారాలు ఎలా దొరుకుతాయి?

లిపికన్నా భాష ముందు పుట్టింది. దైవ ప్రార్థనలు, లాలిపాటలు, ప్రేమపాటలు, పనిపాటలు ఇవన్నీ భాషతో పాటే పుడతాయి. భాష అభివృద్ధి కొద్దీ అవి కూడా విశిష్ట సంపన్నంగా ఉంటాయి. లిపి ఏర్పడిన తరువాత ఆ సంపన్న సాహిత్యం అవతరిస్తుంది. భాష ప్రాచీనత వేరు. సాహిత్య ప్రాచీనత వేరు. కావ్యాలు దొరకలేదు కాబట్టి భాష లేదనే వాదన అర్థం లేనిది. అత్యంత ప్రాచీన కాలానికి చెందిన ప్రాకృత సాహిత్యంలో తెలుగు వారి వ్యక్తిత్వాన్నే కాదు, ఈ మూడు తెలుగు మాటలు కూడా దొరికాయి. భాష ప్రాచీనతకు ఇంతకన్నా ఆధారాలు ఏం కావాలి?

పురావస్తు ఆధారాలు అంటే కేవలం ఆనాటి ప్రజలు వాడిన వస్తువులు, శాసనాలు వగైరా మాత్రమే కాదు, భాష కూడా ఒక ఆధారమే. దీన్ని లింగ్విష్టిక్ ఆర్కియాలజీ అంటారు. ఒక భాషా పదం యొక్క ప్రాచీనత జాతి ప్రాచీనతకు తిరుగులేని సాక్ష్యం అవుతుంది. తెలుగు ప్రాచీనం. తెలుగే ప్రాచీనం. అందుకు భాషాపురావస్తు ఆధారాలు అనేకం ఉన్నాయి. చరిత్రకారులు వాటిని స్వీకరించటం మొదలు పెట్టాలి. అంతే!



# సోమనాథుడి స్వదేశీయత"

2012 ఆగష్టు నెల 20 నుంచీ 30 వరకూ రాజమండ్రిలో ఆంధ్ర పద్య కవితా సదస్సు, తూర్పు గోదావరి జిల్లా శాఖ వారి ఆధ్వర్యంలో వీర శైవ సాహిత్య సభలు జరిగాయి. 21 వ తేదీన జరిగిన సదస్సులో "సోమనాథుడి స్వదేశీయత" అనే అంశం మీద నేను మాట్లాడాను. సభలో 60-70కి పైగా పండితోత్తములు తెల్లని విభూతిరేఖలు, నెరిసిన జుట్టు, ఒక్కక్కరూ ఒక్కొక్క హిమశైలంలా ఉన్నారు. ఆ సభలోసోమనాథుని బ్రాహ్మణ వ్యతిరేకతను సామాజిక దృష్టి కోణంలోంచి పరిశీలిస్తూ సాగిన నా ప్రసంగాంశం.

తెలుగు వారికి చరిత్రపట్ల ముందు నుంచీ చిన్న చూపే ఉంది. సాహిత్య చరిత్ర గురించి అంతకన్నా చిన్న చూపు మనకి. ఉన్న చరిత్రను కూడా రాగ ద్వేషాలు లేకుండా మౌలికంగా పరిశీలించి చెప్పింది కూడా తక్కువే!

రెండు వేర్వేరు సిద్ధాంతాలకు అంకితమై, ఎన్నో కొత్త ఒరవడులకు కారకులైన ఇద్దరు గొప్ప కవులలో నన్నయ గురించి జరిగినంత అధ్యయనం పాల్కురికి సోమనాథుని విషయంలో జరగకపోవటానికి కారణాలు అనూహ్యం కాదు.

సోమనాథుడు ప్రారంభించిన సమాజ సంస్కరణోద్యమం గురించీ, అంటరాని తనం, కుల వ్యవస్థల నిర్మూలన గురించీ చర్చించడానికి విశ్వవిద్యాలయాలు గానీ పరిశోధకులు గానీ అంతగా ఆసక్తి కనపరచకపోయినా, అభ్యుదయవాదులు కూడా సోమన విషయంలో పెద్దగా స్పందించకపోవటమే చరిత్ర పట్ల మనకున్న చిన్న చూపును పెద్దది చేసి చూపిస్తోంది.

శివకవుల దేశీయతా భావాన్ని ఆవిష్కరించుకొనే ఈ సందర్భంలో సాహిత్య చరిత్రని అధ్యయనం చేసే వారికి సామాజిక దృష్టితో పాటు, జాత్యాభిమానం, భాషాభిమానం కూడా ఎంతో అవసరం అని మనం గమనించాలి.

సోమనగారి స్వదేశీ కవితోద్యమాన్ని గాంధీగారి స్వదేశీ మంత్రంతో మాత్రమే పోల్చగలం. గాంధీ, సోమన లిద్దరిదీ దాస్యభావజాలం నుంచి విముక్తిని లక్ష్యం కావటమే ఈ పోలికకు కారణం.

## మార్గ-దేశీ కవితా రీతులు :

"మును మార్గ కవిత లోకం

బున వెలయ(గ దేశి కవిత(బుట్టించి తెనుం

గును నిలిపిరంధ్ర విషయం

బున( జన జాళుక్య రాజు మొదలగు పలువురు..." లోకం అంతా మార్గ కవిత వెలుగుతోంటే, చాళుక్య రాజులు ఇంకా మరికొందరు దేశికవితను తెలుగులో నిలిపారంటూ క్రీ. శ 1128లో నన్నెచోడుడు మొదటిసారిగా దేశికవిత గురించి ప్రస్తావించాడు.,

పండరంగడి చేబ్రోలు శాసనంలో కూడా "మార్గ", "దేశి" పదాల ప్రస్తావన ఉంది. తిక్కన కాలం కూడా అప్పటిదే! జాయప సేనాని నృత్తరత్నావళి కూడా (క్రీ.శ. 1250?) కాకతీయ యుగంనాటిదే!

ఆ రోజుల్లోనే సాంస్కృతికపరమైన స్వదేశీ ఉద్యమానికి మంచి ప్రారంభం జరిగింది. వీరి తరువాతి తరం వాడయినప్పటికీ, పాల్కురికి సోమనాథుడు ఈ దేశీయ భావానికి ఒక ఉద్యమ రూపాన్ని సంతరింపచేసి, నాయకత్వం వహించాడు.

"మార్గ", "దేశి" అనేవి మౌలికంగా సంగీత నాట్యరీతులకు సంబంధించినపదాలు. శార్ఙదేవుడు (క్రీశ.1230) సంగీత రత్నాకరంలో మార్గ, దేశీ భేదాలను పేర్కొన్నాడు."

మార్గ దేశీతి తద్వేదా తత్ర మార్గ స ఉచ్యతే

యో మార్గో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః

దేవస్యపురతశ్శంభోర్నియతోంభ్యుదయప్రదః

దేశేదేశే జనానాంయత్ రుచ్యా హృదయ రంజకం

గీతంచ వాదనం వృత్తం తద్దేశీత్యభిదీయతే"

-గీతం, వాద్యం, నృత్తం- ఈ మూడింటినీ సంగీతం అంటారనీ, ఈ సంగీతం మార్గ, దేశీ భేదాలతో రెండు రకాలనీ, బ్రహ్మాదులచే మార్గితమై శంకర సమ్ముఖంలో భరతాదులచే సంస్కృతంలో ప్రయుక్త మైంది మార్గ సంగీతం అనీ, జనుల హృదయాలను రంజింపచేసే దాన్ని దేశీ అంటారనీ దీని భావం. (దేశి కవిత-ఆచార్య యస్వీ జోగారావు, ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు జనవరి 1979).

"మార్గ" ప్రస్తావన వాల్మీకిరామాయణంలో కూడా కనిపిస్తుంది.

"తతస్తుతౌ రామవచః ప్రచోదితా

వ గాయతాం మార్గ విధాన సంపదా!

న చాపిరామః పరిషద్గతశ్శనై

ర్బుభూష యానక్తమనాభభూవహ!"

గీతం, వాద్యం, నృత్తం ఈ మూడింటినీ సంగీతం అంటారు. ఈ సంగీతం "మార్గ", "దేశి" భేదాలతో రెండు రకాలుగా ఉంటుంది. మార్గ సంగీతం బ్రహ్మాదుల మార్గాన పండిత రంజకమైనదిగా ఉంటుంది. అలా కాకుండా కేవల సామాన్య జన రంజక మైనది "దేశి" సంగీతం. పండితులకు మాత్రమే ఆనందం కలిగించే సంగీతానికి గౌరవం ఎక్కువ అనీ, పండితులు మెచ్చని, పామరులు మాత్రమే ఇష్టపడేది "దేశి" అనే ఒక స్పష్టమైన విభజన ఈ శ్లోకాలలో కనిపిస్తుంది.

ఆచార్య Hass లాంటి పాశ్చాత్యులు ఈ నిర్వచనాల ఆధారంగా "మార్గ" ను higher style అనీ, "దేశి"ని Lower style అనీ వ్యవహరించారు.

క్లాసికల్ అనే ఇంగ్లీషు పదానికి బెంగాలీలో "మార్గ" అని వ్యవహరిస్తారు. బెంగాలీ భాషలో "మార్గ" అంటే ఉత్తమమైనది. ఉన్మార్గ అంటే, నిషేధితం. హర్దేవ్ బహ్రి హిందీ నిఘంటువులో "మార్గ" అంటే, దారి అనే అర్థంతో పాటు, తెలియనిది, కఠినమైనదీ, తికమకగా ఉన్నది లాంటి అర్థాలు కూడా కనిపిస్తాయి. జనసామాన్యంలో "మార్గ" అంటే ఎలాంటి అభిప్రాయం ఉండేదో దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.

నాట్యశాస్త్రంలో కూడా ఈ నిర్వచనాలు కనిపిస్తాయి. దశరూపకంలో ధనుంజయుడు(క్రీ.శ. 950) ప్రతీ పదానికీ భావాన్ని అభినయించే నృత్యాన్ని "మార్గ" అనీ, నృత్తాన్ని "దేశి" అనీ నిర్వచించాడు. నృత్త, నృత్య అభినయాలకు గల తేడాని ఈ నిర్వచనం చెప్తోంది.

నన్నెచోడుడు "మార్గ", "దేశి" పదాలను తెలుగు కవిత్వానికి ఆపాదించి, ఈ రెండు కవితారీతులకు గల తేడాలను విశ్లేషించాడు. హృదయ రంజకతనీ, హృదయోత్తేజాన్ని కూడా కలిగించటానికి "దేశికవిత" ఉపయోగిస్తుందన్నవాడు నన్నెచోడుడు. ఆయన వాదాన్ని అందిపుచ్చుకొని, "దేశికవిత"ను ఉద్యమించి రాయాల్సిన అవసరం ఉందని భావించినవాడు పాల్కురికి సోమనాథుడు.

## తెలుగులో దేశీయ సాంస్కృతిక ఉద్యమం :

తమిళులు సంగసాహిత్య సంపదనంతా తమ దేశి సంపదగానే చెప్పుకొంటారు. అది క్రీశ ఐదు లేక ఆరవ శతాబ్దాల నాటి సాహిత్య సంపదగా చరిత్రవేత్తలు భావిస్తారు.

9వ శతాబ్ది నాటి కన్నడ నృపతుంగుడి "కవిరాజ మార్గం"లో దేశికవితా ప్రసంగం ఉందనీ, నాగవర్మ కన్నడ ఛందోంబుధిలో మెల్వాడు, బాజనెగబ్బ,పాడుగబ్బా అనే దేశి రచనలు పేర్కొనబడ్డాయనీ ఆచార్య ఎస్వీ జోగారావు పేర్కొన్నారు.

ఏ భాషలోనయినా మొదట "దేశి" మాత్రమే ఉంటుంది. పండితుల కారణంగా "దేశి" అడుగంటి "మార్గ" వ్యాపిస్తుంది.

తెలుగునేల మీద ఊళ్ళ పేర్లను, మనుషుల పేర్లను సంస్కృతీకరించటం, చెన్నమల్లు అనే ద్రావిడ నామాన్ని శ్రీగిరీశ్వరుడుగా మార్చటం లాంటి వెన్నో జరిగాయి. పరిస్థితి ఇలానే కొనసాగి తెలుగు శబ్దాలు పూర్తిగా కనుమరుగై పోయి, సంస్కృతమయంగా మారిపోయే ప్రమాదం ఏర్పడింది.

మాకు తెలుగు రాదనటం ఇవ్వాళ ఎలా ఘనమైన విషయంగా చెప్పుకొంటున్నామో అలానే వెయ్యేళ్ళ క్రితం కూడా మనవాళ్ళు చెప్పుకొన్నారు. సంస్కృతం మధ్యతరగతి తెలుగు ప్రజలను అంతగా ప్రభావితం చేసింది. ఆ పరిస్థితుల్లో సంస్కరణ వాదులకు దేశి భావన కలిగి ఉండాలి.

కవి జనాశ్రయంలో:

"వెలయంగ దెను(గు బాసకు

దలమయ్యెడు సిసములును దర్వోజలు గీ

దులు నక్కరలును ద్విపదలు

పాలు పొందగ రేచడిష్టమున నొనరించున్" అనే పద్యం వలన తెలుగు భాషకు స్వదేశీ ఛందస్సు ఉందని అర్థం అవుతుంది. బండారు తమ్మయ్యగారు ఛందస్సుని బట్టి ఏది దేశీ, ఏది మార్గ అనేది నిర్ణయించవచ్చన్నారు. కందం గీతం మొదలైన వృత్తాలు స్వదేశీయమని ఆయన పేర్కొన్నారు.

పండరంగని అద్దంకి శాసనం (క్రీ.శ. 848)లో కనిపించే తరువోజ పద్యాలు గుణగ విజయాదిత్యుని కందుకూరిశాసనం (క్రీ.శ. 9)లో సీసపద్యాలు, యుద్ధమల్లుడి బెజవాడ శాసనం (క్రీ.శ. 898-934)లో మధ్యాక్కర పద్యాలు క్రీ.శ. 9, 10 శతాబ్దాల కాలంలో తెలుగు మాత్రా ఛందోబద్ధరీతి గౌరవప్రదంగా జనాదరణ పొందిందని అర్థం అవుతోంది.

జైన బౌద్ధాల పతనం తరువాత వైదిక ధర్మాల వ్యాప్తి, సంస్కృత ప్రాబల్యం జనసామాన్యాన్ని కూడా బాగా ప్రభావితం చేసిన కారణంగా తెలుగు ద్వితీయ స్థానానికి దిగి ఉంటుంది. సోమన కాలానికి నన్నయాదుల చంపూ రీతి బహుళ వ్యాప్తిలో ఉండి ఉంటుంది. అందుకు భిన్నంగా దేశీయ భాషేతివృత్త ఛందోరీతుల్నీ ద్విపద కావ్య మార్గాన్ని తీర్చి దిద్దే ప్రయత్నం పాల్కురికి సోమనాథుడు చేయవలసి వచ్చింది.

శాస్త్రాలనూ, శాస్త్రార్థాలనూ వివరించటానికి తెలుగు ఛందో రీతులు చాలవనే అభిప్రాయాన్ని ఖండించటానికే ద్విపదలో బసవపురాణం, పండితారాధ్యుల చరిత్రలను సోమన వెలువరించాడు. శ్రుతి, స్మృతి పురాణేతిహాసాలలో అపారమైన పరిజ్ఞానం లేకుండా కేవల భాషాభిమానంతో చేసిన రచనలుగా వాటిని ఎవరూ భావించలేరు.

## జానుతెనుగు

తెలుగు సాహిత్యంలో 1100 నుండి 1225 వరకు శివకవి యుగం అంటారు. నన్నయకు, తిక్కనకు ఇది సంధియుగం. తెలుగు నేల మీద కాకతీయుల పాలన సుస్థిరమౌతున్నకాలం.

నన్నెచోడుదు, పాల్కురికి సోమనాథుడు, మల్లికార్జున పండితారాధ్యుడు ఈ యుగంలో శివకవిత్రయం నన్నయ కారణంగా వచ్చిన సంస్కృత పద భూయిష్ట సాహిత్యానికి వ్యతిరేకంగా మొదట శంఖం పూరించిన వాడు నన్నెచోడుడు. దానిని ఉద్యమం చేసిన వాడు సోమనాథుడు

"జానుతెనుగు", "వస్తుకవిత" అనే పదాలను పరిచయం చేసినవాడు నన్నెచోడుడే! కన్నడ భాషలోంచి "జాణ్ నుడి" (చమత్కారమైన నుడి) పదాన్ని తీసుకొని, జాను తెనుగు అనే ఒక కొత్త ఆలోచనను కవుల ముందుంచాడు.

కన్నడంలో నాగవర్మ, గుణవర్మలు జాణ్ నుడి రచనకు ప్రసిద్ధులు. తిరుల్ కన్నడం(సారవంతమైన కన్నడం) గా జాన్నుడికి కన్నడిగులు కావ్యగౌరవం ఇచ్చారని జోగారావు గారు పేర్కొన్నారు.

భాషా ఛందస్సులు, భావజాలం, వర్ణనలు, జాతీయాలు సంస్కృత ప్రభావానికి లోను కాకుండా వెలయించిన స్వచ్ఛమైన దేశికవిత "జానుతెనుగు కవిత" అవుతుందని నన్నెచోడుడి నిర్వచనంగా కనిపిస్తుంది.

పండిత పాఠకులు చదివి మెచ్చేది మార్గ కవిత, పామర జనం విని మెచ్చేది దేశి లేదా జానుతెలుగు కవిత అనే భావనని వ్యాపింపచేసే ప్రయత్నం నన్నె చోడుడి ప్రేరణతో ఒక ఉద్యమంగా ప్రారంభమయ్యింది.

"సరళము కాగ భావనలు జాను తెనుంగున నింపు విరింగొన వర్ణన"లతో కుమార సంభవ కావ్యాన్ని తాను రచిస్తున్నట్టు ఆ కావ్య అవతారికలో నన్నెచోడుడు చెప్పుకొన్నాడు.

అందరికీ అర్థం కావటం, అది ఇంపు పెంపుగా ఉండటం అనేవి జాను తెనుగు లక్షణాలుగా ఆయన భావించాడు.

జనం మాట్లాడుకొనే భాష, జనం చెప్పుకొనే విషయాలతోనే జానుతెనుగులో చిత్రితమై దేశికవిత రూపొందు తుందన్నాడు.

అటు "మార్గ" ఇటు "దేశి" రెండింటిలో ఏదో ఒకటే నిర్ణయించుకోవాలని కవులకు సూచించాడు.

సంస్కృతం, తెలుగు పదాలతో సంకర సాహిత్యాన్ని సృష్టించేవారిని "దుర్మార్గ" కవులుగా నిరసించాడు(కు. సం. 1-28).

సంస్కృత పదాలను గుప్పించి చివర డు ము ఉ లు చేర్చే కవిత్వం ప్రజలకు చెందనిది అవుతుందని భావించాడు.

"తండులాలు గృహమందు నసంతి, దిండికైతే పదిమంది వసంతి-అనే హాస్యాస్పదమైన తెలుగు సంస్కృత సంకరాలకు కావ్య గౌరవం దక్కే పరిస్థితులు ఏర్పడినప్పుడు జాను తెనుగు అవసరం ఏర్పడింది.

"టెంపుల్ కి వెళ్ళి కోకోనట్ బ్రేక్ చేసిరా" లాంటి సంకర వాక్యాలు ఇప్పుడు గొప్పవిగా చెలామణి అవుతున్నట్టే వెయ్యేళ్ళ క్రితం సంస్కృత వెర్రి వ్యామోహాలు తెలుగును హీనపరచటం మొదలు పెట్టాయి.

ఆనాడు సంస్కృతవ్యామోహం, ఈనాడు ఇంగ్లీషు వ్యామోహం అంతే తేడా!

ఈ రోజుల్లో ఈ నేరాన్ని గ్లోబలైజేషన్ మీదకు నెట్టేస్తున్నాం గానీ, మన తత్వంలోనే, మన రక్తంలోనే ఈ పరభాషాదాస్యం అనేది అంతర్లీనంగా ఉన్నదనాలి.

"మార్గ- దేశీ" అనే వ్యాసంలో డా వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు "యీ మిశ్రభాషా కవితా కల్పనాసక్తికి మూలం.

కానీ బహుభాషా జ్ఞానమే కాని వేరు కాదు" అన్నారు.

కానీ బహుభాషా జ్ఞానానికి పరబాషా వ్యామోహం కూడా తోడయ్యిందనే వాస్తవం దాస్తే దాగేది కాదుగదా!

పాల్కురికి సోమనాథుడు 1160-1230 కాలంవాడు కావచ్చును. వరంగల్లు సమీపంలోని పాల్కురికి గ్రామంలో శ్రియా దేవి, విష్ణురామ దేవుడు అనే దంపతులకు జన్మించాడు. జన్మతహా బ్రాహ్మణుడైనా, వీరశైవ మతం మీద అనురాగంతో గురువు కట్టకూరి పోతిదేవర వద్ద శైవాగమ ధర్మశాస్త్రాలు నేర్చుకున్నాడు, వీరశైవ దీక్షను తీసుకుని వీర మహేశ్వర వ్రతుడిగా మారాడు. తల్లిదండ్రులు జన్మనిచ్చిన కులాన్ని వదలి శివపార్వతుల్నే తల్లిదండ్రులుగా భావించటం వీర మహేశ్వర వ్రతం. వీళ్ళని జంగమ దేవరలంటారు. వీరికి కులగోత్రాల పట్టింపు ఉండదు. ఈ కారణంగానే అంటరానితనాన్ని పాటించే అగ్ర కులాలను కులం పేరుపెట్టి తిట్టగలిగాడు.

"కులజుండు నతడే యకులజుండు నతడె/ కులము లేకయు నన్ని కులములు నతడే"అని గట్టిగా నమ్మినవాడు సోమనాథుడు.

"ప్రజలకోసం అతడు పుట్టాడు.

ప్రజలే అతడిని అమరకవిని చేశారు" అంటారు సమగ్రాంధ్ర సాహిత్యంలో ఆరుద్ర!

సాంస్కృతికంగా అప్పటికే బౌద్ధం, బలహీనపడిన స్థితిలో ఉన్నాయి. "జైన బౌద్ధ చార్వాక దుష్పథ సమయములు

మూడును నిర్మూలము జేయుదనుక

మూడు రాలను వైతు ముప్పొద్దు నిన్ను" అనీ,

"వసుధలో జినులనువారి నందరను నేలపాలుగజేసి"

అనీ సోమనాథుడు బసవపురాణంలో ముప్పేట దాడులు ఎలా చేయవలసి వచ్చిందో వివరించాడు. "జైనులు, బౌద్ధులు రంగంనుంచి దిగజారి పోయిన తర్వాత మతోన్మాద గదాయుద్ధానికి వీరశైవ, వీరవైష్ణవులే మిగిలిరి. వీరు పరస్పరము తిట్టుకున్న తిట్లే ఒక చేట భారతమగును" అని సురవరం ప్రతాపరెడ్డిగారు సోమన కాలంనాటి పరిస్థితులను వివరించారు.

కర్మచండాలురు, వ్రతభ్రష్టులు, దుర్జాతులు, పశుకర్ములు, బాపన కూళలు,... ఇవన్నీ వైష్ణవులను తిట్టడానికి ఉద్దేశించినవే.

కాకతీయప్రభువుల మద్దతు శైవులపక్షాన ఉంది. రాజాదరణ తో గోలకీ మఠాలను సాధించుకున్నారు. శివదీక్షను స్వీకరించిన బ్రాహ్మణులు గురుస్థానాలను పొందారు. కానీ, అప్పటిదాకా శివాలయాల్లో పూజారులుగా ఉన్న తంబళ్లను తొలగింపచేసి, వారి స్థానంలో ఈ బ్రాహ్మణ గురువులు పూజారులయ్యారని సురవరం వారు పేర్కొన్నారు.

సోమన కాలానికి ఈ భాషాదాస్యం మరింత ముదిరింది. అప్పటికే సువ్యవస్థిత మైన ఛందో రీతులు తెలుగులో అనేకం ఉన్నప్పటికీ, అవి నిరాదరణకు గురి కావటం వలన, భాషాభిమానంతో పూనుకోకపోతే తెలుగును కాపాడు కోవటం కష్టం అనే పరిస్థితి వచ్చేసింది.

అందుకే, మరిన్నిఅడుగులు ముందుకేసి, "అల్పాక్షరముల ననల్పార్థరచన కల్పించుటయు కాదె కవి వివేకంబు...?"అని ప్రశ్నించాడు సోమన.

**"బలుపోడతోలు సీరమును బాపసరుల్ గిలుపారు కన్ను వె**
**న్నెలతల సేదుకుత్తుకయు నిండిన వేలుపుటేరు వల్లుపూ**
**సల గల రేని లెంకనని జానుదెనుంగున విన్నవించెదన్**
**వలపు మదిం దలిప్ప బసవా బసవా బసవా వృషాధిపా"**

అంటూ, వృషాధిపశతకంలో సోమనాథుడు స్వదేశీ జానుతెనుగులోనే విన్న విస్తానని శివుడికి ఒక మాట ఇచ్చాడు. నన్నయది ధ్వని ప్రధాన కవిత. సోమనది రస ప్రధాన కవిత. సోమన, శివునిపట్ల ముగ్ధభక్తిని ప్రచారం చేస్తే, సమాంతరంగా వైష్ణవులు మధురభక్తిని ప్రచారం చేశారు.

## దేశిభాషలో ప్రజాసాహిత్యోద్యమం

పొట్టయిన రత్నంబు చుట్టును పసిడి కట్టిన భావనగా సోమన ద్విపదకు కావ్య గౌరవాన్ని సాధించాడు.

అప్రమాణమనీ, అనాద్యమనీ, ముదిలంజ దిడ్డికంతలనీ ద్విపదను ఎవరెంత ఈసడించినా ఆ దేశిఛందస్సులోనే ఆయన పెద్ద కావ్యాలను నిర్మించాడు. సంస్కృత భావజాలంలోంచి బయట పడగలిగితేనే దేశిభాష బాగుపడుతుందని ప్రబోధించాడు.

మన పెళ్ళీ, పేరంటాలకూ, పుట్టుకకూ, చావుకూ దేనికీ తెలుగుని పనికి రాకుండా చేయటాన్ని ఖండించాడు. దేవుణ్ణి స్వంతభాషలో స్వంతపద్ధతిలో ఆరాధించుకోవాలని సూచించాడు. అందుకు అడ్డుపడే బ్రాహ్మణవర్గం పట్ల తన వ్యతిరేకతను స్పష్టంగానే ప్రకటించాడు.

తన భావాలను వెల్లడించటానికీ, పరమత ఖండనానికి, స్వమత స్థాపనకూ జనభాషలో సాహిత్య సృష్టిచేయటం ఒక సాధనంగా చేసుకున్నాడు.

“దెలుగు మాటలనగ వలదు, వేదముల కొలదియు కాజూడుడిల నెట్టులనిన...” అంటూ తెలుగు మాటలు వేదములతో సమానమన్నాడు. తెలుగే దేవభాషగా ఆయన సంభావించాడు. జన వశీకరణకు అమ్మభాషే శరణ్యం అన్నాడు.

దేశి భావ జాలాన్ని, దేశి జీవన విధానాన్ని, దేశిభాషను ప్రతిబింబించే ప్రజా సాహిత్య ఉద్యమానికి శ్రీకారం చుట్టాడు. వస్తువులో కొత్తదనం తీసుకువచ్చాడు. తెలుగు నుడికారాన్ని, తెలుగు ఛందస్సును, తెలుగు శబ్దజాలాన్ని కలిగి ఉండటం మాత్రమే కాదు, అందులో సామాన్యుడు వస్తువుగా ఉన్నప్పుడే అది దేశి కవిత అవుతుందన్నాడు.

అత్యంత సామాన్యుల్లో అసామాన్యులైన శివభక్తుల జీవితాలను భక్తి సూత్రాలతో బంధించి చిత్రించే ప్రయత్నం చేశాడు.

తెలుగుదనాన్ని తేట తెల్లంచేస్తూ, “జాతులు రీతులు నేతులుట్టంగ” దేశికవితను తీర్చిదిద్దాడు.

దుర్గవ్వ, కిన్నెర బ్రహ్మయ్య, బెజవాడ కుమ్మరి గుండయ్య, మడివాలు మాచిదేవయ్య , కన్నప్పగా ప్రసిద్ధుడయిన తిన్నడు, మౌళిగ మారయ్య, ముసిడి చెన్నయ్య, మాల శివనాగుమయ్య, మేదర క్షేత్రయ్య, చెన్న మల్లన్న లాంటి సామాన్యు లెందరినో ప్రధాన పాత్రలుగా చిత్రించి వారి చరిత్రలు వెలుగులోకి తేవటానికి ఈ స్వదేశీ భావనని ఉపయోగించుకొన్నాడు.

వర్ణవ్యవస్థని కోరే సంస్కృత సాహిత్యాన్ని నిరసించాడు. అసమాక్షు కొలవని అగ్రజుండైనా వసుధ మాలల మాలవాడు కాకెట్టు? అని ప్రశ్నించాడు.

శివుని కొలవడం అంటే కులమతాలు పాటించకపోవటం, వర్ణవైషమ్యాలు వదిలేసుకోవటం, వైదిక క్రతువులను అంగీకరించకపోవటంగా ఆయన ప్రచారం చేశాడు.

వేద భరాక్రంతులనగబడిన బ్రాహ్మణ గార్ధబంబులతోడ ప్రతిసేసి యాడిన పాపంబు వచ్చునంటాడు.

అంటరాని తనాన్ని పాటించే బ్రాహ్మణులను మెడలో త్రాడు మాలగా ధరించేవారు -తాటిమాలలు-అని నిరసించాడు.

పాల్కురికి సోమనాధుడు శివుని ప్రమధ గణాలలో "భృంగి" అవతారమని నమ్ముతారు. ఇతర బ్రాహ్మణ శివకవులకు భిన్నంగా పాల్కురికి సోమనాధుడు బ్రాహ్మణుల ఆచార వ్యవహారాలను నిశితంగా విమర్శించాడు.

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి "శివకవులు భవికవులను గర్హించిరి. కవితలో కూడా వారు వేరు మతము వారయిరి." అని వ్యాఖ్యానించారు.

వైదిక మతోద్ధరణ తన గురుతర బాధ్యతగా భావిస్తే,. సోమన వైదిక ధర్మాలను తుదముట్టించి కుల వర్ణ భేదాలు లేని సమ సమాజ నిర్మాణాన్ని తలపెట్టాడు. వ్యక్తిగా, పాలకుడిగా కన్నడ ప్రాంతాలలో బసవన్న సాధించిన విజయాలను, తెలుగు నేలమీద సోమన తన సాహిత్యం ద్వారా సాధించాడు. పాడుకునేందుకు తెలుగువారికి ద్విపద, ఛందస్సును కానుకగా ఇచ్చాడు. తెలుగులో తొలి స్వతంత్ర పురాణంగా బసవపురాణం వాసికెక్కింది. తొలి ద్విపద కావ్యం కూడా ఇదే!

## ఏది దేశి కవిత?

వైదిక పురాణ సాహిత్యానికి వ్యతిరేకంగా మొదట జైన పురాణాలు వెలిశాయి. జైన తీర్ధంకరుల మహిమలను జోడిస్తూ, వైదిక పురాణాలను తమకు అనుకూలంగా తిరగ రాశారు.

9వ శతాబ్దిలో పంపమహాకవి ఆదిపురాణం పేరుతో ప్రథమ జైన తీర్ధంకరుడి చరిత్రను చంపూ పద్ధతిలో వ్రాశాడు. క్రీ. శ 9వ శతాబ్ది నాటికి తెలుగు కన్నడ "భాషా" సరిహద్దు ఇంత స్పష్టంగా విడివడి లేదు రాజులు రాజ్యాలు వేరుగా ఉన్నా భాషా జాతీయత పరంగా ఇప్పుడున్నంత భిన్నత్వం లేదని చెప్పవచ్చు. ఈనాటి కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాల హద్దుగా ఉన్న వేంగి రాజ్య పాలకులు వైదిక సాంప్రదాయబద్ధులు. వారి సామంతులుగా పాలిస్తున్న కాకతీయులు జైనంలోంచి శైవంలోకి మళ్ళారు.

గణపతి దేవుడు తిక్కన ద్వారా జైనులను ఓడింప చేసి "జిన సమయార్థుల తలలు దునియె-విద్వేష బౌద్ధుల విలువమాడె (సిద్ధేశ్వర చరిత్ర)" అనే వాక్యాల సాక్ష్యంగా జైనులను, బౌద్ధులను నిశ్శేషం చేశాడు.

కాకతీయ సామ్రాజ్యం పతనమైనా సోమనాథుడి ప్రేరణతో సకల నియోగంబులు(అన్ని కుల వృత్తుల వారు), శైవ మార్గాన ఐక్యమై, జాతి ఐక్యతను నిలబెట్టుకున్నారు.

బసవ పురాణము, పండితారాధ్యుల చరిత్ర రచనలతో బాటు సోమనాథుడు వ్రాసిన అనుభవసారము, వృషాధిప శతకము, చతుర్వేద సారము, సోమనాథ భాష్యము, చెన్నమల్లు సీసములు పరిష్కృతమైనవి చాలావరకూ దొరుకుతున్నాయి. ఇంకా, కొన్ని ఉదాహరణ కవితలు, రగడలు, అష్టకాలు,నామావళులు, పంచరత్నాల లాంటివెన్నో రచించాడు. వీరశైవులు కంఠోపాఠంగా వల్లించే శివస్తవం సోమనాథకృతమే!

రంగనాథ రామాయణం లాంటి మరికొన్ని ద్విపద కావ్యాలు విష్ణుకథలు జన సామాన్యంలోకి చొచ్చుకు పోయే ప్రయత్నం చేశాయి. 14వ శతాబ్దికి చెందిన గణపనారాధ్యుడు స్వర శాస్త్రము అనే యోగ శాస్త్రాన్ని ద్విపదలో రచించి ద్విపదకు కావ్యగౌరవం తెచ్చాడని జోగారావుగారన్నారు. శ్రీనాథుడి పల్నాటివీర చరిత్ర ద్విపద కావ్యమే! పదకవితా పితామహుడు దేశికవిత ప్రవర్తకుడు అన్నమాచార్య చరిత్రను తాళ్లపాక చిన్నన్న ద్విపదలోనే వ్రాసి ప్రసిద్ధుడయ్యాడు. ప్రజలకోసమే సాహిత్యం అనే భావనకు ఐదువందల నుండి వెయ్యేళ్ళ చరిత్ర ఉందని ఈ అంశాలు నిరూపిస్తున్నాయి.

దేశికవితలో కూడా మార్గ కవిత్వపు ఛాయలు కనిపించవచ్చు.

వేదాదులనుంచి ఉన్నవి ఉన్నట్టుగా సంస్కృత వాక్యాలను దించటం, "అక్షయకీర్తి దృష్టాదృష్ట లోక సాక్షిక ప్రత్యయ లింగమూర్తి"లాంటి దీర్ఘ సంస్కృత సమాసాల ప్రయోగాలు సోమనాథుని కవిత్వంలో ఉన్నప్పటికీ జోగారావు గారన్నట్టు ఆయన కావ్యాలు నూటికి ఎనబై పాళ్ళు దేశితనాన్ని కలిగి ఉంటాయి.

"ఆరూఢ్య గద్యపద్యాది ప్రబంధ పూరిత

సంస్కృత భూయిష్ట రచన

మానుగా సర్వ సామాన్యంబు గామి

జాను తెనుగు విశేషము ప్రసన్నతకు" (పండితారాధ్య చరిత్ర) అనే పద్యంలో వాడిన భాషకీ, "ఉరుతర గద్య పద్యోక్త్యుల కన్న

సరసమై పరగిన జాను తెనుంగు

చర్చింపగా సర్వ సామాన్యమగుట

గూర్చెద ద్విపదలు గోర్కె దైవార" అనే పద్యంలో

వాడిన భాషకీ(బసవపురాణం) తేడాని గమనిస్తే, సంస్కృత పాండిత్య ప్రతిభ గలిగిన ఒక కవి, జాను తెలుగులోకీ, దేశి సాహిత్యం లోకీ మళ్ళడం ఎంత కష్టమో అర్థం అవుతుంది.

అందుకే, నేలటూరి వెంకట రమణయ్యగారు సోమన భాష అచ్చతెనుగు భాష అనే వాదంతో ఏకీభవించలేదు: సోమనాథుని వాక్యములు జానుదెనుగున నచ్చతెనుగను భ్రమను గలుగ జేయుచున్నను వాస్తవము విచారించగా జానుదెనుగునకు సరియైన యర్థమది కాదని తోచుచున్నది. ఏలన, సోమనాథుని రచన లచ్చతెనుగు కబ్బములు కావు. ఇతరాంధ్ర కవులను బోలె ఇతడును సంస్కృతాంధ్ర మిశ్రభాషనే వాడియున్నాడు. తిక్కన సోమయాజి కవనమందుబోలె ఈతని కవనమందును సంస్కృత పదములకంటెను తెనుగు మాటలే యధికముగా గానవచ్చుచున్నవి. అంతమాత్రముననే ఇతని గ్రంధముల భాష యచ్చ తెనుగని చెప్పుట తగదు గదా! జానుదెను గచ్చతెనుగే యైన పక్షమున నితడు జానుదెనుగున గ్రంధములను రచించితినని చెప్పినది పొల్లుమాట, దబ్బఱ యనుకొనవలసివచ్చును. కాని, సోమనాథుడు దబ్బఱలాడెననుట విశ్వసింపదగిన విషయము కాదు. మరియు "గద్యపద్యాది ప్రబంధపూరిత సంస్కృతభూయిష్టము గాని రచన జానుదెనుగని సోమనాథుడు నిర్వచించి చెప్పుచుండ, గద్యపద్యాత్మకము, సంస్కృత భూయిష్టమునగు కుమార సంభవమును దాను జానుదెనుగున రచియించితినని నన్నెచోడుడు దెల్పుచున్నాడు. దీనివల్ల వీరిరువురును "జానుదెనుగు" నొక్కవిధముగ నర్థము జేసికొనక భిన్నమార్గములను ద్రొక్కినట్లు తెల్లమగుచున్నది. ఒక్కమాట యర్థమును చేసుకొనుట యందిరువురును పరస్పర విరుద్ధ మార్గములు ద్రొక్కుట చూడ జానుదెనుగునకీ రెండుమార్గములను సమన్వయ పరిచెడి సామాన్యార్థమేదో యుండవలెయునని తోచుచున్నది" అని వ్యాఖ్యానించారు.

ఆ సామాన్యార్థాన్ని అయన ఇలా వివరించారు: "జాను శబ్దము దేశ్యమని సీతారామాచార్యులు గారు అభిప్రాయ పడిరి. ఇది జ్ఞానశబ్దభవ మనియు, 'జాణ'కు

దోబుట్టు వనియు నేను తలచెదను. దీనికి అందము, సౌందర్యము అని యర్థము. ' జానుదెను'గనగా సొంపైన నుడికారము గల తెనుగని యన్వయము చేసికొనవలయును" అన్నారు.

"లోకమ్ము వీడి రసమ్ము లేదు" వ్యాసంలో ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య మౌఖికమైనంత మాత్రాన సూత్ర భాష్యాదుల పాండిత్యం లేకుండా అన్నమయ సంకీర్తనలను అర్థం చేసుకోగలమా...? అని ప్రశ్నించారు. కఠినమైన శాస్త్ర విషయాలను సామాన్యుడి ముంగిటకు చేర్చగలగటం ఒక శైలి. అది రచయిత ప్రతిభకు తార్కాణం. పామర జన మోదాన్ని కలిగిస్తూనే ఎన్నో రహస్యాలు పండితులు వెదుక్కోగలిగేలా ఏర్పడి చెప్పగలగటం ఒక సోమనాథుడికి తెలుసు ఒక అన్నమయ్యకు తెలుసు.

చెన్నమల్లు సీస పద్య శతకంలో "ఆడింప నోడింప నా హెచ్చు కుందులు రవణించి చూడనీయవియె కావె?" అంటాడు. "నిదానించి చూస్తే, ఆడించేవాడివీ, ఓడించేవాడివి, హెచ్చు తగ్గులు ఇచ్చేవాడివి నువ్వే కదా- ఈ జీవితం ఒక నాటక రంగం" అనే భావన చెప్పటానికి దేశీయతను చక్కగా ఉపయోగించుకోవటాన్ని ఈ సీసపద్యంలో గమనించవచ్చు.

"కలనైన నిలిచిన నిలుకడ చలియింప నప్పుడ రూపకుండయ్యేనేని" అనే ప్రయోగం కనిపిస్తుంది. ఇక్కడ రూపకుడు అనటం జీవితమే ఒక నాటక రంగం అనటానికి కొనసాగింపు ప్రయోగం.

రూపకుడు ఈ నాటక పాత్రధారి. శివుని మీద మనసు నిలుకడగా నిలిచి ఉన్నప్పుడే రూపకుడు శివైక్యం చెందడం మంచిదంటాడు. "యంత్రధారి చేత జంత్రమున్నటులు నీవాడినట్లు దేహమాడ వలదె...?" అని హితవు చెప్తాడు.

## అచ్చ తెలుగు ప్రయోగాలు :

ఎన్నో తెలుగు పదాలను ఆయన అవలీలగా ప్రయోగించాడు, "టగ్ ఆఫ్ వార్" అనే తాడాటను **"రాగుంజుపోగుంజులాట"** (పండితా .46) అన్నాడు. కొన్ని పదబంధాలను స్వయంగా రూపొందించాడేమోననిపిస్తుంది.

బసవని చూడటానికి జనసందోహం కదిలి వస్తుంటే, పందిళ్ళు వేసి, వాటి గుంజలకు గాలి ధారాళంగా వచ్చేలా **"వ్యాసహస్తాలు"** అమర్చారంటాడు. సీలింగుఫ్యానుకు ఈ వ్యాసహస్తం అచ్చుగుద్దినట్టు సరిపోతుంది.

"ఒరేయి కుక్కా...!" అని కసితీరా తిట్టటానికి ఆయన గొంతు చించుకోలేదు. **"ఉచ్చుచ్చిరే శంకరోచ్చిష్టు భోగి"** అని ఊరుకున్నాడు.

**"పాపికా భ్రమసితే ప్రాణవల్లభుని ఘూపొద్వ గూడునే తుంపురుల్నిండ"** (బసవ3-157) అనే వాక్యంలో ఘూ అని చీదరించటానికి **ఘూపొద్వ** అని మృదువైన ప్రయోగం చేశాడు.

అలాగే ఛీ! ఛా! అని ఈసడించదగిన వ్యక్తులను చాలా సౌమ్యంగా **"చాకారులు"** అన్నాడు.

పరువు నష్టాన్ని తూని చెడటంగా అన్నాడు.

పడిన మచ్చ మాసిపోదని హెచ్చరించటానికి అలుకు పోదు అంటాడు.

వీసమంతదానికి కొండంతపాపాన్ని మూటగట్టుకొనేవాళ్లనే అర్థంలో **"వీసానికైనా ఎట్టి దోసానికైన చేసాచుకొను కర్మజీవులు..."** అంటాడు.

నీచులను **"లెంగులు"** అంటాడు.

పేరాశని **"కోలాస"** అంటాడు.

చాలా మంచివాడు, అమాయకుడు అని చెప్పటానికి **"నునుపరి"** అని అందంగా ప్రయోగిస్తాడు. (బసవ5-135).

కుంభవృష్టి కురిసిందనటానికి అచ్చతెనుగులో **"కుండకూలిన యట్టు"** అంటాడు.

రాతిని శిల్పంగా మలచటాన్ని **"గండరించు"** అంటాడు. **"పండిత లోచనాబ్జంబుల యందు గండరించినయట్టి"** అని ప్రయోగిస్తాడు.

గ్రూపులు కట్టడాన్ని గుంపిడటం అని ఎత్తిపొడుస్తాడు.

తక్కువగా గౌరవించటాన్ని **"సోలవెలితి"** అన్నాడు.

చాలా కొద్ది సమయాన్ని **గోరంతపొద్దు** అంటాడు,

అసాధ్యం అనడానికి "కుంచాలతో మంచుకొలవటం" అనే చక్కని జాతీయాన్ని ప్రయోగిస్తాడు.

భరించటం అనే అర్థంలో **"తనువెల్లా శిరమై"** అంటాడు,

విత్తనాలు నాటడాన్ని"విత్తులలుకు" అనడంలోని పదలాలిత్యం అసాధారణమైనది

మేలము అంటే పరిహాసము (చెన్నమల్లు -5)

"దుద్దెక్కు" అంటే పెద్దదగు, లావెక్కు: భక్తి దుద్దెక్కితనలోన దొట్రుకొనంగ (బసవ 1-217)

**బుడిబుళులు అంటే గుసగుసలు :** "నరుల్ బుడిబుడుల్వోవ, బుడిబుళ్ళు వోవుచు భూసురులెల్ల పుడమీశు కొలవుకు పోయి" బసవ7-180)

**బిలిబిలి కృతులు :** వేగంగా రాసేసిన పనికి మాలిన రచనలు.

**బిలిబిలి కాయకంబులు :** కొద్దికష్టంతో చేసే పనులు(బసవ5-131)

**తొడితొడి :** మొట్టమొదటగా: తొడితొడి జాగిలబడి మ్రొక్కి...అంటాడు పండితారాధ్యుల చరిత్రలో (ద్వి.261o)

**ధర్మకవిలె :** చెప్పినట్టు వినే దాసుడు, నిజమైన భక్తుడు, అచంచల భక్తివిశ్వాసాలు కలిగినవాడు: "కతలేల మీ ధర్మకవిలెలము మేము" (పండితా175), "మీ దత్తి మీ ప్రాత మీధర్మకవిలె (బసవ-422), కవిల బసవ అంటే, కన్నడ దేశంలో శాస్త్రోక్తంగా ఉత్సర్జనము చేసిన వృషభము అని!

**బయిసి :** మర్యాద, ప్రతిష్ఠ. బైసిమాలినవాడు, మర్యాదలేనివాడు." మాబోటి భక్తులకునికియు నులికి నీ/ బయిసియు కాదె నిలలో(బసవ5-134)

**పొట్టపొరుగు:** చాలాదగ్గిరగా ఉండటం: పొట్టపొర్వునగల్వ భూరుహంబుండ..."(బసవ-7-207)

**పొట్టిడుకొను :** కడుపులో దాచుకోవటం, రహస్యం కాయటం. బడబాగ్నియంతయు ఫాలమధ్యమున మృదుగణంబొకడు బొట్టిడికొనుటెట్లు? (పండితాద్వి. 406)

సోమనాథుని కవితలో పదలాలిత్యం, సంక్షిప్తతలతో పాటు, వైరి సమాసాలను కూడా స్వేచ్ఛగా ప్రయోగించటం అనే లక్షణాన్ని కూడా గమనించవచ్చు. పుష్పవిల్లు, భూమి తీరు, వేడి పయోధార లాంటి ప్రయోగాలు అలవోకగా చేసినవెన్నో కనిపిస్తాయి. తిరుగుబాటు చేయటమే ఊపిరిగా పనిచేసే ఉద్యమకారుడు రూల్సు పాటిస్తాడా...!. బసవడు పట్ల, శివుడు పట్ల, సమాజంలోని అంటరానివారుగా అణగదొక్కబడిన వారి పట్ల, ఆయన తనది అతిలౌల్యం... అని చెప్పుకొన్నాడు. వర్ణవ్యవస్థ వ్యతిరేకత పట్ల, సంస్కృత భావజాల వ్యతిరేకత పట్లకూడా ఆయన అతిలౌల్యాన్నే ప్రదర్శించాడు. తన ద్విపద కావ్యాన్ని "వేదములకొలదియు కొలువుడు" అని చెప్పుకోవటానికి ఒక కవికి ఎన్నెదలు కావాలీ...?



# రాయలనాటి పాలనా భాష - నేటి అవసరాలు

**కా**కతి రుద్రమ నుండి కృష్ణరాయల దాకా నడిచిన సాంస్కృతిక పరిణామాలు తెలుగు భాషా సంస్కృతులకు ఒక కొత్త ఒరవడి నిచ్చాయి. ఒక రాజు పోవటమూ, ఆ స్థానంలో వేరొక పాలనా వ్యవస్థ వ్రేళ్ళూనుకోవటం ఆ జాతి భాషా సంస్కృతుల్ని తప్పకుండా ప్రభావితం చేస్తాయి. ఇదంతా పరిణామ చక్రంలో ఒక భాగం. కొండ లెక్కటం, లోయల్లోకి పడిపోవటం భాషా సంస్కృతులకు సహజ పరిణామాలే! ఎల్లకాలం ఒకే రాజ్యం సాగదు. పడినా కూడా లేచే సత్తా ఉన్నదా లేదా అనేది ప్రశ్న. తెలుగు భాషా సంస్కృతులు ఆ సత్తా చాటుకునే పనిలో ఉన్నాయి.

తెలుగు భాషా సంస్కృతుల పరంగా చూస్తే, కాకతీయుల వరకూ పాలనా పరంగా సంస్కృతాధిపత్యమే కనిపిస్తుంది. సంస్కృత భావజాలం లోంచి బయటపడాలని పాల్కురికి సోమనాథాదులు చేసిన ప్రయత్నాలు ఉద్యమస్థాయి పొందక పోయినా, పాలనా పరంగా తెలుగుపదాలు చేరటం మొదలై, రాయల కాలానికి వచ్చేసరికి తెలుగులో పాలనా భాష అమలైంది. రెడ్డిరాజుల కాలంలోనూ, విజయనగర కాలంలోనూ వివిధ ప్రభుత్వాధి కారులకూ, వారికి సంబంధించిన విధులకూ, విధించిన పన్నులకూ, ఇంకా అనేక పాలనాంశాలకు సంబంధించిన పరిభాష తెలుగులోనే కనిపిస్తుంది. వాటిని శాసన భాషగానూ, ఫ్యూడల్ వ్యవస్థకు సంబంధించిన భాషగానూ వదిలేయాల్సిన పనిలేదు. వాటిని మన అవసరాలకు తగ్గట్టుగా తిరిగి వాడకం (రీసైక్లింగ్) చేసుకో వచ్చేమో ఆలోచించవలసి ఉంది. పాలనా మరియు న్యాయపాలనా వ్యవస్థల్లోకీ, తెలుగును తేవటానికి ప్రభుత్వం ముందు కొచ్చే నేటి కాలంలో అందుకు అవసరమైన పరిభాషని అందించటం

తక్షణ అవసరం. ముఖ్యంగా రాయల కాలం నాటి పరిభాషలో పరిమళించిన తెలుగు దనాన్ని పరిశీలిస్తే, నేటి అవసరాలకు కావలసిన పరిభాష ఎలా ఉండాలో అర్థం అవుతుంది.

సకలజనుల భాషలోనే పారిభాషిక పదాలుండాలనే అంతర్జాతీయ సూత్రం ప్రకారం పరిభాషను రూపొందించు కోవటం ఇప్పుడు జరగాలి. రూఢికెక్కిన పదాలను స్వీకరించాలని వేటూరి ప్రభాకరశాస్త్రి గారు చెప్పిన విషయాన్ని గుర్తు చేస్తున్నాను. పరభాషా ద్వేషం, భాషా దురభిమానాలతో 'పరిభాష' సృష్టించ కూడదు. అందరికీ అర్థం అయ్యే పరిభాష కావాలి.

వ్రాయసం అంటే లేఖనం (writing). కాకతీయుల తరువాత అది రాయసంగా మారి, రెడ్డిరాజుల కాలంలో 'రాయసం' అనే ఉద్యోగం ఏర్పడింది. ఈ రాయస ఉద్యోగులు ప్రభుత్వ వ్రాత పనులన్నీ (Documentation) చూసేవారు. ముఖ్యంగా ప్రభుత్వ ఉత్తర్వులను అందరికీ అర్థం అయ్యే భాషలో వ్రాయటం రాయసం గారి విధి. ఇతనికి చక్కని చేతి వ్రాతతో పాటు, ఎక్కువ భాషలు తెలిసి ఉండాలనీ, గంభీరమైన వ్యక్తిత్వం ఉండాలనీ 'సకల నీతి సమ్మతం'లో మడికి సింగన అంటాడు.

ఆనాటి ప్రతి పదాన్నీ, ప్రతి సాంస్కృతిక అంశాన్నీ పరిశీలిస్తేనే ఆ పరిణామ క్రమం మన కళ్ల కదుతుంది. సాహిత్యం, శాసనాలు, చరిత్ర ఆధారాలతో పాటు బుడతగీచులు(పోర్చుగీసులు), వళందులు (డచ్చి), పరాసులు (ఫ్రెంచి), ఇంగిలీజులు (బ్రిటిష్) వీళ్లందరి రికార్డుల సమ్మేళనంగా మధ్య యుగంలో తెలుగు పరిభాష ఏర్పడింది. అందుకని మధ్య యుగాన్ని "పరిభాషా యుగం" అని పిలవచ్చు. ఇప్పటి కోర్టు పరిభాష ప్రకారం దస్తావేజుల్లో గానీ, వీలునామాల్లో గానీ ఫలానా ఆ స్తిని "వ్రాయించి ఇస్తున్నాను" అంటున్నాం. కానీ, క్రీశ. 1556 నాటి ఒక శాసనంలో "కంపిలి మాంగాణి స్వామ్యానకు చెల్లివచ్చే వితలాపురం శ్రోత్రియం మడిస్థావరం మడి సహధార వోయించ్చి తామ్రశాసనం తీసియిచ్చిన వితలాపురం గ్రామం ఒకటిన్నీ..." అని ఉంది. వ్రాయించి ఇచ్చాడని అనటానికన్నా తీసి ఇచ్చాడనటంలో తెలుగుదనం బయటకొస్తుంది. ఇదీ "తెలుగు పరిభాషాయుగం"లో ఒక పరిణామం.

మొఘల్ చక్రవర్తుల ప్రభావం, ఇరుగు పొరుగు రాష్ట్రాల ప్రభావాలతో పాటు యూరోపియన్ల ప్రభావం కూడా ఈ యుగంలో గమనించవచ్చు. "కన్నుల పండువై/ కాకితమందలి వర్ణ పద్ధతులు" అనే శ్రీనాథ కవి వాక్కు(భీ. పు. అ1, ప. 74) ఇందుకు సాక్షి. "దస్త్రాలుం మసిబుర్రలున్ కలములుం/దార్కొన్న చింతంబళుల్" అనే చాటువులో మారిన కాలరీతి కనిపిస్తుంది. కాకితాల కట్టలు(దస్త్రాలు), మసిబుర్రలు, కలాలు శ్రీనాథుని

కాలానికే హస్తభూషణా లైనాయి. మసితో చేసిన సిరాలో తూలిక లేదా కూచిక (కలం)ముంచి వ్రాసేవారు.

**"వెసవ సుధా స్థలంబున కవీంద్రులు కొందరు శేముషీ మషీ**
**రసము మనః కటాహ కుహరంబుల నించి కలంచి జిహ్వికా**
**కిసలయ తూలికం గొని లిఖింతురు కబ్బము లెన్నగా మహా**
**వ్యసనముతో నిజానన వియత్తం తాళ పలాశ రేఖలన్"** వ్రాత గురించి చెప్పిన ఈ శ్రీనాథుని పద్యం సాంఘిక చరిత్ర నిర్మాణానికి చాలా ముఖ్యమైంది(ఆంధ్రుల సాంఘిక చరిత్ర, సురవరం ప్రతాపరెడ్డి). మొత్తం మీద వ్రాయటం అనే ప్రక్రియ కాకతీయుల అనంతరం సులువయ్యిందనేది స్పష్టం. కానీ, అందువలన దొంగ లెక్కలు రాయటం కూడా సులువయ్యిందట. కొరవి గోపరాజుగారు తన "సింహాసన ద్వాత్రింశిక"లో దొంగలెక్కల రాతగాళ్ల గురించి ఇలా చెప్తున్నారు.

**కం. "వహి వారణాసి యనగా**
**మహి బరగిన దిందు కపట మార్గంబు నా**
**గ్రహమున వ్రాసిన వానికి**
**నిహపరములు లేవు నరక మెదురై యుండున్"** దొంగ లెక్కలు రాసే వాడికి నరకం ఎదురయ్యే ఉంటుందట!

**కం. "ఒక దెస దెచ్చిన యాయం**
**బొక దిక్కున చెల్లు వ్రాసి యొక దెస వ్యయ మ**
**ట్లొక దిక్కున జన వ్రాసిన**
**బ్రకటంబుగ వాడు మిగుల పాపాత్ముడగున్"**

ఇలా ఆధునికంగా అక్కౌంట్లు వ్రాసే విధానాన్ని కావ్యబద్ధం చేసిన తొలి రచన ఇది. తాళపత్రం లోంచి, కాకితం వైపుకు సమాజం పరిణమించింది. కొత్తగా కనుగొన్న సాంకేతిక అంశాలను తెలుగువారు సద్వినియోగ పరచుకో గలిగారు కూడా! ఒక పక్కన ఆదాయాని ఇంకొక పక్క చెల్లు (వ్యయం)ని వ్రాసే పద్ధతినే ఆనాడూ అనుసరించారు.

**కం. "రాని పైడి చెల్లుట వ్రాయుట యాయంబు**
**తక్కువై వ్యయంబదెక్కుడౌట**
**లెక్క తుడుపు వడుట లిపి సందియంబౌట**
**చెల్లు మరచుటయును కల్లపనులు"**

సరిగ్గా నేటి కాలానికి నకలుగా ఉంది నాటి పరిస్థితి. కరణం నీతిమంతుడైతే మంచి ఉపకరణం అవుతాడంటాడీ కవి.

కాకతీయుల కాలంలో రాజ్యంలో 72 మంది ఉన్నతాధికారుల్ని నియోగించే అధికారం "బాహత్తర నియోగాధిపతి"కి ఉండేది. గణపతి దేవుడి కాలంలో కాయస్థ గంగయ సాహిణి, రుద్రమకాలంలో జన్నిగ దేవుడు, త్రిపురాంతక దేవుడు, పోకల మల్లియ ప్రెగ్గడ మొదలైన వాళ్ళు ఈ బాహత్తర నియోగాధిపతులుగా పనిచేశారు. రాయల కాలానికి ఈ పదవి తన సంస్కృత రూపం వదిలి తెలుగుదనాన్ని సంతరించుకొంది. "అంత్తరమన్నీ"లనేవారు ఏర్పడ్డారు. రాయవాచకంలో "తమ దొరల పాలిటి కర్తారు వల్లసున్న అంత్తర మన్నీలమై అరువై యేండ్ల బట్టిన్నీ..." అనే వాక్యాన్ని బట్టి, ఆంతరంగికులు, నమ్మకస్తులు, ప్రభు నిర్ణయాలను ప్రభావితం చేయగల వారికి ఉద్యోగస్థులను నియమించే ఉన్నత స్థాయి ఎంప్లాయిమెంటు ఆఫీసర్లను అంత్తర లేదా అంతరమన్నీలని పిలిచేవారని ఊహించవచ్చు.

రాయల కాలంలో కొత్త మార్పు ఇంకొకటి కనిపిస్తుంది. ప్రభువునే నియమించే అధికారాలు గల "అధిష్ఠాన కర్తలు" అనే అత్యున్నత స్థాయీ సంఘం ఇంకొకటి ఉండేది. "కృష్ణరాయలవారు తాము పెద్దల మైతిమి తమ మర్యాదగా రాజ్య పరిపాలనం జేసేటందుకు పట్టాభిషేకం అధిష్ఠానకర్తల్ శేయమని మంచి వేళ జూచి ముద్దుటుంగర మిచ్చినారు..." అని రాయవాచకంలో ఈ పదవి గురించిన ప్రస్తావన కనిపిస్తుంది. తన వారసుడిని ఎంపిక చేసి అతని పట్టాభిషేకం జరిపించ వలసిందిగా అధికారంఇస్తూ ముద్దుటుంగరం అంటే రాజముద్రిక ఇచ్చినట్టు ఈ వాక్యం వలన తెలుస్తోంది. రాజు తరువాత ఎవరు రాజ్యానికి రావాలో నిర్ణయించే అధిష్ఠానం ఉండేదనీ, మన రాజకీయ పార్టీల అధిష్ఠానాల కన్నా మెరుగైన అధిష్ఠానకర్తలు ఉండేవారనీ అర్థం చేసుకోవచ్చు. ఈ అధిష్ఠానకర్తల్లో (ఎలెక్టోరల్ కాలేజీ) మంత్రి, పురోహిత, సామంత, సైన్యాధికార, కవి పండితాదులు ఉండేవారేమో! ఒకప్పటి రోమన్ వ్యవస్థలోని కొల్లేజియంకు రాయల కాలంనాటి సంస్కరణ రూపం ఇది!

మహా మాండలిక, మాండలిక, మహా సామంతాది పదవుల స్థానంలో రుద్రమదేవి నాయంకరుల వ్యవస్థను ప్రవేశ పెట్టింది. తెలుగు పాలనా పరిభాష కోసం తాపత్రయ పడిన తొలి ప్రయత్నంగా దీన్ని భావించవచ్చు. ఇలాంటి ప్రయత్నాలు క్రమేణా ఊపందుకుని రాయల కాలానికి తెలుగు పాలనా భాష చాలా వరకూ స్థిరపడింది. తరువాత ఇదే భాషను నాయక రాజులు కొనసాగించారు. బ్రిటిష్ వారి కారణంగా ఈ పదజాలం అంతా నశించి పోయింది.

రాయల కాలానికి ఈ నాయంకరుల స్థానంలో పాలెగార్లు ఏర్పడ్డారు. పాలెగార్ల చేతుల్లో సైనిక వ్యవస్థ కేంద్రీకరించి ఉండేది. సైన్యం లేదా దండు నిలిచే స్థలాన్ని పాలెం అన్నారు. పాలెం అంటే ఒక ప్రత్యేకమైన కంటోన్మెంట్ ప్రాంతం.

సైనికాధికారులు రాజ్య సంరక్షణ బాధ్యతలు (Military) చూసే వారయితే, అంతరంగిక భద్రతని కాపాడుతూ, శాంతిని నడుపుకు పోయే సివిల్ లేదా పోలీసు వ్యవస్థ కూడా ఆ రోజుల్లో ఉండేది. వివిధ శాసనాలలో దండు, దళం అనే రెండుపదాలు విరివిగా కనిపిస్తాయి. దండుని మిలిటరీ, దళాన్ని పోలీసు వ్యవస్థలకు సంబంధించిన పదాలుగా భావిస్తే మిలిటరీ పోలీసు పరిభాషకు దండిగా పదాలు కనిపిస్తాయి. దండు, దండాధీశ్వరుడు, దండనాథుడు, దండనాయకుడు, దండాధికారి, దండాయి లేదా దణాయి(రక్షణ మంత్రి) అనేవి మిలిటరీ పదాలుగానూ, దళం, దళాధీశ్వరుడు, దళనాథుడు, దళనాయకుడు, దళాధికారి, దళవాయి(హోం మంత్రి) లాంటి పేర్లను పోలీసు వ్యవస్థకు సంబంధించినవి గానూ భావించాలి. ఈ పదాలను ఈనాటి అవసరాలకు వాడుకోవటంలో తప్పు లేదు. పైగా, అందరికీ తెలిసిన పదాలు కదా!

తీర్పులిచ్చే న్యాయమూర్తుల్ని కాకతీయుల కాలంలో ప్రాడ్వివాకులని పిలిచేవాళ్ళు. ఆ తరువాతి కాలాలలో తీర్పరి, తగవరి అని తెలుగులో పిలవటం కనిపిస్తుంది. “జంతఅనాంటి వీటి అంగడినాయని నగిశెట్టి కొడుకు తీర్పరి గంగిశెట్టి..” (క్రీ. శ. 1400, (11-6-878- శాసనం) లాంటి ఉదాహరణలు చాలా కనిపిస్తాయి.. క్రీ.శ. 1210 నాటి ఒక శాసనంలో న్యాయమూర్తిని తీర్పరి అన్నారు. జయరేఖ: (copy), తీర్పరి, తగవరి (judge), హజారం: కొలువు, కూటము, (a court), హజారముఖము: న్యాయమూర్తి ఉన్నతాసనం), ఆరదాసు: లిఖిత ఫిర్యాదు, ఇలాంటి అనేక కొత్త తెలుగు పేర్లు ఈ యుగంలో వాడకంలోకి వచ్చాయి. వీటిని గాలించి తిరిగి వాడుకోవటానికి చాకచక్యం కావాలి.

అలాగే, ఆర్థికపరమైన అంశాలలో ఎన్నో కొత్త పేర్లు కనిపిస్తాయి: మిశానా: జీవనభృతి, అడ్డలి: (deposit), తొలికట్టు: (advance payment), కాణాచి: (వంశపారంపర్య హక్కు), కైజీతం, చేజీతం: (daily allowance), బత్తా( రోజు కూలి- బేటా, భత్తెం (Dearness Allowance), నిబాతకట్నం: (fixed price, no bargain), సువర్ణాదాయం: రొఖ్ఖంగా చెల్లింపు ఇలా ఎన్నో పదాలు తెలుగు దనాన్ని కొత్తగా నింపుకున్నవి కనిపిస్తాయి.

రెడ్డిరాజుల నాటి శాసనాలలోనూ, రాయల కాలంలోనూ ఎన్నో తెలుగు పేర్లతో అనేక పన్నులు అమల్లోకి వచ్చాయి. అమ్మగడ సుంకం: సేల్సు టాక్స్, కందాయం: (వాణిజ్యపన్ను), కడ్దాయం: (పన్నుకట్టి తీరాలనే శాసనం) పడనాటిపన్ను (ఎగుమతి దిగుమతి సుంకం), పర్వత భోగం(కొండమీద కట్టెలు కొట్టుకునేందుకు విధించే పన్ను), బంటుబడి(బంటు పైన విధించే ఆదాయపు పన్ను), బోయ సుంకం (ప్రభుత్వ అడవుల్లో జీవించేవారు చెల్లించే పన్ను), మణిపైకం(wholesale Shop) పైన విధించే పన్ను, దీన్ని ఈనాటి VAT తరహా పన్నులకూ వర్తింపచేయవచ్చు), సిల్లఱ సుంకం (సుగంధ ద్రవ్యాల పైన విధించే పన్ను), స్థల భరితం(దేవాలయ స్థలంపై విధించే పన్ను), ఆటపన్ను (entertainment tax), మడి సుంకం(ఓడని సముద్రంలో నిలుపుకున్నందుకు చెల్లించే పన్ను), మాదారిట్కం(మేదరిపన్ను?) మాగ సుంకం(దానమివ్వబడ్డ గ్రామం గుండా సరుకు తీసుకు వెళ్ళినందుకు వ్యాపారులు ఆ గ్రామానికి చెల్లించే సుంకం) ముద్ర సుంకం: (అమ్మకానికి తెచ్చిన సరుకు మీద ముద్ర వేసినందుకు విధించే పన్ను) ముద్రాయం: ముద్ర వేసినందుకు వచ్చిన ఆదాయం, ఱేవు సుంకం: రేవుని దాటించినందుకు విధించే పన్ను), సుర సుంకం: మద్యంఅమ్మకాలపై పన్ను), ఎంటబడి-యేటబడి: (వార్షిక పన్ను) ఇంకా, అభినవాయం, కట్టిగ, మన్నన, రదెలు, సుండిద, సులగ, కొనటి, కొవిణం, తాకు, తొత్తు, పంజి సిద్ధాయం ఇలాంటి పన్నుల పేర్లు కూడా శాసనాలలో కనిపిస్తాయి. దొమ్మరులు ఆడిన ఆటని చూసి, మెచ్చి ప్రజలు రొఖ్ఖం రూపంలో ఇచ్చిన మొత్తాన్ని "దొంబరికాసు" అన్నారు. ఈ పన్నులన్నీ ప్రజలు ప్రభుత్వానికి చెల్లించినవే కాకపోవచ్చు. మేదరి పన్ను లాంటివి ప్రజల దగ్గర నుంచి వసూలు చేసి వృత్తిదారుల కందించే ఒక సంక్షేమ పథకం లాంటివి కూడా కావచ్చు. మనుషులందరూ ఏదో ఒక విధంగా ఇతరులపైనే ఆధారపడి జీవిక సాగిస్తున్నారు కాబట్టి, ఆ ఇతరులకు ప్రతి ఒక్కడూ కొంత పన్ను చెల్లించాల్సిందేననే విధానం ఆనాడుండేదని దీన్నిబట్టి అర్థం అవుతోంది.

విజయనగర కాలంలో అడపాధికారులు ఉండేవాళ్ళు. అడప అంటే వక్కలాకు సంచీ. అది పుచ్చుకొని ప్రభువుని అంటి పెట్టుకుని ఉండేవాడుగా ఈ అడపాధికారిని మన నిఘంటువులు వివరణ లిచ్చాయి. నిజానికి, వీళ్ళు ప్రభువుకు ఆంతరంగికులైన మేధావులే గానీ రాజుకు ఆకూ వక్కా అందించే పరిచారకులు కాదు. ఒక అతిథి వచ్చినప్పుడు, వాణిజ్య వేత్తలు, సామంత రాజులు, విదేశీయులు వచ్చినప్పుడు రాజుతో వారికి ఏకాంత సమావేశం ఏర్పరచి, ఇద్దరి మధ్య ఒప్పందం కుదిర్చే బాధ్యత ఈ

అడపాధికారిది! పెళ్ళిళ్ళు, అమ్మకాలు, అప్పులు, వ్యాపార విషయాలకు తాంబూలాలు ఇచ్చిపుచ్చుకున్నారంటే ఒప్పందం కుదిరిందని అర్థం. బహుశా మధ్యయుగాలలోనే ఈ అలవాటు మొదలయి ఉండవచ్చు. అడపాధికారికి మండలాధిపత్యాన్ని ఇచ్చేవారు. 1529కి ముందు రాయలు దగ్గర అడపంగా ఉన్న విశ్వనాథ నాయకుడికి మధుర నాయక రాజ్యాధిపత్యం ఇచ్చి గౌరవించిన సంగతి గుర్తుచేసుకోవాలి.

విజయనగర శాసనాలలో ఒప్పందాల పత్రం-దస్తావేజుని 'ఆకు' అని వ్యవహరించటం కనిపిస్తుంది. తమలపాకు లిచ్చుకొనే ఆచారానికీ దస్తావేజుని ఆకు అనటానికిగల సంబంధాన్ని గుర్తించాలి. ఆధునిక ప్రజాస్వామ్య వ్యవస్థలో రిసెప్షనిస్టు లేదా పౌర సంబంధాల అధికారి బాధ్యత ఇదే కదా! (A receptionist is a type of secretary who specializes in handling the flow of people through a business)" అని నిఘంటువులు రిసెప్షనిస్టును నిర్వచిస్తున్నాయి. అడపం = వరిసెప్షన్, అడపాధికారి = రిసెప్షనిష్ట్. ఇలా పాత పదాల్ని కొత్తగా అన్వయించుకొంటే, ప్రత్యామ్నాయ పరిభాష నిర్మాణం తేలిక అవుతుంది.

శాసనాల్లోంచి, ప్రాచీన కావ్యాల్లోంచి ఆధారాలు వెదికి అధ్యయనం చేయించాలి. కొత్త పరిభాషా పదాలను సూచించటానికి ప్రజల్ని భాగస్వాములు చేయాలి. ఎంపిక చేసిన పదాలను ఇంటర్నెట్లో ఉంచితేనే విస్తృత చర్చకు అవకాశం ఉంటుంది. ప్రజలు మాట్లాడుకునే ప్రతి పదాన్నీ, దానికి ఇంగ్లీషు సమానార్థకాన్నీ ఇస్తూ, ఎప్పటికప్పుడు పెంపు చేస్తూ ఒక మహా నిఘంటు నిర్మాణం జరిగితేనే తెలుగు పరిభాష తయారౌతుంది.

అనేక భాషలు మాట్లాడే ప్రజలున్న దేశాలలో పరిభాషా సంఘాలు(Terminology Commissions) పని చేస్తున్నాయి. పౌరపాలన, న్యాయపాలనా రంగాలను స్థానిక భాషలో నిర్వహించటం ప్రజల ప్రాథమిక హక్కుగా ఇప్పుడు చాలా దేశాలు భావిస్తున్నాయి. సాధికారికమైన తెలుగు పరిభాషా సంఘాన్ని నియమించటం వలన సాంకేతిక అవసరాలు కూడా నెరవేరుతాయి. ఇలాంటి బాధ్యతలను విశ్వవిద్యాలయాలకు అప్పగించటం కన్నా ప్రభుత్వ సాంకేతిక శాఖకు గానీ, కొత్తగా నెలకొల్పాలని సంకల్పిస్తున్న తెలుగు శాఖకు గానీ అప్పగించటం మంచిది!



# క్షేత్రయ్యగారి పర్యావరణ కవిత

ప : లలనామణిరో ఈ భావము తెలుపవే లలితముగానిపుడు

అ.ప. వెలదిరో మా మువ్వ గోపాలుని దయచేత వేడుకగా దెలుపవే ఓ బాల!

చ : అలివేణి నీ దేశమేమంటేను అపుడు చెట్టు చూపెను
చెలి నీ యూరి పేరేమని యడిగితే చెట్లు రెండు చూపెను
చిలుకల కొలికి నీ చెలుల పేరేమంటేను చెట్లు రెండు చూపెను
పలుమారు నీ జాతి పేరేమని యడిగితే వదరి చెట్టే చూపెనే ఓ బాల :లలనా:

చ. నక్షత్ర నఖ నీకు హితమేమని అడిగితే పక్షి హితవని అనెను
లక్షణపతి నీదు చెక్కిట నేమంటె పక్షి యున్నదనెను
వక్షస్థలాన ఉన్నది యేమంటే పక్షి యున్నదనెను
సూక్ష్మముగ నీ పేరేమని యడిగితే పక్షి పేరే చెప్పెనే ఓ బాల... :లలనా:

చ. వారిజానన నీకు యెన్నేండ్లాయెనంటే ఊరి పేనే చూపెను
చేరి నీ తోడబుట్టువు లెవరంటే ఊరి పేనే చెప్పెను
తీరుగా మెరసెడు మేలుంగర మేమంటే ఊరి పేరే చూపెను
ఓ రమణి నీ మోముందున్నది యేమంటే ఊరిపేరే చెప్పెనే ఓ బాల..." :లలనా:

ఇది మహాకవి క్షేత్రయ్య పదాలలో దొరికిన ఒక అపురూప పర్యావరణ కవిత. ఈ పాటలో దాగిన రహస్యం గురించి పెద్దగా చర్చ జరగలేదు. ఇదంతా పొడుపుకథ పద్ధతిలో సంకేతాత్మకంగా సాగుతుంది.

క్షేత్రయ్యను బూతు కవితలు వ్రాశాడని ఆయన స్వంత ఊరు కృష్ణాజిల్లా మొవ్వ నుండి గ్రామస్థులంతా వెళ్ళగొట్టారని చాలామంది వ్రాశారు. కానీ, క్షేత్రయ్యకి జన్మభూమంటే ఎంత ప్రేమో ఈ పాట చాటిచెప్తుంది. క్షేత్రయ్య సృష్టించిన మువ్వగోపాలుడి నాయిక 'రతిమతి' కాదు, 'ప్రకృతికాంత' అని చెప్తోందీ పాట.

తన దేశం చెట్టు, తన ఊరు చెట్టు, తన ఊపిరి చెట్టు, తన మనుషులు చెట్టు, అసలు తన జాతే చెట్టు అని గర్వంగా చెప్పుకుంటోంది ఆ మువ్వగోపాలుడి నాయిక... తన ఇష్టం, తన కష్టం, తన మనసు అన్నీ ఆ పక్షిలాంటి వంటోంది. తన ఊరు తనలా యవ్వనంతో కళకళలాడుతుందనీ, తన ఊళ్ళో అంతా అక్కచెల్లెళ్ళలా కలిసి మెలిసి ఉంటారని, తన ఊరు తన మోమంత అందమైందనీ, మెరిసే మేలుంగరం లాంటిదనీ చెప్పుకుంటోంది. ఇంతకన్నా పర్యావరణ కవిత ఇంకోటి ఉంటుందా...?

ఆరుద్రగారు "మువ్వ" శబ్దం 'మొవ్వ' ఎలా అయ్యిందీ అని ప్రశ్నిస్తూ, క్షేత్రయ్య పుట్టిన ప్రాంతంమీద అనేక సందేహాలు వెలిబుచ్చారు. క్షేత్రయ్య చెంజి లేదా జింజి ప్రాంతానికి చెందినవాడు కావచ్చని, కృష్ణాజిల్లావాడు కాకపోవచ్చనీ వ్రాశాడు. ఎక్కడ పుట్టినా ఈ తెలుగుబిడ్డ తెలుగునేల నాలుగు చెరగులా విఖ్యాతిని పొందాడు.

అన్నమయ్య పదాలు భక్తి ప్రధానంగా సాగితే, క్షేత్రయ్య పదాలు మధుర భక్తి ప్రధానంగా సాగాయి. భగవంతుడు ఒక్కడే పురుషుడు. మిగతా వాళ్ళంతా స్త్రీలే. భక్తుడు ఇలా స్త్రీ భావనతో, ప్రేయసి భావనతో భగవంతుణ్ని ఆరాధించడమే మధురభక్తి! జీవాత్మ, పరమాత్మలో విలీనమయ్యే భావనా సాహిత్యమే ఈ మధురభక్తిలో ఉంటుంది.

మీరాబాయి కృష్ణుడి ప్రియురాలిగా తనను తాను భావించుకొని వ్రాసినట్టే క్షేత్రయ్య కూడా తననే నాయికగా చేసుకుని ఆ పరమాత్ముడితో సంయోగాన్ని వర్ణించుకున్నాడు.
"ఏమిర వరదా! నీ మోము చిన్నబోయినది-నా మనసు నీ మనసు ప్రేమనిండి యుండగ"
"నీవే వచ్చితివి-నేను వచ్చినట్లు-భావముఁ దెలిసి మువ్వగోపాల! నేడు మాయింటికి"
లాంటి పదాలు ఈ అభిప్రాయానికి చక్కని సాక్ష్యాలు.

తిరుపతి, కడప, శ్రీశైలం, కంచి శ్రీరంగం, మధుర, తిరువళ్ళూరు, పాలగిరి, చెన్నకేశవుడు, ఇనగలూరు, ఇనపురిస్వామి, గుంటూరుజిల్లా బెల్లంకొండలో చలుపు చక్కరపురీశుడు, శ్రీశైలం మల్లికార్జునుడు, హంపి హేమాద్రి నిలయుడు, కడప వెంకటేశ్వరస్వామి ఇందరినీ దర్శించి వాళ్ళపై పదాలు వ్రాశాడు.

భద్రాచలం రామదాసుగా ప్రసిద్ధుడైన కంచెర్ల గోపన్న క్షేత్రయ్యను భద్రాచలానికి స్వాగతించి సత్కరించి పంపాడు.

"కంచివరదా!" అంటూ మువ్వగోపాలునితోపాటు వరదరాజస్వామిని "చెల్లబో! పాలగిరి చెన్నుడే వీఁడుకొమ్మా?" అని పాలగిరి చెన్నుణ్ణీ, తిల్ల గోవిందస్వామి అంటూ, చిదంబరం గోవిందస్వామిని, ఇంకా చాలామంది దేవుళ్లని నాయకుడిగా భావించి పదాలు వ్రాశాడు.

వివిధ రాజుల దగ్గరకు వెళ్ళినప్పుడు "భామరో! తిరువళ్ళూరి వీరరాఘువ!" ఇలా ఆ రాజుల రూపంలో పరమాత్మని ఊహించి పదాలు వ్రాశాడు. రాజులు ఆయన్ని తమ సంస్థానాలకు ఆహ్వానించి సత్కారాలు చేయటానికి ఇది కూడా ఒక కారణం కావచ్చు.

క్షేత్రయ్య పదాల్ని కేవల శృంగార పదాలుగా భావించటం వలన వాటిలో ప్రతీ పదానికీ సహజంగానే నీచ శృంగారమే కనిపిస్తుంది. అది జుగుప్సని కలిగిస్తుంది కూడా! అందుకని జనసామాన్యం నేరుగా ఈ పదాలను చదివి ఆస్వాదించడం తక్కువ. నృత్య కళాకారులే క్షేత్రయ్యను బ్రతికించుకుంటూ వచ్చారు.

అన్నమయ్య కూడా శృంగార పదాలు వ్రాశారు. అలివేలుమంగ, శ్రీ వేంకటేశ్వరునికి సంబంధించిన వియోగ సంయోగ శృంగారాలే! అయినా క్షేత్రయ్య పైన వచ్చినంత చెడ్డ విమర్శ అన్నమయ్యపై రాలేదని కొందరంటారు. 1950లలో వేటూరి ప్రభాకరశాస్త్రి అన్నమయ్య రచనల్ని వెలుగులోకి తెచ్చేవరకూ 400 యేళ్ళపాటు ఆయన గురించి ఎవరికీ తెలీదు. అన్నమయ్య శృంగార పదాలమీద పెద్ద విమర్శ రాకపోవటానికి ఇదొక కారణం.

క్షేత్రయ్య అసలు పేరు వరదయ్య (1595-1660). ఇంటిపేరు మొవ్వ అంటారు. క్షేత్రం అంటే ఒక ప్రదేశం. వివిధ ప్రదేశాలు తిరిగాడు కాబట్టి క్షేత్రయ్య అయ్యాడని కొందరు, క్షేత్రం అంటే ఆత్మ కాబట్టి ఆత్మజ్ఞాన సిద్ధుడిగా క్షేత్రయ్య అనే పేరు వచ్చిందని మరికొందరు భావిస్తున్నారు.

శ్రీపాద పినాకపాణిగారు నాట్యోపయోగకరమైన క్షేత్రయ్య పదాలకు స్వరాలు కట్టి, సంగీతానికి పనికివచ్చేవిధంగా వ్రాశారు. ఇప్పుడు సంగీత కచ్చేరీల్లో కూడా క్షేత్రయ్య పదాలు వినిపిస్తున్నాయి.

తంజావూరు విజయరాఘవ నాయకుడు తననుతాను రాసలీలా కృష్ణుడిగా ఊహించుకుని తన వెయ్యిమంది రాణుల్నీ ఒకేసారి రప్పించి వాళ్ళతో కృష్ణుడిలానే రాసలీలలు నిర్వహించాడని రంగాజమ్మ వ్రాసింది.

అలా చెల్లుబాటు సాగిన ప్రభువులు అలా ప్రవర్తించిన కాలంలో క్షేత్రయ్య జీవించాడు. క్షేత్రయ్య కవిత్వాన్ని కూడా ఆ గాటనే కట్టారు పండితులు. క్షేత్రయ్య మధురభక్తి శృంగార పరమైన పదాల పరంపరలో దొరికిన వాటిలో ఈ పర్యావరణ కవిత ఉండటమే గొప్ప విషయం.

"నీదేశం ఏదంటే" చెట్టు చూపించిందది. వూరి పేరడిగితే రెండు చెట్లు చూపించింది. నీ స్నేహితురాళ్లు ఎవరంటే రెండు చెట్లు చూపించింది. నీ జాతి ఏమిటని ఎన్నిసార్లడిగినా చెట్టే చూపించింది.

నీకు ఇష్టమైనదేమిటంటే, 'పక్షి' అన్నది. నీ చెక్కిలి మీద వున్నదేమిటంటే పక్షి అన్నది. వక్షస్థలాన వున్నదేమంటే పక్షి వున్నదని చెప్పింది. సూక్ష్మంగా నీ పేరేమిటంటే పక్షి పేరే చెప్పింది.

నీకు ఎన్నేళ్లంటే  ఊరివైపు చూపించింది. నీ తోడ పుట్టిన వారెవరంటే ఊరి పేరు చెప్పింది., తీరుగా మెరిసే ఆ మేలుంగరం ఏమంటే ఊరిపేరే చెప్పింది.

ఇలా  సాగుతుంది ఈ కవిత.

మౌలికంగా ఇది ప్రకృతిని ప్రస్తుతించిన పర్యావరణ కవిత. ప్రకృతిని పరమాత్మగా భావించాడు క్షేత్రయ్య. ఆయన వక్షస్థలాన వున్న లక్ష్మీదేవిని కూడా ప్రకృతి సంపదగానే భావించాడు క్షేత్రయ్య.

క్షేత్రయ్యని "చూడవలసిన కళ్లు" వేరే అని అన్పిస్తుంది ఈ కవిత చదివితే!



# ఆంధ్రదీపిక ప్రశస్తి

**"నేను మామిడి వంశాంబునిధి విధుండ**
**సూరనాహ్వాయు పౌత్రుండ సుజనహితుడ**
**వేంకనార్యుని పుత్రుండ వినుత యశుండ**
**వేంకటార్యసమాఖ్యచే వెలయువాడ"**

'పండితరాయ', 'బాలామర', 'సాహిత్య చక్రవర్తి' బిరుదాలు పొందిన మామిడి వెంకటార్య పండితులు యావద్భారత దేశంలోనే తొలి ఆధునిక అకారాది నిఘంటువులకు ఆది పలికాడు. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో పండితుడు. ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వంలో అనువాదకుడు. తండ్రి మామిడి వెంకన్న. తాత సూరన్న

ఆయన స్వయంగా నూతనత్వం అమరేలాగా నవ్యాంధ్రత్వం నిండేలాగా 'ఆంధ్రదీపిక' అనే నిఘంటువును కూర్చి ప్రచురించాడు. "ఆంధ్ర శబ్దజాలసంకేతరచనా చాతురీధురీణంబగు నీ యాంధ్రదీపికానామక గ్రంథంబు సేయ సమకట్టితి. సంకేతం బెట్టిదనిన సకల శబ్దంబులు నాద్యక్షర క్రమంబు చేత కూర్చబడుచున్నవి" అని ఆయనే స్వయంగా ఒక వివరణ ఇచ్చారు.

ఆద్యక్షరాలు వరుస క్రమంలో ఉండేలా కూర్చటం ఏ సాంకేతిక ఉపకరణాలూ లేని ఆ కాలంలో, నేటికి రెండువందల ఏళ్ళక్రితం, దేశంలోనే తొలిసారిగా మామిడి వెంకయ్యగారు ఒంటిచేత్తో కష్టించి సాధించి సత్తా చాటుకున్నారు.

అచ్చు యంత్రాలు వ్యాప్తిలోకి రానున్నాయనీ, పుస్తక ప్రచురణ రంగం ఒక కొత్త విప్లవాన్ని సృష్టించ నుందనీ, సాంకేతికాభివృద్ధి కనుచూపు మేరలో ఉందని గ్రహించి, అందుకు తగ్గట్టుగా తెలుగు నిఘంటువు నొకదాన్ని అత్యాధునిక పోకడలతో కూర్చాలనే ముందు చూపుతో కూడిన ఆలోచన 1816 లోనే ఒక తెలుగువాడికి వచ్చిందంటే, అది అద్భుతమైన విషయమే!

***

"కోశవాన్ ఆచార్యః" అన్నారు. కోశాన్ని అంటే నిఘంటువుల్ని నమిలి మింగినవాడు, పుక్కిలిపట్టిన వాడు, దాన్ని జీర్ణించుకున్నవాడూ మాత్రమే ఆచార్యుడని ఒక వ్యవహారం ఉండేది.

భాష మీద పట్టున్నవాడికి శాస్త్రాలు దాస్యం చేస్తాయి. భాష అనే ఒక జ్యోతి లేకపోతే ఈ లోకం అంధకారమయమే అవుతుంది. ఈ విషయాన్ని అందరికన్నా ముందు గ్రహించ గలిగింది నిఘంటు కర్తలే!

నితరాం = నిజంగా, ఘ్నయతి = చెప్పేది నిఘంటువు. నిజంగా చెప్పేది, నిజం చెప్పేది, సూటిగా చెప్పేది, విడమరచి చెప్పేది, అర్థజ్ఞానాన్ని కలిగించేది, గౌరవంగా చదివేది, గౌరవనీయ వేదాలు, ఉపనిషత్తులు తదితర సాహిత్యాదుల నుండి శబ్దాలు ఏర్చి కూర్చినదీ నిఘంటువు అని స్థూలంగా ఒక నిర్వచనం చెప్పుకోవచ్చు.

'ఘటి'అంటే, భాష! దీన్నిబట్టి కూడా శబ్ద స్వరూప స్వభావాల్ని తెలియ జెప్పేది నిఘంటువని భావార్థం! వైదిక భాషకు సంబంధించిన నిఘంటువుల్ని నిరుక్తం అంటారు. పాణిని కారణంగా లౌకిక సంస్కృతం ప్రాచుర్యం లోకొచ్చింది. తరువాతి కాలాలలో వెలువడిన శబ్దకోశాలు, వ్యాకరణాలు, నిఘంటువులూ వీటన్నింటికీ పాణినీయం, నిరుక్తాదులు ఆధారాలై నిలిచాయి.

సమాజం ఎదిగే కొద్దీ, భాషల్లో శబ్ద సంపద పెరుగుతుంది. సమాజ అవసరాలు పెరిగే కొద్దీ కొత్త పదాల పుట్టుక అనివార్యం అవుతుంది. కొత్త పరికరాలు, పనిముట్లు, వివిధ సామాజిక కార్యకలాపాలు వాడకంలోకి వచ్చేకొద్దీ భాషలో నుడులు కొత్తగా ఏర్పడతాయి. వాటిలో కొన్ని తద్భవాలు, కొన్ని తత్సమాలు కూడా ఉండవచ్చు. అందువలన పాత నిఘంటువుల్ని ఎప్పటి కప్పుడు పెంపు చేసుకోవటం, కొత్తవి తయారు చేసుకోవటం,

అంతకు మునుపు వదిలివేయబడ్డ పదాలను కలుపు కోవటం... ఈ కృషి నిరంతరంగా జరగవలసి ఉంటుంది. నిఘంటు నిర్మాతలకు ఇదంతా పెనుసవాలే!

ప్రచురణరంగం లేని ఆ కాలంలో తర్క వ్యాకరణ శబ్దాది విషయాలకు ప్రాచుర్యం కలగటానికి ఆ నాటి కవులు పద్యాల్లోనో లేక శ్లోకాల్లోనో వ్రాసేవారు. అందువలన భట్టీయం వేసి జ్ఞాపకం పెట్టుకోవటానికి ధారణా సౌలభ్యం సమకూరింది.

17వ శతాబ్ది నాయకరాజుల కాలం నాటి గణపవరపు వేంకటకవి తనకాలానికి 24 రకాల సంస్కృత నిఘంటువులు వాడుకలో ఉన్నట్టు చెప్పాడు. నిజానికి 1225 లోనే డిక్షనరీ అనే మాట వాడకంలోకి వచ్చింది. డిక్షనరీ అంటే 'గుర్తుంచుకో వలసినది' ని అర్థం. అమరకోశం లాగా ధారణ చేయటానికి వీలుగా ఆనాటి లాటిన్ నిఘంటువులు ఉండేవి. ఆంధ్రనిఘంటువులు పద్యాన్ని లేదా శ్లోకాన్ని ఆశ్రయించి పదకోశాలను నిర్మించారు.

చౌడప్ప నిఘంటువు (చౌడప్పసీసాలు) లో ఈ చిన్ని ఉదాహరణ పరిశీలించండి:

"విరియనా పువ్వు/సీవిరియనా కల్లు/ వావిరియనా చెట్టు/కావిరియు-పొగయు/ (విరి అంటే పువ్వు. సీవిరి అంటే కల్లు. వావిరి అంటే చెట్టు. కావిరి అంటే పొగ)

పరియనా డాలు/ రూపరి యనా సొగసు/మేపరియనా తిండి/తేపరన తెగువ..." (పరి అంటే డాలు, రూపరి అంటే సొగసు. మేపరి అంటే తిండి. తేపరి అంటే తెగువ)

ఇది తొలినాటి నిఘంటు స్వరూపం. జ్ఞాపకం పెట్టుకునేందుకు వీలుగా చేసిన ఒక ప్రయత్నం. ఇలాగే, అచ్చ తెలుగు కోశంలో నానార్థవర్గం అధ్యాయంలో ఒక సీసపద్యం ఇలా సాగుతుంది:

గౌరన నేనుగు, కాహళి విలసిల్లు: గౌరు అనే పదానికి ఏనుగు, కాహళి(బాకా) అని అర్థాలు

దంబు నాగను గాంతి దంబము నగు: దంబు అంటే కాంతి, దంబం(ఆడంబరం) అని అర్థాలు.

అచ్చుయంత్రాల వ్యాప్తి పెరిగాక పరిస్థితి మారింది. ఇవ్వాళ, 2×2=4అని చెప్పటానికి కాలిక్యులేటర్ ఉపయోగిస్తూ, బుర్ర ఉపయోగించటం మానేసినట్టే, శబ్దాలను ధారణ

చేయటం కూడా మానేసి పుస్తకం తెరిచి చూడటం అలవాటయ్యింది. లేకపోతే ఇంటర్నెట్ తెరిచి హనుమంతుడు సీతను వెదికినట్టు వెదకటంలా వెదకులాటకు అలవాటు పడిపోతున్నాం. యస్య జ్ఞానగుణదయాసింధో అని, అమరకోశం చెప్పటం మొదలుపెడితే "గోడ దూకితే అదే సందో..." అని మనుషులు తప్పించుకుంటారనే వ్యంగ్యోక్తి ఇందుకే పుట్టింది!

ఆ రోజుల్లో ధారణా పటిమ అనేది సామాన్యుడి సొత్తు. ధారణ వలన మెదడు శక్తిమంతం అవుతుంది. ఈ రోజున అది అత్యంత స్వల్ప సంఖ్యలో ఉన్న మేథావులకు పరిమితం అయ్యింది. మొన్న మొన్నటి దాకా వ్రేలికొనల మీద వందలకొద్దీ టెలిఫోను నెంబర్లు గుర్తు పెట్టుకునే వాళ్ళం. ఇప్పుడు మన ఇంటికే ఫోను చెయ్యాలంటే నెంబరు కొట్టకుండా కాంటాక్ట్సులోకి వెళ్తున్నాం. కాలక్రమంలో ధారణ చేయటాన్ని మనిషి మానుకుంటే మెదడు జ్ఞాపకం పెట్టుకునే శక్తిని క్రమేపీ కోల్పోయే ప్రమాదం ఉంది. ఆధునిక సాంకేతికతని దుర్వినియోగం చేస్తున్నామని దీని భావం.

ఆంధ్ర దీపిక అనేక కొత్త పదరూపాలను ఆవిష్కరించింది. వాటిని చదివి గుర్తు పెట్టుకోగలిగితేనే భాషపైన పట్టుదొరుకుతుంది ఇతర నిఘంటువుల గురించి అలా ఉంచితే, ప్రతి రోజూ రెండూ లేక మూడు పేజీలు ఆంధ్రదీపికని క్రమంతప్పకుండా చదివితే నలబై వేల తెలుగు పదాల పైన సాధికారికత దక్కుతుంది. పైగా మెదడు పదునెక్కుతుంది.

***

ఇతరులకన్నా భిన్నంగా చెప్పాలనే తపన ప్రతి రచయితకూ సహజంగా ఉంటుంది. ఎక్కువ సంస్కృత భూయిష్టంగా రాయాలని ఒకరు చూస్తే, ఒక్క సంస్కృత పదం కూడా లేకుండా రాయాలని మరొకరు ప్రయత్నించటం సహజం. పాల్కురికి సోమనాథుడి బసవపురాణం దేశీయమైన భావాలకూ, పదాలకూ అద్దంపట్టిన తొలి ప్రజాసాహిత్యంగా చెప్పవలసిన రచన.

సోమనాథుడి తరువాత ఇలాంటి రచనలు ఒక ఉద్యమంగా వచ్చి ఉండాల్సింది. కానీ, అచ్చమైన తెలుగు పదాలతో సాహిత్య సృష్టి చేస్తే రస భావాదులు పుష్టిగా ఉండవనే భయంతో కవులు ఆ ప్రయత్నాలను విరమించుకుని నలుగురు నడిచే సంస్కృతం బాటే పట్టారు. అందువలన తెలుగు నిఘంటువుల రాక బాగా ఆలస్యం అయ్యింది. కారణం

ఏదైనా కానీండి, దేశీయమైన రచనలు ఎక్కువగా కాలగర్భంలో కలిసిపోయాయి. కానీ, నన్నెచోడుడి కుమారసంభవం లాంటివి కొన్ని రచనలు కాలగర్భంలోంచి బయటకొచ్చి కావ్యగౌరవాలను దక్కించుకున్నాయి. అన్నమయ ఎన్నేళ్ళ అజ్ఞాతవాసం తరువాత వేటూరివారి పుణ్యమా అని వెలుగు చూడగలిగాడూ...? అలాగే, ఇంకా మరికొన్ని కొత్త దేశీయ రచనలు ముందు కాలంలో వెలుగులోకొస్తాయని ఆశిద్దాం.

నిఘంటు నిర్మాణంలో ప్రముఖులైన కొందరు కవులు కావ్యాలలో వాడిన పదాలకు ప్రాధాన్యత దక్కింది. కానీ, దేశీయతని తమ రచనలలో ప్రతిబింబించిన కవుల రచనలలోని అచ్చమైన తెలుగు పదాలు, ఒకనాటి ప్రజల నాల్కల మీద నానిన పదాలు కనుమరుగై పోసాగాయి. చీపురు రోకలి లాంటి వాడుక పదాలను నిఘంటుకర్తలు విస్మరించటాన్ని గిడుగువారు సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శనంలో తీవ్రంగా దుయ్యబట్టారు. ఇవన్నీ నిఘంటుకర్తల దృష్టి లోపాలే! తెలుగు శబ్దాలన్నింటినీ ఎలాంటి వివక్షా లేకుండా నిఘంటువుల్లోకి చేర్చాలనేది ఒక ఆశయంగా నిఘంటు నిర్మాణం జరగాలి.

బ్రౌన్ నిఘంటువు(1852) నాటికే గోడౌన్, కాంపౌండ్, బేరర్, మస్తర్, లాంటి విదేశీ పదాలు జన వ్యవహారాని కొచ్చేశాయి. జమీందార్, రైతు, లోటా, ఆయా లాంటి హిందీ పదాలు కూడా తెలుగు పదాలు గానే చెలామణి కొచ్చాయి. అలాంటి చాలా వాటిని ఆంధ్రదీపికలో చేర్చేందుకు ప్రయత్నించారు మామిడి వెంకయ్యగారు.

ఆంధ్రదీపికలో లోట- శబ్దానికి 'లోటవ చిన్న పాత్రము' అని అర్థం ఇచ్చారు. బ్రౌన్ ఈ అర్థాన్ని మరింత విస్తృత పరిచి, lota = ఒక కంచు పాత్రకు భారతీయ నామం అనీ, చెంబు అనీ రెండు అర్థాల్ని అందించాడు. ఆంధ్రదీపికను ఆధారంగా తీసుకుని బ్రౌన్ దొర తన తెలుగు ఇంగ్లీషు, ఇంగ్లీషూ తెలుగు, మిశ్రమ నిఘంటులు ఈ నిఘంటు త్రయాన్ని మెరుగు పర్చుకున్నాడనేది నిర్వివాద విషయం.

మహమ్మదీయ బాలలకు జరిపించే 'సున్తీ'ని ఆంధ్రదీపికలో 'సున్నతి' అనే హిందీ శబ్దం అనీ, ఉపనయన సమయంలో శిశ్నము కొనతోలుని ఛేదించటం అనీ, మహమ్మదీయుల, యెహోదీల ఆచార విశేషం అని విపులీకరణ కనిపిస్తుంది. బ్రౌన్ "circumcission: సున్నతి" అని అర్థం ఇచ్చాడు. బ్రౌన్ తరువాత వందేళ్ళకు వచ్చిన సూర్యారాయంధ్ర నిఘంటువులో సుంతీ గానీ సున్నతిగానీ కనిపించదు. ఎందుకు

కనిపించదూ? పదాలను రద్దు చేసేందుకో, నిషేధించేందుకో, దాచి వేసేందుకో నిఘంటు కర్తలు ప్రయత్నించ కూడదని ఆంధ్రదీపిక, బ్రౌన్ నిఘంటువులు హెచ్చరిస్తున్నాయి.

విద్యుఛ్ఛక్తి ఇంకా వినియోగంలోకి రాని ఆ కాలంలో ఎలెక్ట్రిక్ శబ్దానికి బ్రౌన్ ఇచ్చిన అర్థాలు చూడండి: "ఆశ్చర్యకరమైన అద్భుతమైన, ఆకర్షణాపకర్షణ శక్తిగల, మహనీయమైన, అంతర్గతాగ్ని సంబంధమైన, మెరుపు, పిడుగుతోకూడా పడే అగ్ని, చకుముకి రాతిలోని నిప్పులాగా తట్టితే పడేటిది.." ఇన్ని అర్థాలిచ్చాడు. ఇప్పుడు మనం విద్యుఛ్ఛక్తి అంటున్న కరెంటు గురించి వాళ్ళకు ఆనాటికి ఏమాత్రం తెలియని రోజులవి. ఆంధ్రదీపికలో విద్యుత్తు శబ్దానికి మెరపు, సంధ్య మెరుగు లేనిది అనే అర్థాలు కనిపిస్తాయి, ఆంధ్రదీపిక రచన జరిగిన ముప్పయేళ్ళ తరువాత బ్రౌన్ నిఘంటువు కూర్పు జరిగింది. కాబట్టే సాంకేతికంగా మరింత సమాచారాన్ని బ్రౌన్ ఇవ్వగలిగాడని అర్థం అవుతోంది. ఆంధ్రదీపిక 1816లో వెలువడగా బ్రౌన్ నిఘంటు త్రయం 1852, 1853, 1854 సంవత్సరాలలో వరుసగా వచ్చాయి.

Grammar and vocabulary of the Gentoo Language గ్రంథానికి ముందు మాటలు వ్రాస్తూ, బ్రౌన్ దొరగారు మామిడి వెంకయ్య గారిని ఇలా ప్రస్తుతిస్తాడు: "The assistance of this man in the compilation of both grammar and vocabulary has been of the greatest advantage" అని! బ్రౌన్ పైన మామిడి వారి ప్రభావం ఘనంగానే ఉందని ఒప్పుకోవాలి.

ఆంధ్ర శబ్ద చింతామణి (1860) బ్రౌన్ నిఘంటువువెలువడిన వెంటనే విడుదలైన నిఘంటు గ్రంథం- తిరునగరి రామానుజయ్య కూర్పు ఇది. 14090 సంఖ్య కలిగి బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీలో దీని ప్రతి దొరుకుతోంది. ఆంధ్ర శబ్ద చింతామణి పేరుతో సరస్వతి తిరువేంగడాచార్యులు, వి రాజకృష్ణమాచార్యులు 1865లో ఇంకో నిఘంటువు రూపొందించారు. అక్కడ పదిలంగా ఉన్న నిఘంటువుల్లో ఈ క్రింది అపురూపమైన గ్రంథాలున్నాయి.

ఆంధ్రనామ సంగ్రహం (లక్ష్మణుడు పి.ఇ.),

ఆంధ్రనామశేషము (సూరయ్య, ఎ.బి),

ఆంధ్ర నిఘంటు చతుష్కము (శ్రీనివాస జగన్నాథ స్వామి),

ఆంధ్రపదకరము (వీరప్పరాజు?),

ఆంధ్రపదపారిజాతము (జగన్నాథుడు)

ఆంధ్ర శబ్దతత్త్వము (శేషగిరిశాస్త్రి)

కవిశిరోభూషణం (అహోబల పండితీయం)

1898లో తెలుగు పండితుల తొలి కాంగ్రెస్ (సదస్సు) నివేదిక ఒకటి ఈ కేటలాగులో కనిపిస్తోంది. దీన్ని రామకృష్ణమాచార్యులు రూపొందించినట్టు కేటలాగులో ఉంది. ఇది చదివితే తెలుగు నిఘంటు నిర్మాణంలో తొలినాటి పరిణామాల గురించి అవగాహన కలుగుతుంది. బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీలో ఆంధ్రదీపిక ఉంది కానీ అది రంగనాయకులు శ్రేష్టిగారి పేరుతో ఉంది. వెంకయ్యగారి 'ఆంధ్రదీపిక' కూ దీనికీ తేడా ఉన్నదేమో పరిశీలించవలసి ఉంది.

రంగనాయకులు శ్రేష్టి మామిడి వెంకయ్య గారి తరువాతి కాలం వాడు. ఆయన స్వేచ్ఛగా వెంకయ్య గారి ఆంధ్రదీపికని తన పేరుతో వేసుకున్నాడా? లేక వెంకయ్య గారే అంగీకరించి ఇచ్చేశారా? లేక రెండూ వేర్వేరు నిఘంటువులా అనేది స్పష్టం కాలేదు.

***

ఆనాటి బ్రిటీష్ ప్రభుత్వం ఆంధ్రదీపిక కాపీ రైట్ హక్కులు కొనుగోలు కోసం జరిగిన బేరసారాలు చివరికి ఆయన కుటుంబ పోషణకు సరిపడగా ఇవ్వాలని కోరడం – ఈ వ్యవహారాలు అందరికీ తెలిసినవే. ఎ. డి. క్యాంప్'బెల్ తన వ్యాకరణ గ్రంథంలో వెంకయ్యగారి గురించి ఇలా వ్రాశాడు: "Mamidi Vencaya, the author of the Andhra Dipica, an excellent dictionary of Telugu, has in his preface to this work, introduced a concise analysis of the language" అని! క్యాంప్‌బెల్ 1824లో బళ్ళారి కలెక్టరుగా పని చేసిన కాలం అది! క్యాంప్‌బెల్ (1821),జేసీ మోరీస్ (1835 - 1839) వీళ్ళంతా మామిడివారిని అనుసరించిన వారుగానే కనిపిస్తారు. బ్రిటీష్ అధికారులు తెలుగు నేర్చుకుని తెలుగులో పాలించటానికి ఈ నిఘంటువు చాలా ఉపయోగపడింది.

క్యాంప్‌బెల్, బ్రౌన్, లక్ష్మీనారాయణీయం (పర్యాయపద నిఘంటువు), శబ్దార్థ చంద్రిక, ఆంధ్ర వాచస్పత్యం, శబ్దార్థ దీపిక ఇవన్నీ ఆంధ్రదీపిక వెలుగులో రూపొందిన నిఘంటువులు. "అన్ని నిఘంటువులకు ఆంధ్ర దీపిక తల్లి యనవలెను" అని శుద్ధ

చైతన్యస్వామి ఆంధ్రదీపిక 1965 మచిలీపట్టణం ప్రచురణకు వ్రాసిన ముందు మాటల్లో పేర్కొన్నారు. లక్ష్మీనారాయణీయం తమ దృష్టికి రాకపోవటాన కావచ్చు ఆచార్య జి.యన్.రెడ్డిగారు తమ పర్యాయ పద నిఘంటువుని తొలి పర్యాయపద నిఘంటువుని తొలి పర్యాయ పద నిఘంటువని వ్రాశారు. కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రిగారు 1911లోనే "లక్ష్మీనారాయణీయం" నిఘంటువు వ్రాశారు. లక్ష్మీనారాయణ శాస్త్రిగారి పుత్రులు కొట్ర శ్యామల కామశాస్త్రిగారు "ఆంధ్ర వాచస్పత్యము" అనే అకరాది ఆంధ్ర ప్రతిపదార్థ పర్యాయ పద నిఘంటువుగా "శ్రీ శ్యామల కామశాస్త్రీయం" వ్రాశారు. 1934లో ఇది వెలువడింది. సూర్య రాయాంధ్ర నిఘంటువు రూపొందించటంలో అసాధారణ ఆలస్యానికి ఆగ్రహంగా ఆయన ఈ నిఘంటు నిర్మాణానికి పూనుకున్నట్టు "ఆంధ్ర వాచస్పత్యము" చూస్తే అర్థం అవుతుంది.

బ్రౌన్ మచిలీపట్టణంలో కలెక్టరుగా పనిచేసిన కాలంలోనే ఆయనకు పండితులతో చర్చలకు ఎక్కువ అవకాశం కలిగింది. నన్నయాదుల ప్రయోగాలకు సరైన భావార్థాలను పండితుల నుండి పొందలేక పోవటం వలన బ్రౌన్ బాగా అసంతృప్తి చెందాడు ఒక్కో పండితుడుకీ నెలకి మూడు వేలకు మించి స్వంతంగా జీతాలిచ్చి పెట్టుకున్నాడు. కానీ, ఆయనకు మామిడి వెంకయ్య గారి ఆంధ్రదీపిక ఎక్కువ సహాయపడిందని ఆయనే చెప్పుకున్నాడు. "......the last work tombe described is one that deserves honorable mention being the Telugu Dictionary compiled by Mamidi Venkayya, a learned Merchant (Komati) of Masulipatnam, who died in 1834. The work is arranged alphabetically in European method and every word that is found in the ancient lyrics, is briefly explained in Telugu or Sanskrit. The work will always be of value to those who study the poets. The title is ``Andhra Deepica......."

1936లో సూర్యరాయాంధ్ర నిఘంటువు వెలువడింది. జయంతి రామయ్య పంతులుగారు దీనికి ముందు మాటలు వ్రాస్తూ, "ఆంధ్రభాషలోని పదములు తత్సములు, ఆచ్ఛికములు, అన్యదేశ్యములు, వైకృతములు, దేశ్యములు నని మూడు విధములుగా విభాగించవచ్చును. ఆచ్ఛికములు వైకృతములు, దేశ్యములు నని రెందు విధములు. గ్రామ్యము అను విభాగ మొక్కటి కలదు గాని, గ్రామ్య శబ్దములు లక్షణ విరుద్ధములై బహువిధములుగా నుండుటచే వాని నీ గ్రంథమున జేర్పలేదు" అని చెప్పుకున్నారు. గ్రామ్యశబ్దాలు లక్ష్య విరుద్ధాలుగా ఉంటాయని దీని సంపాదక వర్గం ఎందుకు భావించిందో

తెలియదు. అదే సిద్ధాంతమో అర్థం కాదు... "అలగా జనం మాట్లాడే అలగా భాష"గా పైకి అనకపోయినా అదే అభిప్రాయం ఏదో వారిలో వున్నట్లు స్పష్టం అవుతోంది. జనం మాట్లాడుకునే మాటలతో కొన్నింటికి మాత్రమే 'నిఘంటు గౌరవం' కల్పించే విధానం సూర్యరాయాంధ్ర నిఘంటువులో అనుసరించబడింది.

కొన్ని పదాలకు నిఘంటువులో కన్పించే అర్హతని నిషేధించే అధికారం నిఘంటు కర్తలకు ఎవరిచ్చారు?

ఆఫీసు, కుర్చీ, కూర, టూకించు(సంగ్రహించు)గోలీ, గోళ్ళు లాంటి వాడుక పదాలు ఆంధ్రదీపికలో చోటు చేసుకున్నాయి. 'కమ్మకట్టు' అంటే "వ్రాత పూర్వకంగా సేవజేయటానికి ఒడంబడినవాడు" లాంటి అర్థాలు కనిపిస్తాయి. నేటికి 200 ఏళ్ళనాటి వాడుక పదాలను ఈ నిఘంటువులో మనం చాలా చూడవచ్చు.

పెంపు చేసిన నిఘంటువులు కొత్తగా అనేకం పుట్టుకొస్తున్న మాట నిజం. కానీ వాటిలో సంస్కృత పదాలను మరిన్ని తెచ్చి నింపడం కాకుండా నేటి ప్రజలు మాట్లాడుకుంటున్న పదాలకు, జాతీయాలకు, సామెతలకు ఎక్కువ భాగం కల్పించాల్సిన అవసరం ఉంది.

ఆంధ్రదీపిక అకారాది క్రమంలో నిఘంటువుల కూర్పుకు భారతదేశంలోనే మొదటి అడుగు వేసిన నిఘంటువు. మామిడివెంకయ్య అందుకు కారకుడు.

ప్రజల నాలుకల మీద ఆడుతున్న పదాలను ఏర్చి కూర్చి అచ్చమైన ఆంధ్రదీపికను రూపొందించటానికి కృషి చేయగలగటమే మామిడివెంకటార్యకు మనం ఇవ్వగలిగిన నివాళి.

(2016 ఆంధ్రదీపిక ద్విశతాబ్ది సందర్భంగా)



# తొలి తెలుగు పత్రికలు

ఒకరి కోసం ఒకరు వ్రాసుకునేది పత్రిక. కాలక్రమంలో అందరి కోసం ఎందరో వ్రాసేది పత్రికగా పరిణామం చెందింది.

అచ్చు యంత్రాలు అనుభవంలోకి వచ్చాక దిన, వార, మాస, పక్ష పత్రికలు వచ్చాయి. జర్నలిజం అనేది ఒక పవిత్ర బాధ్యత అయ్యింది. ప్రజల కోసం సమాచారం అనే దృష్టితో పత్రికలు వెలువడ సాగాయి.

"చరిత్ర రచనకు మొదటి అక్షరాన్ని రాసేది జర్నలిజం" అనే భావన ప్రబలింది.

నన్నయగారు "వార్తయందు జగతి వర్థిల్లుచుండు" అని ఏ ఉద్దేశ్యంతో చెప్పాడో గానీ, వార్త ద్వారా జగదోద్ధారణ ఒక లక్ష్యంగా మారింది.

"వర్తకులు తెచ్చింది వార్త" అనే సూక్తి 'వర్తకానికి వార్తాపత్రిక' అనే అర్థంలోకి మారిపోయింది.

ప్రజల రాజకీయ సాంస్కృతిక స్థాయికి పత్రికలు గీటురాయి అనే భావంతో తెలుగు పత్రికా రంగం సామాజిక బాధ్యతతో శుభారంభం పలికినా స్వీయ వాణిజ్య ప్రయోజనాలకు, తాము మద్దతిచ్చిన వారి రాజకీయ ప్రయోజనాలకు వార్తాపత్రిక నఅఏ నానుడి స్థిరపడి పోయింది.

క్రీ.పూ. 50 నాటికే రోమన్లు వగైరా ప్రాచీన జాతుల వారికి పత్రికలు వ్రాసిన అలవాటు ఉండేది. కానీ, అచ్చులో ఈనాటి పద్ధతిలో వార్తాపత్రికలు నేటికి సరిగ్గా 500 ఏళ్ళ క్రితం ప్రారంభ మయ్యాయి.

1609లో జెర్మనీలో అవీసా అనే పత్రిక వచ్చింది. 1631లో ఫ్రాంసు నుంచి "లా గజెట్టీ" పత్రిక వెలువడింది. 1641లో పోర్చుగల్ నుంచి "ఎ గజెటా డా రెస్టారకావో" పత్రిక, అలాగే 1702లో లండన్ నుండి తొలి ఆంగ్లదినపత్రిక "ది డైలీ కోరంట్"

వెలువడ్డాయి. వర్తక వాణిజ్య సమాచారం, ప్రభుత్వ ఉత్తర్వులు, పాలనాంశాలు, సాహిత్యం వగైరా ఆ పత్రికలలో ఉండేవి. తెలుగు పత్రికారంగానికి ఇవి పూర్వరంగంగా నిలిచిన అంశాలు.

ప్రచురణరంగంలో హెన్రిక్స్ అనే పోర్చుగల్ మత గురువు కారణంగా తమిళ లిపిని 1578లో అచ్చులోకి తీసుకు వెళ్ళ గలిగారు. క్రమేణ తెలుగు కూడా అచ్చుకు నోచుకుంది.

1835 నాటికే తెలుగువారు పత్రికా రంగంలోకి ప్రవేశించారు. http://www.docstoc.com వెబ్‌సైట్లో 1947కు పూర్వం వెలువడిన తెలుగు పత్రికల పట్టిక ప్రకారం 1831లోనే 'తెలుగు జర్నల్' అనే పత్రిక వెలువడినట్లుగా తెలుస్తోంది.

1831ని తెలుగు పత్రికా రంగానికి శుభారంభ సంవత్సరంగా భావించాలి. కానీ, దాని వివరాలు తెలియక పోవటాన 1835లో వెలువడిన మద్రాసు క్రానికల్ ని తొలి తెలుగు పత్రికగా ప్రకటిస్తున్నారు. తెలుగువాడైన పగడాల నరసింహులు నాయుడిని (సేలం) తమిళ పత్రికారంగ పితామహుడుగా చెప్పుకొంటారు. 1843లో హెర్మాన్ మోగ్లింగ్ అనే మిషనరీ కన్నడంలో తొలి పత్రిక "మాంగళూరు సమాచార పత్రిక" ను తీసుకురాగా, 1847లో "రాజ్యసమాచారం" పేరుతో జెర్మనీ మిషనరీ డా. హెర్మన్ గుండర్ట్ తొలి మలయాళ పత్రికను తీసుకొచ్చాడు.

1835లో 'మద్రాసు క్రానికల్', 'సత్యదూత' పత్రికలు తెలుగు పత్రికారంగానికి పునాదులేశాయి. 'మద్రాసు క్రానికల్' దక్షిణ భారత దేశంలోనే మొదటి తెలుగు సామాజిక పత్రిక. కాన్'స్టాంటైన్ శాంపి, ఎ. వట్టరసర్, టి. విశాఖ పెరుమాళ్ళయ్య, టి. శరవణ పెరుమాళ్ళయ్య అనే నేటివ్ పెద్దమనుషులు మద్రాసు క్రానికల్' ప్రారంభించారు. ఈ పత్రికలో వాణిజ్యం రాజకీయం, మార్కెట్ సమాచారం, సాహిత్య రచనలు ఉండేవట.

ఇదే ఏడాదిలో మద్రాసు నుంచి క్రిష్టియన్ అసోసియేషన్ బళ్ళారి వారు వెలువరించిన రెండవ పత్రిక 'సత్యదూత'. ఇది తొలి క్రైస్తవ తెలుగు పత్రిక. ఇందులో భాష ఇలా ఉండేది: "కాకియైనది ఒక గంటలో 25 మైళ్ళు ఎగురుచున్నదట. చెన్నపురి ఇనుపదారి వేగము ఇంతియే!"(డా. జి.యస్.వరదాచారి: తెలుగు పున్నమి వ్యాసం: పత్రికలలో తెలుగు భాష–)175 యేళ్ల క్రితం ఈ ప్రామాణిక భాషలోనే తొలి నాటి తెలుగు పత్రికలు ప్రాధాన్యం ఇచ్చాయి. స్వాతంత్ర్యకాలం వరకూ ఒక వందేళ్ళపాటు పత్రికలలో భాష ఇంచుమించు ఇలానే ఉంది.

1850 నాటికి పాశ్చాత్య తరహా విద్యాబోధన చేసే పాఠశాలలు, కళాశాలలు రావటం మొదలైనాయి. మధ్య తరగతి విద్యావంతుల సంఖ్య పెరిగింది. దేశభక్తి అందుకు తోడయ్యింది. వేదసమాజం, దేవసమాజం, ఆర్యమహాసభ లాంటి సంస్థల ద్వారా హైందవ సమాజంలోని కొన్ని మూఢాచారాలను సంస్కరించే లక్ష్యం పెరిగింది.

బెంగాలీ, మహారాష్ట్రులతో సాన్నిహిత్యం కూడా తెలుగు వారిని పురోగాములను చేసింది. మద్రాసులో పుట్టిన పత్రికారంగం కోస్తాజిల్లాల్లోకి వ్యాపించింది. గుంటూరు, బెజవాడ, బందరు, ఏలూరు, రాజమండ్రి, కాకినాడ, విశాఖపట్టణం లాంటి కేంద్రాలు పత్రికలకు పుట్టిళ్ళైనాయి. వ్యావహారిక భాషకు, గ్రాంథిక భాషకూ మధ్యే మార్గంగా "శిష్ట వ్యావహారికభాష" పేరుతో ప్రామాణిక భాషని ఇవి వ్యాప్తి చేశాయి.

తొలినాళ్లలో వెలువడిన మరో పత్రిక 'వృత్తాంతిని'. 1838లో వారపత్రికగా ఇది మద్రాసు నుంచి నాలుగేళ్ళపాటు నడిచింది. తెలుగులో తొలి సాహిత్య వారపత్రిక ఇది. మండిగల వెంకట్రాయ శాస్త్రి సంపాదకుడు.

ఈ "వృత్తాంతిని" పత్రికలో తిరుమల రామచంద్రగారు నేవళంగా ఉన్నదని ప్రశంసించిన భాష ఇలా ఉండేది: "సర్వాధికారుడైన గవర్నరుగారు ఈ సంగతి ఆలోచనలోకి తెచ్చి సదరహి వారధి ఇంతకంటే విశేషంగా వెడల్పించి విశాలంగా కట్టిస్తే, జనులకు మహాసౌఖ్యముగా ఉండును ..." (డా. జి యస్ వరదాచారి). 1840లో వచ్చిన "జనవర్తమాని" పత్రిక కూడా వాడుకభాష కోసం ప్రయత్నించింది.

1842లో సయ్యద్ రహంతుల్లా, పువ్వాడ వెంకట్రావు గార్ల సంపాదకత్వంలో "వర్తమాన తరంగిణి" పత్రిక పదేళ్ళు నడిచింది. దీన్ని రాజమండ్రి జడ్జిగా పనిచేసిన జేమ్స్ థామస్ తన కచ్చేరికి తెప్పించే వాడట. ఈ పత్రికలో స్థానిక వార్తలు, వాణిజ్య పరమైన అంశాలు, భౌతిక, నైతిక, పాలనాంశాలు ప్రముఖంగా ఉండేవి. దీని తొలి సంచికలో అప్పటి వరకూ అచ్చైన పుస్తకాల పట్టిక ఉంది.

1848లో "హితవాది" మాసపత్రికని ఆ కాలంలో పేరొందిన తెలుగు పండితుడు ఎడ్మండ్ జె. షార్కీ ప్రారంభించాడు. 1863లో "శ్రీయక్షిణి" పక్షపత్రికను బళ్ళారి నుంచి త్యాగరాజ మొదలి, వెంకట రామన్నకవి వెలువరించారు. మద్రాసు వెలుపల వెలువడిన తొలి పత్రిక ఇదే!

1864లో "సుజనరంజని" మాసపత్రికని వింజమూరి కృష్ణమాచార్యులు, బహుజనపల్లి సీతారామాచార్యులు కలిసి మద్రాసు నుండి నాలుగేళ్ళపాటు నడిపారు. తెలుగులో ఇది తొలి సాహిత్య మాసపత్రిక. చిన్నయసూరి ఈ పత్రికలో సాహిత్య విషయాలను ఎడిట్ చేసేవారట. ఆయన ప్రభావం వలన ఇందులో భాష ప్రత్యేకంగా ఉండేది. పరీక్షలకు వెళ్ళే విద్యార్థులకు ఉపయోగకరమైన స్టడీ మెటిరియల్ ఇచ్చిన తెలుగు పత్రిక కూడా ఇదే! ఉద్యోగ సమాచారం కూడా ఉండేది. తెలుగు పదాలకు సమానమైన ఇంగ్లీషు పదాలను ప్రకటించి, తెలుగు రచనలను ఇంగ్లీషులోకి అనువదించాలని పండితుల్ని కోరేవారట!

1865లో వేదసమాజం వారు తత్త్వబోధిని మాసపత్రిక ప్రారంభించారు. ఇది బ్రహ్మసమాజ భావాలను ప్రచారం చేసేది. రాజా రామ్మోహనరాయి ప్రభావంతో విధవా పునర్వివాహాలను నొక్కి చెప్పిన తొలి పత్రిక ఇది. వేదాలను తెలుగులోకి తెచ్చారు.

1871లో ఆంధ్రభాషా సంజీవని పత్రిక వచ్చింది. కరడుగట్టిన గ్రాంథిక భాషావాది, సాంప్రదాయ వాది అయిన కొక్కొండ వెంకటరత్నం పంతులు గారు ఈ పత్రికలో తెలుగు విభాగం చూసేవారు. మూడు దశాబ్దాలపాటు ఈ పత్రిక నడిచింది. పత్రికకు సంపాదకీయం పద్ధతిని ప్రవేశపెట్టింది ఈ పత్రికే! అందులోని భాష ఎలాఉండేదో ఒక నేరానికి సంబంధించిన ఈ రిపోర్టింగ్ చదివితే అర్థం అవుతుంది.

"ఆలీపురమందు పరభూతి చరన బైకాజీయను నొకానొక రాజపుత్ర జాతీయునికి సర్వాంగ సుందరియైన కులాంగన గలదు. ఆ చెలువకు ఐదునేదేండ్ల యీడుండును. ఇట్లుండ నా బాలామణి నొక మ్లేఛ్ఛుదు చూచెను. చూచి యా కలువకంటిని దన యింటికి రమ్మనెను. అమ్మానిని యందున కొడబడదయ్యెను. అయ్యో! ఆ తురుష్కాధముండే తెరంగుననె నయ్యంగనా రత్నము నెత్తుకొని పోవలెనని నిష్కర్షించుకొనియెను..." ఇలా ఉంటుంది ఆ భాష! (డా. జి యస్ వరదాచారి). ఆ తొలి రోజుల్లో 30 ఏళ్ళపాటు ఒక తెలుగు పత్రికను ఇంత గ్రాంథికంలో నడపటం విశేషమే!

బ్రిటిష్ ప్రభుత్వం సంస్కరణలకు పూనుకొంటున్న దశలో సాంప్రదాయవాదిగా కొక్కొండ ఏటికెదురీదాడు. విధవా వివాహాలు వ్యతిరేకించాడు. ఆడవాళ్లకు చదువు అవసరం లేదన్నాడు. వాడుక భాష వలన తెలుగు చస్తుందన్నాడు. ఆయన చెప్పిందేదీ నిజం కాలేదు.

కానీ, కందుకూరి, గిడుగు, వేదం వెంకటరాయ శాస్త్రిలాంటి సంస్కర్తలతో వైరం నడిపి నష్టపోయాడు. అంతటి సమర్థుడు లోకానికి ఉపకరించకుండా పోయాడు.

1872లో ఉమా రంగనాయకులుగారి నేతృత్వంలో మచిలీపట్టణం నుండి "పురుషార్థ ప్రదాయిని" పత్రిక వెలువడింది. దైవ సమాజం సంస్థ పక్షాన ఈ పత్రిక వెలువడింది. ప్రజలభాషలో ఉన్నత రచనల ఆవశ్యకతను గుర్తించిన పత్రిక. వైజ్ఞానిక అంశాలను తెలుగులో చెప్పాలనే ఉద్యమానికి ఈ పత్రిక శ్రీకారం చుట్టింది. తెలుగులో ఇది తొలి వైజ్ఞానిక పత్రిక. ఆ తరువాత గూడూరు వెంకట కృష్ణారావు 1875లో "సకల విద్యా ప్రబోధిని" పూర్తి సైన్సు పత్రికని విశాఖపట్టణం నుండి తెచ్చారు.

పోతపోసిన అచ్చు అక్షరాలతో కంపోజు చేసిన తొలిపత్రిక "వివేకవర్ధని". సాంస్కృతిక పునరుజ్జీవ నోద్యమానికి ఈ పత్రిక పురుడు పోసింది. కందుకూరు వీరేశలింగంగారు 1874లో మాసపత్రికగా, 1876లో పక్షపత్రికగా, 1885లో వారపత్రికగా దీన్ని నడిపారు. "ది ఇండియన్ బీ" ఆంగ్ల పత్రికను, కొక్కొండ వారిని ఎదుర్కోవటానికి "హాస్య సంజీవని" ని, మహిళల కోసం తొలి పత్రికగా "సత్'హితబోధిని" "సత్య సంవర్ధని" పత్రికనీ, వావిలాల వాసుదేవశాస్త్రి సంపాదకుడిగా "చింతామణి" పత్రికను, అనుబంధ పత్రికలుగా నడిపారు. దూబగుంట నారాయణ కవి 'పంచతంత్రము', మొల్ల 'రామాయణము', పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నము, పాంచాలీ పరిణయము ప్రాచీన గ్రంథాలను అందులో ప్రచురించారు.

1875 'జనవినోదిని' తెలుగులో తొలి బాలల పత్రిక. చిట్టి పొట్లకాయ, రంగురంగుల బిళ్ల లాంటి బాలసాహిత్య రచనలు ఈ పత్రికలో వచ్చేవి. 1885లో అముద్రిత గ్రంథ చింతామణి పత్రికని పూండ్ల రామకృష్ణయ్య నెల్లూరు నుంచి వెలువరించారు. చంద్రగిరిచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానం, భోగినీదండకం, వసుంధరా విజయము, యాదవరాఘవ పాండవీయము, మిత్రావింద పరిణయము లాంటి గ్రంథాలను ఈ పత్రిక ద్వారా వెలుగులోకి తెచ్చారు.

తెలుగులో తొలి రాజకీయ దినపత్రిక "ఆంధ్రప్రకాశిక". ఈ దినపత్రికని 1885లో ఎ. సి. పార్థసారథినాయుడు మద్రాసు నుంచి వెలువరించారు. భారత జాతీయ కాంగ్రెస్ సంస్థ అవతరించిన సంవత్సరం అది. దాదాపు 40 ఏళ్ళపాటు బ్రిటిష్ వ్యతిరేకత ప్రదర్శించి నిలిచిన పత్రిక ఇది. జస్టిస్ పార్టీ రాజకీయాలలో కూడా ఈ పత్రికది ప్రధాన పాత్రే!

తరువాత ఇది వారపత్రికగా మారింది. నేటికాలపు దినపత్రికలు నడుస్తున్న తీరుకు ఓనమాలు దిద్దిన తొలి దినపత్రిక ఇది.

1886లో దేవగుప్తం శేషాచలపతిరావు గుంటూరు నుండి దేశాభిమాని వారపత్రికని తెచ్చారు. "కృష్ణా న్యూస్, "కృష్ణ వృత్తాంతిని" పేర్లతో నడిచి, ఆ తరువాత దేశాభిమాని ఇంగ్లీష్-తెలుగు దినపత్రికగా కొన్నాళ్ళు బెజవాడ నుండి నడిచింది.

1894లో వారపత్రికలకొక ఒరవడిని దిద్దిన శశిలేఖ పత్రిక వెలువడి 1956 దాకా నడిచింది. ఆంధ్రరాష్ట్రం కోసం, జాతీయోద్యమం కోసం ఉద్యమించిన పత్రిక ఇది. 1896లో పోలవరం జమీందారు రాజా కొచ్చర్లకోట రామచంద్ర వెంకట కృష్ణారావు చిలకమర్తి వారి సంపాదకత్వంలో "సరస్వతి" సాహిత్య మాసపత్రికని తెచ్చారు. ఈ పత్రిక 1912వరకూ నడిచింది.

1897లో లక్కవరం జమీందారు మంత్రిప్రగడ భుజంగరావు కూడా "మంజువాణి" మాసపత్రికని ఏలూరు నుంచి నడిపారు. 1904వరకూ ఈ పత్రిక నడిచింది. వేదం వెంకటరాయశాస్త్రి ప్రభృతులు ఇందులో వ్యాసాలు వ్రాసేవారు.

19వ శతాబ్దం మలుపు తిరుగుతున్న ఆ రోజుల్లో సామాజిక సంస్కరణలు, సాహితీ సంస్కరణలు, భాషాసంస్కరణలు, ఆంధ్ర రాష్ట్రోద్యమం, జాతీయోద్యమం అనేవి కొత్త శతాబ్దిలో పత్రికల ముందు పరుచుకున్న అంశాలైనాయి.

ఇదే కాలంలో తెలంగాణా నుంచి నిజాం ప్రభుత్వ పక్షాన ఉర్దూ తెలుగు రెండు భాషలలో వెలువడిన "సేద్యచంద్రిక" తొలి వ్యవసాయ విషయిక పత్రిక."వక వ్యాళ చిన్న చిన్నమామిడి చెట్లమీద తెల్ల వన్నె పురుగులు చేరినట్లయితే...యిందుకు శికిచ్ఛ యిది గదా... వక్క శేరు మెత్తటి సబ్బును నాలుగు శేర్ల నీళ్ళలో ఉడకబెట్టి..." ఇలా వ్యవసాయ వివరాలను అందించేది.

1901లో శ్రీపాద కృష్ణమూర్తి రాజమండ్రి నుండి వెలువరించిన దినపత్రిక "గౌతమి" జనమనోహర భాషలో పత్రికలు రావాలని భావించారు. 1902లో కొండా వెంకటప్పయ్య, కోపల్లె హనుమంతరావు, దాసు నారాయణరావు కృష్ణాపత్రికని వార పత్రికగా ప్రారంభించారు. 1906లో ప్రగతిశీలి శ్రీ ముట్నూరి కృష్ణారావుకు దీని బాధ్యతలు

అప్పగించారు. 1900 నాటికి 160 తెలుగు పత్రికలు వెలువడ్డాయి. కానీ, వాటిలో అప్పటికి బతికి ఉన్నవి చాలా స్వల్పం. ఈ లోటును పూడ్చటం, జాతీయోద్యమానికి వ్యాప్తి కలిగించటం, ప్రజలలో స్వాతంత్ర్యకాంక్ష రగిలించటం లక్ష్యాలుగా కృష్ణాపత్రిక వెలువడింది.

1908లో బొంబాయిలో కాశీనాథుని నాగేశ్వరరావు తన అమృతాంజనం సంస్థ నుండి వారపత్రికగా "ఆంధ్రపత్రిక"ని ప్రారంభించారు. తెలుగు ప్రజలు ఒక భావచైతన్య మహోదయం కోసం ఎదురు చూసిన రోజులవి. 1913 ఆంధ్రరాష్ట్రోద్యమం డిక్లరేషన్ కలిగించిన ప్రభావంలోంచి పుట్టిన భావ చైతన్యం ఆంధ్రపత్రిక వారపత్రికని దినపత్రికగా మార్పుచేసింది. మద్రాసుకు ఆంధ్రపత్రికను తరలించి దినపత్రికగా వెలువరించారు. 20వ శతాబ్దిని ప్రభావితం చేసిన ఆంధ్రుల వెలుగు పత్రిక అది.

1923లో కౌతా శ్రీరామమూర్తి మచిలీపట్టణం నుంచి శారద పత్రికని తెచ్చారు. అది భారతి లాంటి సాహిత్య పత్రికలకు బాటలు వేసింది. 1924లో కాశీనాథుని నాగేశ్వరరావు బలమైన ఆర్థిక పునాదుల మీద భారతి పత్రికను నిర్మించారు.ఆంధ్రుల వ్యక్తిత్వ పరిణామ నిరూపణకు 'భారతి'ని తీసుకు వస్తున్నట్టు తొలి సంచికలో పేర్కొన్నారు.

ఖాసాసుబ్బారావు సంపాదకత్వాన "స్వతంత్ర" వారపత్రిక, కోలవెన్ను రామకోటేశ్వరరావు సంపాదకత్వాన "త్రివేణి" మాసపత్రిక, ప్రకాశంగారి సంపాదకత్వాన "స్వరాజ్య" దినపత్రిక ఆ రోజుల్లో వెలువడిన ఆంగ్ల పత్రికల్లో ప్రముఖమైనవి. 1921లో టంగుటూరి శ్రీరాములు(టంగుటూరి సూర్యకుమారి తండ్రి)నేతృత్వంలో రాజమండ్రి నుండి వెలువడిన "కార్లీలియన్" ఆంగ్ల వార పత్రిక జాతీయోద్యమానికి అండగా నిలిచింది. కానీ, జాతీయోద్యమ ప్రతికూలుడు వీరేశలింగంగారికి అది పంటికింద రాయిగా మారి, పరువు నష్టం దావా దాకా వెళ్ళింది. చివరికి టంగుటూరి ప్రకాశం వాదించి సోదరుడు శ్రీరాములుని గెలిపించుకున్నాడు. వీరేశలింగంపంతులు కేసు ఎలా వీగిపోయిందో ప్రకాశం "నాజీవిత యాత్ర" లో ఉంది.

1910 నుండీ ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు ఏ సంచికకు ఆ సంచిక ఒక ఆకర గ్రంథంగా 50-60 పరిశోధనా వ్యాసాలతో వెలువడేవి. "ఆంధ్ర సాహిత్యపరిషత్ పత్రిక", విశ్వనాథ సత్యనారాయణ, రామ కోటేశ్వరరావులు నడిపిన "జనత" పత్రిక, తేలప్రోలు నుంచి పాటిబండ్ల మాధవరాయ శర్మగారి 'వీణ' పత్రిక, హైదరాబాదు నుండి

"గోలకొండ"పత్రికలు సాహిత్య ఉద్యమాలకు వేదిక లైనాయి. మద్దూరి అన్నపూర్ణయ్య సంపాదకత్వంలో వెలువడిన "కాంగ్రెసు" పత్రిక గాంధేయ సిద్ధాంతాలను, కాంగ్రెసు కార్యాచరణను వ్యాప్తి చేసింది. హైదరాబాదు నుండి "ఆంధ్రజనత", "ఆంధ్రభూమి", రాజమండ్రి నుండి "సమాచారం", విజయవాడ నుండి "ప్రజాశక్తి", 'జన్మభూమి', "విశాలాంధ్ర" దినపత్రికలు, మద్రాసు నుండి ప్రకాశం గారి "ప్రజామిత్ర", సీమ ప్రయోజనాల కోసం "విజయవాణి", నెల్లూరు "జమీన్‌రైతు", గుంటూరు నుండి "గుంటూరు పత్రిక", "గృహలక్ష్మి", "యువ","చందమామ" పత్రికలను స్మరించు కోవటం మన విధి.

1938లో మద్రాసు నుండి వెలువడిన ఆంధ్రప్రభ దినపత్రిక, పత్రికా సాంప్రదాయాలకు కొత్త విలువలను తెచ్చింది. ఖాసా సుబ్బారావు, ఎన్ నారాయణమూర్తి, నార్ల వెంకటేశ్వరరావు. నీలంరాజు వెంకట శేషయ్య, పండితారాధ్యుల నాగేశ్వరరావు దీని సంపాదకులుగా ప్రసిద్ధులు. ప్రజామిత్ర, ఆనందవాణి, జనవాణి, ప్రజాబంధు, తెలుగు స్వతంత్ర పత్రికలు జనచైతన్యం తెచ్చాయి.

స్వాతంత్రానికి పూర్వం ఇంకా పేర్కొనదగిన పత్రికలు ఎన్నో ఉన్నాయి. స్వాతంత్ర్యం తరువాత జాతిని ప్రభావితం చేసే ఏక నాయకత్వంగానీ, ఉద్యమాలుగానీ లేకపోవటాన వ్యాపారంముఖ్యమై సమాజ బాధ్యత అనేది రెండవ ప్రాధాన్యం అయింది. సౌందర్య పోషకాలను దట్టంగా కూరి పత్రికని జనం పైకి వదలాల్సిన పరిస్థితి ఏర్పడింది. పరిశోధనాత్మక, వ్యాఖ్యానాత్మక జర్నలిజాలు రాజకీయ పత్రికలలో ప్రధానాంశాలయాయి. పత్రికా యాజమాన్యాల మధ్య వైరాలు రాజకీయాలను శాసించే స్థితికి వెళ్ళాయి. పత్రికల స్థాపనలోని ఆనాటి మౌలిక అంశాలేవీ ఈనాటి పాత్రికేయ ప్రపంచంలో కనబడక పోయినప్పటికీ, ఆశ చావని, నిబద్ధత వదలని, విలువలు కోల్పోని యజమానులు, సంపాదకులు ఇంకా ఉన్నారు. వారి వలనే జాతి సంస్కారయుతంగా మన గలుగుతోంది. చిత్ర మాసపత్రికలో తెలుగు పత్రికల చరిత్రపైన వ్యాసం వ్రాయమని కోరటమే ఇందుకు సాక్ష్యం.



# తెలుగుదనం నింపిన ఆంధ్రపత్రిక

స్వాతంత్రోద్యమ దీప్తిని కలిగించేందుకోసం 1908లో బొంబాయిలో ఒక వారపత్రికగా ప్రారంభమైంది ఆంధ్రపత్రిక. 1910 నుండీ ఉగాది ప్రత్యేక సంచికలను ప్రారంభించారు. 1914లో మద్రాసుకు తరలివచ్చి, దినపత్రికగా రూపొందింది. 1924లో భారతి ప్రారంభం అయ్యింది. ఆంధ్రగ్రంథమాల ప్రచురణ సంస్థను ప్రారంభించారు.

1938లో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి నిర్యాణం తరువాత శివలెంక శంభుప్రసాద్ గారు నాగేశ్వర రావు పంతులుగారి ఒరవడిని మరింత ముందుకు తీసుకువెళ్ళారు. వారి తరువాత శివలెంక రాధాకృష్ణగారు ఆంధ్రపత్రికను అదే పంథాలో నడిపించారు. 1991లో ఆంధ్రపత్రిక మూతపడింది

స్వాతంత్ర్యోద్యమ కాలంలో దేశానికి ఆర్థిక స్వాతంత్ర్యం కావాలని నినదించింది. ఖద్దరుని, స్వదేశీ వస్తువుల వాడకాన్నీ ప్రబోధించే సంపాదకీయాలు, వార్తలు ఎక్కువగా ఉండేవి. కొంతకాలం బ్రిటిష్ వారి నిషేధాన్ని కూడా ఎదుర్కొంది. అసలైన పత్రికా స్వాతంత్ర్యానికి భాష్యం చెప్పింది.

గాంధీజీకి తెలుగువారిని అత్యంత విధేయులుగా నడిపించటంలో ఆంధ్రపత్రిక పాత్ర గణనీయమైంది. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు కట్టించిన హరిజన కాలనీని ప్రారంభించటానికి యలకుర్రు వచ్చిన గాంధీజీ తనకన్నా ముందే హరిజనోద్ధరణ ప్రారంభించిన వ్యక్తిగా ఆయనను కీర్తించారు. 1917లో నాగేశ్వరరావు పంతులుగారి

ఆధ్వర్యంలో బెజవాడలో ప్రథమ ఆంధ్ర ఆదిహిందూ మహాసభను నిర్వహించారు. ఆది ఆంధ్ర నాయకుడు, మహాత్మా జోతీరావు పూలే అనుచరుడు, విద్యావేత్త, దళితుల అభ్యున్నతికి పాటుపడిన తొలితరం నాయకుడు, డెక్కన్ విప్లవ సేనాని భాగ్యరెడ్డివర్మను బెజవాడ పురవీధుల్లో ఏనుగుపై ఊరేగించి తాను ముందువరుసలో నడిచారు నాగేశ్వరరావు పంతులుగారు.

1921 బెజవాడ కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం సందర్భంగా జరిగిన మహాసభలకు నాగేశ్వరరావుపంతులుగారే నేతృత్వం వహించారు. ఈ కార్యవర్గ సమావేశంలోనే లోకమాన్య బాలగంగాధర తిలక్ మరణానంతరం గాంధీజీ కాంగ్రెస్ పగ్గాలు చేపట్టారు. ఆంధ్రపత్రిక శతవసంత వేడుకలు జరుగుతున్న విజయవాడలోని ఈ గాంధీనగరం ఆ స్మృతి చిహ్నంగానే ఏర్పడటం ఒక విశేషం కాగా, ఇక్కడ ఒకనాటి ఆంధ్రపత్రిక కార్యాలయం, పక్కనే అమృతాంజనం సంస్థవారి దుర్గాకళామందిరం ఉన్నాయి.

భాషా సాంస్కృతిక రంగాలకు ఆంధ్రపత్రిక చేసిన సేవ నిరుపమానమైనది. అనేక శాసనాల పరిష్కరణ, అనేక ప్రాచీన సాహిత్య గ్రంథాల ప్రచురణతోపాటు, తెలుగు భాష ప్రాచీనతకు సంబంధించి ఆంధ్రపత్రిక ఆదివారం అనుబంధం, ఉగాది ప్రత్యేక సంచికలు, భారతి మాసపత్రిక వీటి ద్వారా వెలువడిన అనేక ప్రామాణిక వ్యాసాలు నేటికీ ఆకరాలుగా నిలిచాయి. ఆంధ్రుల్లో ఆంధ్రత్వాన్ని పెంపొందించటం కోసం, తెలుగుదనాన్ని నిలబెట్టటం కోసం తెలుగు భాషను ఆధునీకరించటం కోసం ఈ ప్రచురణలు ఎంతగానో తోడ్పడ్డాయి.

భావ కవితోద్యమంతో ప్రారంభించి, మినీ కవితా ఉద్యమం వరకూ అనేక సాహిత్యోద్యమాలకు ఆంధ్రపత్రిక, భారతి పత్రికలు వేదికలు కల్పించాయి. పండితులు వ్యతిరేకించినా ఎంకిపాటలను ప్రచురించి తెలుగుదనానికి ప్రతీకగా ఎంకిని నిలబెట్టింది ఆంధ్రపత్రిక. మినీకవిత్వ స్వరూప స్వభావాల గురించిన వ్యాసాలు తొలుతగా ప్రచురితమైనది భారతిలోనే!

**సాహిత్యోద్యమాలకు, నూతన ప్రయోగాలకూ అండగా నిలిచింది ఆంధ్రపత్రిక :**

ఆ రోజుల్లో ఆంధ్రపత్రిక దీపావళి కథల పోటీ ఒక సంచలనంగా సాగేది. ఎందరో కథకులు కొత్తా పాతా తేడా లేకుండా ఉత్సాహంగా పాల్గొనేవాళ్ళు.

కొత్తతరం రచయితలను, కళాకారులనూ ఎప్పటికప్పుడు ప్రోత్సహించటం ఒక లక్ష్యంగా ఆంధ్రపత్రిక సాగింది. ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో శ్రీ వీరాజీ నిర్వహించిన కొత్త కలాలు శీర్షిక చాలా మంది యువరచయితలను వెలుగులోకి తెచ్చింది. 1975లో ఈ శీర్షిక ద్వారా నేను కూడా లోకానికి తెలిశాను.

శ్రీరామమూర్తిగారు సంపాదకులుగా ఉన్నప్పుడు 1989-90లలో ఆంధ్రపత్రిక ఆదివారం అనుబంధంలో ఊహల ఉయ్యాల పేరుతో ఎడోల్సెంట్ సైకాలజీ మీద రెండేళ్ళపాటు ఒక శీర్షికను నేను నిర్వహించేందుకు అవకాశం ఇచ్చారు.

1908, 1910, 1914లలో ఆంధ్రపత్రిక వివిధ రూపాలలో పరిణామక్రమాన్ని పొందినప్పటికీ 2016వ సంవత్సరంలో ఇప్పుడు జరుపుతున్న ఈ శతవసంతోత్సవం నూరేళ్ళ క్రితం ప్రారంభమైన ఒక సాహితీ సామాజిక చైతన్యానికి సంస్మరణ మాత్రమే! ఒక దేశోద్ధారకుడి ఆలోచనలకు ప్రతిరూపం ఈ మహాసంస్థ. ఆంధ్రాభ్యుదయానికి అవసరం అయిన అనేకానేక ఉద్యమాల్ని స్వతంత్రమైన విమర్శనాత్మక మైన రీతిలో చర్చించటానికి ఆంధ్రపత్రికను స్థాపిస్తున్నట్టు తొలి సంచికలోనే స్పష్టీకరించారు వ్యవస్థాపకులు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు. స్వకీయ పరిపాలనమును కాలక్రమమున బొందుటయే మా స్వరాజ్యాదర్శము" అని 1908 సెప్టెంబరు 9వతేదీ ప్రారంభ సంచికలో తమ లక్ష్యాన్ని ప్రకటించారాయన.

1905 బెంగాల్ విభజన ఫలితంగా పుట్టిన వందేమాతరం ఉద్యమం ఉధృతంగా సాగుతున్న ఆ కాలంలో ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి ఒక పత్రిక అవసరం అనే భావన లోంచి ఆంధ్రపత్రిక అవతరించింది. దాని జన్మదినాన్ని బట్టి, అది పుట్టిన కల్లోల కాలాన్ని బట్టీ ఆంధ్రపత్రికకు అరిష్టాలున్నాయని జోశ్యులు చెప్పారట. కానీ, ఎనిమిదిన్నర దశాబ్దాల కాలం అది ఒక జాతి నిండుగౌరవాన్ని నిలబెట్టి తెలుగు వారి జీవనంలో ఒక భాగంగా నిలిచింది. తెలుగు ప్రజల మనసుల్లో శాశ్వతంగా పదిలమైన స్థానం పొందింది. చెప్పుకోదగ్గ అరిష్టాలు కలగకపోయినా దేశభక్త కొండావెంకటప్పయ్య గారు ఒక సభలో అన్నట్టు ఆంధ్రపత్రిక ఆదినుండీ నష్టాల్లోనే నడిచిన పత్రిక.

ఆంధ్రపత్రిక మొదటి సంచిక 8 పేజీలైతే, అనతి కాలంలోనే అది 20 పేజీలకు పెరిగింది. రచయితలు పెరిగారు. పాఠకులు, చందాదారులూ పెరిగారు. ఆనాడు సంవత్సర చందా ముప్పైనాలుగు అణాలు మాత్రమే! అంటే, రెండు రూపాయల ఒక బేడా!

ఇప్పటి మనకి అది ఇంతేనా అనిపించవచ్చు గానీ, అప్పట్లో సామాన్యుడికి అది ఎక్కువే కావచ్చు! అయినా 800 కాపీలను కాంప్లిమెంటరీలుగా పంపేవారంటే, పత్రిక లాభసాటిగా నడవలేదనటానికి ప్రముఖ కారణంగా అదే కనిపిస్తుంది.

మొదట వారపత్రికగా ఆంధ్రపత్రిక ప్రతి బుధవారం వెలువడేది. ఐదేళ్ళపాటు బాలారిష్టాలు అధిగమించాక, బొంబాయిలో తెలుగు పత్రిక అచ్చు వేయటానికి గల ఇబ్బందుల రీత్యా, 1914 నుండీ, ఆంధ్రపత్రిక దినపత్రికగా మారి మద్రాసు నుండి వెలువడటం మొదలయ్యింది.

ప్రతి శనివారం సారస్వతాను బంధమూ, ప్రతి ఆదివారం ప్రత్యేక వ్యాసాలు ఆంధ్రపత్రికను అలరిస్తూ ఉన్నప్పటికీ తనివితీరని నాగేశ్వర రావు పంతులుగారు 1910 నుండీ ఉగాది ప్రత్యేక సంచికలను వెలువరించటం మొదలు పెట్టారు.

తెలుగు భాషకు, తెలుగు సంస్కృతికీ, తెలుగు వారి చరిత్రల అధ్యయనానికీ, విశ్లేషణకు ప్రధాన వేదికలుగా నిలిచిన ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు, భారతి మాసపత్రిక ఆంధ్రపత్రికను చిరస్మరణీయం చేశాయి. తెలుగు భాష, సంగీత సాహిత్యాలతో పాటు తెలుగు వారి ఇతర కళలు, సంస్కృతులు, ఆచార వ్యవహారల పైన అధ్యయనం ఒక ఎత్తు కాగా, ఎన్నో చరిత్ర పరిశోధనలు, శాసనాల పరిష్కరణ, విశ్లేషణలు ఇంకొక ఎత్తుగా ఆంధ్రపత్రిక ఉగాది ప్రత్యేక సంచికలు గొప్ప వేదికను కల్పించాయి. షుమారు 50 వ్యాసాల వరకూ ప్రచురించేవారు. తొలిరోజుల్లో చందాదారులకు రూపాయికే ఇచ్చేవారట.

1938 సంవత్సరాది సంచికను అనారోగ్యంగా ఉన్నా లెక్కచేయకుండా, స్వయంగా ఎడిట్ చేసి, విడుదలైన 10 రోజులకే నాగేశ్వరరావు పంతులుగారు పరమ పదించారు.

నాగేశ్వర రావు పంతులుగారి మానస పుత్రిక భారతి. 1924 జనవరిలో మొదలైంది. ఆంధ్ర వ్యక్త్వ పరిణామ నిరూపణ కోసం భారతిని తెస్తున్నట్టు ప్రకటించుకున్నారు. ఆంధ్రప్రపంచంలోని పూర్వ, పర సంస్కారములను సమన్వయం చేయటానికి, ఆంధ్రప్రవృత్తిని వ్యక్తం చేయటానికి, భారతి పత్రికను స్థాపించారు. భారతిలో వ్యాసం ప్రచురితమైతే, అది సర్వ ప్రామాణికం అనే నమ్మకాన్ని ఆ పత్రిక పండితుల్లో కల్పించగలిగింది. కలగూరగంప అనేది భారతి పత్రికలో విశేష ఆదరణ పొందిన శీర్షిక. భారతి తొలిసంచిక ముఖచిత్రం మీద మంగిపూడి వెంకట శర్మగారి "గాంధిశతకం"

ప్రచురించారు. ప్రాచీన సాహితీ సంస్కృతులతో పాటు, నవీన విజ్ఞానానికి పెద్దపీట వేస్తూ భారతిని సమతుల్యంగా నడిపించారాయన.

ఆంధ్రపత్రిక గొడ్డు గ్రాంథికాన్ని ఏనాడూ ఆదరించలేదనీ, సరళ గ్రాంధికాన్నే అనుసరించేదనీ నండూరి రామమోహన రావుగారు ఒక వ్యాసంలో వ్రాశారు. ఆంధ్రపత్రిక సంపాదకులుగా పనిచేసిన సి వి రాజగోపాల రావు గారు ఆంధ్రపత్రిక సంక్షిప్తచరిత్రను వ్రాసి, రాబోయే తరాల వారికి ఒక పత్రిక ఎంతటి చైతన్య దాయకమైన ఉత్తేజాన్నిస్తుంగో కళ్ళకు కట్టించారు. ప్రెస్ అకాడెమీ వారు ఈ గ్రంథాన్ని ప్రచురించారు.

ఇదే సందర్భంలో మరో ముఖ్య పత్రికను కూడా ఇక్కడ స్మరించుకోవటం అవసరంగా భావిస్తున్నాను. 1902లో కృష్ణాపత్రిక, 1908లో ఆంధ్రపత్రిక ప్రారంభమైనాయి. రెండిటి స్థాపన వెనుక జాతీయోద్యమమే ప్రధాన లక్ష్యం. ఈ రెండు పత్రికలూ తెలుగు జాతికి రెండుకళ్ళుగా నిలిచాయి. తెలుగు వారు యావద్దేశాన్నీ, యావత్ ప్రపంచాన్నీ ఈ రెండు కళ్ళతోనే చూసేవారు.. రెండు పత్రికలను కలిపి కృష్ణాంధ్రపత్రిక అని పిలుచుకునేవాళ్ళు.

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక, సాహిత్య పోషణకూ, కలువబాల పత్రిక సామాజిక చైతన్యానికి, మహిళా ప్రగతికీ కేంద్రాలుగా నిలిచాయి.

దేశభక్తి ప్రబోధము, స్వదేశీ ధర్మం, జాతీయవాదాలతో పాటు తెలుగుదనం పరిరక్షణ కూడా ఎంతో ముఖ్యమైనదిగా ఆంధ్రపత్రిక భావించింది. తెలుగు భాష ప్రాచీనతను నిరూపించే వ్యాసాలెన్నింటికో ఆంధ్రపత్రిక, ఉగాది సంచికలు ఆరోజుల్లో ఒక వేదికగా నిలిచాయి.

(నా కీలక ప్రసంగం ఆంధ్రపత్రిక శతవసంతోత్సవ వేడుకలు, కృష్ణాజిల్లా రచయితల సంఘం - కేంద్ర సాహిత్య అకాడమి)



# విదేశాలలో మినీకవిత - కొత్త పుంతలు

కవి హృదయాన్ని అందమైన భాషలో అవిష్కరించటమే కవిత్వం. కాళిదాసాదుల కాలం నుంచీ కాళోజీల దాకా పడిన పాద ముద్రలే తెలుగు కవితకు అమ్మానాన్న!

ఒక నాటి తీరిక నేటి సమాజానికి లేదు. జీవితం అంటే ఆనాటి దృక్పథం వేరు. నేటి జీవనం వేరు.

పాశ్చాత్య సమాజంలో పవిత్రతా వాదులు సృజనాత్మక సాహిత్యం, సంగీతం ఇవన్నీ ఇహలోక భావనను పెంచేవనే భావనతో, సృజనాత్మక రచనా రీతిని పాపకార్యం అనేవాళ్ళు. పాణిని కాలానికి కావ్యరచన పాపకార్యంగానే భారతదేశంలో భావించబడింది. 'జాంబవతి విలాసం' కావ్యాన్ని స్వయంగా వ్రాసి పాణిని కావ్యభాషగా సంస్కృతాన్ని తీర్చిదిద్దడానికి ఆయన చేసిన కృషి గొప్పది.

కాలక్రమంలో కావ్యరచన మోక్షహేతువయ్యింది మనకి. ఋషి కాని వాడు కావ్యం వ్రాయలేదని, కవితా రచన మోక్ష హేతువులలో ఒకటనీ భావించుకొన్న సంస్కృతి లోంచి తెలుగు కవిత పుట్టింది. ప్రాచ్య పాశ్చాత్య కవితా రీతులకు మౌలికమైన తేడా ఇక్కడే ఉంది. కవిత్వానికి పునాదులు ఆ జాతి తాత్విక చింతన ఆలంబనగా ఏర్పడతాయి.

క్రీ. శ. తొలి శతబ్దాల నాటి శాతవాహన ప్రభువు హాలుడు సంకలనం చేసిన గాథా సప్తశతి రోజుల్లోనే తెలుగు నేలమీద స్వేచ్ఛాకవిత రాజ్యం ఏలింది. నన్నయ తరువాత పాల్కురికి సోమనాథుడు దేశి కవిత అవసరాన్ని నొక్కి చెప్పాడు. "అల్పాక్షరముల ననల్పార్థ రచన కల్పించుటయు కాదె కవి వివేకంబు...?"అని వెయ్యేళ్ళ క్రితమే ప్రశ్నించినవాడాయన.

నిడివి ఎక్కువైతే కవిత్వం పలచబడుతుంది, దట్టంగా అల్లుకొన్న భావం సాగి, చీరిక లౌతుందని తెలుగు కవిత్వానికి సంబంధించి నంతవరకూ తొలిసారిగా గుర్తించినవాడు పాల్కురికి.

ఒక సామాజిక ఉద్యమం ఏర్పడినప్పుడు వాటి ప్రభావం సాహిత్యాది కళల మీద తప్పకుండా ప్రసరిస్తుంది. సాధారణంగా కవులు త్వరగా ప్రతిస్పందిస్తారు. అమెరికా స్వాతంత్ర్య పోరాటం ప్రభావం అమెరికన్ కవిత్వ తత్వాన్నే మార్చేసింది. ఫ్రెంచి విప్లవం ప్రపంచ సాహిత్య తీరుతెన్నుల్ని కొత్త లోకాలకు మళ్ళించింది. భారత స్వాతంత్ర్య సమరం దేశభక్తిని, భావప్రకటనా స్వేచ్ఛను కవిత్వంలో ప్రతిబింబించేందుకు దోహదపడింది.

ఆధునిక యుగంలో నిజాన్ని నగ్నంగా ఆవిష్కరించే ధోరణిని తెలుగులో దిగంబర కవిత ప్రవేశ పెట్టింది. దాని ప్రభావం విప్లవకవిత ఆవిష్కరణకు ఎంతగానో కారణం అయ్యింది. అభ్యుదయ, విప్లవ కవితా ధోరణులు రెండూ రెండు ధృవాలై కవితా రీతులను శాసించిన కాలంలో, కవిత్వం తిరుగుబాటు ధోరణులకు మాత్రమే పరిమితం అయ్యింది. దైనందిన జీవిత సమస్యలు, మానవ సంబంధాలు అప్రధానం అయ్యాయి. సుదీర్ఘమైన సిద్ధాంత చర్చలు తప్ప కవితాత్మకత అనేది అపురూపం అయినప్పుడు, సంక్షిప్తత, దేశీయత అనే వెయ్యేళ్ళ నాటి పాల్కురికి సోమనాథుని ఆలోచనలకు కార్యరూపం ఇవ్వటం ఒక తప్పనిసరి అయ్యింది. ఈ నేపథ్యంలోనే 1978లో తెలుగులో మినీకవితా ఉద్యమం ప్రారంభం అయ్యింది.

కొత్త రూపంలో, కొత్త భావాలతో, కొత్త అంశాలతో మినీకవిత ఆనాటి తెలుగు యువతను ఎంతగానో ఆకట్టుకొంది. ఇప్పుడు లబ్ధప్రతిష్టులైన కవులు ఎందరో మినీ కవితా ఉద్యమం నేపథ్యం లోంచి వచ్చిన వారు ఉన్నారు. మినీకవితలంటే శబ్ద చిత్రాలు మినీ కవితలంటే మెరుపులు, మినీకవితలంటే ప్రభంజనాలు అన్నంతగా ఆనాటి ఉద్యమం నడిచింది.

ఆంగ్ల కవులు కూడా లయాన్విత కవిత్వీకరణకు, సూటిదనానికి చిన్న రూపాలు అనువుగా ఉంటాయని భావించారు. వాళ్ళ భాష, వాళ్ళ సామాజిక జీవన పరిస్థితులు కూడా అందుకు దోహదపడేవిగా ఉంటాయి. ఒక కవితలో చెప్పిన భావాలకన్నా, చెప్పకుండా దాచి, పాఠకుని ఆలోచనలకు పదును పెట్టే ధ్వనిగర్భిత కవిత్వం చిన్న రూపంలో ఒదిగినట్టు పెద్దకవితలో కనిపించదని కూడా అనేకమంది విమర్శకులు భావించారు. ఆసు రాజేంద్ర రాసిన"ఆకాశమంత ఉందికదా అని/వాన చినుకు/సముద్రాన్ని

ఆశ్రయిస్తే/దాని బతుకూ ఉప్పన అయిపోయింది" అనే మినీ కవిత ఇందుకు చక్కని ఉదాహరణ. అనువుకాని వారితో స్నేహం అనర్థదాయకం అని కవి హెచ్చరిక.

ఇంగ్లీషులో ఉన్నదంతా అంతర్జాతీయ కవిత అనే భ్రమలోంచి బయటకు వస్తే, తెలుగు కవితలు ఇప్పుడు వస్తున్న ఇంగ్లీషు కవితలకు ఏ మాత్రం తీసిపోవు. మన తెలుగు కవులు ఏ అంతర్జాతీయ కవులకన్నా తక్కువేమీ కారని మొదట గుర్తించాలి.

మినీ కవిత ప్రారంభం అయిన కాలంలోనే, హైకూ' అనే జపానీ లఘురూపం ప్రేరణతో ఇస్మాయిల్ ప్రభృతులు తెలుగులో కొత్త ప్రక్రియకు ప్రారంభం పలకగా, నానీలు, రెక్కలు, దాదీలు, తాతీలు, చిట్టీలు, పొట్టీలు ఇలా ఎన్నో ప్రయోగాలు తెలుగులో వచ్చాయి. ప్రయోగాలు చేయటం కవికి సహజ లక్షణం. ఎవరూ చెప్పని కొత్త విషయాన్ని కొత్తగా చెప్పాలనే తపనే కవికి రాణింపు నిస్తుంది.

ఆ కొత్త దనం బుర్రకు తట్టాలంటే, ప్రపంచ పోకడ కూడా రచయిత గమనిస్తూ ఉండాలి. ఒకప్పటికన్నా ఇప్పుడు ఇంటర్నెట్ సౌకర్యం అందుబాటులోకి వచ్చింది. అరచేతిలో ప్రపంచాన్ని అందుకోగలిగే అవకాశం ఏర్పడింది. తమ రచనలను నెట్లో ఉంచాలని కవులు బాగా ప్రయత్నిస్తున్నారు. ఫేసుబుక్, ట్విట్టర్, బ్లాగుల్లాంటి అవకాశాలెన్నో సామాన్యుడి స్థాయికి వచ్చేశాయి. ఎంత ఎక్కువ సాహిత్యం చదివితే అంత రాణింపు వచ్చే అవకాశం ఈ రోజున ఉంది. అందుకే, తెలుగు లోకి తెచ్చుకొని మనకు తగ్గ రీతిలో మలచుకొనేందుకు అవకాశం ఉన్న కొన్ని ఆంగ్ల లఘురూపాలను పరిచయం చేయటం ఈ వ్యాసం లక్ష్యం.

ఒకప్పుడు ఆంగ్లంలో సానెట్స్ ఎక్కువ ప్రాచుర్యం పొందాయి. 14-15 పాదాల కవిత ఇది. సానెట్ పేరు చెప్పగానే, ఎమెర్సన్ రాసిన "ఎ ఫేబుల్" చటుక్కున గుర్తుకొస్తుంది.

"కొండకీ ఒక ఉడుతకూ

తగువయ్యింది

కొండ ఉడుతతో అంది కదా..." అనే అర్థంతో మొదలయ్యే ఈ కవితలో ఆఖరున ఉడత అంటుంది:

"మహారణ్యాన్ని నేను వీపున మోయలేను,

చిన్న పప్పుగింజని నువ్వు కొరకలేవు" అని! ఎవరి గొప్ప వారిది, ఎవరి బలహీనత వారిది- ఏనుగు నుండి దోమ దాకా దేన్నీ లోకువగా చూడనవసరం లేదని ఈ సానెట్

చెప్తుంది. దీన్ని పీడిత తాడిత వర్గాల అభ్యున్నతికి అన్వయించి ఎంత వ్యాఖ్యాన్నయినా చేయవచ్చు.

ఇటాలియన్ సానెట్, పెట్రార్చియన్ సానెట్ లాంటి ప్రక్రియల్లో ఆంగ్ల కవితలు ఇప్పుడు బాగా వస్తున్నాయి. స్పెన్సర్, హోరేస్ పేర్లతో కొన్ని కొత్త కవితా రూపాలు కూడా వెలిశాయి. జపానీ హైకూల ప్రభావం తెలుగుకవుల మీద బాగా ఉంది. హైకూలే కాదు, కొత్త లఘు కవితా రూపాలు మరికొన్ని జపాన్లో ఇప్పుడు వ్యాప్తిలో ఉన్నాయి.

## Senryu కవిత :

సమాజమూ,మానవ సంబంధాలను దృష్టిలో పెట్టుకొని 'సెంద్ర్యూ' కవిత రూపొందింది. ఇది 3 పాదాల కవిత. హాస్యం, వ్యంగ్యం ఇందులో ప్రధానంగా ఉంటాయి. దాని నడక ఇలా ఉంటుంది:

"తల దువ్వకొంటున్నాను
అద్దంలో కనిపించే ముఖం
అది మా అమ్మది"

ఈ కవితలో యతులూ, ప్రాసలూ,గణాలు, పాదాలు పదాల నియమాలేవీ లేవు. తక్కువ మాటలు ఎక్కువ భావం దీని లక్ష్యంగా కనిపిస్తుంది. ఇలాంటిదే ఇంకో 'సెంద్ర్యూ' కవితను పరిశీలించండి:

"రాత్రి ఆకాశం
ఆ పిల్లవాడు
చుక్కల ఓడల్ని చిత్రిస్తున్నాడు"

ఇది చంద్రుణ్ణి భావుకతకు సంకేతంగా చూపిస్తున్న కవిత. చంద్రుణ్ణి మనం మనః కారకుడిగా భావిస్తాం. జపాన్ వారికి అది కొత్త కావచ్చు అందుకే ఈ కవితను చాలా మంది విమర్శకులు గొప్పగా ఉదహరించారు.

## Tanka కవిత :

జపాన్ వారి మరో లఘు కవితా ప్రక్రియ టాంకా కవిత. "దుమ్ములో సూరీదు" అనే ఈ టాంకా కవితను చూడండి:

"సూర్య కిరణాలు ప్రవహిస్తున్నాయి
మొగ్గ తొడుక్కుంటున్న కొమ్మల గుండా
వసంతం అడవిలోకి వచ్చింది
దుమ్ముకణాలు తేలుతూ
నేలను చేరుతున్నాయి"

సూర్యుడు లేకపోతే పత్రహరితం లేదు, ప్రకృతి లేదు. సూర్యుడు ఒక జవం, జీవం, ఒక చైతన్యం. లోకానికి వసంతాన్ని తెచ్చేది సూరీడే! సూరీడుని అభ్యుదయ చైతన్యానికి ప్రతీకగా చిత్రిస్తున్న ఈ టాంకా కవితలో మొదటి మూడు పాదాలు విషయాన్ని ప్రతిపాదిస్తే చివరి రెండు పాదాలు దానికొక గమ్యాన్ని చూపిస్తున్నాయి.

## Sinquain కవిత :

సింక్వాయిన్ కవిత ఒక ఆంగ్ల లఘు కవితా రూపం. ఇది 5 పాదాల ప్రక్రియ. మొదటి పాదం కవితా శీర్షిక అవుతుంది. తరువాత రెండు పదాల పాదం, మూడుపదాల పాదం, నాలుగుపదాల పాదం వరుసగా ఉంటాయి.

"డైనోసార్లు
ఒకప్పుడు ఉన్నాయి
ఎన్నో ఏళ్ళప్పుడు, కానీ
కేవలం మట్టీ ఇంకొన్ని కలలు
మిగిలున్నాయి"

ఇది సింక్వాయిన్ కవితకు ఒక ఉదాహరణ. దీన్ని ట్రయాంగిల్ కవిత అని కూడా అంటారు. ప్రతీ పాదాన్నీ మధ్యకు తెచ్చి పేరిస్తే పిరమిడ్ ఆకారంలో ఉంటుంది. అందుకని పిరమిడ్ కవిత అని కూడా పిలుస్తారు. ఇందులో ప్రతి పాదానికీ ఒకప్రత్యేకత ఉంటుంది. మొదటి పాదం శీర్షిక, రెండో పాదం విషయ విశ్లేషణ, మూడో పాదం దాని పూర్వాపరాలు, నాలుగో పాదం దాని భావావేశం ఉంటాయి. 5వ పాదంలో ఒకే పదం ఉంటుంది. అది శీర్షిక కొనసాగింపుగా ఉంటుంది. ఒకటీ ఐదవ పాదాలను కలిపి, "డైనోసార్లు మిగిలున్నాయి" అని అర్థం సాధించటం కవి లక్ష్యం. రాతి యుగాలనాటి చాందస భావజాలంలోంచి బయట పడాలనే సందేశం ఇందులో కనిపిస్తుంది.

## Blank verse కవిత :

ఛందోబందోబస్తులను తెంచుకొని పుట్టిన వచనకవితలో ఒక చిన్నరూపాన్ని Blank verse అంటారు. A poem written in unrhymed iambic pentameter and is often unobtrusive అని దీనికి నిర్వచనం. అంత్య ప్రాశలు యతి ప్రాసల నియమం లేకుండానే లయబద్ధంగా మాట్లాడే తీరులో ఈ కవిత ఉంటుంది. లయాన్విత కవితాత్మక వచనాన్ని బ్లాంక్ వెర్స్ అని నిర్వచించవచ్చు.

"ఆ కుర్రాడేం చేస్తున్నాడిప్పుడు,
బంతి పారేసుకున్నాడే వాడు?
ఏంటి ఏంటి వాడు చెయ్యాలనుకుంటోంది?
నేను చూశాను... దాన్ని
గొప్పగా గెంతుకొంటూ, నడివీధిలో, ఆ తర్వాత
గొప్పగా అక్కడ ఆ నీళ్ళలో!"

John Berryman రాసిన The Ball Poem అనే కవితకు ఇది తెలుగు అనువాదం. ఇందులో పైకి కనిపించే భావం ఏమీ లేదు. పైగా చాలా సాధారణమైన విషయం. బంతాట ఆడుకొంటున్న కుర్రాడు విసిరిన బంతి, వీధిలో ఎగురుకొంటూ వెళ్ళి నీళ్ళలో పడింది. దీని ద్వారా రచయిత చెప్పదలచుకొన్నది ఏమయినా ఉన్నదా? బాల భారతంలో ద్రోణుడు బావిలోంచి బాణాలతో బంతిని తీసి ఇచ్చిన కథ లాంటిదీ ఇందులో కనిపించదు. కానీ, భూగోళంతో ఆడుకోవటం ఒక పిల్ల చేష్ట. చివరికి అది ఎవరికీ దక్కకుండా పోతుంది...అనే హెచ్చరిక ఇందులో దాగి ఉంది. ఇంకొకరికి మరో అర్థం ఏదయినా ఇలానే స్ఫురించవచ్చు కూడా. ఓ తెల్ల కాయితాన్ని ఇచ్చి ఎవరి ఊహను వారు చిత్రించుకోవాలని కాబోలు ఈ కవితను Blank verse అన్నారు.

## Epigram కవిత :

టెలిగ్రాంలలో వాడే భాష, లేదా ఎస్సెమ్మెస్సులు ఇచ్చేందుకు వాడే భాషని ఉపయోగించి తయారు చేసిన హాస్య స్ఫోరక కవిత ఇది. "ఎపి" అనేది శాసనాలకు సంబంధించిన పదం. అది దీనికి పేరుగా స్థిరపడి, ఎపిగ్రామ్ కవిత అయ్యింది.

"ఎపిగ్రామ్

పొట్టి ఆకారం

సంక్షిప్తత శరీరం

వ్యంగ్యం ప్రాకారం"

ఎపిగ్రామ్ కవితకు నిర్వచనాన్ని ఇలా ఎపిగ్రామ్ పద్ధతిలోనే రాయవచ్చు. దీని రూపం చాలా విలక్షణంగా ఉంటుంది. ఒక ఎపిగ్రామ్ కవితను పరిశీలించండి:

"చక్కెర

దొరికితే లక్కేరా

కానీ, మద్యం

దొరకటం తథ్యం"

ఇందులోని లోతైన భావాన్ని మాటలతో వివరించే ప్రయత్నం చేస్తే, స్వారస్యం చచ్చి పోతుంది. దాన్ని దానిగానే అర్థం చేసుకోగలగాలి. మన దేశంలోనూ,రాష్ట్రంలోనూ ఉన్న పరిస్థితికి అద్దం పడుతున్నదీ అంతర్జాతీయ కవిత.

"ఒప్పుకొంటున్నా తమరి రూలు

ప్రతీ కవీ ఒక ఫూలు

నిలువెత్తు నిదర్శనం మీరే

ఫూల్సందరూ కవులు కారే!"

అనేది ఎపిగ్రామ్ రచనకు ఇంకో ఉదాహరణ. పొడిమాటలతో ఇది కనిపించినా ఇందులో లయ ఉంది, ప్రాస నియమాలున్నాయి. అతి తక్కువ మాటలతో గొప్ప ఆలోచనాత్మకతను కలిగించటం దీని లక్ష్యం. అల్పాక్షరాలతో అనల్పార్థ రచనకు ఇది మంచి ఉదాహరణ.

## Epitaph కవిత :

విషాదాన్నీ, మరణాన్నీ చిత్రిస్తూ, సంతాప సూచకంగా చెప్పే కవితను ఎపిటాఫ్ కవిత అంటారు. తక్కువ పాదాలలో కవితాత్మకంగా ఉంటుంది. సమాధుల మీద చెక్కేందుకు ఉపయోగకరంగా ఉంటుంది. "పుటక నీది/చావు నీది/బతుకంతా దేశానిది" అంటూ జేపీ మీద కాళోజీ వ్రాసిన ప్రసిద్ధ కవిత ఈ ఎపిటాఫ్ కవితకు చక్కని ఉదాహరణ!

"అబ్బో! ఆయన గొప్ప వైద్యుడు
ఇంకా గొప్ప స్నేహశీలి
అద్భుతమైన మేథావి

చిట్టచివరి రోజున తప్ప!" ఇలా ఉంటుంది ఎపిటాఫ్ కవితా రూపం. విదేశీ కవితలో వ్యంగ్యాన్ని పులిహోరలో జీడిపప్పు తాలింపు పెట్టినట్టు జోడిస్తున్నారు. మన కవులు ఈ విషయాన్ని గమనించాలి. వ్యంగ్యం ఎక్కువమంది పాఠకుల్ని పెంచుతుంది.

## Terza Rima కవిత :

తెర్జా రీమా కూడా జపానీ లఘుకవితా రూపాలలో ఒకటి.

వసంతంలో నవజీవనం మొదలు
జీవితానికి వసంతం ఇవ్వాలని
ఏప్రిల్ నెలలో వాన చినుకులు
హరితాంకురాలు అవుపిస్తూ
పక్షులు వెనక్కి వలస వస్తూ
అలసిన రెక్కలకు విశ్రాంతి అవ్వాలని

ఒకటీ మూడూ పాదాలకు అంత్య ప్రాసని గమనించవచ్చు. ప్రతీ పాదంలోనూ 6-10 పదాల వరకూ ఉంటాయి.

## ABC కవిత :

ఒక భావావేశాన్ని, ఒక చిత్రాన్ని, ఒక అనుభూతిని కళ్ళకు కడుతూ, ఐదు లైన్లలో ఉండే కవితా ప్రక్రియ ఏబీసీ కవిత. ఐదు పాదాలలో చక్కని భావావేశం, చిక్కని శబ్ద చిత్రం, అంతులేని అనుభూతిని కలిగించటం దీని పరమావధి. ఇందులో ప్రతీ పాదంలోనూ మొదటి పదాలు అకారాది క్రమంలో ఉంటాయి. అందుకని ఏ బీ సీ కవిత అనే పేరు వచ్చింది. 5వ పాదం మకుటంగా ఉంటుంది. మచ్చుకొక ఆంగ్ల కవితను పరిశీలిద్దాం.

A lthough things are not perfect
B ecause of trial or pain
C ontinue in thanks giving
D o not begin to blame
E ven when the times are hard
F ierce winds are bound to blow

## Acrostic కవిత :

మొదటి అక్షరం లేదా మొదటి పదం ఒక భావోద్దీప్తిని కలిగించేదిగా ఉన్నప్పుడు దాన్ని Acrostic కవిత అంటారు. ఈ ఉదాహరణ పరిశీలించండి.

C reamy or

H ot, it makes my mouth scream

O n and on

C hocolate, chocolate

O h, yum

L uscious chocolate, I can't believe I

A te it all. It

T ickles my throat

E ach time I eat it, mmm oh I love chocolate.

మొదటి అక్షరాలన్నీ కలిపి ఆ కవిత శీర్షికగా నడిపిస్తే, మంచి మినీ కవిత అవుతుంది. ఇలాంటి ప్రయోగాలు లోకోపకారకంగా ఉండాలి. మనవాళ్ళు సన్మాన పత్రాల రచనల్లోనూ, పెళ్ళిళ్ళప్పుడు పంచరత్నాల రచనల్లోనూ ఇలాంటివి ఎక్కువగా చేస్తుంటారు. వైవాహిక, సాంసారిక జీవితాన్ని గురించి, లోకం పోకడల గురించి, సమాజం గురించి విశ్లేషణాత్మకమైన మినీకవితలను ఇచ్చే పద్ధతిని తెలుగులోకూడా తీసుకు రాగలిగితే అందరూ చదివే అవకాశం ఉంటుంది. కవి అనే వాడు తన భావాన్ని ప్రచారం చేసేందుకు అందివచ్చే ప్రతీ అవకాశాన్నీ సద్వినియోగం చేసుకోవాలి. అది పెళ్లయినా సరే, చావైనా సరే!

దేశీయతను సాధించ గలిగితే, తెలుగు కవిత సంపన్నమే అవుతుంది. తెలుగులో చిన్న కవితలదే రాజ్యం. విదేశాలలోనూ చిన్న రూపాలకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తున్నారు. అల్పాక్షరాలు, అనల్పార్థాలే ప్రపంచ కవితను పాలిస్తాయి. లోకం పోకడ తెలుసుకోవటం వలన మరింత శక్తివంతంగా తెలుగు కవితను తీర్చిన వాళ్లం అవుతాం. అందుకు ఈ వ్యాసం కొంచెం సహకరిస్తుందని ఆశ.



# కన్యాశుల్కం :: సమకాలీన రాజకీయాలు

దేవుడికి వందనం అనే స్థితి నుంచి, దేశానికి వందనం అనే స్థాయికి భారతీయులను మళ్ళించినవాడు బంకించంద్ర చటర్జీ.

దేశమంటే మట్టికాదనీ, మనుషులనీ అంటూ, తన దేశభక్తి గీతం ద్వారా స్వదేశీ భావనను రగిలించి తెలుగు జాతికి దిశానిర్దేశం చేసిన వాడు గురజాడ.

1905లో మొత్తం దేశాన్ని కదిలించి వేసిన వందేమాతరం ఉద్యమం లోంచే స్వదేశీ ఉద్యమం పుట్టింది. "జల్దుకొని కళలెల్ల నేర్చుకు/దేశి సరుకులు నించవోయి" అనే వాక్యాలు గురజాడ స్వదేశీ ఉద్యమానికి తార్కాణాలు.

"నాది ప్రజల ఉద్యమం. దానిని ఎవరిని సంతోష పెట్టడానికైనా వొదులుకోలేను" అని తన డైరీలో 1911మార్చి, 27న గురజాడ రాసుకొన్న మాటలు ఆయనను నవయుగ నిర్మాతగా భాసిల్లచేశాయి.

"విద్యలనెరయ నించిన యాంగిలేయులు" (1912) అనీ, "కన్నుకానని వస్తుతత్త్వము కాంచనేర్చరు. లింగిరీజులు కల్ల నొల్లరు వారి విద్యలకరచి సత్యము నెరసితిన్" అనీ ఆంగ్లేయులను గురజాడ ప్రశంసించినప్పటికీ, ఆంగ్లేయ సంస్కృతి పట్ల ఆయన విముఖతనే ప్రదర్శించారు. "పాశ్చాత్య నాగరికత కొన్ని అంధ విశ్వాసాలను పోగొట్టుతున్న మాట యదార్థమే అయినప్పటికీ, అది ప్రబోధించే స్వాతంత్ర్యము సాంఘిక

ప్రగతి శూన్యమైనది. ఇది సంపూర్ణ స్వాతంత్ర్యము కాదు, నామ మాత్రమైనది."( గురజాడ డైరీ-19o1, పుట215/సం: అవసరాల) "శతాబ్దాల తరబడి రాజకీయ బానిసత్వం వలన మరుగు పడి ఉన్న ఉదాత్త జాతీయ మనః ప్రవృత్తిని విద్యావంతులైన హిందువులకు బహిర్గతం చేసి, వారిలో, వారి ప్రభావానికి లోనౌతున్న వ్యక్తులలో అట్టి వృత్తినే కలిగించటానికే ఇది దోహద పడును.(గోమఠం శ్రీనివాసాచార్యులు గారి హరిశ్చంద్ర నాటకం ఇంగ్లీషు అనువాదానికి గురజాడ పీఠిక)అని స్వదేశీ ఉద్యమం గురించి చెప్పిన వాక్యాలు గురజాడ నిబద్ధతను చాటుతాయి.

గురజాడ స్వహస్తంతో వ్రాసిన "దేశభక్తి" గీతం చిత్తుప్రతిలో "నిన్నవచ్చారింగిలీషులు/మొన్నవచ్చిరి ముసల్మను లటు/ మొన్న వచ్చిన వాడ వీవని/ మరచి, వేరులు బెట్టుకోకోయి" అనే చరణం ఉంది. ఇందులో గురజాడ ప్రదర్శించిన ఆంగ్లేయానుకూలత ఏమీ లేదు. అన్ని కులాల, మతాల వారికీ దేశమే దేవత అనే భావన బలపడుతున్నదశలో అందుకు ప్రతిబంధకంగా నిలిచే వారికి చేసిన హెచ్చరిక ఇది. కానీ ప్రజానాట్య మండలి నిర్మాణ దశలో గురజాడ దేశభక్తి గీతాన్ని ప్రచారం చేస్తున్నప్పుడు తాము కావాలనే ఈ చరణాలను తొలగించి మిగిలిన చరణాలను పాడే వాళ్లమని నాటి ముఖ్య కార్యకర్త ముక్కామల నాగభూషణంగారు నాతో అన్నారు.

హిందూ శబ్దాన్ని దేశీయులనే అర్థంలో గాక, మతస్థులనే అర్థంలో ప్రయోగించి, ఈ దేశంలో అన్యమతస్థులకు తావులేదని వాదించే వాళ్ళ పైన ఇది చురక అని నేను భావిస్తున్నాను.

కాంగ్రెస్ సభలో తాను పాల్గొన్నట్టు రాసుకున్నారు. కానీ, కాంగ్రెస్ లోని మితవాద ధోరణులపట్ల ఆయన తన విసుగుదలని కన్యాశుల్కంలో ఎన్నో పాత్రల ద్వారా ప్రదర్శిస్తారు.

"తమ్ముడూ! గిరీశంగారు గొప్పవారప్షా?" అని బుచ్చమ్మ అడిగితే, వెంకటేశం "గొప్పవారంటే అలా యిలాగా అనుకున్నావా యేవిటీ? సురేంద్రనాథ్ బెనర్జీ అంత గొప్పవారు" అంటాడు. "అతగాడెవరు?" అనడిగితే, వాడికి ఏం చెప్పాలో తెలియక బుర్రగోక్కుని, "అందరికంటే మరీ గొప్పవాడు" అనేస్తాడు.

దేశాన్ని గిరీశంగారు "యెలా మరమ్మత్తు చేస్తున్నార్రా? ' అనడుగుతుంది బుచ్చమ్మ. దానికి వెంకటేశం చెప్పిన సమాధానం ఇది: "నావంటి కుర్రాళ్లకు చదువు చెప్పడం,

(నెమ్మళంగా) చుట్టనేర్పడం, గట్టిగా నాచ్చి కొశ్చన్ అనగా సానివాళ్ల నందరినీ దేశంలోంచి వెళ్లగొట్టడం ఒహటి.

నేషనల్ కాంగ్రెస్ అనగా దివాన్గిరీ చెలాయించడం ఒహటి. ఇప్పుడు తెలిసిందా...?" అని సమాధానం చెప్తాడు వెంకటేశం. నేషనల్ కాంగ్రెస్ అనగా దివాన్గిరీ చెలాయించడం అని అన్నది నాటకంలో ఒక బొడ్డూడని కుర్రాడే అయినప్పటికీ, అది గిరీశం అభిప్రాయంగానే కన్పిస్తుంది. అందుకే మరో సీనులో, గిరీశమే అంటాడు: "ఒక సంవత్సరం గానీ నాకు దేవుడు దివాన్గిరీ యిస్తే, బీమునిపట్టణానికి పాలసముద్రం, విశాఖపట్టణానికి మంచినీళ్ళ సముద్రం, కళింగపట్టణానికి చెరకు సముద్రం తెస్తాను" అని. ఇక్కడ దివాన్గిరీ అంటే కాంగ్రెస్ పదవి.

"పొలిటికల్ మహాస్త్రం అంటే, "ఒకడు చెప్పిందల్లా బాగుందండవే! సమ్మోహనాస్త్రం అంటే అదే కదా...!", "ఒపీనియన్లు అప్పుడప్పుడు చేంజి చేస్తూంటే గానీ పొలిటీషియన్ కానేరడు" లాంటి సంభాషణల్లో కనిపించే ఆనాటి పొలిటీషియన్ నేషనల్ కాంగ్రెస్ వాడే! దేశంలో రాజకీయ సంస్థ ఆనాడు అదొక్కటే కాబట్టి!

"మొన్న బంగాళీవాడు ఈ ఊర్లో లెక్చరిచ్చినప్పుడు ఒక్కడికైనా నోరు పెగిలిందీ...?"

"పెళ్ళి ఆపడానికి బ్రహ్మ శక్యం కాదు. డిమాస్థనీసు, సురేంద్రనాథ్ బానర్జీ వచ్చి చెప్పినా మీ తండ్రి వినడు"

"మొన్న మనం వచ్చిన బండి వాడికి నాషనల్ కాంగ్రెసు విషయమై రెండు ఘంటలు లెక్చరు ఇచ్చేసరికి ఆ గాడిద కొడుకు, వాళ్ల ఊరు హెడ్ కానిస్టేబిల్ని కాంగ్రెసు వారు యెప్పుడు బదిలీ చేస్తారని అడిగాడు. విలేజెస్‌లో లెక్చర్లు యంత మాత్రం కార్యం లేదు..."

"(దేవుణ్ణి ఉద్దేశించి) యిలాంటి చిక్కులు పెట్టావంటే, హెవెన్ లో చిన్న నేషనల్ కాంగ్రెస్ లేవదీస్తాను"

"అన్ని మతాలూ పరిశీలించి వాటి యస్సెన్స్ నిగ్గుతీసి ఒక కొత్తమతాన్ని ఏర్పాటు చేశాను. అదే అమెరికా వెళ్ళి ప్రజ్వలింప చేస్తాను" లాంటివెన్నో ఆనాటి రాజకీయపక్షుల మీద వ్యంగ్యాలు కన్యాశుల్కంలో కనిపిస్తాయి.

"దేశాభిమానం నాకు కద్దని/వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్/పూని యేదైనాను ఒక మేల్/కూర్చి జనులకు చూపవోయ్" దేశభక్తి గీతంలోని ఈ చరణంలో వొట్టి గొప్పలు చెప్పుకోవద్దంటూ పెట్టిన వాత ఎవరిని ఉద్దేశించి చేశాడో తెలియాలి.

నేషనల్ కాంగ్రెసుకు ఆ తొలినాళ్లలోనే గురజాడ అంతగా వాతలు పెట్టటానికి బలమైన కారణాలే ఉన్నాయి. 1905లో లార్డ్ కర్జన్ బెంగాల్ రాష్ట్ర విభజనకు నిరసనగా బెంగాలీలు విదేశీ వస్తు బహిష్కరణ ఉద్యమం ప్రారంభించారు. ఆ సమయంలో వందేమాతరం గీతం బెంగాలంతా ప్రతిధ్వనించింది. అది వందేమాతరం ఉద్యమంగా ప్రసిద్ధి పొంది దేశం అంతా వ్యాపించింది. స్వరాజ్యం, స్వదేశీ, జాతీయ విద్య అనేవి ఈ ఉద్యమ లక్ష్యాలయ్యాయి. 1906 కలకత్తా కాంగ్రెస్ ఈ మూడింటి మీద దృష్టిపెట్టి కొన్ని తీర్మానాలను ఆమోదించింది. బ్రిటీష్ అనుకూలత ద్వారా దేశానికి మంచి సాధించు కోవాలనే ధోరణిలో నేషనల్ కాంగ్రెసును నడుపుకొస్తున్న సర్ ఫిరోజ్ షా మెహతా, సురేంద్రనాథ్ బెనర్జీ, గోఖలే, చిత్తరంజన్ దాస్, మోతీలాల్ నెహ్రూ లాంటి సీనియర్ కాంగ్రెస్ నాయకులు "బోయ్‌కాట్" లాంటి పదజాలం పట్ల వ్యతిరేకత కనపరచారు. లాలాలజపతి రాయ్, లోకమాన్య తిలక్, బిపిన్ చంద్రపాలు ప్రభృతుల నాయకత్వంలో యువకులు పూర్వ మార్గాన్ని వ్యతిరేకించి, బ్రిటిష్ వారి పైన పోరాటానికి సిద్ధపడ్డారు. ఈ ముగ్గరినీ లాల్ బాల్ పాల్ త్రయంగా పేర్కొంటారు. వీళ్లని అతివాదులనీ, చేంజర్స్ అనీ పిలవసాగారు.

ఆ మరుసటి సంవత్సరం 1907లో సూరత్ లో జరిగిన కాంగ్రెస్ మహాసభలలో అతివాదులకూ, మితవాదులకూ తీవ్రమైన విభేదాలు చోటు చేసుకున్నాయి.

మితవాదులు రాస్ విహారీ ఘోష్‌ను కాంగ్రెస్ అధ్యక్షుడిగా సూచించగా, అతివాదుల పక్షాన లాలాలజపతి రాయ్‌ని పోటీకి నిలబెడుతున్నట్టు వేదిక మీదనుంచి తిలక్ ప్రతిపాదించాడు. ఆయన అలా ప్రసంగిస్తూ ఉండగా జనం లోంచి ఒక బూటు వచ్చి వేదికపైన ఉన్న ఫిరోజ్ షా మెహతా చెంపకు తగిలి, పక్కనేఉన్న సురేంద్రనాథ్ బెనర్జీ మీద పడింది. బూటుని మెహతా, బెనర్జీల వర్గం వాళ్ళు తిలక్ మీదకు విసిరారో, తిలక్ వర్గీయులు మెహతా, బెనర్జీల మీదకు విసిరారో ఎవరికీ తెలియదు. బూటు వచ్చి తగిలింది.

"నాగాపురం నుంచి వచ్చిన ప్రతినిధులు లాఠీ కర్రలతో "తిలక్ మహరాజుకీ జై" అనుకొంటూ వేదిక మీదకు ఉరికారు. తరువాత గలాటా పెరిగి ఉభయ పక్షాలవాళ్ళూ

కుర్చీలూ, బెంచీలు కూడా చేత బట్టి విజృంభించారు. అనేకమందికి గాయాలు తగిలి రక్తం స్రవించింది" అదీ సంఘటన. ప్రకాశం పంతులుగారి ప్రత్యక్ష కథనం ఇది.

సరిగ్గా నేటి పరిస్థితికి నాటి పరిస్థితి నకలుగానే ఉంది. దీనికి,తాను ప్రత్యక్ష సాక్షి నంటూ, టంగుటూరి ప్రకాశం "నా జీవిత యాత్ర" గ్రంథంలో ఈ సంఘటనకు ఒక నేపథ్యాన్ని ఇలా విశ్లేషించారు: "ఆ కాలంలో కాంగ్రెస్ కి ఫిరోజిషా మెహతా నియంతవంటి వాడే! కాంగ్రెస్ సంఘాలు అనిగానీ, ప్రతినిధుల్ని ఎన్నుకోవడం గానీ, ప్రతినిధులు ప్రెసిడెంటును ఎన్నుకోవటం గాని ఏమీ లేవు. మెహతా ఎవరి మీద కటాక్ష వీక్షణం చేస్తే వాళ్ళే కాంగ్రెస్ అధ్యక్షులు. తీవ్రవాదులైన తిలక్, లాలాజీలు ఆయన ఆగ్రహానికి గురయిన ముఖ్యులు" అని.

ఇలాంటి పరిస్థితుల్లో, కాంగ్రెస్ పెద్దలను మంచి చేసుకొంటే విజిటింగ్ కార్డు పదవి అయినా సరే, పొందగలిగితే, ప్రభుత్వాదరణ దొరికేదని దీన్ని బట్టి తెలుస్తోంది. గురజాడ లాంటి ఆలోచనా పరుడు ఈ సంస్కృతిని ఆమోదించలేకపోవటమే సహజం. అందుకే, ఒట్టి గొప్పలు చెప్పుకోవద్దని మితవాద కాంగ్రెసుకు చురక వేశాదని నమ్మవచ్చు.

ఆనాటి కాంగ్రెసు తెలుగు వారిలో న్యాపతి సుబ్బారావు ప్రముఖులు. ప్రకాశంగారు ఆయనను మధ్యస్థ వాదిగా పేర్కొన్నారు.

1907 లో బిపిన్ చంద్రపాల్ ఆంధ్ర రాష్ట్ర పర్యటన సమయంలో విశాఖపట్టణంలో ఆయనకు అంతగా ఆదరణ రాలేదు. కాకినాడలో ఒకమోస్తరుగా విజయవంతం అయ్యింది. రాజమండ్రి వచ్చేసరికి అద్భుతమైన విజయాలను సాధించటమే కాదు, తెలుగువారిలో స్వాతంత్ర్య దీప్తిని కలిగించింది. "భరత ఖండంబు పాడియావు" అనే పద్యాన్ని చిలకమర్తివారు ఈ సభలోనే బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాన్ని అనువదిస్తూ ఆశువుగా చెప్పారు.

1897 నుంచీ 1912 వరకూ సంస్థాన వారసత్వ దావా విషయంలో అప్పారావు గారు తలమునకలుగా ఉన్న సమయం అది. ఆయన ప్రత్యక్ష రాజకీయాలతో సంబంధాలు పెట్టుకోకపోయినప్పటికీ, రాజకీయ అవగాహనను ప్రజలలో కలిగించే ప్రయత్నం చేశారు. జాతీయ విషయాలనే కాదు అంతర్జాతీయ విషయాలు కూడా కన్యాశుల్కం నాటకంలో కనిపించటానికి ఈ నేపథ్యం ఓ కారణం కావచ్చు.

హవల్దార్ పాత్ర- సారా కొట్టు సీను: కుంపిణీ నమ్మక్ తిన్నతరువాత ప్రాణం ఉన్నంత కాలం కుంపిణీ బావుటాకి కొలువు చెయ్యాలి. రేపు రుషియాతో యుద్ధం వొస్తే పించను ఫిరకా యావత్తూ బుజాన్ని తుపాకివెయ్యమా?" అంటాడు

"రుస్సావోడి వోడ నీట్లో ములిగి నడస్తాది గదా, నువ్వు తుపాకుతో యవణ్ణి కొడతావు? అని మునసబు రెట్టించి అడుగుతాడు. దానికి హవల్దారు, "మొన్నగాక మొన్న యింగిరీజ్ రుషియా దేశానికి దండెత్తిపోయి, రుషియాని తన్ని తగలాడా లేదా? అప్పుడేవైందో, యిప్పుడూ అదే అవుతుంది. మా రాణి చల్లగా ఉండాలి...!" అంటాడు హవలదారు.

"సీమరాణి ఆ కాళీమాయి అవుతారం కాదా?" అనడిగితే, "కాళీ గీళీ జాంతానై- ఆ రాముడి అవుతారం" అని సమాధానం చెప్తాడు.

నేషనల్ కాంగ్రెస్ మితవాదుల సగటు ఆలోచనాధోరణికి ఇది ప్రతీక. మనుషులు చేసిన దేవుళ్ళారా...మీ పేరేమిటి కథలో కనిపించే శైవ వైష్ణవ భేదాలు ఈ నాటకంలో అదనంగా ధ్వనిస్తాయి.

కన్యాశుల్కం నాటకంలో సార్వజనీనత, సార్వకాలీనతలు కొట్టొచ్చినట్టు కనిపించటానికి గురజాడ ప్రదర్శించిన ఈ రాజకీయ చైతన్యం ఒక కారణం.



# కథకో కథ

మనిషికి మొట్టమొదట ఊహ ఎప్పుడు తెలిసిందో అప్పటినుంచే కథని చెప్పటం కూడా మొదలయ్యింది.

"అనగనగా ఒక రాజు" కథ తెలుగువారి స్వంతం. అస్సామి, బెంగాలీలక్కూడా ఈ కథ తెలుసునంటారు. తెలుగువారు ఈ కథని చాలామందికి చెప్పే వుంటారు!

చెప్పాలనే ఉత్సాహం, వినాలనే ఆసక్తి సమకూరినప్పుడే కథ వస్తుంది. ప్రాచీనమైన జాతులన్నింటిలోనూ కథలు ఇలానే పుట్టాయి. ఎవరి కథ వారిది. ఎవరి కథనం వారిది. ఎవరి విధానం వారిది. 'తెలుగు' అనే మాట తెలుపు, చెప్పు అనే అర్థంలో ఏర్పడింది. కాబట్టి చెప్పటంలో 'తెలుగు' వారు దిట్టలు కథల్ని కూడా!

వాల్మీకి చెప్పిన రామాయణం, వ్యాసుడు చెప్పిన భారతం, హోమర్ చెప్పిన ఇలియడ్, ఒడిస్సీ... ఇవన్నీ మొదట కథలుగానే పుట్టాయి. ఆయా కథకులు వీటిని అందమైన కావ్యాలుగా మలిచారు.

కథను చెప్పటంలో ఒక లయ, ఒక కవితాత్మక ధోరణి, ఒక నాదం, ఒక వాదం, ఒక విధానం... కథను చెప్పేవాడి ప్రతిభని బట్టి, నేర్పుని బట్టి, పరిజ్ఞానాన్ని బట్టి ఆ కథకు వ్యాప్తి వుంటుంది.

కొన్ని కథలు వచనంలో నడిచాయి. కొన్ని పాటలుగా కొన్ని నృత్య రూపకాలుగా మలుచుకున్నాయి. ఇవ్వాళ మనం వాటిని జానపదసాహిత్యం అంటున్నాం. కానీ, ఆ రోజున "నేను జానపదకథని చెప్తున్నాను" అని ఏ జానపదుడూ కథని చెప్పలేదు. వాళ్ళకు చెప్పాలనిపించిన రీతిలో చెప్పారు.

ఆనాటి కథలు సరళ స్వభావం కలిగి వుండేవి. తమ నమ్మకాలు, తమ ఆచారాలు, తాము జీవిస్తున్న పద్ధతులు, తమ ఆహారవ్యవహారాలు, తమకు తరాలుగా సంక్రమిస్తూ వస్తోన్న నమ్మకాలు, శాశ్వత విలువల్ని క్లిష్టత లేని రీతిలో కథల్లో పొదిగి చెప్పుకోవటానికి ప్రయత్నించాడు మనిషి.

అలనాడు పాతకాలంనాటి ఆ కథల్ని పురాణగాథలంటారు. వాటిలో కల్పన కన్నా వాస్తవికత ఎక్కువ. కొన్ని కథలు తమ జాతిమూలాలను వెదికితే, కొన్ని కథలు సృష్టి పుట్టుకను స్పృశిస్తాయి. గతంలోంచి నేర్చుకోవాల్సిన పాఠాన్ని, నైతిక విధానాన్ని మరికొన్ని నిర్దేశిస్తాయి.

జలప్రళయం, ప్రళయానంతర సృష్టి, వంశ విస్తరణలు ఆనాటి కథకు వస్తువులు. ఇలాంటి కథలు ప్రాచీన జాతులందరికీ వున్నాయి. మనువు కథలైనా, నోవా కథలైనా, భూభారాన్ని మోసే ఆదిశేషుడి కథలైనా, అట్లాస్ వీరుడి కథలైనా అసాధ్యకార్యాల్ని సాధించి జాతిని ప్రేరేపించటమే వాటి లక్ష్యం. ఇది ఒక జాతిని చూసి ఇంకొక జాతి అరువు తెచ్చుకున్న స్ఫూర్తితో చెప్పిన కథలు కావు. ఎవరికి వారికి మనసులో కలిగే ఒక ఆదిమ లక్షణం. ప్రతి ప్రాచీన జాతిలోను ఒక అట్లాస్ వుంటాడు. ఒక ఆదిశేషుడు వుంటాడు. ఆ సంస్కృతి వారిని ఎంత పదిలపరుచుకున్నదన్నదే ముఖ్యం. కృష్ణుడి కథలోనూ, క్రీస్తు కథలోనూ ఒకేవిధమైన ఆలోచనాక్రమం కన్పించటానికి ఈ ఆదిమలక్షణమే కారణం.

వీరుల కథలు, దాతల కథలు, వంశపురుషులకథలు, గ్రామదేవతల కథలు ఇలానే పుట్టాయి. కాలక్రమంలో ఇవి దైవపరమైన అంశాలుగా మారి మతగ్రంథాలలో చేరి దేవుడి కథలుగా వ్యాప్తిలోకి వచ్చాయి. స్త్రీల వ్రతకథలు, సత్యనారాయణస్వామి వ్రతకథల్లో మనకు దేవుడితోపాటు జీవితంకూడా కన్పిస్తుంది. ఎవరో మనకు తెలియని అపురూప వ్యక్తుల చరిత్రలు కన్పిస్తాయి. కాని, కథనానికి మతం తోడుకావటం వలన కథకు ప్రచారం బాగా జరిగినా కథలోని మౌలిక లక్షణానికి పెద్దదెబ్బ తగిలింది. మనిషిలో కథ భారాన్ని భగవంతుడిపైన వేయాలనే ప్రబోధంలోకి మళ్ళింది. అపజయాన్ని ఎదుర్కొన్న మనిషి తన అసమర్థతను గ్రహించకుండా, దైవానుగ్రహలోపంగా భావించుకోవటం మానవజాతికి పెద్ద అపకారమే కదా! కథ అందుకు కారణం కాకూడదు!

సంఘంలో కట్టుబాటుకు మతం సంరక్షణ బాధ్యత స్వీకరిస్తుంది. అందుకోసం మొత్తం సామాజికవ్యవస్థని తన గుప్పెటలోకి తీసుకోవటానికి ప్రయత్నిస్తుంది. మతంలేని సమాజం

వుండదు. మతం లేకుండా కథ కూడా వుండని పరిస్థితి అది! అయినా, మతం గుప్పెట్లోంచి బైటపడి రసభావాలంకారాలతో కథ తనను తాను అలంకరించుకోవటానికి కొంతయినా ప్రయత్నిస్తూనే వుంటుంది.

"చేపా! చేపా! ఎందుకు ఎండలేదు....."

"చీమా చీమా ఎందుకు కుట్టావు....." కథల్లాంటివి ఇందుకు ఉదాహరణ. చీమ తన బంగారపు పుట్ట గురించి మాట్లాడుతుంది. ఎవరిల్లు వారికి బంగారమే కదా.....! నేలని తొలుచుకొంటూ, లోపలి మట్టిని తెచ్చి బైటపోస్తూ చీమ ఇల్లు కట్టుకొంటుంది. చీమ తన ఇంటిని భూమిలోపల బంగారు గనులున్నచోట కట్టుకుంటోందనుకోండి. లోపలినుంచి అది తెచ్చిపోసేది బంగారపురజనే కదా.....! దాని పుట్ట బంగారపు పుట్టేకదా! "నా బంగారుపుట్టలో వేలుపెడితే కుట్టనా.....?" అని అది అడుగుతుంది. తెలుగునేల మీద బంగారపు గనులున్నచోట పుట్టిన కథ ఇది అయివుండాలి. మహాభారతంలో బంగారుపుట్టలు పెట్టే చీమల గురించి ప్రస్తావించారని కూడా అంటారు. కథలు ఇలా సమాజంలోంచి పుడతాయి. కథలో సమాజం ఒదిగిపోతుంది.

కథలు ప్రపంచజాతులన్నింటికీ వుంటాయి. ప్రాచీన బాబిలోనియన్, ఈజిప్షియన్ల కథలు క్రీ.పూ. 2000 నాటివి. చాలావరకూ శిలాఫలకాలమీద చిత్రలిపిలో చెక్కివున్నాయి. జాతి వీరగాథలవి! తొలినాటి సుమేరియన్లకు సంబంధించిన వంశ మూలపురుషుల కథలు. పేర్లతో సహా అనేకం మన రామాయణ భాతర ఇతిహాసాల్లో దొరుకుతున్నాయి. అక్కడి సార్గన్ చక్రవర్తి కథ – మన సగర చక్రవర్తి కథ ఒకటే! అహమెనిన్, అసమంజసుడు ఒకరే! ఒకే కుదురులోంచి బయల్దేరిన ఒక జాతి ప్రజలు వివిధ దేశాలలో సంఘర్షణలు – సంలీనాలు కారణంగా వివిధ ప్రజలుగా విస్తరిస్తూ, వెంట తమ కథల్ని తీసుకుపోయారు. ఆ కథలు కల్గించిన ప్రేరణతోనే వారు విజయాలు సాధించారు. ఒకే కథ అనేక జాతుల్లో ఒకే తీరున వుండటానికి, నాగరికతోపాటు, కథ కూడా మానవజాతి విస్తరణలో భాగస్వామ్యం పొందటం ఒక కారణం కావచ్చు. ఇవన్నీ పురాగాథలు. క్రమేణా పురాణగాథలయ్యాయి.

తెలుగువారికి ఈ పురాగాథలు, పురాణగాథలతోపాటు, మనవైన స్వంతకథలు కూడా వున్నాయి. తెలుగుభాష ప్రాకృత–పైశాచీ రూపాంతర భాషగా వెలుగుతున్న రోజుల్లో, క్రీస్తుకు పూర్వమే గుణాఢ్యుడి బృహత్కథ, హాలుని గాథాసప్తశతి లాంటి కథలు తెలుగు నేలమీద పుట్టి పెరిగాయి. క్రీస్తుశకం తొలి శతాబ్దాలకు చెందిన తమిళ సంగసాహిత్యంలో అనేకమంది తెలుగువారి కథలున్నాయి. తెలుగు కథలున్నాయి. పేదరాశిపెద్దమ్మ కథలు,

కాశీమజిలీ కథలు, భట్టి విక్రమార్కుడి కథలు, బాలనాగమ్మ కథలు, పంచతంత్రం కథలు, తెనాలి రామలింగడి కథలు, అక్బర్ బీర్బల్ కథలు – అంతో ఇంతో తెలియని తెలుగువాళ్ళు అరుదుగా వుంటారు.

కథ అనగానే ఎవరికైనా బౌద్ధ జాతకకథలు గుర్తుకురావాలి. క్రీస్తుపూర్వం చివరి శతాబ్దాలకాలంలోనో...క్రీస్తుశకం తొలి శతాబ్దాలోనో వీటి సంకలనం జరిగిందని చరిత్రవేత్తలు చెప్తారు. వాటిలో తెలుగువారి కథలున్నాయి. తెలుగువారి దేవుడు "ఆంధ్రవిష్ణువు" కథ (అంధక వెణ్హుజాతక కథ) కూడా అందులో వుంది. ప్రతికథలోనూ ముఖ్యపాత్రని బుద్ధుడికి ఆపాదిస్తూ ఆ కథని తిరిగి చెప్పటం జాతకకథల్లో కన్పిస్తుంది. రామాయణ భారతేతి హాసాలకన్న ముందు నాటి బౌద్ధ జాతక కథలకు దీటైన కథలు ఇతర దేశాల సాహిత్యాలలో ఎంత వున్నాయో ఎవరైనా పరిశీలించారా? ప్రపంచ కథా సాహిత్య చరిత్రలో ఉన్నతస్థానాన్ని మనకు దక్కనీయకుండా చేయటానికి చరిత్రవేత్తలు వీటిని పలాయనవాద కథలని ముద్రవేశారు. ఈ కుట్రని గమనించక అవే చిలకపలుకుల్ని పలికి, మన విశ్లేషకులు విదేశీ కీర్తననే అందుకున్నారు. ఈ కథలలో భారతీయాత్మని వీరు పసిగట్టలేదు. వేదాల్లోనూ, ఓల్డ్ టెస్టమెంటులోనూ కథల మధ్య పోలికలను కూడా గట్టిగా అధ్యయనం చెయ్యలేదు.

ఈ కథలు వెలువడిన 1500 ఏళ్ళ తర్వాత క్రీ.శ. 14వ శతాబ్దిలో కొన్ని రోమన్ ఉపాఖ్యానాన్ని (ANECDOTES) సేకరించి, "బెస్టా మనోరోమ్" పేరుతో ఒక సంకలనాన్ని వెలువరించారట. సాహిత్య చరిత్రకారులు ప్రపంచకథా సాహిత్యంలో ఇదే తొలి కథా సంకలనంగా ప్రకటించి మన కథల గురించి ఏమీ తెలయనట్టు ఊరుకున్నారు.

రోమన్లు ఇలా తమ పాతకథల్ని నెమరువేసుకొంటున్న కాలానికన్నా ఎంతోముందే, తెలుగుభాషలో పరిణతి – పరిపుష్టినొందిన కాల్పనిక కథాసాహిత్యం వెలువడింది.

క్రీ.శ. 12వ శతాబ్దికి చెందిన పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్ర, బసవపురాణం పేర్లతో ఒక వ్యక్తి చరిత్రని అందులో అనేకమంది శివభక్తుల కథల్ని చేర్చి, ప్రజల భాషలో వెలువరించిన సాహసి, తెలుగు వాఙ్మయాన్ని జాను తెలుగుపదాలతో పరిపుష్టినొందించిన గొప్ప కథకుడు సోమనాథుడు.

సోమనాథుడి కాలానికి సంస్కృతభాషా వ్యామోహం తెలుగుపదాల్ని కబళించినట్టే, యూరప్‌లో కూడా ఫ్రెంచి లాటిన్ భాషలో స్థానిక భాషల్ని కబళించాయి. ఆ పరిస్థితుల్లో

1343–1400కి చెందిన గెఫ్రీబాసర్ "కాంటర్ బరీ కథలు" వగైరా... Vemacular English - సామాన్యుడు మాట్లాడే ఆంగ్లంలోకి సాహిత్యాన్ని మళ్ళించగలిగినట్లు సాహిత్య చరిత్రకారులు బానర్‌ని ప్రశంసిస్తూ వుంటారు. అంతకు 100 ఏళ్ళముందే సోమనాథుడు ప్రజలభాషలో తెలుగు సాహిత్యాన్ని సృష్టించిన వైనాన్ని మనం కనీసం నోరు తెరిచి చెప్పటంలేదు.

మనుమసిద్ధి కొలువులో తిక్కన ఉభయ కవిమిత్ర బిరుదం పొందాడు. తనకు సంస్కృత పాండిత్యం సమృద్ధిగా ఉన్నా, అచ్చ తెలుగు నుడికారాలతో మహాభారత రచనకు పూనుకున్నవాడు తిక్కన. ప్రపంచ సాహిత్యాన్ని వెదకండి – తిక్కన యుగంలో తిక్కనతో సమానమైన కథకుడు ప్రజల భాషకు అంకితమైనవాడు మరొకడు కన్పించగలడా...? కానీ, మన ఔన్నత్యాన్ని లోకానికి చాటడానికి మనం గట్టిగానే మొహమాటపడ్తున్నాం. సోమనాథుడు, తిక్కనల కృషికి చారిత్రక గౌరవం దక్కాలి.

ప్రబంధ కవులలో స్వకపోల కల్పితంగా "కళాపూర్ణోదయం" కథని చెప్పిన పింగళి సూరనతో సమానమైన కథారచయిత, ఆయన సమకాలీనంలో యూరోపియన్ సాహిత్యంలో ఇంకొకడు కన్పిస్తాడా?

అయ్యలరాజు నారాయణామాత్య 'హంసవింశతి' కదిరీపతి "శుకసప్తతి"లాంటి తెలుగుకథా కావ్యాలు రచయిత కల్పనా చమత్కృతికి తార్కాణాలు. 17–18 శతాబ్దాల దాకా, యూరప్‌లో తిరిగి చెప్పిన పాత కథలే రచనలుగా సాగాయి. కానీ, సమాంతర యుగంలో తెలుగువారు సృజనాత్మకమైన కథల్ని పండించారు.

17వ శతాబ్ది తర్వాత భారతదేశం బానిసత్వంలో మగ్గుతుంటే, తెలుగునేల మీద కోస్తాజిల్లాలు ఫ్రెంచి–బ్రిటిషర్ల ఆధిపత్యపోరులో నలిగిపోయాయి. తెలంగాణా జిల్లాలు నిజాం నిరంకుశంలో నలిగిపోయాయి. రాయలసీమ జిల్లాలను దత్తత పొంది, బ్రిటిష్ కర్కశత్వం స్వేచ్ఛను అపహరించిన రోజులవి. ఈ దశలో తెలుగులో సృజనాత్మక రచనలకు అవకాశమే లేదు. సిపాయిల తిరుగుబాటు తర్వాత రాజకీయ చైతన్యంతో సాహిత్య వ్యాసంగం పునరుత్థానం పొందాకే నూతన సాహిత్య ప్రక్రియల గురించి ఆలోచించగలిగే అవకాశం తెలుగు కవులకు, కథకులకు లభించింది.

17–18 శతాబ్దాల కాలంలో తెలుగు కథ వెనుకంజలో వుండగా, బానిసత్వం సంకెళ్ళు తెంచుకొని, స్వేచ్ఛావాయువులు పీల్చుకొని అమెరికా సాంస్కృతికంగా ఎంతో ఎదిగింది.

ఆధునిక కథా సాహిత్యానికి అమెరికా పుట్టినిల్లు. అమెరికా లేకపోతే "ఇంగ్లీషు షార్ట్ స్టోరీ" అనేది లేదు.

1819లో అమెరికన్ కథా రచయిత, వాషింగ్టన్ ఇర్వింగ్ "లిప్‌వాన్ వింకిల్" కథ కథాసాహిత్యాన్ని ఒక మలుపు తిప్పింది. 18వ శతాబ్దపు ఇంగ్లీషు పత్రిక "ది స్పెక్టేటర్" సంపాదకులు జోసఫ్ ఎడిసన్, సర్ రిచర్డ్‌స్టీవ్ కథాసాహిత్యంకోసం అమోఘమైన కృషిచేశారు.

అప్పటివరకూ కథ గురించి ఇంగ్లీషు రచయితల ఆలోచనల్లో అనేక మార్పులు చోటుచేసుకున్నాయి. చిన్నదిగా చేసి వచనంలో చెప్పినదాన్ని "షార్ట్‌స్టోరీ" అనీ, పెద్దదిగా చేసి, పద్యంలో చెప్పటాన్ని కావ్యం అని, పెద్దదిగా చేసి వచనంలో చెప్పటాన్ని నవల (Novel) అనీ, షార్ట్‌స్టోరీ కన్న పెద్దది నవలకన్న చిన్నదిగా చెప్పిన కథని Novella - నవలిక అనీ కాలక్రమంలో ఇలాంటి ప్రక్రియాభేదాలు ఏర్పడ్డాయి.

1860-1904 మధ్యకాలంలో జీవించిన రష్యన్ కథారచయిత యాంటోన్ పోవ్లోవిచ్ చెకోవ్ వైద్యవృత్తిని చేస్తూనే, అద్భుతమైన షార్ట్ స్టోరీలను వెలయించాడు. 1885లో "ది కుక్స్ వెడ్డింగ్"నుంచి 1902 "ది బిషప్" వరకూ చెకోవ్ చెప్పిన కథలు చర్చ జరగటానికి చెకోవ్ కథలు కారణభూతమైనాయి.

మొదటి అంకంలో ఒక తుపాకీ గోడకు వ్రేలాడుతున్నట్లు కన్పిస్తే, మూడో అంకం అయ్యేసరికి ఆ తుపాకీ పేలాలి - అనే చెకోవ్ హితవచనం ఈనాటికీ కథలు చెప్పేవారికి శిరోధార్యంగానే వుంది. కథా రచనకు ఇది మూలసూత్రం.

అమెరికన్ కథా రచయిత ఎడ్గర్ అలన్ పో (1809-1849) "ది ఫిలాసఫీ ఆఫ్ కంపోజిషన్ - సిద్ధాంత గ్రంథం షార్ట్‌స్టోరీ విషయంలో ఒక అవగాహనని కల్గించింది. డిటెక్టివ్ కథలు, సైన్స్‌ఫిక్షన్ - ప్రక్రియలకూడా ఈయనే ఆద్యుడు. 1901లో బ్రాండర్ మాథ్యుస్ "ది ఫిలాసఫీ ఆఫ్ ద షార్ట్ స్టోరీ" సిద్ధాంత గ్రంథాన్ని వెలువరించాడు. సాహిత్య ప్రక్రియలలో షార్ట్ స్టోరీ అనేది చాలా ఆలస్యంగా ఏర్పడిన ఒక పరిణామంగా ఆయన పేర్కొన్నాడు. మనిషి నాగరికుడు అయ్యాక "షార్ట్ స్టోరీ" పుట్టడానికి అనేక వేల ఏళ్ళే పట్టిందనాలి ! వార్తా పత్రికలు విస్తృతంగా ప్రోత్సహించటం వలనే షార్ట్‌స్టోరీ జననం సాధ్యం అయ్యింది.

కొన్ని అవసరాలు, కొన్ని సాంకేతిక పరిణామాలు, కొన్ని ఆధునిక పరిస్థితులు ఇవి అనేక సందర్భాలలో ఇలా అనేక సాహితీ ప్రక్రియలు రూపొందటానికి కారణం అయ్యాయి.

టాబ్లాయిడ్ సైజులో వార్తాపత్రిక వెలువడుతున్నప్పుడు ఒక పేజిలో ఇమిడే 'షార్ట్‌స్టోరీ'ల అవసరం ఏర్పడింది. అంతకన్నా చిన్నదిగా డెమ్మి-క్రౌన్ సైజులలో పత్రికలో వెలువడు తున్నప్పుడు "షార్ట్ స్టోరీ"ల పేరుతో మరింత చిన్న కథలు రూపొందాయి. పేజీ కథలు కాలం దాటని కథలు, పోస్ట్ కార్డ్ కథలు - ఇలాంటి సాహిత్యప్రక్రియలన్నీ అవసరాల ప్రాతిపదికనే ఏర్పడ్డాయి. షార్ట్‌స్టోరీ అలానే పుట్టింది!

మొదటి ప్రపంచయుద్ధానికి పూర్వకాలంలో భారతీయులు చాలామంది - పంజాబి, ఉత్తరప్రదేశ్, బెంగాల్ రాష్ట్రాలనుంచి వృత్తిపరంగానో, వాణిజ్యపరంగానో సంబంధాలు కొనసాగించటంతో ఇంగ్లీషు వార్తాపత్రికలు అనేకం భారతదేశానికి కూడా రాసాగాయి. వాటినీ, వాటిలోని కథల్ని భారతీయులు గూడా గమనించగలిగారు. వాటి ప్రభావంతో హిందీ - బెంగాలీ - ఉర్దూ భాషల్లో అద్భుతమైన షార్ట్‌స్టోరీలు రావటం మొదలైనాయి. 1910కి పూర్వమే ప్రేమ్‌చంద్ కథలు తెలుగునాట ప్రసిద్ధాలు. వందేమాతరం ఉద్యమం ప్రభావం కారణంగా హిందీ - బెంగాలీ ప్రాంత ప్రజలతో తెలుగువారికి బాగా పరిచయాలు ఏర్పడ్డాయి. ముఖ్యంగా 1907 బిపిన్ చంద్రపాల్ ఆంధ్రప్రాంత పర్యటన గోదావరి జిల్లాలు, అలాగే కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల్లో చైతన్యవంతులైన ప్రజల గుండె తలుపులు తట్టింది! ఎన్నో రాజకీయ, సామాజిక, సాంస్కృతిక పరిణామాలకు పాల్ పర్యటన కేంద్రబిందువయ్యింది.

1910లో దిద్దుబాటు కథానికని మచిలీపట్నం నుంచి వెలువడ్తున్న ఆంధ్రభారతి పత్రికలో మహాకవి గురజాడ ప్రచురించారు. తెలంగాణాకు చెందిన మాడపాటి హనుమంతరావు ప్రభృతులు "మల్లికాగుచ్ఛము" పేరుతో కొన్ని కథలు వెలువరించారు. సంస్కృతి నికేతనం - మచిలీపట్నం వారు ఈ కథల్ని ప్రచురించారు. ఆ తర్వాత మాలతిగుచ్ఛం పేరుతో మరో కథాసంపుటి వెలువడింది. ఇలా మొదలయ్యింది తెలుగులో "షార్ట్‌స్టోరీ" ప్రక్రియ! ఇందుకు నాందీ పలికిన 'దిద్దుబాటు' కథకి వందేళ్ళు కాబట్టి తెలుగు షార్ట్‌స్టోరీకి వందేళ్ళ పండుగని మనం జరుపుకొంటున్నాం. దిద్దుబాటుకన్నా ముందు తెలుగులో చిన్న కథలు లేవని కాదు - ఒక ఉద్యమాళి ఆద్యంగా "దిద్దుబాటు" నిలిచింది. అందుకే ఈ ఉత్సవం.

తెలుగుకథ ఎంతో బలీయమైనది. ఇన్నాళ్ళూ కవితాత్మకంగా నడిచింది. ఈ వందేళ్ళలో వచన మార్గాన నడుస్తోంది. తక్కువ పాత్రలతో, తక్కువ సంఘటనలతో, తక్కువ నిడివితో

ఎక్కువ ఆలోచనా స్ఫోరకంగా వుండటం షార్ట్‌స్టోరీ మౌలికలక్షణం. కథలోని ఈ అంతస్సూత్రాన్ని తెలుగు కథారచయితలు గట్టిగానే పట్టుకోగలిగారు. ఈనాటి ఈ షార్ట్‌స్టోరీని ఇప్పటికీ "కథ" అనే మనం పిలుస్తున్నాం. "వచన కథ" అంటే ఇంకా బావుంటుంది. షార్ట్‌షార్ట్ కథని కథానిక అంటారు.

దిద్దుబాటు కథ పుట్టిన ఈ వందేళ్ళలో, తెలుగుకథ వచనమార్గాన నడక సాగించిన తర్వాత, తెలుగునేలమీద అనేక సామాజిక రాజకీయ పరిణామాలు చాలా వేగవంతంగా జరిగాయి. తెలుగు కథ వాటికన్నింటికీ నిలువుటద్దంలా నిలబడింది. మన "కథ"ల్లోకి తొంగిచూస్తే మన 'జీవితం' స్పష్టంగా అవుపిస్తుంది.

ఒకప్పుడు దీపావళి పండుగ వస్తే, పాఠకులకు కథల పండుగలా వుండేది. ప్రముఖ పత్రికలన్నీ పోటీలు పెట్టి మంచికథల్ని పండింపచేసేవి. ఇవ్వాళ పరిస్థితి వేరు. మామూలు వార్తల్నే చిత్ర విచిత్ర కథనాలతో పత్రికలు మార్కెట్ చేసుకొంటూ వుండటంతో, "తెలుగు కథ"కు కొంచెం గిరాకీ తగ్గిన మాట వాస్తవం. డా॥ పరుచూరి రాజారామ్ పురస్కారం తీసుకొంటూ ప్రముఖ కథారచయిత శ్రీవిహారి ఈ దశాబ్దికాలంలో తెలుగు కథ వన్నె పెరిగిందనీ, జీవితాన్ని మరింతగా తమ కథల్లో చూపించాలని రచయితలు తాపత్రయ పడ్తున్నారనీ అన్నారు ఇది నిజం.

అనేకానేక సాహిత్యప్రక్రియల్లో జనజీవితాన్ని ఆవిష్కరిస్తూన్నది. "తెలుగు కథ" ఒక్కటే! మన కథా రచయితలు ప్రజల్లోంచి వచ్చినవాళ్ళు. ఇంగ్లీషు కథలు చదివి తెలుగులో రాస్తున్నవారు కాదు. 1952లో "ది ఓల్డ్‌మాన్ అండ్ ద సీ" కథని ఎర్నెస్ట్‌హెమింగ్వే "లైఫ్ మ్యాగజైన్"లో ప్రచురిస్తే, కేవలం రెండురోజుల్లో ఆ సంచిక 53 లక్షల కాపీలు అమ్ముడు పోయిందట! తెలుగు కథకు ఇంత వైభవం ఏనాటికైనా వస్తుందా? తప్పకుండా వస్తుంది! మంచి కథకు మంచిరోజులు వస్తాయి.





# తెలుగు కోసం

# Telugu Kosam

by Dr. G.V. Purnachand

సాహిత్యరంగంలో రాష్ట్ర ప్రభుత్వ "కళారత్న (హంస) పురస్కారం", పరిశోధనారంగంలో తెలుగు విశ్వవిద్యాలయం కీర్తి పురస్కారం, ఇంకా 50కి పైగా జాతీయ, రాష్ట్రీయ పురస్కారాలు పొందిన డా. జి. వి. పూర్ణచందు తెలుగు భాషోద్యమ సారథి, పరిశోధకుడు, రచయిత, కాలమిష్టు, సంపాదకుడు, చిత్రకారుడు కూడా!

తెలుగు భాషోద్యమ నిర్మాణంలోను, తెలుగు భాషకు ప్రాచీనతాప్రతిపత్తి సాధనలోనూ క్రియాశీల పాత్ర పోషించారు. కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రధాన కార్యదర్శిగా మూడు పర్యాయాలు ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు, జాతీయ తెలుగు రచయితల మహాసభలు, 20కి పైగా భాషాచరిత్ర సదస్సులు నిర్వహించి భాషోద్యమ దీప్తి కలిగించారు.

'నైలు నుండి కృష్ణదాకా', 'తెలుగే ప్రాచీనం' మొదలైన భాషాచరిత్ర గ్రంథాల ద్వారా కొనసాగవలసిన పరిశోధనలకు కావలసిన పరిశోధనాంశాలను సమీకరించి ఇచ్చారు.

1980ల నాటి మినీకవిత ఉద్యమ రథసారథుల్లో పూర్ణచందు ముఖ్యులు. ద్రావిడ విశ్వవిద్యాలయం, తెలుగు విశ్వవిద్యాలయం, ఎమెస్కో, విక్టరీ, మధులత, శ్రీ మహాలక్ష్మీ మొదలైన ప్రసిద్ధ ప్రచురణ సంస్థల ద్వారా 116 వరకూ వీరి గ్రంథాలు అచ్చయ్యాయి.

1978 నుండీ వివిధ దిన, వార, మాసపత్రికల్లో 35కు పైగా శీర్షికలు నిర్వహించారు.

తెలుగు భాషా సంస్కృతులకు సంబంధించిన 25 బృహద్గ్రంథాలకు సంపాదకత్వం వహించారు.

సునిశిత పరిశీలనతో, లోతైన అధ్యయనంతో, సామాన్యుడికి కూడా అర్థమయ్యేలా సులువైన రచనాశైలితో సాహిత్య, సామాజిక, ఆరోగ్యపరమైన అంశాలపై 800కు పైగా వ్యాసాలు ప్రచురించారు.

తెలుగువారి ఆహార చరిత్రకు సంబంధించి 12 పుస్తకాలను వెలువరించి, తెలుగువారి తొలి 'ఆహారచరిత్ర గ్రంథ' రచయితగా వాసికెక్కారు.



ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి
ప్రచురణ






Designd : artist ramu / 9440277811

